

సంపు. ౧౩ ధాత. సంవత్సరము, శ్రావణమాసము (ఆగస్టు ౧౯౩౬) సంఖ్య

# శ్రావణము

శ్రీ వత్సవాయ వేంకట నీలాద్రి రాజు

శ్రావణియన్నచో శ్రవణసంగతపూర్ణిమయన్నమాట యా
శ్రావణి గల్గుమాస మది శ్రావణ మెల్లజగం బెఱుంగగా
పావనమైన శ్రావణము పట్టుమటంచిదె వచ్చునన్న గో
దావరి పొంగు నింక జనతాహృదయంబులు పొంగకుండునే.

కోయిలపాడిపాడి యిది గో విరమించెనో లేదొ కాని య
త్యాయతమైన కంఠ మది యంబరవీథికి సాగి పర్వగా
నీయెడ బర్హి మ్రోగుటయు నీరస పాంథగ మారి కొక్కురో
కోయని కూయగా దొడగె కుక్కుటమున్ స్వరకల్పనంబులోన్.

కేకికచాకచోచ్ఛ్రయవికీర్ణమనోహరకేతకీదళ
స్వీకృతసూత్న సౌరభవిశేషముకంబెను మట్టిపండ్లచే

మైకొని క్రొవ్వుపోలు కలమాంసముతో మృదుపక్వమైన యా
గాకరకాయకూర నవకమ్ముగు నామెత రాచవారికిన్.

కీడెంచక మేలెంచుట-పాడియె లెస్సలును మిగులబస్సులు నడవన్
బాడయ్యె రోడ్డులెల్లను-గీడయ్యెన్ బ్రజకు పన్నుకిష్టుల బరువుల్.

కిమ్మనకుండుగాక మరు కేలికి హెచ్చరికించు నన్యపు
ష్ట మ్మికనంచు నమ్మదనశాసను నాదిమమూర్తి వించుక
బ్రమ్మను బోలె నభ్రనినదంబు ఘుమంఘుమఘుంఘుమార్భటుల్
గ్రమ్మకొనన్ వినంబడియె గండళికోత్కర మంకురింపగన్.

కాంచన కేతకీకుసుమగర్భదళంబులు మేళవించి క
ల్పించిన నేశికల్ పరిమళింప గపోలసుగంధచర్చతో
కాంచనకంచులీనిరవకాశకుచోపరిభాసమాన చే
లాంచల మార వాయనము లైదువ లియ్యగ నంది రైదువల్.

కలకంఠులు విద్యాశాలలలోనన్ నోరుదెరచి లపితము సేయన్,
కలకంఠులెల్ల నింకన్-బలుకక నోర్మూసికొనుట భావ్యము కాదే.

కన్నె గేదగి రేకు గడివోవకుండంగ కమ్మతావులు కొన్ని గుమ్మరించి
విరజాజిపూగొమ్మ విఱ్ఱవీగకయుండ మేలుతావులు కొన్ని మేళవించి,
ఫలగుళుచ్ఛంబులు పలకబారకయుండ వింతతావులు కొన్ని సంతరించి
గంగమ్మసైదోడు కలకబాఱకయుండ జలితుంపురులు కొన్ని సంగ్రహించి,
ప్రకృతి తగుభక్తి నర్పించు పత్రపుష్ప-ఫలజలంబుల గడుదేరి బలిసి సొలసి
ప్రాణికోటికి బ్రాణంబు ప్రాణముగుచు-కలసి మెలసి ప్రవర్తించె కమ్మగాడ్పు.

కనమన జీకటుల్ వొలయ గారుమొగుల్ గలయంగ బర్వి యా
కసమున నొక్కచుక్కయిన గానగవచ్చుట లేకపోవగా
కిసలయపాణు లుల్కిపడి కెవ్వన నాథుల గౌగిలింప న
ద్దైస నురుముల్ సెలంగ నిదె దీని నభంబని చాటి చెప్పెడున్.

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

## రేడియో గ్రామఫోనులు!



శబ్దపునరుత్పన్నమున ప్రఖ్యాతి బడసిన "హిస్ మాస్టర్స్ వాయ్స్" వారు రేడియోవార్తలను, సంగీతమును సహజమాధుర్యముతో ప్రతిఫలింపగల రేడియోయంత్రములను తయారుచేసియున్నారు. ఈ రేడియోగ్రామఫోను రికార్డులందలి సంగీతమును విద్యుచ్ఛక్తి ద్వారా ప్రతిఫలింపచేయుటయేగాక 8 రికార్డులవరకు తమంతట తామే మార్చి నిరంతర సంగీతశ్రవణమును గూర్చును. జగద్విఖ్యాత "హిస్ మాస్టర్స్ వాయ్స్" వారి శ్రేష్ఠతమమైన పరికరములచే సమర్పబడిన యీ రేడియో గ్రామఫోనును నేడే కొని విని ఇందలి ఔన్నత్యమును కనుగొనుడు.

D. C. స్థలములందుపయోగించుటకు రోటరీ కన్వర్టర్: వెల రూ. 150/- (ప్రత్యేకము)

**ఆటో రేడియో గ్రామఫోన్**

మాడల్ 475 A. C.

**వెల రూ. 700.**

వివరములకు నేడే వ్రాయుడు.




## ది గ్రామఫోను కంపెని

లిమిటెడ్,

45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.

# తిక్కన ద్రౌపదీ చిత్ర రచనము

(ఉద్యోగపర్వము)

నండూరి బంగారయ్య

చదువరీ, మన మొకసారి భారతయుగమునకు పోవలెను. "ఇరువదవ శతాబ్దమువాడనని గర్వ పడుచున్న నన్ను ఎన్నియోవేల సంవత్సరములు వెను కకు బొమ్మనుచున్నావే" మని కోపపడకుము. నీ వెంత యిరువదవ శతాబ్దపు నాగరకుడవైనను ఇతరయుగముల నుండి- అందు ముఖ్యముగ భారత యుగమునుండి- నేర్చుకొనవలసిన పాఠము లనేకములున్నవి. "శత యోజన విస్తీర్ణమగు సాగరమును లంఘించుట హను మంతునకే చెల్లినది. అనేకశతాబ్ద విస్తీర్ణమగు కాలసము ద్రమును దాటుట నాకు సాధ్యపడునా?" యని సంకోచింపకుము. కవిబ్రహ్మ యనుగ్రహమున్నచో కాలచక్రము మనచేతిలో చతురంగపుబంటువలె నడ చును. అందుకు సందేహములేదు.

అదిగో ఉపప్లావ్యపురము. అది శ్రీకృష్ణుని శిబి రము. పాండవపక్షయోధులెల్లరు నచ్చట సభచేయు చున్నారు. శ్రీకృష్ణుడు రాయబారము నడపుటకు ప్రయాణసన్నద్ధు డయినాడు. పాండవులెల్లరు నాత నితో ఎవరికితోచినమాటలు వారు చెప్పుచున్నారు. యుధిష్ఠిరు డేమనుచున్నాడు ?

"ఇచ్చటి బంధులు నీవును
నచ్చెరువడి వినుచునుండ నైదూళులు మా
కిచ్చినను జాలు నంటిని,
పొచ్చెముగా దంతవట్టు పూర్ణముసుమ్మా!"

ఇంతకుముందే పాండవు లుపప్లావ్యపురమున విడిసినమాటను విని ధృతరాష్ట్రుడు సంజయునిచే రాయ బార మంపినాడు. ఆ రాయబారములో రాజ్యభాగము మాటమాత్ర మెత్తకుండ తియ్యనిమాటలు చెప్పి ధర్మ రాజును మరల నరణ్యవాస ప్రయాణసన్నద్ధుని గావించు టకు సంజయునికి ధృతరాష్ట్రుడు సర్వాధికారములతో పవర్ ఆఫ్ అట్టర్నీ (ముక్త్యారునామా) యిచ్చినాడు. సంజయుడును తదనుగుణముగనే ధర్మరాజుతో మాటాడి నాడు. ధర్మరా జాతనికి ప్రత్యుత్తరమిచ్చుచు అయి దూళ్లిచ్చినను సంధి కొడంబడెదనని చెప్పినాడు. అపు డాప్రాంతములనున్న పరిజనులు తమ చెవులను తాము నమ్మజాలకపోయినారు. అదివరకు పాండవులు పడిన పరాభవములేమి? వారు చేసిన దిగ్విజయమేమి? తుద కయిదూళ్లు యాచించుటేమి? ఇంతకంటె కార్పణ్య మున్నదా? కాని రాయబారియగు కృష్ణునితో వెనుక తాను సంజయునితో నాడిన మాటనే ధర్మరాజు మరల బలపఱచుచున్నాడు. భీమార్జున నకులులకు మనములో నిది హర్షప్రదముగ లేదు. అయిననేమి? అన్నగారి మాట కడమాడరాదని గదా వారి వ్రతము. అందుచే ఒకరి వెంబడి నొకరుగ వారు వల్లెవేసికొన్న పాఠమును వప్పజెప్పుచు డొమినియన్ స్టేటసు తీర్మానమును బల పరచిరి. కాని సభయంతయు సంపూర్ణస్వరాజ్య మిచ్చి నను చాలదను నతివాదులతో నిండియున్నది. వారినోరు మాటాడకున్నను చూపులు గంభీరోపన్యాసములను గుఱియుచున్నవి. ఎవ్వరైనను తగిన మనిషి ఒక్కడు లేచి ధర్మరాజుతీర్మానమును ప్రతిఘటించిన చాలు- ఓట్లన్నియు ఆతని పక్షమే. ఇంతలో సహదేవుడు లేచి నాడు. ఇదివరలో ఆతని వంతు రాకుండగనే యాసనము నుండి పెక్కుసారులు లేచుచు వచ్చెను గాని బలవం తముమీద నకులుడు మఱల కూర్చుండబెట్టినాడు. ఇక వంతు వచ్చిన తరువాత నాతని తీవ్రత నడచుటకు సాధ్యపడినదికాదు.

"రక్కసమాట లాడెదరు
రాజును దమ్ములు వానిలోన నీ

వొక్కటిరైన గాదనక
యూరకొనుచుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేడికొన
నైననుపోయెదువో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ
మిచ్చుట యెక్కడ దానవాంతకా !
" ............ఉచిత
మైనదికయ్యమ వంకమాట లే
నేర కురుప్రవీరుసభ
నిశ్చిత మిట్టిదికాగ దెల్పుమీ."

అని తెగగొట్టి చెప్పినాడు. అతని ప్రతిఘటనమును సాత్యకి సెకండుచేసినాడు.

ఈ యిరువురి యుపన్యాసములకు సభయంతయు కదిపిన కందిరీగలమట్టయయిపోయి ఒక్కమారుగ చెలరేగినది. అప్పటి సభావర్ణనము సంస్కృతములో నిట్లున్నది.

శ్లో. ఏవం వదతి వాక్యంతు యుయుధానే మహామతౌ,
సుభీమం సింహనాదోఽభూత్ యోధానాం
తత్ర సర్వశః;
సర్వేహి సర్వశో వీరా స్తద్వచః ప్రత్యపూజయన్,
సాధుసాధ్వితి శైనేయం హర్షయంతో
యుయుత్సవః.

దీనికే తిక్కన తెనుగున చక్కగ విపులవ్యాఖ్యానమొనర్చినాడు. "రథికవరులందరు "సహదేవు డింత యొప్పనాడునే! సాత్యకిపలుకు లిట్లుండునే? తక్కటివి యెక్కడిమాటలు? పగవారి నడిగికొనంబోవుట యుచితంబటె, కయ్యంబు కర్జంబు గాదటె, భంగంబు వీగికొనం దగదటె" యను నివిమొదలుగా ననేకు లనేక ప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్క మ్రోతగా జెలంగిన యెలుంగులు నింగిముట్టె." "సర్వేహి సర్వశో" యనుట "కనేకు లనేకప్రకారంబుల" నను యనువాదములో సామాన్యకవి సంతృప్తిపడును. తిక్కన యట్లుగాక ఆయనేకప్రకారంబు లెట్టివో విపులముగా వివరించి ఆనాటిసభను యీనాటి మనకండ్లముందర నిలిపినాడు. ఈ ప్రాతిపదిక (**Background**) మీద ద్రౌపది యుపన్యాసమును విజృంభింపజేసినాడు. ఆమె యుపన్యాసమును విన కుతూహలపడుచుంటివా? ఇదిగో కవిబ్రహ్మయిచ్చిన రిపోర్టు—

"ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్యమొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యబలికె
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు.

అంతలు సేసి పోనడచి
యక్కట! సంజయుచేత జెప్పి పు
త్తెంతురె? ఇట్టి యూఱట మ
దిం బ్రియమంది యుధిష్ఠిరుండు దా
నంతన యూరు లేవురకు
నైదు సుయోధను డిచ్చునొక్కొ? ఈ
నంత కృపావిహీనమతి
నాతడు సేచునె యన్నదమ్ములన్!.

తన మునుపడ్డ బన్నముల
దమ్ములపై గల కూర్మిపేర్మి నీ
జనపతి సైపకున్నె? అది
సక్కన! రాజ్యముపాలు లేక తీ
ఱున కొడబాటు గల్గిన, నె
ఱుంగమి పెట్టరె? 'చాలరైరి పీ'
రనరొకో? నాన లేమియని
యాడరె లోకమువారు కేశవా?

పెం పేదం దమ కిట్టితక్కరులు రూ
పింపంగనేలా? విచా
రింపన్ వారిక మేలు సంధి తము వా
రింజూచినం దారు సా
ధింపంజాలరొ? కాక పోర దగ మ
ర్దింపం దలంపేని కం
ఠింపం బట్టరొకో? వారు బ్రాహ్మణులె యే
కీడైన సైరింపగన్.

ఓటు యెుకింతయేనియు సు
యోధను చిత్తమునందు లేదు; నీ

మాటల బోవునే దురభి
మానము యెక్కుడు పూనుగాక; య
చ్చోటన సంగరంబు లగు
చొప్పులు పుట్టిననైన బాండవుల్
పోటున కిచ్చగింతురొకో?
పోదురొ కానల నుండ నచ్యుతా!

ఏ నిటు లంటి నావలవ;
దింకను నీవును రాజు దమ్ములుం
గా నుచితంబు సూచి మన
కార్యము, మీ సుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక త
గం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచి
నట్టుల చేయుడు నేర్పు లేర్పడన్.

వ. అని మఱియు నిట్లనియె.—

అలుకడిబోకయున్, ఫలము
నందుటయున్, గని పల్క నేరమిన్
మాఱటనోరిదానయి
మాటలు చిత్తమునందు నిల్పకే
గాఱులు ప్రేలెదన్ వినుడు,
కజ్జము నెగ్గును గాన నల్కమై
వీఱిడిరైన మానిసికి
వెండి వివేకము గల్గనేర్చునే.

వరమున బుట్టితిన్, భరత
వంశము జొచ్చితి, నందు బాండుభూ
వరునకు గోడలైతి, జన
వంద్యుల బొందితి, నీతివిక్రమ
స్థిరులగు పుత్రులం బడసి
తిన్, సహజన్ముల ప్రాపుగాంచితిన్
సరసిజనాభ, యిన్నిట బ్ర
శస్తికి నెక్కినదాన నెంతయున్.

వ. అట్లుంగాక

నీవు సుభద్రకంటె గడు
నెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు; దిట్టి నను
బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి
యై పెనుపొందిన వేణి వట్టి యీ
యేవురు జూడగా సభకు
నీడ్చె! కులాంగన నిట్లొనర్తురే?

అసభ కేశవస్త్రయుగు
నట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు ల
సంభ్రములై తగుచేష్ట లేక వా
యూసలు మాని చిత్రముల
యాకృతినున్నయెడన్, ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ
వచ్చె మనం బదియుం దలంపవే?

అరయమి జేసి కోడలన
కప్పుడు దాసిగజేసె; నమ్మహా
పురుషుని పాలికిం బతులు
వోవగ వీరలతోన యేను జై
చ్చెర జని కోటరంబు దగ
జేయుదునో? అటుగాక పాడిమై
వరవుడ మోపి జేయుదునో
వారికి? మాధవ నిశ్చయింపుమా!

వ. అని యట్లుగ్గడించి,

ద్రోవది బంధురంబయిన
క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి నెంద్రుకల్
దా వలచేత బూని యసి
తచ్ఛవి బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలగ మ
నంబున బొంగు విషాదరోషముల్
గావగలేక బాష్పములు
గ్రమ్మగ డగ్గన లేచి యార్తయై.

ఇది దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయది! కౌ
రవులకడ దీని మాటల
యవసరమున దలపవలయు నచ్యుత వీనిన్!

ఈవెంట్రుకలు వట్టి యీడ్చిన యాచేయి
దొలుతగా బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పఱియున్న గని యెడుకాలుగాక
యలుపాల బొనుపడునట్టి చిచ్చే యిది?
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
శక్తివిక్రమంబు గాల్పనే! ఇట్లు బ
న్నములువడిన ధర్మనందనుండు
నేను రాజరాజుసీనుంగు గన్నార
కానబడయమైతి మేని కృష్ణ?
నెట్టన యిట్టియలుకఁ మది
నిల్పితి రక్కసతాల్మి జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి నాలు చెన్న దుర్
బుట్టదు దుష్టనిగ్రహము
పూని జగంబులు గాచునట్టి తో
బుట్టువు నీవు, తేజమున
బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞ
సేనిం గృపాయత్తచిత్తుండయి నారాయణుం డూరార్చి
కూర్చుండ నియమించి కన్నీరు దుడువను, జెన్నొందు వేణి
ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో
నిట్లనియె."

దీనికి సంస్కృతముకూడ చూడవలసినదే. అప్పుడు గాని దీని యందము తేలదు. కవిబ్రహ్మ కళా చాతుర్యము ప్రకాశింపదు!

వైశంపాయనః—

రాజ్ఞ స్తద్వచనం శ్రుత్వా
ధర్మార్థసహితం హితమ్,
కృష్ణా దాశార్హ మాసీన
మబ్రవీ చ్ఛోకకర్శితా.
సుతా ద్రుపదరాజస్య
అసితాయతమూర్ధజా,
సంపూజ్య సహదేవంచ
సాత్యకించ మహారథమ్.
భీమసేనంచ సంశాంతం
దృష్ట్వా పరమదుర్మనాః,
అశ్రుపూర్ణేక్షణా వాక్య
మువాచేదం మనస్వినీ.
విదితం తే మహాబాహో
ధర్మజ్ఞ మధుసూదన,
యథా నికృతి మాస్థాయ
భ్రంశితాః పాండవా స్సుఖాత్.
ధృతరాష్ట్రస్య పుత్రేణ
సామాత్యేన జనార్దన,
యథాచ సంజయో రాజా
మంత్రం రహసి శ్రావితః.
యుధిష్ఠిరేణ దాశార్హ
తచ్చాపి విదితం తవ,
యథోక్తః సంజయశ్చైవ
తచ్చ సర్వం శ్రుతం త్వయా.
పంచ న స్తాత దీయంతాం
గ్రామా ఇతి మహాద్యుతే,
అవిస్థలం వృకస్థలం
మాకందీం వారణావతమ్.
అవసానం మహాబాహో
కంచి దేకంచ పంచమమ్,
ఇతి దుర్యోధనో వాచ్య
స్సుహృద శ్చాస్య కేశవ.
నచాపి హ్యకరో ద్వాక్యం
శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ
హ్రీమత స్సంధి మిచ్ఛతః.
అప్రదానేన రాజ్యస్య
యది కృష్ణ సుయోధనః,
సంధిమిచ్ఛే న్నకర్తవ్య
స్తత్ర గత్వా కథంచన,

శక్ష్యంతిహి మహాబాహో
పాండవా స్సృంజయైస్సహ,
ధార్తరాష్ట్రిబలం ఘోరం
క్రుద్ధం ప్రతిసమాసితుమ్.

నహి సామ్నా నదానేన
శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మా త్తేషు నకర్తవ్యా
కృపా తే మధుసూదన.

సామ్నా దానేనవా కృష్ణ
యేన శామ్యంతి శత్రవః,
మోక్తవ్య స్తేషు దండస్స్యాత్
జీవితం పరిరక్షతా.

తస్మా త్తేషు మహాదండః
క్షేప్తవ్యః క్షిప్రమచ్యుత,
త్వయాచైవ మహాబాహో
పాండవై స్సహ సృంజయైః.

ఏత త్సమర్థం పార్థానాం
తవచైవ యశస్కరమ్,
క్రియమాణం భవేత్ కృష్ణ
క్షత్రస్యచ సుఖావహమ్.

క్షత్రియేణహి హంతవ్యః
క్షత్రియో లోభమాస్థితః,
అక్షత్రియోవా దాశార్హ
స్వధర్మ మనుతిష్ఠతా.

అన్యత్ర బ్రాహ్మణా త్తాత
సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం
బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్.

యథావధ్యే భవే ద్దోషో
వధ్యమానే జనార్దన,
స వధ్య స్యావధే దృష్ట
ఇతి ధర్మవిదో విదుః.



యథా త్వాం నస్పృశే దేష
దోషః కృష్ణ తథా కురు,
పాండవై స్సహ దాశార్హ
సహ సైనికైః.

పునరుక్తంచ వక్ష్యామి
విస్రమ్భేణ జనార్ధన,
కాను సీమంతినీ మాదృక్
పృథివ్యా మస్తి కేశవ.

సుతా ద్రుపదరాజస్య
వేదీమధ్యా త్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ
తవ కృష్ణ ప్రియా సఖీ.

ఆజమీఢకులం ప్రాప్తా
స్నుషా పాండో ర్మహాత్మనః.

మహిషీ పాండుపుత్రాణాం
పంచేంద్రసమవర్చసామ్.

సుతా మే పంచభి ర్వీరైః
పంచ జాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ
తథా తే తవ ధర్మతః.

సాహం కేశగ్రహం ప్రాప్తా
పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం
త్వయి జీవతి కేశవ.

జీవత్సు పాండుపుత్రేషు
పాంచాలే ష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం
సభామధ్యే వ్యవస్థితా.

నిరమర్షే ష్వచేష్టేషు
ప్రేక్షమాణేషు పాండుషు,
పాహి మా మితి గోవింద
మనసా చింతితోఽసి మే,

యత్ర మాం భగవా న్రాజా
శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి
వరార్హాసి మతాసి మే.

అదాసాః పాండవా స్సంతు
సరథా స్సాయుధా ఇతి,
మయోక్తే యత్ర నిర్ముక్తా
వనవాసాయ కేశవ.

ఏవంవిధానాం దుఃఖానా
మభిజ్ఞోఽసి జనార్దన,
త్రాయస్వ పుండరీకాక్ష
సభర్తృజ్ఞాతిబాంధవామ్.

నన్వహం కృష్ణ భీష్మస్య
ధృతరాష్ట్రస్య చోభయోః,
స్నుషా భవామి ధర్మేణ
సాహం దాసీకృతా బలాత్.

ధి క్పార్థస్య ధనుష్మత్తాం
భీమసేనస్య ధి గ్బలమ్,
యత్ర దుర్యోధనః కృష్ణ
ముహూర్తమపి జీవతి.

యది తేఽహ మనుగ్రాహ్యా
యది తేఽస్తి కృపా మయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః
సర్వః కృష్ణ విధీయతామ్.

వైశంపాయనః,

ఇత్యుక్త్వా మృదుసంహారం
వృజినాగ్రం సుదర్శనమ్,
సునీల మసితాపాంగీ
సర్వగంధాధివాసితమ్.

సర్వలక్షణ సంపన్నం
మహాభుజగవర్చసమ్,
కేశపక్షం వరారోహా
గృహ్య వామేన పాణినా.

పద్మాక్షీ పుండరీకాక్ష
ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా దీనా
కృష్ణం వచన మబ్రవీత్.

అయం తే పుండరీకాక్ష
దుశ్శాసనకరోద్ధృతః,
స్మర్తవ్య స్సర్వకార్యేషు
పరేషాం సంధి మిచ్ఛతామ్.

యది భీమార్జునౌ కృష్ణ
కృపణౌ సంధికాముకౌ
పితా మే యోత్స్యతే వృద్ధః
సహపుత్రై ర్మహారథైః.

పంచచైవ మహావీర్యాః
పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య
యోత్స్యంతే కురుభిస్సహ.

దుశ్శాసనభుజం శ్యామం
సంఛిన్నం పాంసుగుంఠితమ్,
యద్యహంతు నపశ్యామి
కా శాంతి హృదయస్య మే,

త్రయోదశహి వర్షాణి
ప్రతీక్షం త్యాగతాని మే,
నిధాయ హృదయే మన్యుం
ప్రదీప్తమివ పావకమ్.

విదీర్యతే మే హృదయం
భీమవాక్శల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహు
ర్ధర్మమే వానుపశ్యతి.

ఇత్యుక్త్వా బాష్పసంఘేన
కంఠే నాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కంపం
సస్వనం బాష్పగద్గదమ్.

స్తనౌ పీనాయతశ్రోణీ
సహితా వభివర్షతీ,

ద్రవీభూత మివాత్యుష్ణం
ముంచతీ వారి నేత్రజమ్.

సుప్రసిద్ధవిమర్శకులగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈ తిక్కనచిత్రరచనను జూచి, "తిక్కనయొక్క ద్రౌపది దుస్స్థితికతో వెక్కి వెక్కి యేడ్చుచు మనకు దుస్సహసంతాపము గలిగించుచున్నది" అని మాటి ముడుమదున్నారని యాలోచించుచున్నావా? అక్కరలేదు. ఈ ద్రౌపదీవాక్యముల సందర్భశుద్ధిగాని,అపురూపమైన తేజముకాని, అద్వితీయసౌందర్యముకాని యాలోచింపక వారు చేసిన విమర్శనము సమీచీనము కాదని నీవు నిశ్శంకముగా వచింపవచ్చును. కార్యము చెడిపోవుచున్నను నోటికి తాళము బిగించుకొని కూర్చుండుటయే గాంభీర్యలక్షణమనినచో మేము చెప్పలేముగాని మూలమునలేని వివిధ మనోభావప్రకటనము,హృదయగాంభీర్యప్రదర్శనము, వాక్యచమత్కృతి, శైలిసౌందర్యము, స్వరూపసౌష్ఠవము తిక్కనరచనలో గలవు. తన పరాభవముమాట తలపెట్టక స్వధర్మము నుజ్జగించి కార్పణ్యమున కొడబడుచున్న భర్తలను కంటిచూపుచేతనే గడగడలాడించి "మీకు స్వయముగ దోచకపోయిన నేను చెప్పినట్లు వినుడు" అని గద్దించి పలుకుచు కర్తవ్యోపదేశ మొనర్పగల యాత్మవిశ్వాస మీ ద్రౌపది ముఖమున తేజరిల్లుచున్నది.దాని నించుక విపులముగా బరికింతము.

ద్రౌపది శ్రీకృష్ణునితో తన పరాభవములనెల్ల త్రవ్వికొని విచారించిన సన్నివేశ మొకటి ఆరణ్యపర్వమునక ఈ రెండు సన్నివేశములను స్థూలదృష్టికి ఒకే తరగతికి చెందునట్లుగా కానవచ్చినను తత్త్వమున వీనికి భేద మేర్పడుచున్నది. అరణ్యవాసమున పూర్వ జన్మవృత్తాంతములతో ప్రొద్దుపుచ్చు నరనారాయణులయొద్దకు వచ్చి ద్రౌపది తన పడిన భంగపాటులను వాక్రుచ్చినది. అట్లు వాక్రుచ్చుటవలన నామె కాంక్షించిన ప్రయోజనము తాత్కాలికముగ తాపోపశమనము తక్క వేఱొకటి లేదు. మఱియు అప్పటిలో సమయభంగమునకు వెఱచి పాండవులు పరాక్రమపరాఙ్ముఖులయినను అజ్ఞాతవాసానంతరమయినను తన పరాభవములకు తగిన ప్రతీకారమొనర్చి తీరుదురను నమ్మక మామెకున్నది. ఇపుడన్ననో ఒకరికంటె ఇంకొకరు మించిపోయి మితవాదివర్గములో జేరుచున్న పాండవులను జూడగనే వారు క్షత్రియోచిత ధర్మము నవలంబించి కౌరవులను మర్దించి తన కసి దీర్పగలరనిన యాశ పూర్తిగ నశించినది. ఇక తాను చేయవలసిన పనియేమి? గొంతెత్తి యొక్కమారేడ్చి "తనగతి యింతే" యని యూరకుండవలసినదా? లేక అంతకంటె నేమయిన నున్నదా? ద్రౌపది నిస్పృహ వహించి యూరకుండునంతటి భీరురాలు కాదు. అదను దెలిసి అగ్నివర్షము కురిపించగల నెరజాణ. ఉద్వేగముతో నుపన్యాసపీఠ మెక్కి యుపదేశముద్రను చేతబట్టగల తేజస్విని. తప్పక తన కార్యమును సాధించుకొనజూచిన శక్తిస్వరూపిణి.

ఈ సన్నివేశమున సంస్కృతమునలేని భావసంఘట్టన మొకటి తిక్కన తన ద్రౌపదికి గల్పించినాడు. మూలములో 'శోకకర్శిత' యైన ద్రౌపది 'అశ్రుపూర్ణేక్షణ' యయి మాటలాడ నారంభించినది. క్రమముగ చిన్న సెలయేరు పెద్దసింధునదిగా మారినట్లు ఈ శ్లోకము పెరిగి

"ద్రవీభూత మివాత్యుష్ణం ముంచతీ వారి నేత్రజమ్" అను నవస్థకు వచ్చినది. కాని తెనుగులో నటు కాదు.

"మోమున దైన్యమొందనున్న పాంచాలి
యిట్లని యొయ్యబలికె గనలి శౌరితో గద్గదకంఠి యగుచు."

అనేకపర్యాయములు సభాముఖమున ధిక్కరించి యుపన్యసించిన యామెకు స్వరగాద్గద్య మెందులకో? సభాభీరుత్వముచేతమాత్రము కాదు. ఒకవైపునుండి దైన్యము, ఇంకొకవైపునుండి రోషము ఆమెహృదయమను కోటను ఆక్రమింపజూచుచున్నవి. పరస్పరవిరుద్ధములగు ఈభావములకు ఆమెహృదయమున నడచిన యుద్ధముమూలముననే ఆమెగొంతుక చలించినది.

మొదటిపద్యములో బీజప్రాయముగ నుంచిన ఈ విషాదరోషములు క్రమముగ నెట్లు విజృంభించినది

యీ పద్యమాలికలో వివరించినాడు. ఈపద్యమాలికను మనము నాలుగైదు అంతర్భాగములుగ విభజించుకొన వచ్చును. అందు "అంతలు" అనుమాటతో మొదలుపెట్టు పద్యము మొదలుకొని "నేర్పు లేర్పడన్" అనుమాటలు తుది గాగలిగిన పద్యమువఱకు ఒక అంతర్భాగము. ఈ యంత ర్భాగమున వాగ్విజృంభణమును, దాని కనువగు ముఖ భావప్రదర్శనమును తప్ప బాహ్యాభినయము విజృంభించి నట్లు గానము.

"కురువర్గముతోడి సంధి మీకైన తెఱంగునన్ వలచి నట్టుల చేయుడు నేర్పు లేర్పడన్."

అనుటలో ప్రాణమువిసిగి నిరాశరూపకమగు విషాదము జయించినది. "మీ యిష్టము వచ్చినట్లుమీరు చేసికొనుడ"ని చెప్పి ఆమె యూరకుండదలచినది. కాని ఆమె స్వభావసిద్ధమగు 'రుష' ఆమె నంతతో నూర కుండనీయక "నిరాశ జయము నొందుటా? సిగ్గు సిగ్గు. నేను జయించి తీరుదును" అను పట్టుదలతో మఱల నామెను మాటాడించినది. అందుచే "అరడిబోకయుండ్" అనుట మొదలుకొని "మాధవ నిశ్చయింపుమా" అను వఱకు గల యంతర్భాగ ముదయించినది. ఈ యంత ర్భాగములో

"వీరలతోన యేను చెచ్చెర జని కోటరంబు తగ జేయుదునో యటుగాక పాడిమై వరవుడమోపి చేయు దునో వారికి మాధవ, నిశ్చయింపుమా." అనుటలో కోపము జయధ్వజమెత్తుచున్నది. ఇది ద్రౌపదీస్వభావో చితమగు నయనిష్ఠురము. "వెనుక నన్ను ధృతరాష్ట్రుడు కోడలనియైన నాలోచింపక దాసిగా జేసినాడు. ఇప్పు డాతనికడకు సంధిచేసికొన్న నాపతులతో బోయి చేయ వలసినది కోడరికమా? దాస్యమా?" కనకనలాడు నిప్పులలో గాల్చిన యినుప శలాకకైనను ఈ ప్రశ్న కున్న వేడిమి యుండదు! తరువాతి యంతర్భాగము "ద్రోవది బంధురంబయిన" అను పద్య మొక్కటి మాత్రమే. ఇది కేవలము స్థూలాభినయము నాధారపరచు కొన్న కేశపత్తు ప్రదర్శనమును వర్ణించుచున్నది. ఈకేశ పత్తుప్రదర్శనమునకు హేతుభూతము కోపమే. కాని

ఇది ముగియులోపల విషాదముకూడ అందుకొన్నది. అందుచే బాష్పములు వచ్చినవి. మొదట బయలుదేరిన మోమునందలి దైన్యభావము ఇక్కడ 'బాష్పముల' క్రింద ద్రవీభవించినది. అయితే ఆ బాష్పములు ఆమె సహజగాంభీర్యముచే వారింపజూచినను నిలువక వచ్చుచున్నవి. ('కావగలేక') ఒకవెంట రోషము, ఇంకొకవెంట విషాదము సుడిగాలివలె విజృంభింపగ ఈ సుడిగాలికి ఆమె అప్రయత్నముగ లేచినది. ఈ లేచుటలో శోకవిషాదములు మెఱుపుదీగెలవలె మెఱయు చున్నవి. అటుతరువాత "ఇవి దుస్ససేనుక్రేళ్లం" మొదలుకొని "అచ్యుతా" అనువఱకు పద్యమాలికలోని తరువాతి యంతర్భాగము. ఈ భాగమున శోకము, విషాదము వెనుకటికంటెను మఱింత సాంద్రములయి నవి. అందుచేతనే కేశపత్తుమును ప్రదర్శించుటతో నాగక "ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యాచేయి" యిత్యాదిప్రదేశములలో స్థూలాభినయము విజృంభింపగ నగ్నివర్షము కురిసినది. "సెట్టన యిట్టియల్క" అను పద్యములో ఈ యగ్నివర్షమును సహజసౌమనస్యముచే జల్లార్పనెంచి యుపసంహార వాక్యములకు జొచ్చినది. కాని యీయుపసంహారము వాక్యరూపముగాక క్రియా రూపము దాల్చినది. ఆమె యెలుంగెత్తి యేడ్చినది. వెనుక నాచుకొనలేక కొలదిగమాత్రమే జనించు బాష్పములు ఇపుడు పెద్ద ప్రవాహమైనవి!

తుదకు గెల్చిన దేది? రోషమా, విషాదమా? ఏడ్చిన దనగానే విషాదమే గెల్చిన ట్లూహింపవలసి యున్నది. కాని యా యేడ్పులో వెడలిన బాష్పధారలు అగ్నిపర్వతమునుండి వెడలు లావాద్రవముకంటెను ఉష్ణమైనవి. ఆయేడ్పులో "ధర్మరాజాదులు తన కుండియు లేనివారైరి" అని వారి సంధివాక్యములను గాఢముగ నిరసించు రుషాగ్నికూడ అఖండముగ ప్రవ హించుచున్నది. అందుచే రోషవిషాదములు రెండును జయించినట్లు నిశ్చయింపవలసియున్నది.

తిక్కన చిత్రించిన యీ భావసంఘట్టనము రసోదయమునకు అత్యంతసహకారి. ఏ కావ్యమున గాని ఏకముఖముగ ప్రవహించు మనోభావముల

కంటె పరస్పరవిరుద్ధములగు భావములు పైకొని పాత్రములను "ఇటా అటా" అని ఊగించినపుడే అధికముగ కావ్యరసోదయ మగును. దీనికి షేక్స్పియరు హ్యామ్లెటునోట నుంచిన "To be or Not to be" అను స్వగతము ప్రబలసాక్ష్యము.

మఱియు ఈ భావసంఘట్టనమువలన ద్రౌపదీ పాత్రమునకు మూలములో లేని గాంభీర్యము వచ్చినది. ఒక్కమారుగనే "అశ్రుపూర్ణేక్షణా" యని వెంబేలు పడినట్లుగ చిత్రింపబడిన ద్రౌపదికంటె అంతలో నిరాశ, అంతలో నాత్మవిశ్వాసము ఒకదాని నొకటి జయించుచు విజృంభించినట్లుగ చిత్రించిన ద్రౌపది యెక్కుడు గంభీరముగ లేదా? ద్రౌపది విచారించి నందుల కామెను తప్పుపట్టనక్కరలేదు. ఎట్టిస్త్రీయయి నను అట్టి దుస్స్థితిలో నున్నపుడు అంతికంటె నేమి చేయును? ఆమెపడిన పరాభవములు లోకములో మరి యేస్త్రీయును పడలేదు. అందులకు తగిన ప్రతీకార మొనర్తురనుకొన్న భర్తలు ఉపేక్షాపరు లయిరి. అందుచే ఘోరవిషాదము నందినదని వ్రాయుటలో స్త్రీత్వమునకు పోషకముగనే యున్నది. కాని విషాదములో నాగిపోయినచో ఆమె ద్రౌపది కానేరదు. ఎంతెంతలాపదలు వచ్చినను దైవముపయి భారమువైచి తన్నుతా నుపశమించుకొని కర్తవ్యనిశ్చయమునకు గడంగ నేర్చిన విశ్వాసబల మామె కున్నది. చూడుడు విరాటపర్వమున కీచకుని గృహమునకు బోవుటకు ముందు,

"అలయుటబొందు, మాయవిధి
　　యాయని దైవముదూఱు, నిత్తతిం
గలరొకొ నాకు దిక్కనుచు, మొ
　　గంబున నశ్రులు వెల్లిగొల్పు దొ
ట్రిలబడు, జల్లనం జెవరు
　　డెందము గూడగ దెచ్చి నన్ను నే
వలమున ముట్ట నెవ్వరికి
　　వచ్చు? నసుర్ గలుగున్ వెనుంబడుర్."

అని విశ్వాసమునకు విషాదమునకు జనించినపోరాటమును వర్ణించినాడు. (ఈ పద్యభావముకూడ మూలములో లేదు.) సభాపర్వవృత్తాంతమును విలోకించి నను మొదట తనభర్త లుపేక్షాపరులగుట చూచి దైన్యమునందిన పాంచాలి తుదకు ఆత్మవిశ్వాసమువలననే తన భక్తిని తాను నమ్ముకొని మానసంరక్షణ మొనర్చుకొన్నది. అందుచే నీభావసంఘట్టనము గాంభీర్యమును ప్రదర్శించునదిమాత్రమేకాక భారతమునందలి ఇతర సన్నివేశములను బట్టి చూచినచో ఆపాత్రమునకు ఎంతయు నుచితముగనున్నది.

"కౌంతవులకు దైన్యమందుట కంతతప్పు పట్ట వలసిన పని లేదుగాని వారుమని ఏడ్వనగానే అది పేలతనమును సూచింపదా?" యను ప్రశ్నము రావచ్చును. విచారము మొదటనే యామెను పైకొనినదని వ్రాయక సోపాన ప్రకారమున ఆమెమనోభావములను ప్రకటించి తుదకు విషాద మెట్లు పైకొనినదియు చిత్రించుటవలన తిక్కన యీయాక్షేపణకు తావిచ్చుట లేదు. మరియొక విశేషము. ఇచ్చట ద్రౌపది యేడ్చినదనగా అంత గంభీరస్వభావకు గూడ నలంఘ్యమగు సన్నివేశము తటస్థించినదని స్పష్టమగుచున్నది. ఎంతటి ధీరోదాత్తపురుషులయినను కొన్ని కొన్ని ఘట్టములలో నేడువకతప్పదు. సీతాపహరణమునకు, లక్ష్మణ దేవర మూర్ఛకు శ్రీరామునియంతటి ధీరోదాత్తపురుషుడు 'వారు' మని విలపింపలేదా? మొన్న మొన్నటి వృత్తాంతము. ఎరవాడ జెయిలునుండి విడుదలయయిన క్రొత్తలో తాను పెట్టిన తీర్మాన మేదో స్వల్పసంఖ్య అధికముగ వచ్చుటచే మాత్రమే నెగ్గినదని నిండుసభలో గాంధిమహాత్ముడు షౌకతాలీని కౌగిలించుకొని యేడువ లేదా?

మూలములో లేని భావసంఘట్టనమును పాత్రోచితముగ ప్రవేశపెట్టుటయేకాక యీభావసంఘట్టనమును వ్యక్తీకరించిన విధానమునందుకూడ తిక్కన తన ప్రతిభను జూపుచున్నాడు. మూలములో ద్రౌపదీ వాక్యములు వాచ్యపద్ధతి నవలంబించినవి. "సంజయుడు ధృతరాష్ట్రునిచే పంపిన సందేశ మేమో నీవు తెలి

యయును. దానికి ధర్మరాజిచ్చిన సమాధానమును తెలియయును. అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారణావతము, మఱియొక గ్రామము ఇమ్మని యాతడు కబురంపెను. దుర్యోధనుడు యుధిష్ఠిరమతానుసారము చేయకపోయినను యుధిష్ఠిరుడు సంధినే కోరుచున్నాడు. దుర్యోధనుడు రాజ్యభాగ మిచ్చుట కొడంబడనినాడు నీ వచ్చటకు పోవుట కర్తవ్యముకాదు. సృంజయులును, పాండవులును కలసి ధార్తరాష్ట్రులను జయింపనోపుదురు. వారు సామదానములచే చక్కబడరైరి. ఇక వారిపై కృప యెందులకు? సామదానములందు చక్కబడని శత్రువునిపట్ల దండమేగదా ప్రయోగింపవలసినది" అని యీతీరుగ తన మతమును స్పష్టముగ చెప్పుచున్నది. కాని తెనుగులో నట్లుకాదు. లోపల తనకు సంధి యిష్టములేదు. ఇష్టములేదని స్పష్టముగ చెప్పుటచే నామె తృప్తిపడలేదు. ఆమె కవివలె వక్రోక్తిప్రియ. స్వభావమునుబట్టి యామె మిగులగడుసరి. అందుచే నేదయిన తరుణము వచ్చినచో ఎత్తిపొడుపు మాటలతో తనమనోగతమును వ్యక్తముచేయును. స్పష్టముగ కోపపడుటకంటె ఈ యెత్తిపొడుపుమాటలు భావప్రకటనమున కెక్కుడు ప్రయోజనకారులనుట నిస్సంశయము.

"పలుపోకల బోవుచు వి
చ్చలవిడి నాట్యంబునూపు చాడ్పున నిచ్చో
కులసతుల గఱువచందము
దొలగగ ని ట్లునికి దగునె తోయజవదనా."

అని ప్రశ్నించిన ధర్మసూతికి

"వాడు వల్లభుండు నటు డింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు
గాన పలుకులవిధమకాక యేశైలూషి
గా ననంగరాదు కంకభట్ట."

"మత్పతి కితవుండును—జూదరియాతకింగఱువతనం బెక్కడిది" అని సమాధానమిచ్చిన ద్రౌపది ఎత్తిపొడుపులో నెంత యారితేరినదో వేరుగవివరింపవలెనా? అంతటి గడుసరినిగూడ వికలచిత్తగా నొనర్చు సన్నివేశమే గానుండినచో ఆమె యీసందర్భమునగూడ పూర్ణముగ నయనిష్ఠురములనే ప్రయోగించియుండును. కాని నడుమనడుమ కోపము వఱదవలె పొంగి నయనిష్ఠుర ప్రయోగమున కడ్డువచ్చెడిది. అందుచే ధర్మరాజు మతమును ఖండించుటలోనే ఒకమారు నయనిష్ఠురములను, అంతలోనే చిత్తజల్లుగవచ్చు విస్పష్ట కోపవాక్యములను ఆమె ప్రయోగించుచువచ్చెడిది. లోపల భావసంఘట్టనమే లేకున్నచో విస్పష్టకోపవాక్యము లుండవు. ఈ యంశము నించుక వివరింపవలసియున్నది. ఈపద్యమాలికలో మొదటి యంతర్భాగము నైకొన్నచో,

"అంతలు సేసి పోనడిచి
యక్కట సంజయుచేత జెప్పి పు
త్తెంతురె? ఇట్టియారట మ
దిం బ్రియమంది యుధిష్ఠిరుండు?— తా
నంతనె యూళు లేవురకు
నైదు సుయోధను డిచ్చునొక్క ఈ
కంత కృపావిహీనమతి
నాతడు నొంచునె యన్నదమ్ములన్."

ఇచ్చట ద్రౌపది లోపల రగులుచున్న కోపమును కప్పిపుచ్చి పరమశాంతురాలివలె మాటాడజూచినది. "అంతలు నేసివారు కబురంపింతురా. దీనికి యుధిష్ఠిరుడు ప్రియమంది" అనియేమో వాక్యముపూర్తిచేయబోయినది. కాని యంతలో కోప మాగినదికాదు. అణచిపెట్టిన స్ప్రింగు ఒక్కప్పుడు పైకి తన్నినట్లు పైకి తన్నినది. అందుచే పూర్వవాక్యము ముగియకుండగనే "తానంతనె యూళు లేవురకు నైదు సుయోధనుడిచ్చునొక్క" అను కోపవాక్యము అప్రయత్నముగ వెలువడినది. కాని యంతలోనె గడుసుదనము కనుసైగచేసినది. ఆమె సర్దుకొని "యీకంత కృపావిహీనమతి నాతడు నొంచునె యన్నదమ్ములన్" అని నయనిష్ఠురమునకు జొచ్చినది. పైపద్యములో గీతగీచినచోట సమాపకక్రియ బుద్ధిపూర్వకముగ లోపించినది. భావోద్వేగమునకు క్రియాపదములు వదలుట, వాక్యము నసంపూర్ణము గావించుట తెక్కన సంప్రదాయమనుట కొక యుదాహరణము—

"అనిమిషవాహినీతనయు
నస్త్రకళాగురు సోమదత్తి క
ర్ణుని రణధర్మహీనతకు
రోయక చంపిన భంగులన్ మరు
త్తనయుడు నేడు చేసిన వి
ధంబును?—లోకులు పాండురాజు నం
దనతతి బ్రువ్వదిట్టరె వృ
థావిజయం బది యెంత యొప్పెడున్!"

ఈ పద్యములో ప్రశ్నార్థక ముంచినచోట క్రియాపద ముండవలయును. కాని దానిని విలుప్తమొనరించుట దుర్యోధనుని భావోద్వేగమును సూచించును. ప్రకృత మనుసరింతము.

"తన మునుపడ్డ బన్నములు
తమ్మునిపై గల కూర్మి పేర్మి నీ
జనపతి సైపకున్న — అది
చిక్కిన రాజ్యముపాలు లేక తీ
టున కొడబాటుగల్గిన నె
ఱుంగమి పెట్టరె? చాలరైరి వీ
రనరోజో ? నానలేమియని
యాడరె లోకమువారు కేశవా."

"ఒడబాటుగల్గిన" అనువాదము కోపము నిగూఢ మార్గమున నిష్ఠురోక్తులలో బ్రవహించినది. కాని యిక నాగజాలక మరల విస్పష్టముగ తరువాతి భాగమున విజృంభించినది. ఇంకొక విశేషము మొదటి భాగమున వాక్యములు దీర్ఘములుగ నున్నవి. కాని కోపము చిత్తజల్లుగ వర్షించునపుడు ఎంతచిన్నవిగ నున్నవో గమనింపుడు. ఈ తీరుగ పద్యమాలిక నంతను నిరూపింప వచ్చును. కాని ప్రకృతమున కివి చాలును. ఈ నయ నిష్ఠురము లన్నియు తిక్కన క్రొత్తగ తెచ్చిపెట్టినవే. కోపమును కొంతసేపు నిష్ఠురములలోను, కొంతసేపు విస్పష్టవాక్యములలోను విజృంభింపజేయుటకూడ కళావైదగ్ధ్యప్రకటనమున కనుకూలముగ తిక్కన కల్పించుకొన్నదే.

సాధారణముగా ఒక భాషలోని గ్రంథమును ఇంకొక భాషలోని కనువదించిన యనువాదములను విమర్శించునపుడు "ఇంతవఱకు మూలములో నున్నది. ఇది యనువాదకర్త కల్పించినాడు" అని పరిహద్దులు నిర్ణయించుటకు వీలుండును. కాని యాంధ్రమహాభారతమున నట్లు వలనుపడదు. అమూలకము లనుకొన్న భాగములకు బీజప్రాయముగనైనను మూలములో వాక్యములు గానవచ్చుటయు, మూలములో నున్నవే యనుకొన్న వాక్యములకుగూడ తెనుగుకవులు తమ ప్రతిభాముద్రను వైచి నవ్యముగ గనపరచుటయు ప్రాయికముగా గానవచ్చును. అందువలననే ఆంధ్రమహాభారతము స్వతంత్ర గ్రంథముగ పరిగణింపబడవలెనను వాదము బయలుదేరినది. వస్తువంతయు సంస్కృతమునుండి గైకొన్నదే. కాని కవితాప్రతిభమాత్రము సరిక్రొత్తది. ఒకటి రెండుదాహరణములు:

"ఓటు యొకింతయేనియు సు
యోధను చిత్తమునందు లేదు నీ
మాటల బోవునే దురభి
మానము యొక్కుడు పూనుగాక, య
చ్చోటన సంగరంబు లగు
చొప్పులు పుట్టిన నైన పాండవుల్
పోటున కిచ్చగింతురొకొ
పోదురొ కానల నుండ నచ్యుతా"

దీనికి మూలములోని మాతృక యిది యని స్పష్టముగా చెప్పుట కేశ్లోకమును గానరాదు. కాని ౯, ౧౦ శ్లోకములలోని యర్థమును గైకొని దానికి తాను కల్పించిన కొన్ని భావములు చేర్చి తిక్కన యీపద్యము రచించినాడు. అట్లే 'తవ కృష్ణ ప్రియా సఖీ' యని బీజప్రాయముగ మూలములో నున్న భావమును,

"నీవు సుభద్రకంటె గడు నెయ్యము గారవమున్ దలిర్ప సంభావన సేయుదు" అని తెలుగుచేసినాడు. రెండింటికి గల తారతమ్యము రసజ్ఞులకు సుబోధము.

ఇట్లు వ్యాసభగవానుని ప్రతిభయు, తిక్కన ప్రతిభయు ఒకదానితో నొకటి విడదీయరాకుండ పెనగొనియున్నను రెండింటికి శైలిలో నొక తారతమ్యము

గోచరించుచున్నది. సంస్కృతము పురాణశైలినున్నది. తెనుగు నాటకశైలి నున్నది. దీనిని నిరూపించుటకు రెండు మూడుదాహరణములు—మూలములో ధర్మరాజు వచనము "ధర్మార్థసహితం హితమ్" అని వర్ణింపబడినది. తెనుగులో 'ధర్మనందను పలుకులు' అనుటతో నాపివైచినాడు. ఆ పలుకు లెట్టివో వర్ణించుట నాటక కవి పనిగాదు. వాని స్వభావమును చదువరియే నిశ్చయించుకొనవలెను. ఒక దృష్టితో చూచినచో నవి ధర్మార్థసహితములే కావచ్చును. ఇంకొకదృష్టితో చూచినచో వీరపురుషోచితములు గాకపోవచ్చును. ఇట్లే ద్రౌపదీ కేశపక్ష వర్ణనములో "మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనం సునీలం సర్వగంధాధివాసితం సర్వలక్షణ సంపన్నం మహాభుజగవర్చసమ్" అను విశేషణము లుపయోగించినాడు. అందులో కడపటి దానిని మాత్రమే గైకొని తిక్కన తక్కిన వానిని విసర్జించినాడు. తక్కిన లక్షణము లన్నియు ఆ కేశపక్షమునకు లేవని కాదు. కాని అవి ప్రకృత సన్నివేశమునకు అప్రస్తుతములు. ఆ కేశపక్ష ప్రదర్శనమువలన భర్తలకును సభ్యులకును ఎట్టి భయానకరస ముదయించినదో అది వర్ణించుటయే మనకు ముఖ్యము. ఇట్లే చివర రోదనమును వర్ణించుటలోగూడ

"ఇత్యుక్త్వా బాష్పసంఘేన
కంఠే నాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కంపం
సస్వనం బాష్పగద్గదమ్.
స్తనా పీనాయతశ్రోణి
సహితా వభివర్షతీ,
ద్రవీభూత మివాత్యుష్ణం
ముంచతీ వారి నేత్రజమ్"

అను రెండు శ్లోకములకు "అని యెలుంగు రాలుపడ నేడ్చిన" అని యెంతో యౌచితీపోషకముగ సంగ్రహించినాడు.

వస్తుప్రస్తారమునందు మాత్రమేగాక పదప్రయోగమునందును, వాక్యనిర్మాణమునందును కూడ తిక్కన నాటకశైలి ననుసరించినాడు. మూలములో నున్న "విదితం తే మహాబాహో" ఇత్యాది ప్రారంభమునకును "అంతలు నేసి పోనడిచి" అను ప్రారంభమునకును భేద మారయదగును. మూలములో ప్రారంభ మేదో కథచెప్పుచున్నట్లున్నది. తెలుగులో ప్రారంభవాక్యములు హృదయమును చీల్చుకొనివచ్చుచున్నట్లున్నవి. ఒకొక్కచో ఒకొక్క పదము నెంతసాభిప్రాయముగా ప్రయోగించినాడో చూచినచో అద్భుతము జనించును. "నీవు సుభద్రకంటె" అను పద్యములో తనను పరాభవమొనర్చిన దుశ్శాసనుని నామమైన నుచ్చరింపక "ఒకండు" అని పేర్కొని, తన కాతనిపట్ల గల యసహ్యభావము నంతను ద్రౌపది వెల్లడించినది. కాని తరువాతి పద్యములో "దుశ్శాసను జూచుచున్ బతులసంభ్రములై" అను పద్యములో దుశ్శాసనుడు అని ప్రత్యేకముగా పేర్కొనుటలో ప్రయోజన మున్నది. దుశ్శాసనుని నామోచ్చారణమున పతులకు పౌరుషము దెప్పింపవలయును. దుశ్శాసనుని చూడగనే చేష్టలు దక్కనారనుటలో అతని నామమాత్రమునకే భయపడు స్వభావముగలవారని ధ్వని. ఇట్లే "పెనుగద పట్టిన భీమసేను" అనుటకును "గాండీవమను నొక విల్లెప్పుడును వహించు కవ్వడి" అనుటకును తారతమ్యమూహింపవలయును. భీమసేనుని గదను నిరసించినచో భీమున కంతకోపము రాదు. కాని గాండీవమును నిరసించినచో అర్జునునికి తీరని కోపము వచ్చును. కర్ణపర్వములోగూడ

"దైవికంబు చేనున్నది గాండీవ మన దాటియంత విల్లు."

అని యర్జునుని ధర్మరాజు నిందించినాడు. 'అంతలు నేసి' 'తన మునుపడ్డబన్నములు' ఇత్యాది పద్యములలోని వాక్యవిరచనచమత్కృతి నిదివరకే వివరించియుంటిని.

ఇట్లు మూలములోని కొన్ని భాగములను వదలియు, మరికొన్ని భాగములను తారుమారుచేసియు, కొన్నిటిని క్షిప్తపరచియు, కొన్ని సొంతభావములను చేర్చియు వ్రాయుటలో సాధారణ కవులయినచో

పద్యమాలికకు స్వరూపసౌష్ఠవము చెడును. మూలము నుండి గైకొన్నదియు, క్రొత్తగ చేర్చినదియు ఒకదాని కొకటి యతుకక "తీర్థమునకు తీర్థము; ప్రసాదమునకు ప్రసాదమై" వికార రూపమును వహించును. కాని తిక్కన మహామేధావి యగుటచే మూలమునుండి గైకొన్నదానికి తాను క్రొత్తగ చేర్చినదానికి ఏకత సంధించి పద్యమాలికకు మూలములో నున్నదాని కంటెను అపురూపమగు స్వరూపసౌందర్యము చేకూర్చినాడు.

తిక్కనపద్యరచనలో మనవా రుపేక్షించు మహాగుణములలో నిది యొకటి. ఒక్కొక్క పద్యమును గాని, పద్యములోని యంతర్భాగములను గాని, అంతర్భాగములలోని పద్యమాలికలనుగాని కలయికలేకుండ అత డెన్నడును వ్రాయడు. వాక్యోపవాక్యముల నొకదానితో నొకటి పొందుపఱచి, పేరగ్రాఫును పేరగ్రాఫుల నొండొంటితో పొందుపఱచి వ్యాసమును గాని, ఉపన్యాసమునుగాని అల్లినట్లుగ నవీనవక్తలను సహితము శిష్యప్రాయులుగా జేయదగిన స్వరూపసమీచీనతతో తిక్కన యుపన్యాసము లలరారుచుండును. అసంబద్ధాంశములను పరిహరించి ఒకవాక్యము నింకొకవాక్యమునకు హేతుభూతముగా నొనర్చి అన్యోన్యావలంబనము తర్కశుద్ధి (Logical sequence) సమకూర్చుటలో నాతని కాతడేసాటి. "పదముల్ సరిగ్రుచ్చునట్లుగా జేరుపనేర్వగావలయు జేసెద నే గృతి యన్నవానికిన్" అని యాతడు నిర్వచనోత్తర రామాయణములోనే ప్రతిజ్ఞ చేసినాడు. ఈప్రతిజ్ఞను భారతములో పూర్ణముగ నెరవేర్చుకొన్నాడు.

ప్రకృతము విమర్శనీయమగు పద్యమాలికను "అంతలు నేసి" మొదలుకొని "నేర్పు లేర్పడన్" వఱకు ఒక ఉపభాగముగను "ఆఱడిలోకయున్" మొదలు "మాధవ నిశ్చయింపుమా" అనువఱ కొక యుపభాగముగను, "ద్రోవది బంధురంబయిన" అను పద్యము ప్రత్యేకమొక యుపభాగముగను "ఇవి, దుస్ససేను వ్రేళ్లం" మొదలుకొని "అచ్యుతా" అనుటవఱకు వేఱొకయుపభాగముగను, "ఎల్లుండ్రరాలుపడ నీడ్చి" ననుట ప్రత్యేకమొక యుపభాగముగను మొత్తము ౫ ఉపభాగములుగ విభజింపవచ్చును. ఇందు ఒక ఉపభాగమున కింకొక యుపభాగము సోపానప్రాయము. అయిదవది కడపటి సోపానము. వీనిని భావతరంగము లన్నను అనవచ్చును. ఈయైదింటిలోను క్రమముగ మనోభావము లెట్టు విజృంభించినదియు ఇదివరకే వివరించితిని. ఈభాగముల నొకదానితో నొకటి "అని మఱియు నిట్లనియె" యిత్యాది వచనభాగములచే నతుకుచున్నాడు. (7, 14, 16 వచనములు) "వాక్యసాంగత్యము చేయుచోనయిన గద్యము వ్రాయను" అను నిర్వచనోత్తర రామాయణ వాక్యమును బట్టి చంపువులలో గద్యప్రయోజనము కొన్నిచోట్ల వాక్యసాంగత్య మొనర్చుటే యని తిక్కన యభిప్రాయమనుట స్పష్టమగుచున్నది. అయితే యీప్రయోజనమునకు భిన్నముగ నీపద్యమాలికలోనే "వరమున బుట్టితిన్" అను పద్యమునకును "నీవు సుభద్రకంటె" అను పద్యమునకును నడుమ "అట్లుంగాక" అని యొక వచన మున్నది. ఈ వచనము పద్యములోని అంతర్భాగమును సూచింపదుగాని వెనుకటి పద్యార్థమునుండి రాబోవు పద్యార్థమును విడదీయుచున్నది. ద్రౌపది మహాభక్తురాలు. అందుచే వరమున బుట్టుటాదిగా గలుగు తక్కిన ప్రాశస్త్యమునకు కృష్ణునికి తనయందున్న గౌరవముచే తనకు లభించిన మాహాత్మ్యమును జోడింపదలచుకొనలేదు. "తక్కిన నా ప్రాశస్త్యమంతయు ఒక యెత్తు. నీవు నన్ను గౌరవించుట అదిఒక్కటి ప్రత్యేకమొకయెత్తు" అని యామె విభజింపదలచుకొన్నది. ఆ విభజనమును సూచించుటకు ఈ "అట్లుంగాక" యను వచన ముపయోగపడుచున్నది.

నాలుగవభాగము ("ఇవి దుస్ససేను" మొదలుకొని "అచ్యుతా" వఱకు) చాలవరకు మూలానుసరణమే. మొదటిభాగము ('అంతలు నేసి' మొదలు 'నేర్పు లేర్పడన్' వఱకు) చాలవఱకు స్వతంత్రరచనమే. ఈ రెంటిని ఒకదానితో వేరొకదానిని కలుపుటకు "ఆఱడిలోకయున్" మొదలుకొని "మాధవ నిశ్చయింపుమా" అనువరకు గల యంతర్భాగము వచ్చినది. ఈ యంతర్భాగములో ద్రౌపది తన ప్రాశస్త్యమును వివరించు

కాని అట్టి తనకు దటస్థించిన సభాపరాభవమును పేర్కొన్నది. ఈ రెండంశములు మూలములో నున్నవే. కాని ఈ యంతర్భాగమును తిక్కన యంతర్భాగములతో ననుసంధించిన విధానమునందును ఈ యంతర్భాగమువలన సాధించిన ప్రయోజనమునందును తిక్కన భేదపడుచున్నాడు.

మూలములో

"యథా త్వాం నస్పృశే దేవ
దోషః కృష్ణ తథా కురు,
పాండవై స్సహ దాశార్హ
స్సృంజయై స్సహ సైనికైః."

అనుశ్లోకము తరువాత తక్షణము 'ఇత్యుక్త్వా మృదుసంహారమ్" అనునిత్యాదిభాగ మున్నచో పార్శ్వమున బండినడిచినట్లు వడిదుడుకుగ నుండును. ద్రౌపదీకేశపక్షప్రదర్శన మంత హఠాత్తుగ జరగినచో చదువరిహృదయము దానికి సంసిద్ధమయియుండదు. సంసిద్ధమొనర్చుటకయి పూర్వనికార ప్రకారకథన మావశ్యకమే. కాని ఆనికారములను చెప్పుటలో

"యత్ర మాం భగవాన్ రాజా
శ్వశురో వాక్యమబ్రవీత్
వరం వృణీష్వ పాంచాలి
వరార్హాసి మతాసి మే.
అదాసాః పాండవా స్సంతు
సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా
వనవాసాయ కేశవ."

అనికూడ ఉన్నది. చతురుడయిన వక్త ఏదైన నొకయుదంతమును చెప్పుటలో తాను సిద్ధాంతీకరింప దలచుకొన్న యర్థమున కెంతయావశ్యకమో అంత మాత్రమే వచించును గాని తనకు వ్యతిరిక్తముగనున్న దానిని చెప్పడు. అట్లుచేసినచో తనకు వ్యతిరేకముగా నున్న రూలింగు చూపించు వకీలువలె హాస్యాస్పదుడగును. దుర్యోధనాదులు ఎన్నటికి క్షమింపరాని యపకారములు తమకు కొనర్చిరి గావున వారితో సంధికూడ దని ద్రౌపది స్థాపింపదలచుకొన్నది. అట్టిచో ధృతరాష్ట్రుని యుదారహృదయమును స్థాపించు ఈవృత్తాంతమునుకూడ చెప్పనేల? ఇది వక్తవ్యాంశముతో చక్కగ నతుకకపోవుటచే తెనుగున వదలివైచినాడు.

మూలమున దీనిని పూర్వభాగముతో నతుకుటలో "పునరుక్తేనచ వక్ష్యామి విస్రబ్ధేన జనార్దన" అనిపించినాడు. అంతవఱకు చెప్పించిన యంశము "వధ్యులను వధింపకపోవుటకూడ దోషమే. అందువలన నాదోషము నిన్నంటకుండ గాపాడుకొను"మని. దాని తరువాత "పునరుక్తియైనను నీయందుగల చనవున చెప్పుచున్నా"నని తనప్రాశస్త్యమును వర్ణించుట కారంభించినది. ఈరెండును ఒకదానితో నొకటి చక్కగ నదుకుట లేదనుట స్పష్టము.

తెనుగులో 'ఏ నిటు లంటి నావలన' దను పద్యము తరువాత 'అని మఱియు నిట్లనియె' అను వచనమున్న, 'ఆఱడి బోకయుఁన్' అను పద్యమును ఉన్నవి. "మీమీ నేర్పులు ప్రకాశించునట్లు మీ సుజనత్వము చెడకుండ సంధిచేసికొను"డని యామె వచించినది. న్యాయతః ఆమె యంతతో నూరకుండవలసినది. కాని యంతటితో నూరకుండుట కవకాశము లేదని యావాక్యవైఖరియే సూచించుచున్నది. నిష్ఠురమునకు "మీయిష్టము వచ్చినట్లు మీరు చేసికొనుడు. నాకెందులకు?" అని మాటవరుస కన్నదేగాని నిజముగ హృదయ మూరకుండ నిచ్చునా? అందుచే తిరువాత మరల మాటాడినది. అయితే నెఱజాణయగు నామెకు "మీయిష్టము వచ్చినట్లు మీరు చేసికొను డని చెప్పిన వెనుక మఱల నెందుకు మాటాడుచున్నావు?" అను ప్రశ్నకు సమాధానము చెప్పకుండ మాటాడుట యుచితము గాదని తోచినది. అందుచే "నాఱడి బోకయుఁన్" అనుపద్యము వచ్చినది. "రవ్వపడకుండ ఫలము సాధించుకొను నేర్పుతో మాటాడగల శక్తి నాకవ లేదు. ఎందుకు లేదు? వివేకము నన్ను పూర్ణముగ విడకుండినచో అట్టిశక్తి నాకు లేకపోలేదు. కాని యిప్పుడు వివేకము నన్ను విడిచిపెట్టినది. అట్టి వివేకము విడుట కేమికారణము? అలుకమై విఱిడిరైన

మానిసికి వివేక ముండునా? వివేకమునుగూడ నశింప జేయు నంతటి యలుక కేమి కారణము?" ఈ ప్రశ్నకు సమాధానము కులాంగన లిట్టులోర్తురే యను పునఃప్రశ్నయే. నా యాభిజాత్యము, శీలము విచారించి అట్టి నేను పడిన పరాభవములనువిచారించి ఆ పరాభవములకు కులాంగన నగు నేను అలుక వహించుట ఉచితమో, కాదో నీవే నిశ్చయింపుము." అని ద్రౌపది సమాధాన మిచ్చుచున్నది. అయితే "నీ భర్తలు మాత్రము నీతోఁబాటు పరాభవింపబడినవారు గాదా? వారికి లేని యలుక నీకేల?" యను ప్రశ్నము వచ్చుచున్నది. దానికి సమాధానముగ "ఇప్పుడు సంధియైనచో వారికి నాకు దటస్థించు విషమసన్నివేశము తటస్థింపదు. నన్ను వెనుక ధృతరాష్ట్రుకు కోడలనియైన సంకోచింపక దాసిగా జేసెను. ఇప్పుడు నేను ధృతరాష్ట్రుని కడకు సంధిపేరు చెప్పుకొనిపోయి చేయవలసినది కోడరికమా, దాస్యమా?"

మూలములో పునరుక్తియని స్పష్టముగ వచ్చుచున్న యంశమును పునరుక్తిగ గానరానీయక తెనుగున ద్రౌపదీప్రాశస్త్యకథనమున కెట్టి మహత్తర ప్రయోజనమును కల్పించినాడో. "నా కిప్పుడు నిజముగ నొక విషమ సన్నివేశము తటస్థించినది. దానినుండి నీవు న న్నుద్ధరింపవలెను." ఆమె కృష్ణుని వేడుచు ఆ విషమ సన్నివేశ మేదో వివరించుటకు తనప్రాశస్త్యమును, పరాభవమును ఉగ్గడింపవలసివచ్చినది. దీనివలన చేకుఱిన తర్కశుద్ధి యనిర్వచనీయము. మూలములో వదులు వదులుగ నున్న పద్యమాలిక కెంత జిగి వచ్చినది!

"నన్వహం కృష్ణ భీష్మస్య
ధృతరాష్ట్రస్య చోభయోః,
స్నుషా భవామి ధర్మేణ
సాహం దాసీకృతా బలాత్."

అని మూలములో నున్న దానిని ప్రశ్నార్థకముగమార్చుట కళాప్రయోజనమును గుర్తింపదగును.

ద్రౌపది కిట్టి ప్రశ్నలు వేయుట కిదియే మొదటిసారి కాదు. వెనుక సభాపర్వమున కూడ నెవ్వరును సమాధానమును చెప్పలేనట్టి యిట్టిప్రశ్న మొకటివైచినది.

పై యంతర్భాగములోని భావక్రమము కొంచెమాలోచించినగాని బోధపడదుగావున ఇంత వివరింపవలసివచ్చినది. తక్కిన యంతర్భాగములలోని భావక్రమము సుబోధమే ఈయంతర్భాగములలోని సారాంశము సంగ్రహముగ జెప్పినచో ఈ యంతర్భాగములొకదానితో నొకటి యెట్లు పొందుపడియున్నదియు విశదమగును. మొదటి యంతర్భాగములో "ధర్మరాజు అయిదూళ్లకు రాయబార మంపుచున్నాడా? అవును పాపము! ఆతడు తన యన్నదమ్ములను చూచి చూచి చంపుకొనగలడా? దుర్యోధను డేమియు నీయకపోయినను సరే, సంధిచేసికొనును. మంచిదే. మీ సుజనత్వము చెడకుండ మీమీనేర్పులు చూపి సంధిగావించుకొనుడు. నా కెందులకు? నేను మూగనై యుందును." అన్నది. ఈ వాక్యవైఖరినిబట్టియే ఇది నిష్ఠురము గావున ఆమె అంతతో నూరకుండజాలదని తేలుచున్నది. అందుచే తరువాతి యంతర్భాగమునకు ప్రసక్తికలిగి దాని కిది సోపానమగుచున్నది. తరువాతి యంతర్భాగమున "ఊరకుందమన్నను లోపలనున్న కోప మూరకుండనిచ్చుట లేదు. అంత కోప మెందుల కందువా, నాయాభిజాత్యమును, సౌశీల్యమును, కౌరవులవలన నే పడిన పరాభవమును విచారించినచో కారణము నీకే విస్పష్టమగును." ఇది తరువాతిభాగమగు కేశపక్షప్రదర్శనమున కుపోద్ఘాతము. వెనుకటి వాక్యములు చెప్పి యామె తన పడిన పరాభవమునకు శాశ్వతచిహ్నముగ నున్న, దుశ్శాసనుని వ్రేళ్లచే సగముతెగిపోయి మిగిలిన కేశపక్షమును మాధవునిముందట పెట్టి "కౌరవసభలో నీ మనస్సున స్మరింపవలసిన దీకేశపక్షమేగాని తక్కిన మామాట లెవ్వియు గావు. ఈ పరాభవాగ్నిని ఒడిలో చిచ్చిడుకొన్నట్లు హృదయమున వహించితిని. అచ్యుతా, నీవంటి తోబుట్టువు, ఇట్టి భర్తలు నాకున్నను ఇంతవరకు దాని నార్పుట కవకాశము లేకపోయినది. ఇకముందుకూడ అట్టి యవకాశము లభించనే లభింపదేమో.' అని వెలుంగురాలుపడ నేడ్చినది.

ఇప్పుడు ఆయా యంతర్భాగములలోని స్వరూపసౌష్ఠవము మొత్తముమీద పద్యమాలికస్వరూపసౌందర్యము విస్పష్టమైనది. కేశపక్ష ప్రదర్శనమునుగూర్చి

కొంత చెప్పవలసియున్నది. ఇది చాల గమనింపదగినది. మాట లెన్ని చెప్పినను అవి మనసున నిలువకపోవచ్చును. అచ్చట నున్న వారందరును ద్రౌపది యామెకు తోచిన మాటలు చెప్పునని యనుకొనియుందురేకాని ఈ తీరున ప్రవర్తించునని యెవ్వరును అనుకొనియుండరు. బహుశః ద్రౌపదికిగూడ నది సద్యఃస్ఫురణమే కావచ్చును. కాని దానివలన మంచి నాటకీయప్రయోజనము (Dramatic effect) సిద్ధించినది. ఒఱలోనుండి ఖడ్గము నీవలకు తీసి యోధాగ్రేసరుడు జళిపించిన ట్లామె యీ కేశ పక్షమును ప్రదర్శించినది. దానివలన యోధవరులెల్లరు నివ్వెరపడియుందురు. కురుపాండవ యుద్ధమునందు వారికీ దృశ్యము నిరంతరము కండ్లకు గట్టినట్లు ప్రత్యక్షమయి యుండదగియున్నది. ఆమె యేడ్పు టెలుంగుకూడ వారి శ్రవణకుహరములలో మారుమ్రోగును ఇప్పటి యుద్ధములలోని బ్యాండుసంగీతముకంటెను ఎక్కుడుగ వారిని హెచ్చరింపదగిన రసోన్మీలనశక్తితో విరాజిల్లుచున్నది.

ఇట్లు ఒకకంట నశ్రుకణములతో, ఒకకంట అగ్నికణములతో ద్రౌపది ప్రత్యక్షమగుచున్నది. భరత వీరులకు సైతము పౌరుషము ప్రసాదించు నఖండతేజ మామెముఖసీమను తాండవించుచున్నది. ఈ ఘట్టమున ధర్మజుడు అర్జునుడు భీముడు నకులుడు సహదేవుడు - వీరి అయిదుగురి సంభాషణములును హృదయంగమములుగానే యున్నవి. వారిలో నేకాభిప్రాయ మిచ్చినవారు కూడ పునరుక్తిని పరిహరించి తమతమవ్యక్తిత్వమున కనుగుణముగ మాటాడిరి. ఆయుపన్యాసములలోని పాత్రౌచిత్యము, వ్యంగ్యచమత్కృతి, అర్థగాంభీర్యము, రాజకీయ తంత్రజ్ఞత చదివినకొలది చవులూరించుచుండును. కాని వానిలో దేన్నికిని ఈ ద్రౌపదీవాక్యముల కున్న ఉద్వేగముకాని, తేజముకాని లేవు. ద్రౌపది అగ్నికుండమునుండి యుదయించినది. ఆమెయుపన్యాసము కూడ కనకనలాడు హృదయాగ్నికుండమునుండి యుదయించినది.

పాండవులందఱును కష్టముల ననుభవించినవారే యయ్యు వారి కష్టములెల్ల నొకయెత్తు. ఈమెపడిన పరాభవము ప్రత్యేక మొకయెత్తు. అందుచేతనే వారిని దనకు శిష్యప్రాయులుగా జూచుకొని ఉపదేశముద్రను చేతబట్టుట కామెయే కధికారము సిద్ధించినది. దీనిని గుర్తించియే పాండవజననియగు కుంతి

"కొడుకులకంటె నయ్యనుగు
గోడలి కెక్కుడుగూర్తు గోడలుగ్
గొడుకులుసేయు భక్తి కట
కోటిమడుంగులు నాకు నె
ప్పుడు దగ జేయుచుండు నది
పుణ్యచరిత్ర కులాగ్రగణ్య ద్రౌ
పది సకలంబు చూడ సభ
దైన్యముబొందుట నూని పోక్కెదన్.

భుజబలమున జీవించుట
నిజనర్మము మెత్తబడుట నింద్యము మాద్రీ
ప్రజలకు జెప్పుము ద్రుపదా
త్మజ గార్యంబడుగు మనుము తగ నందరతోన్."

అని సెలవిచ్చినది. ధీరచరిత్రమాహాత్మ్యము ధీరచరిత్ర గ్రహింపవలెనుగదా? మాటవరుసకు ద్రౌపది వివేకహీనముగా మాటాడుచున్నా నమన్నదేగాని పరిస్థితులనుబట్టి చూచినచో నామెయుపదేశ మవశ్య కర్తవ్యము. అందుచేతనే 'కార్యవాదములే' పలుకు గొంతి సైతము ఆమెను 'కార్య మడుగు'మని చెప్పినది.

సాధారణముగా ఉడుకు, ఉద్వేగము నున్న యుపన్యాసములలో వివేక ముండదు. వివేకమున్న యుపన్యాసములలో నుడుకుండదు. ఈ రెండును మేళగింపగల ద్రౌపదివంటి యద్వితీయమహిళారత్నములు ప్రస్తుతకాలమున ముగ్గురుండిన జాలును. ఈ సరికి హిందూదేశ మెట్టి యున్నతస్థితిలో నుండెడిదో!

చదువరీ! ఒకసారి శిరమువంచి నమస్కరింపుము. ఎవరికి? భారతీయనారీమండలికి మాత్రమేగాక అఖిలభారత నారీలోకమునకును దలమానికమైన ద్రౌపదికా? ఆమెను ప్రత్యక్షపఱచిన కవిబ్రహ్మకా? అతని గురుదేవుడగు వ్యాసునకా? ముగ్గురకును,

# తిరువణ్ణామలై చిత్రములు



౧. అరుణాచలేశ్వరాలయము, పర్వతము

K. P. S.



౨. అరుణాచలేశ్వరాలయము (గాలిగోపురము వెలుపలనుండి) K. P. S.

# 'పద్మావతీచరణ చారణచక్రవర్తి'

పరిశీలనము

'హనుమచ్ఛాస్త్రి'

ఇది మూడంకాల 'రూపిక.'

కవయిత: శ్రీ శివశంకరశాస్త్రి.

వస్తువు : పదకొండవ శతాబ్ద్యంతమున వంగ దేశాన్నేలిన లక్ష్మణసేనవిద్వత్ప్రభువు ఆస్థానకవి జయదేవుడు శ్రీ రాధామాధవ ప్రణయలీలాలాలిత్యములను, భక్తితన్మయుడై, రససిద్ధుడై ఎన్నో గీతాలలో గానం చేసి గీతగోవిందకావ్యాన్ని నిర్మించినాడు. ఏలిక జయదేవకవిని సప్రీతిబహుమానంగా తనకొలువునకు రప్పించి ఉమాపత్యాది పండితులతో గీతగోవిందమును విని బ్రహ్మానందం పొంది మహోన్నతంగా సమ్మానించి జయదేవుని రసికతకు అంకితముగా గీతగోవింద కావ్యాది శ్లోకములోని 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ' అన్నమాటను అతనికి బిరుదు చేశాడు.

జయదేవమహాకవిరాసిక్యమునకు దీప్తి నిచ్చి, అతని కావ్యసృష్టికి ప్రాణప్రతిష్ఠ చేసినది అతని భార్య పద్మావతీదేవి. ఆమె నృత్య వైభవం అతని దివ్యకావ్యనిర్మితికి జీవనౌషధమై హృదయమున కొక జ్వలనము నిచ్చిన సంగతిని జయదేవుడు సగర్వంగా తనకావ్యాదిని చెప్పుకొన్నాడు.

శివశంకరశాస్త్రిగారు ఆ పుణ్యదంపతుల సుస్నిగ్ధవృత్తికీ, కళాప్రవణతకూ, వారికావ్యమునకు జరిగిన అద్భుత సమ్మానకథకూ మురిసి, పద్యవాక్యోపవాక్యాలతో మూడు రంగాల ఒకక్రొత్త దృశ్యకావ్యమును నిర్మించారు.

దీనిని కొందరు పద్యనాటిక అంటారు. కాని నాటికాలక్షణం దీనికి దగ్గరగా లేదు.

"నాటికా క్లప్తవృత్తా స్యాత్
స్త్రీప్రాయా చతురఙ్కికా,
ప్రఖ్యాతో ధీరలలితః
తత్ర స్యాన్నాయకో నృపః"
—సాహిత్యదర్పణము.

ఆదిగా ఎన్నో లక్షణాలు కావాలి నాటికకు. రూపకమార్మికులు నాటక, ప్రకరణ, భాణ ఆది దశరూపకాలనూ, నాటికా, త్రోటక, గోష్ఠి ఆది అష్టాదశోపరూపకాలనూ లక్ష్యలక్షణాలతో నిరూపించారు. పరిశీలించి చూడగా 'పద్మావతి'... వీటిలో ఏదిన్నీ కాదు - అయితే, కానవసరములేదు.

అభినయయోగ్యమై, రూపారోపితమైతే రూపకం అవుతుంది. ముఖ, ప్రతిముఖాది సంధులతో పూర్ణములైతే - నాటకాది ప్రధాన రూపకాలూ, కించిదూనములైతే

నాటకాది ఉపరూపకములున్నూ పుట్టుతవి. నిరంకుశుడైన కవి పరిణతబుద్ధితో, ప్రస్తరించిన కొద్దీ న్యూనాధికలక్షణాలతో ఎన్నో కొత్తరూపకాలు నిర్మించవచ్చు.

నవ్యసాహిత్య భగీరథుడు శివశంకర శాస్త్రిగారు ఇట్టి క్రొత్తరూపకసృష్టికి దారి తీసి ఆంధ్రకళాశాలుర ప్రతిభకు అంకురార్పణచేసినారు. అయితే - ఈరచనకు పాశ్చాత్యుల Operas గాని, వేదవాఙ్మయపు ఛందోభాషణప్రతిభాషణములుగాని, తెనుగులవీథి నాటకాలుగాని దూరపుచుట్టాలు కావచ్చు.

ఇతివృత్తవిన్యాసంలో చిన్నదై, రూపకోపరూపకలక్షణాలకంటె వేరైన ఈ సంక్షేపరూపకానికి 'రూపిక' అని నేను సంకేతం చేస్తున్నాను. ఇది, గానానురూపమైన పద్య భాషణప్రతిభాషణములతో ఉంటే దానిని పద్యరూపిక అందాం. అంతే, కాని అమరని సనాతనరూపకాల పేర్లను తొడగవద్దు.

దీనిని కాకినాడ నవ్యసాహిత్య పరిషత్తు నాల్గో సమావేశంలో ప్రయోగించగా నేను చూశాను. ఆదర్శకమైన పద్మావతీజయదేవుల దాంపత్యమున్నూ, కళాగర్భితమైన వారి సుస్నిగ్ధవృత్తీ, గౌడమహారాజు మహౌదార్యమున్నూ చక్కగ చిత్రితములై, పద్యాలు పాకాన బడి, ప్రదర్శనం రుచిగానూ, శుచిగానూ ఉన్నది.

పలువురు కళాపరులు తలలూపి మెచ్చుకొన్నారు. కాని సమర్థులగు పరిషన్నటుల వంటివారు గాని సామాన్యులు నటించి 'రక్తి' కట్టించడం చాలా కష్టం.

'పద్మావతి...'లోని రూపకావయవ న్యాసమును దిఙ్మాత్రగా వివరిస్తాను.

దీనికి నాయకుడు జయదేవుడు. అంగిరసము అద్భుతం; అంగరసం శృంగారం.

"అష్టపదులు చాల అవధరించినవాడు
గోష్ఠిలోన నృపతి కుతుకమునను
కావ్యపరిసమాప్తి కావుట యాలించి
ప్రభువొసంగె నాజ్ఞ పఠనమునకు"

అను జయదేవవాక్యంతో బీజోత్పాదక ప్రారంభంతో ముఖసంధి ప్రారంభించింది.

ద్వితీయరంగాదిని మహారాజు
"కావున మా కెరిగింపం
గావలె విపులముగ కావ్యగానంబులు మీ
కేవిధమున రుచియించెనో ?-"

అన్న మాటతో ముఖసంధియందలి ప్రధానోపాయంయొక్క లక్ష్యాలక్ష్య్యోద్భేదంతో ప్రతిముఖసంధి స్పష్టమగుచున్నది. ఇందులో గర్భసంధి లేదు. లక్ష్మణసేన సభాపండితుడు నీలకంఠమఖి అనిన "అన్యథా ఈకవిప్రకాండు డెంచకున్న వివరములను కొన్ని విద్వద్వినోదార్థ మడుగదలతు మాజ్ఞయయ్యోనేని" అనే మాటలతో ముఖ్యఫలోపాయం సాస్తరాయకమై విమర్శసంధి ఉప

జీ ప్రమైనది. ద్వితీయరంగాంతమున మహారాజు పలికిన,

"మణిహారమును పుష్పమాలికం జుట్టి
గ్రంథ రాజము భద్రగజముపై నుంచి
వివిధ వాద్యములతో వీధుల వెంట
వైభవమ్ముగ నుత్సవము సేయవలయు"

అను పలుకులతో ఫలప్రాప్తిరూపమైన నిర్వహణసంధి నిర్వహింపబడింది.

పురాణపురుషుల అమానుషకథలతో అల్లుకొన్న పాతనాటకాలకంటె 'పద్మావతి...' ప్రత్యేకరచన. భారతీయ ప్రాచీన కళా వైదగ్ధ్యమును, నాటి విద్వత్ప్రభువుల కావ్యగీత ప్రియత్వ, మహౌదార్యములను పట్టి చూపించి పురాభారత భాగ్యమును తలపునకు దెచ్చే ఒకప్రకృష్టతతో ఈ రూపిక సహృదయ సారస్వతుల సాముఖ్యమునకు నోచుకొన్నది.

పాత్రసంభాషణ మృదువైన వేర్వేరు జాతి పద్యాలతో ఇంపుగ నడచింది. తెనుగు పలుకుబడికి ఒదగని వృత్తాలు లేవు. వాక్యోపవాక్యాలలో పద్యాలు మొలిచినట్టున్నాయి. మచ్చుకు ఒండు రెండు పద్యాలు -పద్మావతి జయదేవునితో

"అదిగో! కల్యాణశంసి ఘంటారవమ్ము
బయలు దేరుడు నృప సభా భవనమునకు
వరదుడైనట్టి రాధికావల్లభు కృప
విజయమగుగాక గీతగోవిందకృతికి."

మహారాజు సభలో మహేశ్వరభట్టు -

"చిత్తము మహాప్రభూ! మీ రశేష శేము
షీధురంధరులు రసజ్ఞ శేఖరులును
అట్టి మీసన్నిధానమునందు మేము
వ్యాఖ్య చేయుట కేవల మాజ్ఞవలన."

ఈ రూపికలో చక్కని రూపక సంఘటనలూ, మంచి ఉక్తిచాతుర్యమూ, గోరువెచ్చని సాంస్కృతికవాక్కులూ ఉండి, రస సారస్వతులకు చదువదగీ, సమర్థులకు ఆడదగీ ఉంది.

కాని :

ఎడనెడ 'పద్మావతి...' లో శ్రవ్యావానలు కొట్టి నాట్యంలో కొంత ఎగుడుదిగుడు దెచ్చిపెడుతున్నవి. రచయిత, వర్ణనకు అనువు దొరికిన చోట రూపకత్వమును మరచిపోయి

"ఆపగాతీరాన అనతిదూరమున
రమణీయమైన ఆరామంబు కలదు."

అని వర్ణనను సాగదీసి ఇరవై పంక్తులు వ్రాయడం - ఈ చిన్న రూపకంలో పొందలేదు. వాచికాభినయంలో పద్యం నటునకు ఎక్కువ బాధ్యతను, శ్రమను పెడుతుంది. కనుక ఇందులో కొన్ని పాత్రల కున్న పద్యాల 'అతి' ని తగ్గిస్తే బాగుంటుంది.

మహారాజసభలో పండితుల సాహిత్య గోష్ఠిలోని 'చాదస్తం' కాస్త కుదించడానికి శాస్త్రిగారు వీలుచూడాలి.

ఒకొక్కచోట పాండిత్య వివశులై వాడిన 'స్తంబేరమం','ఉద్వాహనక్షమం', 'మధురిమోద్గారం' వంటి చేవసంస్కృతాన్నీ, 'రసాది ప్రతీతి ప్రకర్ష బంధ కారకం' 'రస ప్రతీతి విలంబ కారకం' వంటి పరిభాషలను—దృశ్యకావ్యం కనుక—సభ్యుల సుకుమార బుద్ధి ననుసరించి కొంచెం మోతాదు తగ్గించి వాడితే దీని శోభ ఇంకా పెరగ వచ్చు.

మొత్తంమీద ఈ రూపిక నవ్యసాహిత్యవ్యవసాయంలో వింతచవులూరించే ఒక క్రొత్తఫలం; శివశంకర శాస్త్రిగారి బహుముఖ కళాశీలితకూ, రసికత్వమునకూ అద్దంవంటిది.

ఇందలి వడ్డాది బాపిరాజు గారి బొమ్మలు 'హేమంత శర మాధుర్యం' (పసిడికి పరిమళం). పుస్తకంకూర్పూ, తీర్పూ సాహితీసమితి సభాపతి వనదగి, అమూల్యముగా ఉన్నవి.

# వెన్నెలనీడలు

పి. గణపతిశాస్త్రి

రజనీమయూర బర్హమునం జంద్రకములో !
నీలిచీకటికొలనిం దెలికలువపూవులో !
పూలలత లిడిన కర్పూర నీరాజనములో !
మెరయు వెన్నెల నీడలారా !
పూర్ణిమా
తరళనయనమ్ములారా !
మీరిట నిరీక్షింతు రెవరికొరకై ?
మబ్బులై,
మిమ్ము నే మూసి ముద్దాడిపోనా ?
పుష్పవనజాలమున "మిలమిల" ను, ముత్యాల
మీనులై; హృదయమున మెరయునవహారమ్ములై,
మీరిటులె మెరయువరకున్,
రేయెల్ల
మీకొరకె పడియుందునో !

# "మంచి చెడ్డలు"

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

మాటలు వేఱగునుగాని వీనియర్థముగల పదము లన్ని దేశభాషలందును గలవు. ప్రపంచమందలి యెల్లవారును కోపమువచ్చినపుడో, నీతులు చెప్పునపుడో, వస్తుతత్త్వము పరీక్షించునపుడో, కష్టమందో, సుఖమందో, ఏదోయొకసమయమున వీనిని వాడుచునే యుందురు. ఒకవ్యక్తి తనకుఁగాని, యితరులకుఁగాని మేలుకలుగునట్టి పని చేయుటయు, సౌజన్యము చూపుటయు మంచి యనియు, అందుకు వ్యతిరేకముగా నొనర్చుట చెడ్డయనియు లోకు లందురు. ఏదేని యొకపదార్థము రూపమునఁగాని, గుణమునఁగాని హృదయమాకర్షించెనేని మంచిదనియు, దానికి వ్యతిరిక్తమైనఁ జెడ్డదనియుఁ జెప్పుదురు. ఒకవస్తు వుపయోగకరమైన మంచి దనియుఁ, గాకున్నఁ జెడ్డదనియు నందురు. మఱియుఁ గొందఱొకవస్తువు మంచిదందురు. కొందఱదే చెడ్డదందురు. ఇట్లు బహువిషయముల స్మరింపఁబడుచు విభిన్నానుభవముల కాశ్రయమైన వీటితత్త్వ మెట్టిదో యొకింత పరిశీలింతము:

"దృష్టం కిమపి లోకేఽస్మిన్న నిర్దోషం న నిర్గుణమ్."

అనునార్యోక్తి గుణములేనిదియు, దోషములేనిదియు నొకటియైన లోకమునఁ గన రాదని చెప్పుచున్నది. ఈ నిర్ణయమును బురస్కరించుకొని, ఇవి యన్నిటికిని సహజములా? అన్నిటియందు నివిరెండు నుండునా? అన్నిటియందు సమపరిమాణములుగా సమముగా స్ఫురించునా? అను మూఁడువిషయములు ముఖ్యముగాఁ జర్చింతము.

సహజములందుమా, ఒక కార్యమునకో వస్తువునకో సంబంధించిన మంచి గానీ చెడ్డగానీ, అది యందఱికొక్కవిధముగాఁ గనఁబడవలెను. అట్లు కాకున్న నది సహజము కానేరదు. ఇందుకు జీవహింస నుదాహరించుకొందము.

"ఏజంతువును జంపరాదు - చిన్నమొక్కనుగూడ హింసింపరాదు - యాగములందు పశువును వధింపవలెను - ఐదుగోళ్లుగల మైదుజంతువులను భక్షింపఁదగును - క్రూరజంతువులను హింసింపవలెను - ఆయారోగముల శాంతి కాయామృగముల మాంసము తినవలెను - యుద్ధములందు శత్రువులను సేనలను వధింపవచ్చును - కాళికాదేవికిఁ బ్రాణులను బలియివ్వవచ్చును- స్త్రీవధ చేయరాదు - బ్రాహ్మణుని హింసింపరాదు." ఇత్యాదిగా విధినిషేధరూపమున వివిధమైన జీవహింసకుఁ జెందిన మంచిచెడ్డలు సంఘ

మేర్పఱుచుకొన్నవిగాఁ గనవచ్చును గావున సహజములనుటకు వలనుపడకున్నది. పోనీ!

ఆరోపితములందుమా, ఒకవిషయమున నించుక యభిప్రాయభేదమున్నను, అది చలించినట్లు కనఁబడనిచో, దానిమంచిగాని చెడ్డగాని యారోపితము కాఁజాలదు. ఇందుకు సత్యాసత్యములను గ్రహింతము.

"సత్యంవద - సత్యంబ్రూయాత్ - సత్యాన్నపరం కించిత్ - సత్యమేవజయతి - సత్యము సర్వశ్రేయము" ఇత్యాదిగా సత్య స్తుతి సకలవాఙ్మయములందు, సర్వసంఘము లందు మ్రోఁగుచున్నది. "నబ్రూయా త్సత్య మప్రియ" మనుదాని సత్యవచన మప్రియ మైనచో నపుడేమియుఁ జెప్పక మౌనమువహింపవలెనని భావముగాని, అసత్యము చెప్పవచ్చుననెడియర్థముకాదు.

"వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్త మానభంగమందు
చకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప."

అను భాగవతవచనము కొన్నివిషయముల నసత్యమున కనుజ్ఞయిచ్చినది గాని, అది శ్రద్ధేయము కాదు. తనస్వామిని రక్షింపవలెనన్న యాత్రతమున శుక్రుఁడా సమయమునం దసత్యము చెప్పవచ్చునని బోధించినను, సత్యమర్మజ్ఞుఁడైన బలిచక్రవర్తి యామాట పాటింపకుండుటయే యిందుకుఁ జాలును. స్వలాభపరుఁడై ధర్మరాజొక్కమా అబద్ధమాడినందువల్ల నతనికివచ్చిన యపయశస్సును, సర్వస్వము గోల్పోయి యాలుబిడ్డల నమ్ముకొని నీచవృత్తికైనఁ బాల్పడి సత్యము పరిపాలించిన హరిశ్చంద్రుని యశస్సును లోకవిదితములు. అందుచే సత్యము యొక్క మంచియు, అసత్యముయొక్క చెడ్డయు నిశ్చలములగుటంజేసి యివి యారోపితము లనుటకు వలనుపడకున్నది. ఇఁక-

అన్నిటియందు నివి రెండు నుండునా యన్న ప్రశ్న విచారింతము— మాంసాశనము వామాచార శాక్తేయులకు మంచిది, సమయాచారశాక్తేయులకుఁ జెడ్డది - కొన్ని వర్ణముల కిష్టము, కొన్నివర్ణముల కనిష్టము- మాతులకన్యాపరిణయ మాంధ్రదేశీయుల కభిమతము, దాక్షిణాత్యుల కనభిమతము — పితృవ్యకన్యా పరిణయము మహమ్మదీయులకు సమ్మతము, హైందవుల కసమ్మతము- రజస్వలావివాహ మొకముని యొకవిధముగా నంగీకరించును, ఒకముని యేవిధముగాను అంగీకరింపఁడు - విధవావివాహ మార్యమత విరుద్ధము, బ్రహ్మసమాజ మతసిద్ధము- సకల జాతిసాంకర్యమును హిందూధర్మశాస్త్రము లంగీకరింపవు, జాత్యంతరుల విధు లంగీకరించును. ఒకఁడు విగ్రహారాధన మౌననును, ఒకఁడు కాదనును. ఈవిధముగా నొకరికి మంచిదైన దింకొకరికిఁ జెడ్డది, ఒకరికిఁ జెడ్డదైన దింకొకరికి మంచిది యని విదిత మగుచున్నది గావున నిట్టి సాంఘికవిషయములందివిరెండును గోచరించునుగాని సహజములు

కాఁజాలవు. ఇట్టిపట్టుల నివి సంఘకల్పిత ములే. కాని-

"అన్నము ప్రాణము నిలుపును, అదే యజీర్ణమున విష మగును - నీరు నిప్పు గాలి లేక బ్రతుకలేము, అవి హద్దుమీఱినను బ్రదుకలేము - గరళము ప్రాణము తీయును, అసాధ్యరోగములు కొన్నిటి కదే యమృత మగును." ఇత్యాదిసిద్ధవిషయములు కొన్నిటి యందివి రెండు నుండును; సహజములుకూడ నగును. అయినను మఱికొన్నిటియం దివి రెండును గనరావు.

సజ్జనమైత్రి, చిత్తశుద్ధితోడి యీశ్వర చింతనము మొదలయిన యుత్తమకార్యము లందు మంచియేకాని చెడ్డ యిసుమంతయు గోచరింపదు. పూర్వుల నిర్ణయమునుబట్టి చదువుకూడ నిట్టివానిలోఁ జేరునుగాని యది యీకాలమున సరిపడకున్నది. సంస్కృతమో, ఆంధ్రమో, ఆంగ్లమో, ఏదోయొకటి పూర్తిగాఁ జదివినవారిలోఁగూడ ననేకుల యందు గర్వము, దురహంకారము, స్వార్థ పరత, అసూయ, అసహనము, మోసము మొదలగు దుర్గుణము లు ప్రత్యక్షమగుచున్న వనుట లోక మెఱుఁగనిదికాదు. ఇంతయేల? వేదాన్తశాస్త్రము తలక్రిందుగా నప్పగింపఁ గలవార మనుకొను నపూర్వవేదాంతులలోఁ గొందఱు లబ్ధప్రతిష్ఠులుకూడ 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అను సూత్రములకు 'తాము తమకుటుంబమును సత్యం, తక్కినదంతా అసత్యం' అనుసూత్రములు కల్పించుకొని, దినమునకు వేయి యసత్యము లాడి పరులను మోసగించుచుండ, నిప్పటి చదువులందు కేవలము మంచియే యున్నదని యెవరనఁ గలరు?-ఎవరో దానమువలన దరిద్రులైనా రనియు, దానివలన దేశములో సోమరుల సంఖ్య హెచ్చుననియుఁ గొందఱు దానమున దోషము కల్పింపఁ జూతురు గాని, అది సరి గాదు. యుక్తమైన దాన మెప్పటికి నుత్తమము. అందన్న దానమంటిది మఱియొకటి లేదు. కావున నందు మంచియేకాని చెడ్డలే దనవచ్చును. ఒళ్లు తెలియనీయకపోవుట కూడా గుణ మనుకొనువారికిఁ జెప్పలేము కాని, సురాపానమందు చెడ్డయేకాని మంచి యేమాత్రము కనఁబడదు. అట్టిదే గంజాయి. ఆత్మస్తుతి పరనిందలు రెంటను దోషముమాత్రమే స్పష్టము. ఇట్టి యనేకోదాహరణములనుబట్టి యన్నిటియందు నివిరెండు నుండుననుటకు వలనుపడకున్నది. ఇఁక—

అన్నిటియందు నివి సమపరిమాణము లుగా, సమముగా స్ఫురించునా అనుప్రశ్న మెత్తుకొందము. పూర్వోదాహృతములైన యన్నము నీరు గాలి మొదలగువానియందు గుణ మత్యధికము, దోష మతిస్వల్పము. గరళము, నాభి, నల్లమందు మొదలగు పదార్థములందు మంచి మిక్కిలితక్కువ, చెడ్డ మిక్కిలి యెక్కువ. కాఫీ, టీ, పొడుము, చుట్ట, సిగరెట్టు, బీడీ, కాగాకిల్లీ మొదలగు దానికిఁ జుఱుకు పుట్టించుట యను గుణ మారోపింతురు గాని, అది యే లేశ

మోయున్నను, దానికిఁ బదిరెట్లు దోషమే వానియందుఁ గనవచ్చును. అందుకే యవి దురభ్యాసము లనఁబడుచున్నవి. కూరలు కాయలు పండ్లు మొదలగు వానియందు వైద్యశాస్త్ర మేదోయొక దోషలేశ మెన్నుచువచ్చినదిగాని, దానిని మించి గుణమే యెక్కువగా స్ఫురించును. కావున నేయవి భోజ్యములైనవి. ఇఁక నిట్టివానిని విడిచి లోకము సంసారసారము లనుకొనుచున్న కాంతాకనకములందలి మంచిచెడ్డలు పరిశీలింతను.

కనకమనఁగా నిక్కడ బహువిధమైన ధనమని యర్థము. అది లేకున్న లోకమే లేదని 'ధనమూల మిదంజగత్' అనుసూక్తి చెప్పుచున్నది. వైదికప్రులందఱు ధనమిమ్మనియే యింద్రాది దేవతలను బ్రార్థించిరి. దానికొఱకే రాజులు పోరాడుచున్నారు. దానికోసమే లోకమంతయుఁ దల్లడిల్లుచున్నది. ధనవంతుఁడు సర్వగుణ సంపూర్ణుఁడు. అదిలేనివాఁడు తృణముకంటెను మిక్కిలి తేలిక. నిర్ధనుని భార్యకూడఁ బరిత్యజించునని 'వ్యర్థం నిర్ధనికస్య జీవన మహో దారైరపి త్యజ్యతే' అను నార్యవచనము చెప్పుచున్నది.

"ధనమూలము జగమంతయు
ధనవంతున కిష్టమగు పదార్థములెల్లన్
దనచేతిలోని వగుటను
ధన మార్జింపంగ నెవ్విధంబున వలయున్."

అని భారతము ఇంతయేల? డబ్బులేకున్న నొకనిమిషమైన సంసారయాత్ర సాగదు. అసాధ్యము సాధ్యముగావించుశక్తి దానికున్నట్లు మఱి దేనికిని లేదు. చిన్నపిల్లలును, వెఱ్ఱివాళ్లునుగూడ డబ్బుచూపిన లొంగుదురన్నచో నిఁక దానికి లొంగనివారెవరుందురు? అట్టి ముఖ్యాతిముఖ్యమైన ధనమున మంచిలేదని యెవ ర నఁగలరు? ఇది గుణపక్షము. ఇఁక దోషపక్షము.

ధనము విఱుగుడులేని మత్తుమందు. దుర్వ్యసనముల పుట్టిల్లు. కల్లల కాఁపురము. కలహముల కాకరము. రాజచోరభయములకుఁ దావలము. అవిశ్వాసమున కధిష్ఠానము. 'మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమో నమః' అని పెద్దలు. లోకములోనది సత్కార్యముల సంపాదించిన పుణ్యముకంటె నసత్కార్యముల నార్జించిన పాప మెన్నిమడుఁగులెక్కువో లెక్కింపఁదరముకాదు. సంసార తాపత్రయ మొకయెత్తు, ధనార్జనరక్షణ నాశనములవలని దుఃఖత్రయ మొకయెత్తు. "ధనమా! యెవ్వఁడు నిన్ను నమ్మి సుఖమొందం గల్గెనో చూపుమా" అని నీతివచనము. అట్టి బహువిధపాప దుఃఖహేతువైన ధనమునఁ జెడ్డలేదని యెవరు చెప్పఁగలరు? ధనము కాంతను దెచ్చును, కాంతకొఱకు మరల ధనము కావలెను. కాంతాముఖ మెఱుఁగక తాను దినక యొకరికిఁ బెట్టక, పాఁతఁఱకాచుకొని యుండు పామువలె, నార్జించినధనము చూచుకొనుచుండు నిరర్థకలుబ్ధుఁ డెవఁడో

# యౌవనముగను, దృఢముగను నుండు టెట్లు?



రక్తమును శుభ్రపరచుకొనవలెను. మానవుల ఆరోగ్యము, ప్రాణము మంచి రక్తముపై ఆధారపడియుండును. నెత్తురు చెడిపోయియున్నప్పుడు "డాక్టర్ పాల్సు విం పిల్సు" అను మాత్రలను సేవించినచో రక్తము శుభ్రపడి ఆరోగ్య మొదవును. వృద్ధులు గూడ యౌవనవంతు లగుదురు. ఒకమాత్రయే మంచిగుణము నిచ్చును. దొరకు స్థలములు:—

**అప్పా అండ్ కో,**
**286** చైనాబజారురోడ్డు, మదరాసు.

**దాదా అండ్ కో,**
**86** వైనియప్పనాయక్ వీధి, పార్కుటవును,
మదరాసు.

ఇంకా యితరమందుల దుకాణములలో అమ్మబడును

S. PAUL & Co., 4, Hospital Street
Dharamtola, CALCUTTA.

---



**Success achived**

Mr.. writes on 22-nd June 36 "I was successful in Matric examin. because of your Herb" The following objects are achieved by the "Tibetan Herb" gift by a Lama yogi after much penance sacrifice.

(1) **Vasikaran** - Wonderful and instantaneous effect in creating pure love (male and female)
(2) **TRADE AND PROFESSION**:—Sure gain to the user in all lines and professions. Try once.
(3) **Litigation** :—Hopless cases of all kinds are won.
(4) **Diseases**:—Chronic and acute diseases of worst type are radically and permanently cured.
(5) **Service**.-Suitable service to the satisfaction according to merits and standard Promotion in any line is sure and certain by its use.
(6) **Examination**:-Sure success in Examination.
(7) **Over powering Enemies** - Strongest and most dangerous opponent will kneel down before you.
(8) **Evil stars**: All kinds of evil stars are propitiated.
(9) **Health and Prosperity**:- It improves health in no time and gives prosperity.

Tno-e woh have faith may only apply mentioning name and object. Price of each Item (Herb) is Rs. 3-8-0 Postage extra 3 at a time for Rs. 9/-

BIJOYA LODGE (A. M.) P. O. Salkia,
HOWRAH.

---

# ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము)

శతావధాని,

**వేలూరి శివరామశాస్త్రిగారు**

తెనిఁగించినది

ప్రకాశకులు:

**కాశీనాథుని నాగేశ్వరరావుగారు**

వెల మొదటిభాగము రు. ౦-౧౨-౦.

రెండవ భాగము రు. ౧-౦-౦.

తపాలఖర్చులు ప్రత్యేకము.

మేనేజరు:—ఆంధ్రగ్రంథమాల,
7, తంబుసెట్టివీథి, మద్రాసు.

---

# రూ 100 లు యినాం!

(ఇంద్రజాల అంగుళీయము)




మిక్కిలి శక్తికలది. కాంతి గలది. దీనిశక్తిచే అతికఠినమగు పనికూడ నెరవేరును. ఎవరిని మీరు కోరెదరో వారు దీనిచే మిమ్ముల ప్రేమించెదరు. పరీక్షలందు, వ్యాజ్యములందు జయము గలుగును. ఉద్యోగము మగసంతానము, భాగ్యము మున్నగునవి కలుగును. ఇది గుణములేదని రుజువుచేయువారికి రూ 100/- బహుమానము. కష్టపడ నవసరములేదు. దానిని మీయొద్ద ఉంచుకొనుడు.

**BENGAL MESMERISM HOUSE,**

యొక్కఁ డుండకపోఁడు గాని, ధనార్జనఫలము కాంతయే యనుట లోకానుభవసిద్ధము. అందుకే పెద్దలు–

'వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషుచ'

అనుచుఁ గాంతాకనకములు రెంటిని గుదిగ్రుచ్చి మహామోహస్థానము లీరెండే యని నిరూపించియున్నారు. ఇంక, కాంతతోడిదైన గృహస్థాశ్రమమును, దద్విరుద్ధమైన సన్న్యాసమును బరిశీలింతము.

వేదమతమున గార్హస్థ్యము మంచిది, వేదాంతమతమున సన్న్యాసము మంచిది. పరస్పరవిరుద్ధములైన యీరెంటిలో నేది మంచిదన్నను, రెండవది చెడ్డదగును. కాని, "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే, ధర్మేచ అర్థేచ కామేచ మా మనుచర" ఇత్యాదివాక్యముల గార్హస్థ్యము త్రివర్గసాధనమని విదితమగుచున్నను లోకప్రవృత్తినిబట్టి యది బహుళముగాఁ గామసాధనమగుచున్నదనుట నిర్వివాదము. పిపీలికాదిబ్రహ్మపర్యంతమైన సృష్టిలోని రహస్యమాలోచించిన స్త్రీపురుషసమాగమము నైసర్గికమని గోచరించుచుండ నది చెడ్డదెట్లగును? అని కర్మవాదియన- సంసారపాశములఁ దగుల్కొని జీవుఁడు పడరానిపాట్లు పడి, చేయరానిపనులు చేయుచు దుఃఖమగ్నుఁడగుచున్నాఁడు. అట్టి దుఃఖమునుండి విముక్తుని గావించి యతని కాత్మానంద మొసంగు సన్న్యాసము చెడ్డదెట్లగునని వేదాంతియనెను. మఱియు—

"కామసుఖరూపమైన యిహమును యాగవ్రతతీర్థయాత్రాతిథిపూజా దేవతార్చనాది ధర్మజన్యఫలరూపమైన పరమునుగూడ సమకూర్చునట్టి గార్హస్థ్యమందు మంచియే కాని చెడుగే కనఁబడదు. కాని, ఒక్కపరము మాత్రమే చూపెడి సన్న్యాసమందిహము చేకూర్పఁజాలమి యను చెడుగు కనఁబడకపోదు." అని కర్మవాది స్వమతము సమర్థింప, వేదాంతి యిట్లు చెప్పుచున్నాఁడు:

ఇది విపరీతోపన్యాసము. అయినదాకులోను, కానిది కంచములోను బెట్టినట్లున్నది. ధర్మాచరణమువల్లఁ బుట్టెడిపుణ్యమిచ్చుఫలమేది? స్వర్గము. ఆ పుణ్యమైపోయినపిదప 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అనున్యాయమునుబట్టి జీవుఁడు మరల భూలోకమున జన్మింపవలసినదే. అనఁగా, జననమరణప్రవాహరూపమైన సంసారమున మరలఁబడెననుట. ఇహమా, సుఖశూన్యము. లోకము భ్రాంతిచే ననుకొనుచున్నది సుఖాభాసము గాని సుఖముకాదు. పైగా వ్యాధి జరావిపత్తిసంకులము. దారపుత్రవియోగాది దుఃఖపూర్ణము. పోనీ! పరమా, గార్హస్థ్యము యథాశాస్త్రముగా నడచినను, అది యశాశ్వతము. అట్టి గృహస్థాశ్రమము నిర్దోషము, గుణభూయిష్ఠము ననుట విపరీతవాదము కాదా! పూజ్యులేమనిరి?–

"జన్మ దుఃఖం జరా దుఃఖం
జాయా దుఃఖం పునః పునః,
సంసారసాగరో దుఃఖం
తస్మా జ్జాగృత జాగృత."

ఇఁక సన్యాసముఃమాట- శిఖాయజ్ఞోప వీతపరిత్యాగముమాత్రము సన్యాసము కాదు. "కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయో విదుః" అని భగ గ్గీత. నిత్యానిత్య వస్తువివేకమున దుఃఖాత్మకమైన యిహమును, అశాశ్వతమైన స్వర్గాదిఫలమునుగూడఁ ద్రిక రణశుద్ధిగా విడుచుట సన్యాస మనఁబడును. తాదృశపరిశుద్ధసన్యాసము సాధనముగా శమదమాది షట్కసంపన్నుఁడై జీవాత్మ స్వస్వరూపానుసంధానమునఁ బరమాత్మభా వము గాంచును. అదే జీవన్ముక్తి. అదే కోరఁ దగినది, పొందఁదగినది. అట్టి యద్వితీయ పర బ్రహ్మభావమునకు సాధనమైన నిష్కామ సన్యాసమున దోషముగూడ నున్నదనుట విపరీత వాదముగాదా! ఇంతకుఁ దేలినసారాం శము.

"దృష్టం కిమపి లోకేఽస్మి న్నిర్దోషం ననిర్గుణమ్" అను మాట స్థూలదృష్టితో నన్నదిగాని సార్వత్రికముగా సమన్వయించు నది కాదు. కొన్నిటియందు గుణముండును. కొన్నిటియందు దోషముండును. కొన్నిటి యందు రెండునుండును. ఒకచో నొకటి హెచ్చుగానున్న నింకొకచో మఱియొకటి హెచ్చుగా నుండును. అన్నిటికిని మంచి చెడ్డలు సహజములు కావు. అన్నిటికిని నారో పితములు కావు. మొత్తముమీఁదఁ బరిశీ లింపఁగా, సత్త్వరజస్తమోగుణాత్మకమై యీ సృష్టిలో గుణముకంటె దోషమే హెచ్చని గోచరింపకపోదు. నిర్గుణము నిర్దో షము నిత్యము శుద్ధబుద్ధముక్తస్వభావమునైన దద్వితీయపరబ్రహ్మ మొకటియే. తత్ప్రతి బింబమైన జీవుఁడు గుణదోషభూయిష్ఠమైన సంసారమునుండి విముక్తుఁడై స్వీయమైన నిర్గుణపరమాత్మభావము గాంచుట కైహిక గుణదోషవివేక మొకసాధనమగును.

"సర్వం ఖల్విదం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ."

ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

# ఆభాసనిరాకరణము

శ్రీపాద వెంకటేశ్వర్లు

నేను వ్రాసిన "రసాభాసము" అను వ్యాసమునకు భిన్నాభిప్రాయమును దెలుపదలచి సమాధానరూపముగా శ్రీరామశాస్త్రిగారు మేనెల భారతిలో నొక వ్యాసము వ్రాసినారు. కాని యాసమాధానము నా వాదములోని యాశంకితరూపమే యని తెలుపుచుంటిని.

"అవిదగ్ధులను తిర్యక్ప్లేచ్ఛులయెడగల రతి తాత్కాలిక హృదయ రంజకము గావచ్చునుగాని అది సహృదయ హృదయములకెక్కి వారిచే భావ్యమానము మాత్రము గాజాలదు. కనుకనే యది రసాభాసము" "విభావానుభావవ్యభిచారిభావముల చేరికచే రసము వ్యక్తమగునని యాలంకారికసిద్ధాంతము" అని వ్రాసిరి.

చూడుడు:—

"దదౌ రసా త్పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః;
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా."

(కుమారసంభవము)

ఇచ్చట ఆలంబనవిభావములు (గజము, చక్రవాకము), ఉద్దీపన విభావము (వసంతము), అనుభావములు (సురభిగండూషజలదానము, అర్ధోపభుక్తబిసదానము), వ్యభిచారిభావములు (హర్షాదులు)ను గలవు. రసము వ్యక్తము గావలయును. ఇట్లే:

"మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః;
శృంగేణచ స్పర్శనిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః."

(కుమారసంభవము)

"కండూయత్కుట్మలితేక్షణాం సహచరీం
దంతస్య కోట్యా లిఖన్
పర్యాయవ్యతికీర్ణకర్ణపవనై
రాహ్లాదిభి ర్వీజయన్
జగ్ధార్ధై ర్నవసల్లకీకిసలయై
రస్యా స్థితిం కల్పయన్
అన్యో వన్యమతంగజః
పరిచయప్రారంభ మభ్యస్యతి."

(మాలతీమాధవము)

"చంచూపుటేన విదళయ్య నవం ప్రవాళం
పార్శ్వస్థితాం ప్రణయినీ మనువర్తమానః;
పక్షానిలైః పరభృతో ఽయ మలీ న్విధూయ
కూజన్ రసాలశిఖరైః కురుతే విహారమ్."

(జానకీపరిణయము)

ఇట్టి చోట్ల తిర్యగ్గతమైనప్పటికిని విలాసచేష్టితములతో స్వతస్సిద్ధమైన రతి వర్ణింపబడుచున్నది. ఈ రతి విజాతీయాలంబనాదులుగలది కాదు. నిషిద్ధము కాదు. అదివ్యగతసప్రాణలంఘనాదులవంటిది గాదు. ఇచ్చట నెట్టియవిదగ్ధతానిరూపణమున్నది? ఎట్లాయవిదగ్ధత భాసించును? మఱియు

"ఏకే నాక్ష్ణా ప్రవితతరుషా
వీక్షతే వ్యోమసంస్థం
భానోర్బింబం సజలలులితే
నాపరే ణాత్మకాంతమ్
అహ్నశ్ఛేదే దయితవిరహా
శంకినీ చక్రవాకీ
ద్వౌ సంకీర్ణౌ రచయతి రసౌ
నర్తకీవ ప్రగల్భా."

(దశరూపకము)

ఇత్యాదిస్థలముల ప్రగల్భత చూపబడినది. కనుక నిట్టిస్థలముల నరుంతుదమై భావుకమనోద్వేజకమగు

దోషము లేదన్నను తిర్యగ్గతమని యాగ్రహించెదరేకాని వేరొండుదోషము చూపరైరి.

"గీతాంతరేషు శ్రమవారిలేశైః
కించిత్సముచ్ఛ్వసితపత్రలేఖమ్;
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి
ప్రియాముఖం కింపురుష శ్చుచుంబే."
(కుమారసంభవము)

ఇచ్చట పైనుదాహరింపబడిన "మధుద్విరేఫః" ఇత్యాదిస్థలములకంటె రసత్వాంగీకారమున కేపాటి వైదగ్ధ్యము, భేదము చూపబడినది?

కనుక 'మధుద్విరేఫః' ఇత్యాదిస్థలములకూడ రసత్వాంగీకారమే యుక్తమని యీయవిదగ్ధోక్తి యసమంజసమని యిదివరలో వ్రాయబడినది.

ఇక "దక్షిణనాయకగతరతి రసమగుచుండ, పరనాయికాగతరతి రసముగుచుండ బహుసక్తనాయిష్ఠగతరతి రస మేలకాగూడదు?" అను నాయాక్షేపమునకు శాస్త్రిగారు వ్రాసిన సమాధానము:—

"అన్యోఢాగతరతి అనౌచిత్యభాజనముగాన ఉత్తమ కావ్యములయందు అట్టి పరకీయనాయికగా నుండ దగదు "పరిణీత...లంగున్" అని కావ్యాలంకారచూడామణికర్త. కనుక బహుసక్తగౌణనిష్ఠగతరతివలె పరనాయికాగతరతియు రసాభాసమేయని సాహిత్యవేత్తల యభిప్రాయము" "ఒకపురుషునకు పలువురు నాయికలుండవచ్చును. ఒకస్త్రీకి ఒకపురుషుడేయుండవలయు ననుట శాస్త్రనిహితము, ప్రాచ్య సాంఘికమర్యాద. కావ్యప్రయోజనము నీతిబోధనము గాకపోయినను కావ్యమునకును నీతికిని సంబంధము లేదనుటమాత్రము అవిచారమూలకము. కావున దక్షిణనాయకగతరతి రసమగును. సామాన్యవంటి బహుసక్తయోషిద్గతమైన రతి రసము గాదు" అని.

అంగిరసములో నవోఢ నాయికగా నుండదగదనియేకదా దశరూపకాదులలోగూడ నిరూపింపబడినది! అంతమాత్రముచే తద్గతరతి రసాభాసమని చెప్పదగదు. అట్లయిన—నిశేషనిరూపణములో, శృంగారనాయికలలో పరనాయికానివేశము వ్యర్థము.

మఱియు రసాభాసనిరూపణములోని "ఉపనాయకసంస్థాయాం మునిగురుపత్నీగతాయాంచ......" ఇత్యాదివిశేషనిరూపణములున్ను, శృంగారతిలకములోని "సంబంధిమిత్రద్విజరాజహీనవర్ణాధికానాం ప్రమదా న గమ్యాః" అనువిశేషనిరూపణమున్ను అనర్థకములనియే చెప్పవలయును.

ఆభాసనిరూపణములలో పరనాయికాగతరతిని పృథగ్గణనచేసి లాక్షణికులయుదాహరణములు గాన్పింపవు.

సమవకారములో అంగముగా నివేశముచేయబడు శృంగారములలో కామశృంగార మొకటి. కామశృంగారమనఁ "పరదార సురాపానాది సుఖలలితః కామశృంగారః" అని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానములో కుమారస్వామి సోమపీథి నిరూపణము గాన్పించును.

కనుక పరనాయికాగతరతి రసమగుటనటు లాక్షణికుల యభిప్రాయ మవగతమగును.

లక్ష్యములలోగూడ పరనాయికారతి గనబడుచున్నది:—

"గాఢాలింగన గండచుంబనకుచ
స్పర్శాదిలీలాయితం
సర్వం విస్మృత మేవవిస్తృతవతో
బాలే! ఖలేభ్యోభయాత్;
సల్లాపోఽప్యధునా సుదుర్ఘటతమ
స్తత్రాపి నాతివ్యథా
యత్త్వన్నర్మవచ ప్పృథూదసులభం
తేనైవ దూయే భృశమ్."
(పుష్పబాణ విలాసము)

ఇచ్చట విప్రలంభశృంగారమని వ్యాఖ్యాత.

"అలసవలితైః ప్రేమార్ద్రార్ద్రైః
ముహుర్ముకుళీకృతైః
క్షణమభిముఖై ర్లజ్జాలోలైః
నిమేషపరాఙ్ముఖైః
హృదయనిహితం భావాకూతం
వమద్భిరివేక్షణైః

కథయ సుకృతీ కోఽయం ముగ్ధే!
త్వయా ద్య విలోక్యతే."
(అమరుకావ్యము)

ఇది యిట్లుండ సామాన్యగతరతిగూడ రసమే యని రుద్రటాదులు నిరూపించినట్లు గానవగు.

"సాధారణస్త్రీగణికా
సావిత్తం పర మిచ్ఛతి
నిర్గుణేఽపి నవిద్వేషో
నరాగోఽస్యా గుణిన్యపి
శృంగారాభాసవీవ స్యా
న్నశృంగారః కదాచన
ఇతి ద్వివంత ముగ్దాశ్చ
ప్రాహ శ్రీరుద్రటః కవిః
రాగశృంగారవిర్ముక్తా
యదిస్యు ర్గణికాః స్వతః
యోషిత్సామాన్యతో గాతః
స్వర్గః కిం భక్షితః శ్వభిః
కింతు తాసాం కలాకేలి
కుశలానాం మనోరమమ్
విస్మారితా పరస్త్రీకం
సురతం జాయతే నృణామ్
కుప్యత్పినాకనేత్రాగ్ని
జ్వాలాభస్మీకృతః పురా
ఉజ్జీవితః పునః కామో
మన్యే వేశ్యావిలోకితైః
కలావిలాసవైదగ్ధీ,
వసతి ర్గణికాజనః
పుంసాం సౌభాగ్య వైదగ్ధీ
వసతి ర్గణికాజనః.
ఈర్ష్యా కులస్త్రీషు నవాయకస్య
నిశ్శంకకేలి ర్నపరాంగనాసు;
వేశ్యాసు చైత ద్ద్వితయం ప్రరూఢం
సర్వస్వ మేతా స్తదహో స్మరస్య."
(భావప్రకాశము)

మరొకవిషయము. లక్షణగ్రంథములలో

"శ్వశ్రూరత్రనిమజ్జతి
అత్రాహం దివసకం ప్రలోకయ;
మాపథిక రాత్ర్యంధ
శయ్యాయాం మమ నిమంక్ష్యసి."

ఇత్యాదిశ్లోకములు కావ్యాత్మభూతమైన వస్తుధ్వన్యాదుల కుదాహరణముగా నివ్వబడియున్నవి. ఇట్టి వస్తుధ్వన్యాదు లుత్తమకావ్యములలో నుండగూడదని చెప్పియుండలేదు. రసాభాసముగా పరిగణింపబడిన తిర్యగాదిగతరతికిసూడ అలంకార్యముగా ప్రబంధానుప్రవేశము చేయవచ్చునని ప్రతిపాదించిరిగాని సర్వాత్మనా ప్రబంధస్పర్శను నిరాకరించియుండలేదు.

కనుక అట్టి వస్తుధ్వనులకు ప్రబంధానుప్రవేశము చేసినపుడు కావ్యమున కెట్టినీతిసంబంధముండునో, పరనాయికారతి కనుప్రవేశము చేసినపు డెట్టినీతిసంబంధముండునో, ప్రకృతమైన బహుసక్తయోషిద్గతరతి రసాభాసమని కావ్యానుప్రవేశము చేసినపు డెట్టి నీతిసంబంధముండునో అట్టి నీతిసంబంధము దక్షిణనాయకగతరతి తుల్యమైన బహుసక్తయోషిద్గతరతికి రసమని కావ్యానుప్రవేశము చేసినపుడుకూడ చెడదు.

అందువలననే దక్షిణనాయకగతరతిని, పరనాయికాగతరతిని రసమని యొప్పుకొనినటులే బహుసక్తయోషిద్గతరతిని గూడ రసమని యొప్పుకొనవలయునని వ్రాసియుంటిని.

కనుక ఆభాసనిరూపణముకొరకు శ్రీశాస్త్రి గారు వ్రాసిన యుపపత్తులు కొంచె మించుమించుగ నావ్యాసములోని యాశంకితరూపములే కాని తద్భిన్నములు గావని నామనవి.

# కయ్యా — కాలవ

'కరుణకుమార'

౧

లక్ష్మమ్మ గొప్ప అదృష్టజాతకురాలు. పాకనాటి కాపుకులంలో పుట్టింది. మళ్లా అపరమహాలక్ష్మి. ఇంతకీ పూర్వజన్మంలో ఇంత పెట్టిపుట్టిందేమో, ఈజన్మంలో భోగం అనుభవిస్తోంది.

లక్ష్మమ్మ పుట్టింటివారిది చాలా గట్టి సంసారం. మొగపిల కాయలు లేనందువల్ల లక్ష్మమ్మకూ ఆవిడ అక్కకూ—ఇద్దరు కూతుళ్లకూ ఒక ఊళ్లోనే మనువులు కుదిర్చి అక్కచెల్లెండ్లిద్దరూ ఒకచోటే సంసారాలు చేసుకుంటూఉంటారని ఆశపడి తండ్రి యిద్దరికీ చెరిముప్ఫయివేల రూపాయల ఆస్తి యిచ్చి మహావైభవంతో వివాహాలుచేసి, వాళ్లను కాపరానికి పంపేడు. కాని కాపరానికివెళ్లిన మరుసటిసంవత్సరమే లక్ష్మమ్మభర్త కాలం చేసినందువల్ల, అప్పటినుంచి ఇప్పటివరకూ ఈముప్ఫయి ఏళ్లుగా ఆవిడ నిరంకుశమైన వైధవ్యాన్ని అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తోంది. ఇదొక్కటే ఆవిడకు కొరతపెట్టాడు పాపం భగవంతుడు. ఇదిమినహా ఆవిడ సంసారానికి ఏమీ కొరతలేదు.

అటు పుట్టింటివారివల్ల దఖలుపడ్డ ముప్ఫయివేల రూపాయల ఆస్తీ, యిటు అత్తింటివారివల్ల లభ్యపడ్డ ఏభైవేల రూపాయల ఆస్తీ కలిసి, భర్త చనిపోయేటప్పటికి ఎంత లేదన్నా ఓ ౮౦, ౯౦ వేల రూపాయల ఆస్తికి లక్ష్మమ్మ హక్కుదారయింది. చావు మంచంమీద ఇంకా తెలివి ఉండంగనే భర్త సిస్తైన వీలునామా వ్రాసి యిచ్చివేశాడు. ఒక ఏభైఎకరాల మాగాణీ, డెబ్భైఎకరాలమెట్టా, మామిడితోటా, నాలుగెకరాల పాటిమట్టిదొడ్డీ, పశువుల బీళ్లూ, పది అంకణాలమిద్దే, యిన్ని పాడిపశువులూ, నాలుగువందల సన్నజీవాలూ. ఒకటేమిటి, ఒకరిదగ్గరకు ఒక వస్తువుకోసం పోనక్కరలేకుండా, అమర్చిపెట్టినట్టు యినుపపెట్టె బీగాలతోసహా చేతిలో పెట్టి "ఏమో భగవంతుడుచేసిన, నేను లేనన్న కొరతతప్ప యిక నీకేమీ లోపంలేదు. ఇంట్లోతల అట్లా వీథిలో పెట్టుకోనవసరంలేకుండా ఈ యావదాస్తీ నువ్వు అనుభవించుకొని జీవించు"అని అంత్యకాలాన్న ఆశీర్వదిస్తూ ఆవిడభర్త అదృశ్యమైనాడు.

భర్త 'హరీ' అన్న మరుసటిక్షణమే లక్ష్మమ్మ యీ యావదాస్తికీ పట్టాభిషేకం కట్టుకొంది. దీనికితోడు ఆమె చిన్నదైనా, మొదటినుంచీ తనబ్రతుకుతెరువు తాను చక్కగా గ్రహించుకొన్న ఘటం. మంచి దూరాలోచనగల మనిషికూడాను. లక్ష్మమ్మది మొదటినుంచీ గట్టిపిడికిలి. ఆమె చిన్నతనంలో, సోదెచెప్పేవాళ్లు వచ్చి ఆవిడ ఎడమచేతి అయిదువేళ్లూ దగ్గరగా పెట్టించి అరి

చేయిచూచి వేళ్లసందున తలవెంట్రుక దూర డానికిగూడా సందులేకపోతేను ఆవిడయింట్లో లక్ష్మి తాండవం చేస్తుందని ఘంటాపథంగా జోస్యం చెప్పేవారు. ఈ జోస్యం విన్నప్పుడల్లా ఔల్లి లక్ష్మమ్మ నెత్తుకొని ముద్దుపెట్టుకుంటూ వుండేది. సాధారణంగా జోస్యంలో చెప్పే ముందువచ్చే విషయాలన్నీ నిజం కావని అనుకొంటాంగాని, లక్ష్మమ్మ జీవితం లోమాత్రం చెప్పింది చెప్పినట్టుగా తూ చా తప్పకుండా జరుగుతోంది.

అదృష్టం కాకపోతే మొగవాడికైనా చేత నవుతుందా సంసారాన్ని అంతచక్కగా నిర్వహించుకోవడం, ఇంట్లో విస్తరివేసే రెండో ప్రాణి లేకపోతేమట్టుకు. పొలంలోపండిన అరవైపుట్ల ధాన్యం లగాయతు దొడ్లో పశువులు వేసిన పేడవరకు సమస్తమూ ఆమె రొఖరూపంగామార్చి కష్టపడి వృద్ధిచేసిన సంసారం అది. రాగులు, సజ్జలు, జొన్నలు, మిరపకాయలు, చింతపండు, మామిడికాయలు, టెంకాయలు, టెంకాయపీచు, తాటికాయలు, తాటాకు, తాటిబుర్రలు, దొడ్లోకాసే అరటికాయలు, అరటాకు, అరటిదూట, వంకాయలు, పొట్లకాయలు, కాకరకాయలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి-ఒకటేమిటి పాటిమట్టి, ఎరువుమట్టి, దూడాడుకూ-సమస్తమూగూడా ఆమెస్వంతం రొఖంగా మార్చి చేతపట్టుకొనే అలవాటు. అందువల్ల భూములు దొడ్లు, బంగారునగలు, వెండిసామానులు వగైరాల అడుమానంమీద ఇచ్చిన అప్పుపత్రాలమీదా ప్రోనోట్లమీదా సాలీనావచ్చే నాలుగువేల రూపాయల నికరం వడ్డీకితోడు, ఈ విధంగాకూడా ఎట్లాలేదన్నా సంవత్సరానికి ఇంకో ౫,౬ వేల రూపాయల ఘట్టి ఆదాయం చేరుస్తూ ఆమె ఈ ముప్పైఏళ్లుగా తన ఆస్తిని రెండు లక్షలకుపైగా పెంచింది.

లక్ష్మమ్మ తోడపుట్టినపడుచు కాపరం అంత నాదారుస్థితికాదు కాని లక్ష్మమ్మస్థితితో పోల్చుకుంటే వాళ్లస్థితి ధూపానికి ఆగదు. అయినప్పటికీ ఆవిడ అక్కకి ఒకకొడుకూ, ఒకకూతురూ కలిగి యింతసిరీ సంపదతోనే కాలక్షేపం చేస్తున్నారు వాళ్లు. లక్ష్మమ్మ అక్కకొడుకు రామిరెడ్డికి ఇప్పుడు ముప్ఫయి సంవత్సరాలవయస్సువచ్చి, పెళ్లి చేసుకొని తన యిల్లు తాను చక్కపెట్టుకొంటున్నాడు. లక్ష్మమ్మకు 'నా' అన్నవాళ్లు ఎవ్వరూ లేనందున, తనసేద్యం మంచిసెబ్బరలు విచారించడానికీ, ఇంట్లో తనకింత లెఖ్ఖడొక్కా వ్రాయడానికీ రామిరెడ్డి కాస్త చేతికందివచ్చినప్పటినుంచీలక్ష్మమ్మ అతగాడినే రప్పించుకొంటూ తనపనులు నెరవేర్చుకొంటూవుంది. అదిగాక మొగదిక్కులేని సంసారం అయినందువల్లా, ఈ తనువులు శాశ్వతం గానందువల్లా, తల లోనాలుకలాగ నమ్మకంతో అంటిపెట్టుకొని వుంటే లక్ష్మమ్మ ఎప్పటికైనా తనయావదాస్తినీ అక్కచెల్లెండ్లిద్దరి సంసారాలకీ ఒక్కడే మొగపురుగు అయిన తనకు సంక్రమించేటట్టు చేయకపోతుందా అని రామిరెడ్డి కొం

డంత ఆశపెట్టుకొని ఉన్నాడు. అది సహజమేగా. అందువల్ల లక్ష్మమ్మకు చీమకాటంత బాధ కలిగిందంటే, తనకు లోకమే మునిగిపోయినట్లుగా భావించుకొని, తన యితరపనులన్నీ గంగలో కలిసిపోయినాసరే, గుండెలు గంపుంగొట్టుకుంటూ పరుగెత్తి ముందు తనపిన తల్లికి సేవచేసి ఆవిడ మెప్పుపొందుతూ వస్తున్నాడు రామిరెడ్డి.

లక్ష్మమ్మకు ఇప్పుడు ఏభైయో పడిదాటి అరవైలోపడింది. రామిరెడ్డికి అనుక్షణమూ నోరు ఊటలూరుతోంది; లొట్టలువేస్తున్నాడు; ఎట్లాగైనా లాలించి ఆమెచేత మూవదాస్తీ సెటిల్మెంటు వ్రాయించుకోవాలని భూమికీ ఆకాశానికీ అంచెలు వేస్తున్నాడు. కాని ఆమెదగ్గర అత్తగాడి పప్పులేమీ ఉడకడంలేదింకా. కానీ చూతాంలే అనుకొని సమయంకొరకు కాచుకొని బకధ్యానం చేస్తూఉన్నాడు రామిరెడ్డి.

ఇచ్చిన అప్పు అణాదమ్మిడీలతోగూడా మళ్లా తనయింటికి పువ్వుల్లోపెట్టి తీసుకువచ్చే ఆసామీ అయితేనేతప్ప, నాలుకపెరుక్కొని చచ్చినాసరే, చిన్నడబ్బు చేబదులిచ్చేరకం గాదు లక్ష్మమ్మ. అందువల్ల ఆమెవద్దనుండి బీదా బిక్కా వగైరా అలగాజనానికి ఎప్పుడూ చీమతలకాయంత ద్రవ్యసహాయం కలుగలేదుకాని, గ్రామంలో వున్న యితర పెద్దపెద్ద ఆసాములలో చాలాభాగంవరకూ ఆమెవద్ద ఖాతాలుపెరిగి, గ్రామంలో కాస్త పలుకుబడిగల తలకాయలందరికీ ఆవిడతో మొగమాటం ఏర్పడింది. ఇక గ్రామంలో జరిగే ప్రతీమంచి చెడ్డలకీ, నలుగురితోపాటు ఆడదైనా లక్ష్మమ్మనుగూడా గ్రామపెద్దలు సంప్రదిస్తూ, ఆమెనిగ్రహానుగ్రహాలకు పాత్రులవుతూవచ్చారంటే అందులో విడ్డూరమేమీ ఉండదు.

౨

కొండుడు మాలవాడు, అనగా పంచముడు. పోనీ హరిజనుడనే అందాం. హరిజనులు నిరుపేదలని వేరే చెప్పవలసిన అవసరంలేదు. గోచీపెట్టుకొనే ఈడులో కొండడు లక్ష్మమ్మకాడనే బ్రరెగొడ్డు కాసూవచ్చినప్పటికీ, వాడికి ఈడువచ్చి పెళ్లిచేసుకొని, భార్య కాపరానికి వచ్చినతర్వాత, వాడు లక్ష్మమ్మను వదలి యిప్పటికి పదేళ్లుగా తన రెక్కలమీదనే ఆధారపడి, యింట్లో తన భార్యనీ, డబ్భైఏళ్ల ముసలితొక్కు తల్లి వెంకినీ పోషించుకొంటున్నాడు. శరీరకష్టం చేసుకొనేవాళ్లకు దరిద్రం ఉండదు. అందులో కొండడు ఏనుగువంటి మనిషి. ఏపని అయినప్పటికీ జంకూకొంకూ లేకుండా నడుంకటి దూకేస్వభావం. అందువల వాడంటే ఆసాములందరికీ ఒక విధమైన ప్రేమా, అభిమానమూకూడా కద్దు.

ఏ ఆసామినో ఆశ్రయించుకొని, ఎవరికమతంలోనో అంటిపెట్టుకొని, సంవత్సరం జీతంమీద, మామూలుప్రకారమే కాలం గడుపుకొంటూ వుంటే తీరేపోను కొండడికి.

కాని మున్నూటఅరవైనాలుగు రోజులూ రాత్రింబగళ్లు చెమటఊడ్చిచాకిరీ చేసినప్పటికీ, సంవత్సరానికి ఏపందుంగింజలో, పన్నిద్దుం గింజలోగాని జీతంరాలని నౌకరీ అవడంవల్ల కడుపునిండక సంసారాన్ని పోషించుకోలేక వెతలుపడుతున్నాడు పాపం కొండడు.

అదిగాక యీ ఆసాములతో అన్నీ యిక్కట్లే. జీతగాడువచ్చి పనిచేసినరోజులకు రోజు ఒకటింటికి ఒకముంతెడుగింజలుచొప్పున కూలియిచ్చి, వాడి కెప్పుడైనా ఏజ్వరమో, ఏ కడుపునొప్పో, ఏ కాలునొప్పో వచ్చి నౌకరీకి రాలేక నిలిచిపోయిన రోజులకు రోజు ఒకటింటికి రెండుముంతలుచొప్పున వాడి దగ్గర తిరిగి ముజరాలు తీసుకొంటారు, ఇదేమి న్యాయమో! అదిగాక, ఆసాములు జీతగాళ్లకూ, కూలివాళ్లకూ తమగింజలు కొలవవలసివచ్చినపుడు కొలిచేముంత వేరూ, జీతగాళ్లదగ్గరనుంచి ఆసాములు ముజరాతీసుకొనేటప్పుడు కొలిచేముంత వేరూ — మొదటిముంత చిన్నదీ, రెండోముంత పెద్దదీని. ఇట్లాంటి దుర్భరమైన పరిస్థితులలో ఎన్నాళ్లు బ్రతకగలడు పాపం కొండడు?

ఈ కష్టాటలన్నీ పడలేక,— ఆ వూళ్లో మాలమాదిగలకు పదికుటుంబాలవాళ్లకు సర్కారువారు ఈ సందుకట్ల కొన్ని బీడు భూములు సాగుబడిచేసుకొనేటందుకు పట్టాలకు యిస్తున్నారంటే, కొండడుకూడా తాశీలుదారుగారిదగ్గర వో అర్జీ గీకించి దాఖలుచేశాడు. కొండడికిగాని, వాడి అవిభక్తకుటుంబంలో మరిమెవ్వరికిగాని, అంతకు పూర్వం ఎన్నడూ సర్కారుభూములు పట్టాకుయిచ్చి ఉండకపోవడంచేత గ్రామంలో ఇతరులతో పాటు వీడికీగూడా, ఒక ఏభైసెంట్లు (అర ఎకరా)భూమి ఎకరా మూడువందలరూపాయలచొప్పున ఖరీదువేసి, అరెకరమూ నూటయాభైరూపాయలకు, సర్కారువారు కొండడికి పట్టా కిచ్చారు. ఎక్కడనో, ఏ అయ్యనో, ఏ అమ్మనో కాళ్లూకడుపూ పట్టుకొని, ఆ నూటయేభైరూపాయలూ గాక యింకా రెవిన్యూయినస్పెక్టరుకూ, తాలూకాగుమస్తాలకూ ఇవ్వవలసిన నజరానాల కింద ఇంకోపాతికా ఏభైరూపాయలు తలతాకట్టుపెట్టి, అప్పుతెచ్చి కట్టి భూమిని తీసుకొన్నాడు కొండడు. ఇంతా చేస్తే చచ్చినంత మరమ్మతు చేస్తేనేగాని సాగుబడికి లాయఖుకాని భూమి అది; మని షి త్తున తుంగ బలిసిపోయి అడవున్నట్టుంది. అదీ గాక, నీళ్లకు మిట్టప్రదేశం. ఊరగజం గడ్డతీరు తీయిస్తేనేగాని కయ్యలోకి చుక్క ఎక్కదు. నీళ్లుపారించుకొనేటందుకు ఆకయ్యకు ప్రత్యేక కాలువ లేదు. అన్నీ తంటాలే పాపం; సర్కారువారు విధించినక్రయం నూటయేభైరూపాయలూ ఖజానాలో జమకట్టంగనే, సర్కారువారు కొండడిచేతిలో పట్టాకాగితంమాత్రం పెట్టి, నలుగురితో పాటు, వాడికీగూడా 'యిదుగో ఇదీనీభూమి' అని ఆకయ్యకు హద్దులు చూపించి చక్కాపోయారు.

సెంటుకు కనీసం ఒకరూపాయిచొప్పున ఏభైసెంట్లకు ఏభై రూపాయలు ఖర్చుపెట్టితేనేగాని కయ్యా మరమ్మత్తుకాదు. తుంగా దుడుసూ కొట్టించడానికే ఒకయిద్దుమో, ముత్తుమో కావలసి ఉండె! ఏరోజు కారోజు రెక్కాడితేనేగాని డొక్కాడకపోయె ఇంట్లో కొండడికి! ఈలోకంలో తాను జన్మమెత్తినందుకు ఈజన్మలో తన పేరిట ఇది తనభూమి అని వోయెకరాభూమి ఏర్పడితే తనజన్మ తరించి తనకష్టాలు గట్టెక్కుతాయనే ఆశపడ్డాడుకాని కొండడు, తీరాభూమి దఖలుపడినతర్వాత ఆకయ్యను సాగుబడి చేసుకోవాలంటే తన శక్తి కణుకువైన పనిలా తోచలేదు కొండడికి. ఇప్పటికి చేసిన అప్పు తలుచుకొంటేనే వాడికి శరీరం నీరయిపోతోంది. భూమిదగ్గరికి వచ్చి చూచుకొంటే దిక్కు తోచడంలేదు. భూమి సాగుబడిచేసుకోవడమా, లేక అంతటితో దాన్ని విరమించుకొని తాను మళ్లా మామూలు ప్రకారం ఏ అయ్యకాడనో జీతానికి కుదురడమా? ఈరెంటి సందునాపడి నలిగిపోతున్నాడు కొండడు. "అయిందేదో అయిపోయింది. మనకీజన్మలో స్వంతకయ్యనీ, స్వంత సేద్యమనీ, స్వంతెద్దులనీ అనుకొనేప్రాప్తం లేదు. అందనిచెట్టుపండ్లకు ఆశలుపడ్డాం. ఇంతటితో ఈకయ్యను పోకడపెడుదా" మనుకొని నిస్పృహచెంది కొండడు ఆకయ్య చేసుకోలేక, పట్టావచ్చిన మరుసటినెలలోనే యితరులకు అమ్మకం చూపేడు.

కొండడికి పట్టాకిచ్చిన కయ్యా లక్ష్మమ్మ స్వంత పట్టాభూమి, నూరెకరాల యేకఖండంగల ఒకనట్టుకు దక్షిణపుతట్టున ఆనుకొని ఉన్నది. కయ్యానందునా, లక్ష్మమ్మ భూమినందునా గనిమె తీస్తే, చులాగ్గా కయ్య ఆవిడఖండంలోకి కలిసిపోతుంది. ఆ కయ్యకోసరం ముప్ఫయ్యేళ్లకుపూర్వం లక్ష్మమ్మభర్త దాన్ని తనభూమిలో కలుపుకోవాలని రివిన్యూ అధికార్లకూ, డి. పి. డబ్ల్యూ అధికార్లకూ లంచాలక్రింద ఒక ముప్ఫైనల్లభై రూపాయలు ఖర్చుపెట్టీ కూడా ఆభూమి పట్టాకివ్వడం ఆక్షేపణకరమని అప్పట్లో సర్కారువారు తీర్మానించడంవల్ల విఫలమనోరథు డయినాడట! అది లగాయతు భర్త చనిపోయినతర్వాతకూడా, ఆశపడ్డకయ్య చివరకు లభించకపోవడమే కాకుండా, దానికొరకు లంచాలుగా పోసిన నల్లభైరూపాయలూ నష్టేటకలిసిపోయెనే అని లక్ష్మమ్మ అప్పటికీ యిప్పటికీ ఆ విషయం తలుచుకొని, తలుచుకొని కుళ్లిపోతూ ఉంటుంది. ఎట్లాగైనా కయ్యలోకయ్యను కలుపుకోవాలని ఆవిడకూడా ఒకటిరెండుసార్లు ప్రయత్నించింది గాని ఆవిడ ప్రయత్నం కొనసాగలేదు. అందువల్ల, ఆ కయ్యను లక్షాధికారైన తాను కోరినపుడు పట్టాకు ఇవ్వకుండా యిప్పుడు ఒక మాలవాడికి పట్టా కిచ్చారనేసరికి లక్ష్మమ్మకు ఆపాదమస్తకమూ తేళ్లూ జెర్రెలూ పాకిన ట్టయిపోయింది. తనకయ్యకింద మాలవాడు ప్రవేశిం

చాడని విన్నప్పటినుంచీ ఈ నెల్లాళ్లుగా ఆమె అన్నంతినక మంచంపట్టింది. రాత్రింబగళ్లు వాణ్ని దుమ్మెత్తిపోస్తోంది. వాడివంశం నాశనం కావాలని శాపనాకారాలు పాడుతోంది.

కొండడికి చేతిలో దమ్మిడీలేక ఒక్కదున్నపోతుగాని, ఒక్క అరకకొయ్యకాని లేక రెండువందలరూపాయలతో ఆశపడి తెచ్చుకొన్న కయ్యను సాగుబడిచేసుకొనే దారీతెన్నూ కనపడక దిగులుపడి ఉక్కిరిబిక్కిరయి వాడు తన్నుకులాడుకుంటూ ఉంటే, తనభూమిలో కలిసేకయ్యను తాను ఇంతప్రయత్నించినా తెచ్చుకోలేక ఆఖరుకు చూస్తూవుండగా తనకళ్లయెదుట ఒక హీనజాతి మాలవాడు తన్నుకు పోతున్నాడే, ఎట్లాగబ్బా ఈలోకంలో జీవించేదని యింట్లో లక్ష్మమ్మ మరణవేదనపడుతోంది.

అట్టిసమయంలో కొండడు ఆ భూమి అమ్మకం చూంపాడని, వినీ వినడంతోనే లక్ష్మమ్మ ప్రాణాలు లేచివచ్చినట్లుగా సంతోషించి రామిరెడ్డిచేత మాలవాడికి కబురు చేసింది, బేరమాడింది. తాను ఖర్చుపెట్టిన రూపాయలు తనకిచ్చివేస్తే ఆక్షణంలో భూమిని వదులుకొంటానని కొండడు జవాబు చెప్పాడు. వాడామాట అనేసరికి లక్ష్మమ్మ గుండెలు బాదుకొని—

“అమ్మయ్యో! నీ కెంతదురాశ పుట్టిందిరా మాలముండాకొడుకా! బ్రతకడానికా నాశనంకావడానికా ఇట్లాంటి దుర్బుద్ధులు పుట్టింది నీకు? ఈకయ్యకుగాను నామగడు ముప్పైఏళ్లనాడు దూటబిళ్లలలాగ, నలభై రూపాయలు ఆసర్కారువారి యెదాన్ని కొట్టినాడు. ఈముప్పై ఏళ్లుగా నలభైరూపాయలకూ వడ్డీ కట్టుకొంటే నూఱురూపాయలయింది. ఈనష్టం నీతాత ఇస్తాడనుకొన్నావా, నీముత్తాత యిస్తాడనుకొన్నావా? ఊరికే దురాశలకు పోబోకు దుఃఖానికి చేటు. ఎట్లాగా ఆకయ్య నీవు మరమ్మతు చేసుకోలేవు. మరమ్మత్తుకుగాను నే నింకా ఏభైరూపాయలు ఖర్చుచెయ్యాలిసుంది. అప్పటికి నాకు నూటయేభయిరూపాయలవుతుంది. తెలిసిందా? నీవు పాపం ఈసందునా ఆసందునా కచ్చేరిచుట్టు తిరిగి డబ్బు ఖర్చుపెట్టావు కాబట్టి అందుకు భత్యఖర్చులకింద పది రూపాయలిస్తాను. ఆకయ్య నాపేర విక్రయం చేసి పారెయ్యి” అన్నది.

“అమ్మయ్యో! నీ కెంతదురాశ పుట్టిందమ్మా” అని కొండడుకూడా గుండెలుబాదుకొంటూ వెళ్లిపోయాడు.

## 3

తాను రెండువందలు పెట్టి కొన్న కయ్యను పదిరూపాయలకిమ్మని లక్ష్మమ్మ చేసినబేరాన్ని తలుచుకొనేవరకు కొండడికి, అదివరకున్న నిరాశా నిస్పృహా వదలి, ఎట్లాగైనా సాధించి కయ్యను నిలబెట్టుకొని సాగుబడిచేసుకోవాలన్న పౌరుషం పుట్టుకొచ్చింది. “నేను దిగులుపడి నిస్సహాయస్థితిలో ఉండబట్టిగదా ఆమె నాకయ్య నింత హీనక్రయా

నికి అడిగింది. దేవుడు చల్లంగాచూస్తే నేను బతకలేకపోతానా? నేనేమీ లోకులడబ్బు కోసం ఆశపడలేదే” అనుకొని ధైర్యంతెచ్చుకొని, దేవుడిమీదే భారంవేసి కొండడు ఊళ్ళోకి చక్కా వెళ్ళాడు; మొదటి మారాజునే మళ్ళా బ్రతిమలాడుకొని, యింకో ౫౦ రూపాయలకి ప్రోనోటు వ్రాశాడు; ఆపైకంతో భూమి మరమ్మత్తుచేసి ఆ సంవత్సరం శ్రావణ మాసంరాగనే వరినాటువేశాడు. ఇరవైముప్పై ఏళ్ళుగా బీడుగావున్న భూమేమో ఆ సంవత్సరం కాలం సక్రమంగా రావడంచేత నారు గుచ్చిగుచ్చంగనే, కర్రలు నలుపుతిరిగి గంటలుకట్టి పైరు నవనవలాడుతూ ఎక్కివచ్చి అర యెకరాకయ్యా ఒకపుట్టెడుగింజలదాకా చితకపండింది. కొండడికి కొంత ధైర్యం చిక్కింది. దేవుడికృప చల్లంగుంటే, నాలుగేళ్లలో అప్పుతీర్చేసి బయటపడతామనుకొని, సాయంకాలం ఇంటికిపోయి, ఉడుకునీళ్లుపోసుకొని, ఆరబయట నులకకుక్కిమీద పండుకొన్నప్పుడల్లా ఏమేమో వూహాలతో మేడలు కడుతూనే ఉన్నాడు.

కొండడితో బేరం చెడ్డప్పటినుంచీ లక్ష్మమ్మకు దిగులుగానేవుంది. తనకయ్యలో కలిసే కయ్యను చూచిచూచి వదులుకోవడానికీ ఆవిడ కిష్టంలేదు; పోనీ ఎంత అయినా సర్లే, డబ్బిచ్చి తీసుకొందా మనుకొంటే - చేతులార అన్నిరూపాయలు మాలవాడిచేతిలో పోయడానికీ మనసొప్పలేదు. రోజులుగడచినకొద్దీ ఆరోజుకారోజు ఆవిడకు కడుపులో యీబాధ జాస్తీ అవుతూవచ్చింది. దానికి తోడు ఆ యేడు తననూరెకరాలనట్టువా సగటున ఎకరానికి ఓ పుట్టెడుగింజలు పండి, తన యింట్లో నూరుపుట్లూ వేసుకొనీకూడా. తన నట్టువలో కలిసేకయ్య అరెకరమే మాలవాడికి పుట్టెడుగింజలు పండిం దని తలుచుకొని తలచుకొని ఆవిడకు కడుపు దహించుకొని పోతోంది. మాలవాడికి పండిన దామాషా ప్రకారం ఎకరం రెండుపుట్లచొప్పున తననూరు ఎకరాలకూ రెండువందలపుట్లూ రాలేదే అనేచింత ఒకతట్టూ, పోనీ తనకు రాకపోతే పోయె పూటకు గతిలేని మాలవాడికి నిముషాలమీద అర యెకరానికి పుట్టెడు గింజలు వచ్చినవే అన్నదుఃఖం మరొకతట్టూ ఆవిడను కాల్చి నుసిచేస్తూ ఉన్నవి.

ఆవిడమనోవేదనకు అంతు కన్పించడం లేదు. ఒకటిరెండుసార్లు రామిరెడ్డిని పిలిపించి “అబ్బాయీ! ఏమిగతిరా, మాలావాడు బంగారంవంటి అరెకరాకయ్యా అర్ధాన్నం చేసి తనపొట్ట పెట్టుకొన్నాడు వాడికడుపు వాడితోనేకాల! నేను ఏబావో ఏగొయ్యో చూసుకోవాలిసిందే గాని గతిలేదిక. తలకింద కొరివెట్టుకొన్నట్లు ఈమాలమాదిగకొడుకుని నాకయ్యలకింద పెట్టుకొని నేను నలుగురిలోనూ తలయెత్తి ఇక ఈగడ్డమీద కాపురం చెయ్యలేను. అన్నిటికీ నువ్వే వున్నావు. ఏం చేస్తావో చెయ్యి” అని సొదపెట్టింది. “కానీలే అమ్మా! తొందర పడబోకు. వాణ్ణి అక్కడనుండి లేవగొట్టే ఉపాయం ఆలో

చిద్దాంలే. కాస్త నిదానించు" అని రామిరెడ్డి కొంతధైర్యం కలిగేటట్టు ఆమె నూరడించాడు. కాని లక్ష్మమ్మకు మనస్సు కుదుటపడలేదు.

జ్యేష్ఠమాసం వచ్చింది. తొలకరించింది. రైతులు నార్లు వేసుకొంటున్నారు. పొలాల్లోకి ఎరువు బూడిద తోలుకొంటున్నారు. తొలకరికి భూమి కాస్త మెత్తపడడంచేత కొంతమంది ఆతడిమీదే అరకలుకట్టి ఒకటి రెండు చాళ్లు వెలిదుక్కులు చేస్తున్నారు కొండడుకూడా తనకయ్యలోకి ఎరువుతోలడానికి, ఎవరినో ఎర వడిగి ఒకకాడి దున్నపోతులు తెచ్చుకొని బండికట్టాడు. తనూ, తనభార్యా-యిద్దరూ చెరొకగంపా తీసుకొని, వోయిరవైగంపలు జల్లిలో పోశారు. ఇక బరువు లాగలేవు దున్నలనుకొని కొండడు బండియెక్కాడు; కొరడా ఆడించాడు; సగం దూరం బండిని తోలుకువచ్చాడు.

కొండడికయ్యకు తూర్పునా, ఉత్తరాన్నా, పడమరా కూడా లక్ష్మమ్మపొలంకమ్ముకువుంది. దక్షిణపుతట్టుమాత్రం సర్కారు అనలు మినహా చెరువుతోట్టా పోరంబోకుభూములున్నవి. తనకయ్యకి పోవడానికి కొండడు లక్ష్మమ్మభూములగుండా పోయితీరాలి. వాడికి మరో మార్గంలేదు. పడమరగా ముప్పాతిక మైలు పోతే చెరువులోకిపోయే డొంక ఉంది గాని అది చాలా చుట్టు. సుమారు రెండు మూడువందల యెకరాలభూమిని చుట్టుకొస్తేనేగాని కొండ డాదారిగుండా తనకయ్యలోకి రాలేడు. ఎరువుబండి తోలుకొని కొండడు తనకయ్యల్లోనుంచి పోతున్నాడని లక్ష్మమ్మకు తెలిసింది. వెంటనే యిద్దరు సేద్యగాళ్లను పంపి బండిని మళ్లగొట్టించింది.

కొండడికేమీ పాలుపోవడంలేదు. పోనీ బండిని ప్రదక్షిణంచేయించి తీసుకుపోదామనుకొంటే రెండుసబుర్లు తోలేవరకే పొద్దుగుంకుతుంది. ఊరికీ తనకయ్యకీ ఓమైలుంది. ఆసాములందరూ అనాదిగా సంపాదించుకొన్న మంచి మంచి భూములన్నీపోను, మాలమాదిగల కెక్కడో పొలిమేరను కెనరుగా నాలుగు కయ్యలిచ్చారు సర్కారువారు. ఊరికి అందుబాటులోనూ, చేరువలోనూ ఇవ్వడానికి ఖాళీభూము లుంటేగా. ఎక్కడా సూదిమోపేటంత స్థలం కూడాలేదు. అసలే దూరంగా ఉన్న తన అరెకరాభాగ్యానికీ మూడునాలుగుమైళ్లు ప్రదక్షిణం తిరిగిసేద్యం చేసుకోవాలంటే, అలవయినపనిగా కనపడలేదు కొండడికి. అందువల్ల బండి నక్కడే విప్పకొని, కొండ డింటికిపోయి భార్యను పిలుచుకొని, యిద్దరూ చెరొకగంపా నెత్తిన పెట్టుకొని, ఎట్లాగైతేనేం, రెండోరోజు సాయంత్రానికి అరెకరాకయ్యలోనూ ఓ ఆరుబళ్ళయెరువు మెడనరాలు మెలితిరిగేటట్టు మోసి మోసి కయ్యలో పోశారు.

లక్ష్మమ్మకు ఒళ్లు గాభరా పుట్టుకొస్తోంది. ఏవిధాన్నా మాలవాడు లోబడడంలేదు. ఆఖరుకు ఆ మధ్య ఒకసారి కొండడి అరకదున్నిన పశువులు పగటివేళ లక్ష్మమ్మ

పొలంలోవున్న మంచినీళ్ళ దొరువుకాడికి నీళ్లుతాగను పోతే, తనదొరువులో నీళ్లుతాగడానికి వీల్లేదని ఆవిడ పశువులను మళ్ళగొట్టి బందెలదొడ్డిలో పెట్టించింది దేవుడా అంటూ పశువు ౧ కి ౦-౧౨-౦ వంతున ౪ పశువులకూ 3 రూపాయలుకట్టి,కొండడుపశువులను బందె నుండి విడిపించుకొన్నాడు. లక్ష్మమ్మ ఇంకా ఏమేమో చేస్తూనే వుంది. ఎన్ని చేసినా మరునటి సంవత్సరంకూడా కొండడు మొండికెత్తి, అన్నికష్టనిష్ఠూరాలకూ తలవొగ్గి ఎల్లాగైతేనేం నలుగురితోపాటు తనుకూడా సకాలంలోనే తనకయ్యను సాగుబడిచేసుకొని మొలగొలుకులు నారుగుచ్చాడు. ఆయేడుకూడా కాలం సరిగ్గానే రావడంవల్ల సకాలంలో మూడు, నాలుగు వర్షాలు కురిసి పైరు ఆరంభంలో బాగానే ఎక్కివచ్చినా, వెన్నుతీసి పొట్టమీదికి వచ్చేవరకు వర్షం బిగించి, కాలం బెట్టచేసి నీళ్లకు ఎద్దడయింది. ఎంత యెద్దడయినా, లక్ష్మమ్మబోటి మారాజులు మాత్రం బీదలనోటిలో మట్టికొట్టి కాలువల్లో వచ్చే నాలుగుచుక్కలూ తమ పొలాలకే పెట్టుకొని, తమపైరుమాత్రం ఎండిపోకుండా కాపాడుకొంటూవచ్చారు. కొండడి కయ్యకు నీరు పారుదలఅయ్యేటందుకు ప్రత్యేకంకాల్వ లేదు. మడవతీస్తే నీళ్లు లక్ష్మమ్మకయ్యలో నుంచి తనకయ్యలోకి రావాలి. నిరుడుకూడా ఆమెకయ్యమీది మడవగుండానే పారించుకొన్నాడు కొండడు. ఈ సంవత్సరంమాత్రం లక్ష్మమ్మ మామూలుమడవనుపూడ్చివేసి, తన కయ్యలోనీళ్లు మాలవాడి కయ్యలోకి చుక్క ఎక్కిరాకుండా, గనిమెగజంఎత్తున మట్టిపోసి గట్టిపరిచి, తనకయ్యలో అదనంగా నిలిచేపులకనీళ్ళకుపడమటితట్టు చెరువులోకిపొయ్యేటట్టు ఇంకో కొత్తమడవ పెట్టించింది. ఆ యేడు బీదలపొలాలకు నీరు చాలక పైర్లు ఎండిపోతూవున్నప్పటికీ అప్పట్టం కొద్ది లక్ష్మమ్మకయ్యలో మోకాలులోతు నీళ్ళు నిలవడమేకాకుండా, ఇంకా పైనీళ్ళన్నీవచ్చి పడడంచేత అదనమై ఈ సంవత్సరం కొత్తగా పెట్టించిన మడవగుండా అవన్నీ చెరువుతొట్టిలోకి వృథాగాపోతున్నవి. అందుకైనా వొప్పుకొందిగాని మామూలు మడవగుండా కొండడిచేలోకి చుక్కకూడా పోవడానికి లక్ష్మమ్మ వొప్పుకోలేదు. పోనీ చెర్వుతొట్టిలోకి పోయిననీళ్ళు తన కయ్యలోకి కాలవతవ్వుకొని మళ్లించుకొందా మనుకొన్నాడు కొండడు కాని తనకయ్య చెర్వుతొట్టుకంటె మిట్టగా వుండడంచేత నీళ్లెక్కక, ఆ ప్రయత్నం చాలించుకోవలసి వచ్చింది వాడు.

ఫలితానికి వచ్చినపైరు. ఆరునెలలుగా చెమట వూడ్చి కష్టంచేసి పెంచుకొన్నపైరు. ఇంక లెఖ్ఖ రెండుతళ్లు తగిలితే మళ్ళా ఒక పుట్టెడుగింజలు నమ్మకంగా పండుతవి. కాని తనకయ్యలోకి నీళ్లువచ్చేమార్గం కనబడలేదు వాడికి. లక్ష్మమ్మ కరుణించాలె; తనకు నీళ్లు ప్రాప్తించాలె. నీళ్లులేక కయ్య ఎండిపోతోంది. తడి ఆరి అడుగువేస్తే దిగబడడంలేదు. క్రమ

క్రమంగా చెమ్మ ఆరిపోయి, కయ్యలోని వరి గంటలసందుల్లో భూమి బద్దలయి బీటలు తీస్తోంది. కయ్య చూచుకొనేకొద్దీ కొండడి హృదయంకూడా ఎండి బీటలు తీస్తోంది. హృదయం ఎంత యెండిపోయినప్పటికీ వాడి కళ్ళల్లో తడిమాత్రం ఆరలేదింకా. ఎంత అడ్డు కట్టవేసినా వాడి కన్నీళ్ళప్రవాహం కట్టుబడకుండా ఉంది. దానివల్లనైనా ఎండిపోతున్న పైరును కాపాడుకొందా మన్నట్టుగా, గనిమెమీద కూర్చొని తూర్పుముఖంగా తిరిగి, మోకాలిమీద తలెట్టుకొని, డొక్కలెగరవేస్తూ, వెక్కి వెక్కి రోదనం చేస్తున్నాడు కొండడు. కాని యెండిపోయి బీటలు తీసిన కయ్యను మెత్తనచేయడానికి ఆ ప్రవాహం చాలలేదు.

కళ్లు కాయలుకాసేటట్లు ఒకగంటసేపు ఏడ్చాడు. కళ్లు ఎర్రబడినవి. తలపైకెత్తిచూచాడు. సూర్యుడు నెత్తిమీదకి రాబోతున్నాడు. "సూర్యభగవానుడా! నీకుకూడా కరుణలేదా సామీ! ఇంతతీక్షణంగా నువ్వు నీకిరణాలన్నిటినీ విడిచిపెట్టితే, కోమలమైన నాపైరు ఎండిపోయి మలమలమాడిపోతోందే! చెమటపూడ్చి ఆరుమాసాలుగా చేసిన సేద్యం మట్టిపాలైపోతోందే! ఎవరితో చెప్పకోను సామీ!" అని రెండుచేతులూ ఎత్తి వలవలయేడ్చాడు కొండడు. ఒక్కపదునువర్షం కురిస్తేచాలు ననుకొన్నాడు. ఆఖరుకు ఇంత మబ్బుతునకయినా అడ్డువస్తే పైరుకు వేడితప్పిపోననుకొన్నాడు.

పొద్దు నెత్తిమీదికి వచ్చింది. నీళ్లులేక పైరు మాడిపోతున్నట్టుగానే, పొద్దుటినుండి చద్దిదాహమైనా లేక వాడికడుపుకూడ మాడిపోతోంది. ఇంటికిపోయినాడు. ఇంతఅన్నం గతికాడు. భార్యను పిలిచాడు. ఇద్దరూకలిసి ఒకగూడ సంపాదించారు. నేరుగా కయ్యకాడికి పోయారు. లక్ష్మమ్మకయ్యల్లోనుండి చెరువులోనికి పోయేనీటికి అడ్డుకట్టవేసి, ఒకసన్నని కాలువతీసి, గూడతో పొద్దుగూకులూ నీళ్లు ఎత్తిపోశారు. కాని వెనుకవాలుగా ఉన్న ఆ ప్రదేశంగుండా నీళ్లు కయ్యలో కెక్కలేదు. అయినప్పటికీ చీకటిపడేవరకు నాలుగోవంతు కయ్య సుమారుగా తడిసింది: రాత్రి యింటికి పోయి, నీళ్లు పోసుకొని, కూడుతిని, పదిగంటలకు వెన్నెట్లో మళ్లా కయ్యకాడికిపోయి తెల్లవారుజామున కోడికూసేవరకూ నడుములు పడిపోయేటట్లు భార్యాభర్తలిద్దరూ ఆ గూడతో నీళ్లెత్తి పోస్తూనేఉన్నారు. అతడితో పైరు కొంచెం పాటుకు తిరుక్కున్నప్పటికీ, ముప్పైలంఖణాలు చేసి పథ్యం పుచ్చుకొన్న రోగి ఎక్కవచ్చిన ట్టయి, అదునుతప్పిన తడి అయినందున పుట్టెడుగింజలు కావలసిన కయ్య అర్థపంటపండి, ఒకపందుంగింజలు రాలింది. తన కెంతప్రాప్తమో అంతే ననుకొన్నాడు కొండడు.

పుష్యమాసం వచ్చింది. పైర్లన్నీ పంటలకువచ్చినై. కూలివాండ్లందరూ కోతలకు వంగారు. వారంరోజులలో తనపైరుయావత్తూ కోయించి కుప్పలువేయించింది లక్ష్మమ్మ.

# తిరువారూరు చిత్రములు





౧. త్యాగరాజస్వామి దేవాలయము, పడమట గోపురము, కొలను A. A.



౨. త్యాగరాజస్వామి దేవాలయము (తూర్పు వైపు) A. A.



3. అరుణాచలేశ్వర దేవాలయము, తూర్పుప్రాకారము K. P. S



౪. అరుణాచలేశ్వర దేవాలయము, తూర్పుగోపురము K. P. S.

కూటికికొరతబడ్డ యానాదులు, ఎరుకలు, మాలలు, మాదిగలు వగైరా అలబరిజనం పైరుకోతయినపొలాల్లోకిపోయి,పన అడుగున మిగిలిన పరిగకర్రలొక్కొక్కటే ఏరుకొనిసాయంకాలానికి ఓసంచెడుకట్ట అయ్యేటట్లుగా కట్టుకొని, ఇళ్లకు తెచ్చుకొంటున్నారు.

కొండడితల్లి వెంకి ముసలిది అయినా పూర్వకాలపు మనిషయినందున దెబ్బయ్యో పడిలోకూడా శరీరం చేవ దేరి ఇంకా దారుఢ్యం గానే ఉంది. మొదటినుంచీ కాయకష్టం చేసిన అలవాటుకొద్దీ, అది యిప్పుడుకూడా ఒక్కనిముషం ఇంట్లో ఊరికే కూర్చోలేదు. పొయిలోకి ఇన్ని చితుకు లేరుకు రావడమో, ఇంత పేడ పోగుచేసి పిడకలు చేసుకోవడమో, ఆసాములు కుప్పలునూర్చి పుట్లుపుట్లుధాన్యం బండ్లమీద తోలుకొనిపోయిం తర్వాత కళ్ళంలో తడినేల కంటుకొనిపోయిన గింజలను పత్తిపుల్లల చీపురుతోనో, కంది పుల్లల చీపురుతోనో పొద్దుగుంకులూ నడుమడిపోయేటట్లు వంగి, ఒక్కొక్కగింజే కళ్ళంలోని మట్టిగడ్డలతోసహా గీకి గీకి, ఆవిధంగా పొద్దుగూకేవరకు ఏ అర్ధశేరుగింజలో చేటలో వేసుకొని ఇంట్లోకి చేర్చడమో - ఇట్లాగే ఏదో ఒకవిధాన్న తానుకూడా కష్టపడి సంసారానికి కాస్త సాయపడుతూనేఉంది. ఆయలవాటుకొద్దీ, ఈ సంవత్సరం కోతలు పూర్తి అయి కుప్పలుపడడంతోనే నలుగురితోపాటు వెంకి పదిరోజులపాటు వరికొయ్యకాలంతా తిరిగితిరిగి ఒక అరమోపు పరిగ కయ్యలు పోగుచేసి ఇంట్లో చేర్చింది.

కొండడుకూడా తనకయ్యలో పైరుకోశాడు. వెంటనే ఆ పందుంగింజలపంటా పన మీదనే పడివాటుకొట్టేదా మనుకొన్నాడు కాని కొంచెం నిదానించి పిడివాటుకొట్టితే ఇంకా గింజలు కర్రకంటుకొని సరిగ్గారాలవేమో, ఇంతాచేస్తే పంటకాస్తా పలాములయి పోతుందని భయపడి, ఒక్కవారంరోజులు కాస్త వెసులుబాటు చూసుకొని నాలుగు బర్రెగొడ్లపల్ని వాటినీ మళ్లించి తొక్కిద్దామని ఆలోచనచేసి కయ్యలోనే ఒకచిన్న కుప్ప పడవేశాడు కొండడు. లక్ష్మమ్మ కూడా కొండడికయ్యకి ఆనుకొనివున్న నూరెకరాలపంటా కోయించి, అక్క డక్కడ నాలుగుకుప్పలు వేయించింది.

౪

కోతలుముగిసి కుప్పలుపడేవరకు రైతాంగానికి రవంత వెసలిక చిక్కింది. అట్టే ఆలోచించుకోగా తనకయ్యకి దిగులులేకుండా నీళ్లు పారేకాలవ లేకపోవడం కొండడికి చికాకుగా తోచింది. ఇక లక్ష్మమ్మమీద ఆశలుపెట్టుకొంటే ఉపయోగంలేదనుకొన్నాడు. అయినా తన కయ్యకు కాలవ కావలెనంటే ఎట్లాగా లక్ష్మమ్మకయ్యలోనుండే తనకు రావాలె, విధిలేదు కాబట్టి ముందు లక్ష్మమ్మ నడిగి ఆమెచేత కాదనిపించుకొన్న తర్వాతనే పై వ్యవహారం చూచుకొందాం మనుకొని ఒకరోజు కొండడు లక్ష్మమ్మ ఇంటికిపోయి:

"అమ్మా! నువ్వు గొప్పమారాజువు. నామీదపగబట్టితే నే బతకలేను. నీదయవల్ల చిన్నతనంలో నాకు గంజిపోసి బతికించావు. ఇప్పుడు పెద్దవాణ్ణయినతర్వాతకూడా నువ్వే అన్నంపెట్టాలసినగండం వచ్చింది. అయిం దేదో అయిపోయింది. కాని అమ్మా! నీకు దణ్ణంపెట్టుతా. నీకయ్యలోనుంచి నాకయ్య లోకి జానెడువెడల్పు కాలవగనుక ఇస్తివా, నీపేర దీపంపెట్టుకొని మొక్కుకుంటా" అని అడిగాడు కొండడు.

"కాలవా! నీకా! ఎంతతల తిరిగిపో యిందిరా కొండా! నీకు. ముష్టి అరమెకరా కయ్య చేతిలోకివచ్చి రెండోయేడింకా జరుగ లేదు, అప్పుడే నీకయ్యకు కాలవలూ మడ వలూ కావలసివచ్చినైగా! ఔరా: అయిన నూరురూపాయల కయ్య - మానోటికాడ అన్నం - ఎత్తుకొనిపోయి నీమొదాన్న పెట్టు కోవడమేకాకుండా పైగా కాలవకోసరం బేరానికి వచ్చావయ్యా?—ఇస్తా. కాలవ ఇస్తా నులే ఉండు; ఈ పొంగు బోర్లాపడడానికే వచ్చిందిలే నీకు. ఎందుకు పాపం అని అజ్ఞా యించి ఊరుకొనివుండా. ఈపాలి నాకయ్య తొక్కిచూడు. రెండుకాళ్లూ విరగగొట్టిస్తా" అంది లక్ష్మమ్మ.

"నాకు ఊరికెనే పనిలేదులే అమ్మా! కాలవకుగాను నీ విచ్చేస్థలానికి క్రమమైన క్రయంగట్టి, డబ్బుతీసుకొని మరీ యిద్దువు గానిలే" అన్నాడు కొండడు.

"ఛీ! నోరుమూసుకొని బయటికిపో మాలమాదిగకొడకా! శుభమల్లె మంగళ హారప్పూటా ఇంటిముంగిటికి వచ్చి, కయ్య మ్ముకో కాలవమ్ముకో అని వెధవకూతలు కూస్తావు. నోట్లో పొడిపిస్తా చూడు. నాకేం గ్రహచారంపట్టలేదు నీకు నామళ్లూ మా న్యాలూ అమ్ముకోడానికి. ఈపాలి కాలవ సంగతి ఎత్తావంటే మాటదక్కదు. పో" అని లక్ష్మమ్మ కసురుకుంది.

ఇక లాభంలేదనుకొని కొండడు ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా ఆఫిర్కా రెవిన్యూ యినస్పెక్టరుదగ్గరకు వెళ్లాడు. అదివరలో కొండడికయ్యకు పట్టాకు తెప్పించినప్పుడు కొంత మేతమేసినగొడ్డు కాబట్టి, రెవిన్యూ యినస్పెక్టరుకు వాణ్ని చూడడంతోనే నోరు ఊటలూరింది. కొండడు చెప్పుకొన్న విన్న పం విన్నాడు. 'ఇది మనచేతిలోపని ఎంత సేపు. ఎల్లుండి మర్నాటికి కాలవకు ఉత్త రువు తెప్పించిపెడతా' నని నమ్మకంచెప్పి అనుకొన్నదానిలో ముందుగా సగమూ, పని పూర్తయిన తర్వాత మిగిలిన సగమూ కొండడు తనకిచ్చేటట్టు ఖరారంటే ఖరారు చేసుకొని, మొదటిసగం అయిదు రూపా యలూ అక్షణంలోనే చేతిలోకి రాల్చు కొన్నాడు, 'రేపు జాగ్రత్త' అనే బ్రతుకు తెరువు తెలుసుకొన్న ఆ నియోగిరెవిన్యూ ఇనస్పెక్టరు. వెంటనే తహశీలుదారుకూ, డిప్టికలెక్టరుకూ అర్జీలువ్రాసి పోస్టులో రిజి ష్టరు చేయవలసిందని కొండడితో చెప్పుతూ

"ఒరే: కొండా! ఇక్కడ ఇనస్పెక్ట రుని ఎట్లాగో తృప్తిపరిచాంగదా ఇక మన కేమీ పరవాలేదనుకొని తాత్సారం చేసి ఊరుకొంటావేమో. ఇవి డెల్టాకొంపలు. ప్రతీ పనికీ డి.పి.డబ్ల్యువారితోనూ మాతోనూకూడా అవసరం ఉంటుంది. తీరాఫలితానికి రాబోయ్యే సమయంలో ఆవోవరుసీరు ముండావాడు ఒక కలంపోటు పొడిచాడంటే ఆచిక్కులోంచి పెరుక్కో లేకచావాలె. అర్జీలు పంపడం తోనే ఆవోవరుసీరుకాడికి పోయి, దణ్ణంపెట్టి చెప్పకో. తెలిసిందా? తర్వాత నన్ను నిష్ఠూరమాడితే ప్రయోజనంలేదు. చూడు! ఆయన ఊరికేనే చేపడు. ఏదో ఇంతకందెన పడవేసి సురిలోగట్టుకోపో" అని రెవిన్యూ ఇనస్పెక్టరు సలహా ఇచ్చాడు. ఇట్లా చెప్పే వరకు కొండడికి గుండె గుభేల్లుమనింది. కాని ఇంకోదారి కనబడ్డంలేదు.

"సరేనే అయ్యా! నాకళ్ళాటలు నేపడ తాలే. నువ్వుమట్టుకు నిండాదయవుంచాలె" అని కొండడు దణ్ణంపెట్టి వెళ్ళి రెండు అర్జీలకూ రెండుపావలాలు ఇచ్చి వ్రాయించి, డిప్టీకలెక్టరు కొకటీ, తహశీలుదారు కొకటీ పోస్టులోవేసి ఇంటికివచ్చాడు.

కొండడు వచ్చివెళ్ళిన మరునాడే రెవిన్యూఇనస్పెక్టరు "ఇట్లా ఇట్లా వ్యవహారం జరగబోతోంది. మీ జాగ్రత్తలో మీరుండ వలసింది" అని తనజవానుద్వారా లక్ష్మమ్మకు కబురుచేశాడు. లక్ష్మమ్మ స్వయంగావచ్చి మాట్లాడ్డానికి వీల్లేక రామిరెడ్డిని ఇనస్పెక్టరు పంతులుకాడికి పంపుతూ, కూడా పదిఅరటి కాయలూ, పది అరటాకులూ ఇచ్చి పంతులు కియ్యమని చెప్పింది. రామిరెడ్డి ఇనస్పెక్టరు పంతులుతో అంతా మాట్లాడి మనస్సుకు తెచ్చుకొని 'ఇంటికిపోయి మాపిన్నమ్మతో మాట్లాడివస్తా'నని కూర్చున్నమనిషి లేచాడు.

"ఇదుగో: ఊరికేనే మంత్రాలకి మామిడికాయలు రాలేకాలం కాదని మీపిన్నమ్మతో గట్టిగా చెప్పు మాలవాడు ఏవేవో సిఫార్సులు తీసుకొనిపోయి పై ఆఫీసుల్లో గట్టి ప్రయత్నం చేస్తున్నాడు. పైగా సర్కారుకు హీనజాతులంటే తగని అభిమానం. ఈ తిరుగుళ్ళన్నీ మీకు తెలియవు. చేసేప్రయత్నం ఘట్టిగా చెయ్యాలని ఆమెతో నొక్కిచెప్పు. తెలిసిందా" అని పంతులనేవరకు 'చిత్తం అట్లాగే లెండి' అని రామిరెడ్డి ఇంటికిపోయి లక్ష్మమ్మతో అన్నిసంగతులూ చెప్పాడు.

"ముందుగా చెయ్యిజారితే తంటాగాని నోరు జారితే పరవాలేదు. ఇచ్చిపుచ్చుకోవడాలు తర్వాత చూచుకోవచ్చుగాని, అసలు మనకు అనుకూలం అయితే కార్యం అంతా అయినతర్వాత ఇనస్పెక్టరుకు ఇరవై రూపాయ లిస్తామని మాటమాత్రం పడేసి చక్కారా" అని లక్ష్మమ్మ చెప్పింది. ఆమాటలే తీసుకువచ్చి రామిరెడ్డి ఇన్‌స్పెక్టరు కందిచ్చాడు. ఆయన పెదవివిరిచాడు; లాభంలేదనుకొన్నాడు. కొండడు ఇచ్చుకొన్న అర్జీలు

రిపోర్టునిమిత్తంఇనస్పెక్టరువద్దకురాగా ఆయన ఆఖరుకు ఎటూ తేల్చకుండా ఎవరికీ అనుకూలం లేకుండా కాలవ ఇస్తే ఇవ్వవచ్చు. ఇవ్వకపోయి నా కొండడికి వచ్చినఇబ్బంది లేదని గోడమీది పిల్లివాటంగా రిపోర్టువ్రాసి అర్జీలు పైకిపంపే వేశాడు. ఇక పదిహేను, ఇరవైరోజుల్లో తనకు అనుకూలంగా ఉత్తరువులు వస్తవని కొండడు కొండంత ఆశతో ఎదురుతెన్నులు చూస్తు న్నాడు.

(సశేషము)



జ్ఞానపిపాస A. A.

# రైన్‌లాండు సమస్య

## నార్ల వెంకటేశ్వరరావు

ఈనాటి యూరప్ చిక్కులకు ఫ్రాన్సు జర్మనీల వైరమే చాలావరకు కారణం! అయితే, ఈవైరం కొత్తదికాదు. కనీసం మూడుశతాబ్దాలనుంచి ఇది రగులుతూనే వుంది.

ఈరెండుదేశాలమధ్య ప్రప్రథమంలో వైరం రావడానికి ఫ్రెంచిఅమాత్యుడైన కార్డినల్ రిష్లూ కారణం! జర్మన్ ప్రజల్ని తలయెత్తకుండా చితక గొడితే, యూరప్‌లో తమదేశ మిక జైగీయమానంగా వుండగలదనే దురాశకొద్దీ ఇతగాడు క్రీ. శ. ౧౬౧౮ లో బొహీమియాలో స్థానికంగా బయల్దేరిన చిన్ని మత కలహాన్ని ఎగదోసి పెద్దయుద్ధంగా మార్చాడు. ఆ యుద్ధం ముప్ఫయిసంవత్సరాలపాటు జర్మన్ రాజ్యం లో జరిగింది. ఫ్రాన్సు జర్మనీలే కాకుండా మరెన్నో దేశాలు అందులో పాల్గొన్నాయి. యూరప్‌చరిత్ర లో దాన్ని మించిన ఘోరమైన యుద్ధం మరొకటి లేనే లేదు. క్రీ. శ. ౧౯౧౪-౧౮ సంవత్సరాలమధ్య చెల రేగిన మహాసంగ్రామంలో విపరీతంగా జననష్టమూ, ధన నష్టమూ జరిగినా, ఇదికూడా ఆముప్ఫయిసంవత్సరాల దారుణమైనయుద్ధానికి సాటిరాదనే చెప్పాలి. ఆయుద్ధ కారణంగా ఆనాటి సస్యశ్యామలశోభితమైన జర్మనీ కేవలం రుద్రభూమి అయిపోయింది! అంతకుపూర్వం అత్యుత్తమమైన సభ్యతతో విరాజిల్లుతున్న జర్మన్ ప్రజలు చాలాభాగం అనాగరికులై పోయారు!!

ముప్ఫైసంవత్సరాలపాటు ఈవిధంగా జర్మనీలో రక్తప్రవాహాల్ని ప్రవహింపజెయ్యడంవల్ల ఫ్రాన్సుకుకలిగిన ఒక పెద్దలాభం ఏమిటంటే,— జర్మనీ పడమటి సరిహద్దులోవున్న ఆల్సేసపరగణా తన రాజ్యంలో కలవడం!

ఫ్రెంచి, జర్మన్ ప్రజలమధ్య ౧౬౧౮ లో రగులుకున్న ఈవైరం ఆనాటినుంచి ఈనాటివరకూ పొగలు కక్కుతూనే వుంది. రిష్లూహయాంతర్వాత యెప్పుడైనాగాని, దాదాపు ఆయిదుసార్లు ఫ్రెంచి సేనలు జర్మన్ ప్రజలమీదకు దండెత్తివెళ్లినాయి. ఈ దండయాత్రలవల్ల జర్మనీవారు పొందిన నష్టం అపారం.

అయితే, వాటర్‌లూయుద్ధంతో ఫ్రెంచి దండ యాత్రలు నిలిచిపోయి, జర్మన్ దండయాత్రలు ప్రారంభమైనాయి. అంతకుపూర్వం ఫ్రాన్సు చేసిన దురాగతా లన్నింటికీ ప్రతీకారంగానా అన్నట్టు ఈ దండయాత్రలు ఒకదాన్ని మించి మరొకటి తీవ్రంసయితం అయినాయి.

క్రీ. శ. ౧౮౧౪, ౧౮౧౫, ౧౮౭౦, ౧౯౧౪ సంవత్సరాలలో మొత్తంనాలుగుసార్లు జర్మనీ ఫ్రాన్సు మీద విరుచుకుపడింది. ఇలా విరుచుకుపడ్డ నాలుగు సార్లలో రెండుసార్లు ఫ్రెంచిరాజ్యంలో కొంత భాగాన్ని హరించిందికూడా! ౧౮౧౪ లో సార్ ప్రాంతాన్ని కలుపుకుంది; తిరిగి ౧౮౭౦ లో పూర్వం తాను పోగొట్టుకున్న ఆల్సేసుతోపాటు దానిసరిహద్దులో వున్న లారైన్ పరగణాను కూడా స్వాధీనపరుచుకుంది. ముందు సార్ ప్రాంతాన్నీ, తర్వాత ఆల్సే లారైన్ పరగణాలనూ హరించడంలో జర్మనీ పెద్దయెత్తే యెత్తింది. సార్ ప్రాంతంలో బొగ్గుగనులు విశేషంగా వున్నాయి. ఇక ఆల్సేలారైన్ పరగణాలలో ఇనుపగనులు విరివిగా వున్నాయి. అంచేత ఆబొగ్గుగనులూ, ఈ ఇనుపగనులూ తనచేతిలోవుంటే తాను పారిశ్రామికంగా యూరప్‌లో అగ్రస్థానాన్ని పొందవచ్చునని దానివుద్దేశం......... పోతే, ౧౯౧౪ లో నయినా బ్రిటన్ అడ్డుపడివుండక పోతే, జర్మనీ ఫ్రాన్సును హతమార్చివుండేదే కాని బ్రిటన్ సైంధవుడిలా అడ్డుపడటంతో కథ అడ్డు తిరిగింది.

మొదటి రెండింటిమాట యెలావున్నా ౧౮౭౦-౧౮౭౧ సంవత్సరాలనాటి జర్మన్ దండయాత్రలు ఫ్రాన్సును పూర్తిగా హడలగొట్టినాయి. ౧౮౭౦ లో అప్పటి ఫ్రెంచిచక్రవర్తి...మూడవ నెపోలియన్ ... చాలా తెలివితక్కువగాత్వరపడి జర్మనీమీద యుద్ధాన్ని ప్రకటించాడు. ఎప్పుడు ఏమిసాకు చిక్కుతుందా, ఎప్పుడు ఫ్రాన్సుమీద విరుచుకుపడదామా అని కాచుకున్న జర్మనీ అమాంతంగా ఫ్రాన్సురాజ్యంలోకి వురికింది. ఇక, ఆతర్వాతజరిగింది యుద్ధంకాదు— వూచకోత. జర్మనీసైన్యాలు ఎకాయెకివచ్చి, ప్యారిస్‌నగరాన్నే నాలుగుమాసాలపాటు ముట్టడివేశాయి. ఈ దెబ్బతో నెపోలియన్‌చక్రవర్తి వూడ్చుకుపోయాడు; ఫ్రాన్సు ప్రజాస్వామిక రాజ్యం అయింది. ఆతర్వాత వేరేదిక్కులేక ఫ్రాన్సు జర్మనీతో సంధిచేరానికిదిగి, తన జాతీయప్రతిష్ఠకు కళంకమైన షరతుల కెన్నింటికో అంగీకరించవలసివచ్చింది. ఈషరతులలో ప్రధానమైనవిరేమిటంటే— ఆల్సేస్-లారైన్ పరగణాలనుజర్మనీ వశం చెయ్యడం; ౨౦ కోట్ల పౌనుల యుద్ధనష్టపరిహారాన్ని సమర్పించుకోవడం! ఘనమైన ఖనిజసంపత్తి వున్న ఆరెండుపరగణాలను పోగొట్టుకోవడం, ఇంత విపరీతమైన మొత్తాన్ని చేతులారా సమర్పించడం— ఈ నష్టం అలావుంచగా, యుద్ధం అంతా కూడా తమ పరిహద్దులలోనే జరగడంవల్ల పంటలన్నీ చెడిపోయి, పరిశ్రమలన్నీ శిథిలమై, ఆర్థికసంబంధమైన ఏర్పాటులన్నీ తారుమారైపోయి, అసలు జాతీయజీవనమే భగ్నమై, ఫ్రెంచిప్రజలు చప్పగా చితికిపోయారు. ఇక, ౧౮౭౦ నాటి జర్మన్ జైత్రయాత్ర ఫ్రెంచివారికి సింహస్వప్నం అయిందంటే ఆశ్చర్యమేముంది?

పోతే, ౧౯౧౪లో నయినా యుద్ధపర్యవసానం ... బ్రిటన్ తోడ్పాటువల్ల ... ఫ్రాన్సుకు అనుకూలంగా అయిందన్నమాటేగాని, నాలుగేళ్లపాటు సర్వప్రపంచాన్ని కలవరపెట్టిన ఆమహాసంగ్రామం అంతా కూడా తిరిగి దానిసరిహద్దులలోనే జరగడంవల్లనూ, తిరిగి జాతీయజీవనం సంపూర్తిగా భగ్నంకావడంవల్లనూ దానికి పూర్వపు ఆకష్టానుభూతి తప్పలేదు.

ఒకప్పుడు ఫ్రాన్సుచేతుల్లో జర్మనీకూడా యితం కష్టాల్ని నష్టాల్ని, పొందినమాటయితే నిజమేగాని అయితే అదంతా పురాతనగాథ! ఫ్రెంచిదండయాత్రలమాట జర్మనీవారికి హిస్టరీ పుస్తకాల్లో చదువుకుంటేనేగాని జ్ఞాపకంరాదేమో! ఇక ఫ్రాన్సుకు జర్మనీదండయాత్రల సంగతిమాత్రం అలాంటిదికాదు. జర్మనీ దండయాత్రలు అన్నీకూడా సుమారొక శతాబ్దిలోపుగానే జరిగాయి. అంచేత, జర్మనీపేరు చెవితేనే ఫ్రాన్సుకు హడల్! ఫ్రాన్సు, జర్మనుల సంబంధబాంధవ్యాలను గురించిగాని, యూరపియన్ రాజకీయాలను గురించిగాని, ఆలోచిస్తున్న సందర్భంలో జర్మనీఅంటే ఫ్రాన్సుకువున్న ఈభయంమాటను మరవగూడదు! ఇలామరిస్తే, ఆయాసమస్యలు సులభగ్రాహ్యంగా వుండవు.

౧౯౧౪ లో అంటుకున్న యుద్ధం ౧౯౧౮ లో చల్లారవచ్చేసరికి ఇంకముందన్నటికీకూడా జర్మనీవల్ల తనకు భయంలేకుండా వుండేపద్ధతిని కట్టుదిట్టాలుచేసికోవాలని ఫ్రాన్సు తాపత్రయపడసాగింది. భవిష్యత్తులో ఆత్మరక్షణకోసం ఫ్రాన్సు అనుభజరిపించాలని అనుకొన్న షరతులివి:—

జర్మనీకి సామ్రాజ్యం ఏమీ లేకుండా చెయ్యడం.

జర్మనీ సరిహద్దుల్ని ఎక్కడికక్కడ తెగగొట్టి ఆయాభాగాలను ఇరుగుపొరుగుదేశాలకుకలిపివెయ్యడం.

యుద్ధనష్టపరిహారాన్ని సాధ్యమైనంత హెచ్చుగా నిర్ణయించి జర్మనీని శాశ్వతంగా ఋణాలపాలు చెయ్యడం.

నౌకదళాన్ని ఛిన్నాభిన్నంచేసి, జర్మన్ వర్తకవ్యాపారాలకు దెబ్బకొట్టడం.

సైనికశక్తిని భగ్నపరిచి జర్మనీని కలకాలంగా దుర్బలస్థితిలోవుంచడం.

తిక్కపుట్టడమే తడవుగా జర్మనీపైన విరుచుకుపడ్డానికి అవకాశంలేకుండా సరిహద్దులో అడ్డుగా ఒకరాజ్యంగాని, ఇదికాదరకపోతే వివిధప్రభుత్వాల

అజమాయిషీక్రింద కనీసం ఒకపరగణాగాని వుండేలా ఏర్పాటుచెయ్యడం.

ఇవీ ఫ్రాన్సుకోరదలచుకున్న షరతులు. వార్సైల్సుసంధి కారణంగా ఇవి చాలాభాగం సిద్ధించాయికూడా!

ముందు సామ్రాజ్యంసంగతి:—జర్మన్ సామ్రాజ్యాన్ని యావత్తూ బ్రిటిష్, ఫ్రాన్సు, బెల్జియం, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, జపాన్ రాజ్యాలవారు......మాన్‌డేట్సు అనేవంకతో పంచివేసుకున్నారు. షాన్‌టన్‌గులో జర్మనీసంపాయించుకున్న ప్రత్యేకాధికారాలన్నీ జపానుకు సంక్రమించాయి. పోతే మిగతా చైనాలోనూ, సయాం, లిబెరియా, సయాం, మొరాకో, ఈజిప్టులలోనూ తనకున్న ప్రత్యేకాధికారాలకుసయితం జర్మనీ వీడ్లువదలుకోవలసివచ్చింది.

ఇక జర్మన్‌సరిహద్దుల సంగతి:—పశ్చిమదిశలో ఆల్సేస్-లారైన్ పరగణాలు రెండూ ఫ్రాన్సుకలుపుకుంది. మల్‌మెడీ, యూపెన్‌అనే రెండుతాలూకాలను బెల్జియం హరించింది. డెన్మార్కుకూడా మరొకతాలూకాను తన్నుకపోయింది. ఇక, తూర్పుదిక్కున ఇంతకుమున్నెన్నటికన్న అధికంగా రాజ్యంపోయింది. పోసెన్, వెస్టు ప్రష్యారాజ్యాలలో అధికాంశం పోలెండ్‌కు చెందిపోయింది. అప్పర్ సైలీసారాజ్యంకూడా దానికే సంక్రమించింది. ఈప్రాంతంలోనే మరికొంతభాగం జెకోస్లోవాకియాకు దక్కింది. బాల్టిక్ సముద్రతీరాన మెమెల్, డాన్‌జిగ్ అనే రెండుపట్టణాలుకూడా ఇలాగే జర్మనీకి కాకుండా పోయినాయి. పైగా ఈస్టుప్రష్యా ప్రాంతం తక్కినదేశంనుంచి చీలదీయబడింది. పోలెండుకు అంతకుపూర్వం బాల్టిక్ సముద్రతీరానికి వెళ్లడానికి దారి వుండేదికాదు. ఈస్టుప్రష్యాను తక్కినదేశంనుంచి చీలదీయడంలో పోలెండ్‌కు అత్యవసరమైన ఈదారి ఏర్పడింది. దాన్ని...అంటే ఈదారిని ... "పోలిష్ కారిడర్" అని వ్యవహరిస్తున్నారు.

జర్మనీదగ్గరనుంచి వీలైనంతఅధికంగా యుద్ధనష్టపరిహారాన్ని గుంజడం, దాని నావికాదళాన్ని, పైనికశక్తినీ శిథిలంచెయ్యడం—ఈ విషయాల్లోకూడా ఫ్రాన్సుకోర్కెలు...వార్సైల్సుసంధిద్వారా ... లెస్సగానే సిద్ధించాయి. మొత్తంమీద యూరప్‌కు సంబంధించినంతవరకు జర్మనీకి వార్సైల్సువల్ల కలిగిననష్టం ఇది—౨౫ వేల చదరపుమైళ్లకుపైగా రాజ్యం పరాధీనంకావడం; ౬౦ లక్షల మంది దేశీయులు విదేశాల పరిపాలనలోకిపోవడం; స్వంతపరిశ్రమలకు ఎంతో ఉపకరమైన ఖనిజసంపత్తిలో అధికభాగం చెయ్యిజారిపోవడం! తనకున్న ముడి ఇనుములో నూటికి దాదాపు ౬౫ వంతుల్ని, బొగ్గులో ౪౫ వంతుల్ని, జింకులో ౭౨ వంతుల్ని, సీసంలో ౫౭ వంతుల్ని, పారిశ్రామికసాధనలలో ౧౦ వంతుల్ని, పంటలో ౧౫ వంతుల్ని జర్మనీ గెలిచినవిజేతలకు అప్పజెప్పవలసివచ్చింది!

పోతే, సామ్రాజ్యానికి సంబంధించినంతవరకు జర్మనీపొందిన నష్టంఇది:—దాదాపు పదిలక్షల చదరపుమైళ్ల సామ్రాజ్యాన్ని, అందులో నివసిస్తున్న ఒకకోటి ఇరవైలక్షల జనాన్ని పోగొట్టుకోవడం! ఇంతపెద్ద సామ్రాజ్యం పోయినప్పుడు ఆర్థికంగా ఎంతకష్టం కలుగుతుందో వేరే చెప్పడం దేనికి?

ఫ్రాన్సుకోరదలచుకున్న తక్కినషరతులన్నీ ఈరీతిగా సిద్ధించినా, ఒక్కటిమాత్రం కొరతగా వుండిపోయింది. అది ఏమిటంటే,—తిరిగి యెప్పుడో



లాయడుజార్జి

వొకసారి జర్మనీ తనమీద హఠాత్తుగా విరుచుకుపడకుండా సరిహద్దులో కొంతఅడ్డుగా ఒక స్వతంత్ర

రాజ్యంగాని, వివిధప్రభుత్వాల అజమాయిషీక్రింద కనీసం వొకపరగణా గాని వుండటం! అయితే ఈ పరతు అయినా నెగ్గకపోవడానికి కారణం ఫ్రాన్సు ప్రయత్నం



ప్రెసిడెంట్ విల్సన్

లోపంమాత్రం కాదు. ఇంకా యుద్ధం జరుగుతూవుండగానే ౧౯౧౭ లో ఫ్రాన్సు రుష్యాతో రహస్యంగా



హిట్లర్

ఒకసంధిచేసుకుని, ఆసంధిలో ఫ్రాన్సు-జర్మనీలు సరిహద్దులో ఒక స్వతంత్రరాజ్యాన్ని సృష్టించాలనీ, ఆరాజ్యాన్ని జర్మనీపునఃవిజృంభణభయం వున్నంత వరకు ఫ్రెంచిసేనలు కాపాడుతూవుండాలనీ ఒక షరతు పెట్టింది. ఆతర్వాత వార్సెల్సు సంధిసంప్రతింపులు జరుగుతూవుండగా ఫ్రాన్సుతరఫున క్లెమెన్సూ ఈసమస్యనుగురించి చాలా పట్టుపట్టాడు. యుద్ధంలో తమవోటమిని, అంతకన్నా అవమానకరమైన వార్సెల్సు సంధిని జర్మనీ ఒకపట్టాన మరిచిపోలేదనీ, అందుచేత ఫ్రెంచిరాజ్యక్షేమాన్ని కాంక్షించి జర్మనీపడమటిసరి



ముసోలినీ

హద్దును రైన్‌నదిగా నిర్ణయించాలనీ, రైన్‌నదికి యెడమ పక్కనవున్న జర్మనీరాజ్యాన్ని ...... అంటే, ఆల్స

మొదలు హాలెండ్‌వరకువున్న పదివేల చదరపుమైళ్ల రాజ్యాన్ని......జర్మనీనుంచి చీలదీసి, స్వతంత్రరాజ్యంగా చెయ్యాలనీ క్లెమెన్సూవాదం. అయితే, ఇందుకు వార్సేలులో బ్రిటన్‌ప్రతినిధి లాయిడ్‌జార్జిగాని, అమెరికాప్రతినిధి ప్రెసిడెంట్ విల్సన్‌గాని అంగీకరించలేదు.

క్లెమెన్సూప్రతిపాదనను నిరాకరిస్తూ లాయిడ్‌జార్జి చేసిన వాదం ఇది. ఆల్సే, లారైన్‌పరగణాలను గురించే కలకాలంగా ఫ్రాన్సు జర్మనీలమధ్య కక్షలు పెరిగివున్నాయి. ఆకక్షలని చంపుకోకుండా, ఇప్పుడు రైన్‌లాన్‌డును విడదీసి కొత్తకలహకారణాన్ని మరో దాన్ని కల్పించుకోవడం తెలివితక్కువపని! పైగా, బెల్జియంవారికి ఒక పురాతనమైన చరిత్ర, ఒక భాష, ఒక విజ్ఞానం,— ఇవి అన్నీ వుండబట్టి అదివొక ప్రత్యేకరాజ్యంగా మనగలుగుతున్నది. రైన్‌లాన్‌డుకు ఇవిఏవీ లేవు. దానిచరిత్ర జర్మనీచరిత్ర! దానిభాష జర్మనీభాష. దానివిజ్ఞానం జర్మనీవిజ్ఞానం! ఈకారణాలవల్ల రైన్‌లాన్‌డును ప్రత్యేకంగా చెయ్యడంపొసగదు. పైగా, జర్మనీ యుద్ధంలో పూర్తిగా చితికిపోయింది. కనీసం యాభై, అరవై సంవత్సరాలవరకు తలయెత్తేఅవకాశం లేదు. ఇలాంటి సందర్భంలో ఫ్రాన్సు అనవసరంగా గాభరాపడటం గాని తనకు ఆరక్షణలేదనీ, ఈరక్షణలేదనీ గొడవపడటంగాని తగనిపని.

లాయిడ్‌జార్జిచేసిన ఈవాదన ఏమీ పనిచెయ్యలేదు. దాన్ని పూర్తిగా విన్నమీదటకూడా "పోనీ, రైన్‌లాన్‌డ్‌ను స్వతంత్రరాజ్యంగా చెయ్యలేకపోతే కనీసం దానిలో వివిధరాజ్యాలవారి సైన్యాలసైనా కాపుంచండి" అని క్లెమెన్సూ పట్టుపట్టాడు. ఇంతే కాకుండా తమసైన్యాలను రైన్‌లాండ్‌లో వుంచడం బాదరబంది అని బ్రిటన్ సంకోచించ నక్కరలేదన్నాడు. బ్రిటన్ ఒక్కయూనియన్‌జాక్‌ను అక్కడ వుంచితే చాలన్నాడు. కాపుదల బాధ్యత అంతా స్వయంగా భరించడానికి ఫ్రాన్సు సిద్ధం అన్నాడు. అయినా ఇందుకుకూడా లాయిడ్‌జార్జి వొప్పుకలేదు. ప్రెసిడెంట్‌విల్సన్ ఈ విషయంలో లాయిడ్‌జార్జితో పూర్తిగా ఏకీభవించాడు. ఇది క్లెమెన్సూకు చాలా అన్యాయంగా తోచింది. "ఈసమస్యను మాకు అనుకూలంగా పరిష్కరించితేగాని వీలులే" దని ఆయన సంధిసంప్రదింపులను కొన్నివారాలపాటు సాగనీయలేదు. చివరకు మార్గాంతరం కనబడక లాయిడ్‌జార్జి, ప్రెసిడెంట్ విల్సనులు జర్మనీ అకారణంగా యుద్ధానికి దిగితే, తమదేశాలు ఫ్రాన్సుకు అండగా నిలుస్తాయని హామీ యిచ్చారు. ఈ హామీ చూచుకుని గుండె దిటవుపరుచుకున్నమీదటగాని, క్లెమెన్సూ తిరిగి సంధి సంప్రదింపులను సాగనీయలేదు.

కేవలం ఈ హామీయే కాకుండా, ఫ్రాన్సు భయాన్ని తొలగించడానికిగాను మరోజాగ్రత్తకూడా చేయబడింది. అదేమిటంటే, జర్మనీ సంధిషరతుల్ని సవ్యంగా పాలించడానికి గ్యారంటీగా రైన్‌నది ఎడమ గట్టువైపునవున్న జర్మన్ రాజ్యాన్ని అంతా ఫ్రాన్సు, బ్రిటన్ వగైరా మిత్రమండలివారి సైన్యాలు పదిహేను సంవత్సరాలపాటు ఆక్రమించుకోవడం! ఇంతేకాదు! మిత్రమండలివారు తాత్కాలికంగా ఆక్రమించే ఈ భాగంలోనూ, రైన్‌నది కుడిగట్టున మరో ౫౦ కిలోమీటర్ల వరకూనూ (షుమారు ౩౫ మైళ్లవరకూ అని చెప్పవచ్చునేమో!) జర్మనీ సైనిక సంబంధమైన బందోబస్తు లేకుండా వుంచాలని ఒకషరతుకూడా. అంటే, ఈ మేరలో జర్మనీ ఎన్నడూ సైన్యాలను సమకూర్చకూడదు; దుర్గాలను కట్టకూడదు. అంతకు పూర్వం నుంచీవున్న దుర్గాలు వగైరాలకు మరమ్మతు చెయ్యకూడదు; యుద్ధసాధనాలను చేర్చరాదు. ఈ షరతును ఇంగ్లీషులో అయితే "డిమిలిటరైజేషన్" అంటారు. ఈ "డిమిలిటరైజేషన్" షరతు ఫ్రాన్సుకు చాలా అనుకూలం! ఎలాగంటే, ఈ షరతు ప్రకారం జర్మన్ సైన్యాలు ఫ్రెంచి సరిహద్దుకు ఎప్పుడూ దాదాపు వందమైళ్లదూరంలో వుంటాయి. అయితే ఫ్రెంచి సైన్యాలు మాత్రం సరిగ్గా జర్మనీ సరిహద్దుమీదనే మకాంవేసి వుంటాయి. అంచేత......ఈ యేర్పాటు అమలులో వున్నంతవరకు...... ఫ్రెంచిసైన్యాలు

చరచరా జర్మనీ సరిహద్దులోకి జొరబడ్డానికి వున్నంత వీలు, జర్మన్ సైన్యాలు ఫ్రెంచి సరిహద్దులలోనికి రావడానికి వుండదు!

వార్సెల్సుసంధి ఈవిధంగా ఫ్రాన్సు కోర్కెలన్నింటినీ చక్కగా తీర్చింది. అయితే, ఆసంధిపత్రంమీద సంతకాలైన కొద్దిరోజులకే బ్రిటన్, అమెరికాలు......జర్మనీ అకారణంగా యుద్ధానికి కలపడితే, తాము ఫ్రాన్సుకు సహాయంగా నిలుస్తామని...ఇచ్చిన హామీ వుత్తిదయిపోయింది. ప్రపంచాన్ని వుద్ధరిస్తాననీ మానవకల్యాణాన్ని సమకూరుస్తాననీ పెద్దపెద్ద కబుర్లుపోయి, చివరకు లాయడ్‌జార్జి, క్లెమెన్సూల టోపీలో పడి, అతిదుర్మార్గమైన వార్సెల్సుసంధిమీద సంతకం పెట్టివచ్చినందుకుగాను ప్రెసిడెంట్ విల్సన్‌మీద కినిసి అమెరికా ఇకముందు తనకు యూరప్‌రాజకీయాలతోగాని, నానాజాతి సమితితోగాని సంబంధంలేదని చెప్పివేసింది. దానితో అమెరికా ఫ్రాన్సుకిచ్చిన హామీ గంగలో కలిసిపోయింది. "అమెరికాహామీవుత్తిదయితే మాహామీకూడా వుత్తిదేసుమా!" అని బ్రిటన్‌కూడా చల్లగా సర్దుకుంది.

బ్రిటన్, అమెరికాలు ఇచ్చిన హామీ వుత్తిదయ్యేసరికి, ఫ్రాన్సుకు తిరిగి ఆందోళన హెచ్చింది. అంచేత ఎలాగైనాసరే జర్మనీని శాశ్వతంగా శిథిలావస్థలో వుంచాలనే వుద్దేశంతో అది నానా ఖంగాళీ చేసింది. సంధిషరతులప్రకారం జర్మనీ సరిగ్గా తనసైన్యాలను తగ్గించడంలేదని ముందు కొంత గొడవచేసింది. ఆతర్వాత యుద్ధనష్టపరిహారం వేళకు చెల్లుబడికాలేదని, రర్ ప్రాంతాన్ని ఆక్రమించుకుంది. మిత్రమండలివారి సైన్యాలు గ్యారంటీకోసం ఆక్రమించుకున్న రైన్‌లాన్‌డురాజ్యంలో ౧/౩ వంతున అయిదేళ్లతర్వాతనూ, మరో ౧/౩ వంతును పదేళ్లతర్వాతనూ, మిగతాభాగాన్ని పదిహేనేళ్లు పూర్తి కాగానేనూ ఖాళీచెయ్యాలని సంధిషరతువున్నా, ఏదోసాకుచెప్పి మొదటి అయిదేళ్లు కాగానే ఖాళీకావలసిన భాగాన్ని ఖాళీకానిచ్చింది కాదు. అసలు రైన్‌లాన్‌డును శాశ్వతంగా జర్మనీనుంచి చీలదీయాలనే దురుద్దేశంతో రైన్ ప్రజలలో స్వాతంత్ర్యోద్యమాన్ని లేవనెత్తిందికూడా! జర్మనీకి విరుద్ధంగా పోలెండ్‌తోనూ, జెకోస్లోవాకియాతోనూ సంఘుల్ని చేసుకుంది. జర్మనీవారి నాణెం (మార్కు) విలువ పూర్తిగాపడిపోయి, వారికరెన్సీపద్ధతి పూర్తిగా మంటగలవడానికి కారణంఅయ్యింది. ఇలాగే మరెన్నోవిధాల ఫ్రాన్సు చాలాదురాగతంగా ప్రవర్తించింది.

అయితే తప్పు కేవలం ఫ్రాన్సుదేఅని ఖండితంగా చెప్పడానికైనా వీలులేదు. జర్మనీకూడా వార్సెల్సు అవమానాన్ని దిగమింగలేక, కొన్నికొన్ని సందర్భాలలో సంధి షరతుల్ని సక్రమంగా పాటించకుండా మొరాయించింది. తప్పు యెవరిదైతేనేమిగాని, ౧౯౨౪ నాటికి పరిస్థితులు యెలా విషమించాయంటే- ఏదోవిధంగా తమలోతాము రాజీ పడకపోతే తామిద్దరంకూడా నాశనమౌతామని ఫ్రాన్సు జర్మనీరాజ్యాలు గ్రహించక తప్పిందికాదు.

మొట్టమొదటిలో ఈ అవసరాన్ని గుర్తించినవాడు జర్మనీ విదేశాంగమంత్రి అయిన గష్టేవ్ స్ట్రెస్‌మన్! జర్మనీనిచూచి భయపడుతూ ఫ్రాన్సు, ఫ్రాన్సుమీద కడుపుమంటతో జర్మనీ- ఈ రెండుదేశాలు ఇలా కొట్లాడుతూవుంటే రెండింటికీ మూడుతుందని తన దూరదృష్టికొద్దీ గ్రహించి ఈ జర్మన్ రాజకీయవేత్త ౧౯౨౪లో యూరప్ శాంతిభద్రతలకుగాను కొన్ని వొడంబడికసూచనలు చేశాడు. రైన్‌లాన్‌డు స్థితిగతులలో ప్రధానంగా గాని, ఆనుషంగికంగా గాని సంబంధంవున్న రాజ్యాలవారు......ముఖ్యంగా బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ రాజ్యాలవారు ... వొకరిపైకి వొకరు కయ్యానికి దిగమని మనస్ఫూర్తిగా వొకయేర్పాటుకు రావాలనీ, రైన్‌లాన్‌డు హక్కుభుక్తాలను గురించి వార్సెల్సు సంధి షరతులకు భిన్నమైన కొత్తయేర్పాటు ఏదీ జరగగూడదనీ, జర్మనీ తనమట్టుకు తాను వార్సెల్సు సంధి కోరిన రీతిగా రైన్‌లాన్‌డ్‌లో సైనికసంబంధమైన బందోబస్తులు ఏవీచెయ్యాదనీ, ఇంతేకాకుండా ఆల్సే-లారైన్ పరగణాలవిషయంలో జర్మనీ పేచీపెట్టదనీ,

పోతే ఫ్రాన్సు తనసరిహద్దును రైన్‌నది గట్టువరకు జరుపుకోవాలనే ఆశను వదులుకోవాలనీ, రూర్ ప్రాంతాన్ని ఏసందర్భంలోనూ తిరిగి ఆక్రమించుకోనని ఫ్రాన్సు గ్యారంటీ చెయ్యాలనీ — స్ట్రెస్‌మన్ చేసిన సూచనలు ఇవి.

ఈసూచనలను గురించి బర్లిన్ ప్యారిస్, నగరాల మధ్యనూ, బర్లిన్, లండన్ నగరాలమధ్యనూ కొన్ని మాసాలపాటు వుత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. మొదటిలో అయితే ఈసూచనలు తక్కిన రాజ్యాలవారి ఆమోదాన్ని పొందుతాయనిగాని, ఇవి ఫలప్రదం అవుతాయని గాని అంతగా ఆశకనబడలేదు. అయితే, ఇంతో అంతో దూరదృష్టి గల రాజకీయనేత్త, బ్రయండ్, అప్పటిలో ఫ్రెంచిప్రధానామాత్యుడుగా వుండటం గొప్ప అదృష్టమయ్యింది. ఈయన స్ట్రెస్‌మన్ సూచనలనుచూచి మొదటిలో కొంచెం సంకోచించినా, త్వరలోనే వాటి అంతరార్థాన్ని, వాటి ప్రయోజనాన్ని గ్రహించి, జర్మనీతో ఒడంబడిక చేసుకోడానికి తమ అభ్యంతరం ఏమీ లేదని తెలియజేశాడు. అయితే, జర్మనీకూడా ఫ్రాన్సుకోర్కెలను కొన్నింటిని మన్నించాలన్నాడు. జర్మనీ నానాజాతిసమితిలో చేరడం, బెల్జియంకూడా ఒడంబడికకు పార్టీకావడం, నానాజాతిసమితినియమావళిప్రకారం ఫ్రాన్సు ఏదైనా చర్యజరుపవలసివస్తే అందుకుగాని, పోలెండ్, జెకోస్లోవాకియా రాజ్యాలకు ఫ్రాన్సు సహాయంవెళ్లవలసివస్తే అందుకుగాని కొత్తఒడంబడిక రాకుండావుండటం,— ఇవిముఖ్యమైనవి ఫ్రాన్సుతరఫున బ్రయండ్ కోరిన కోర్కెలు. జర్మనీ వార్సైల్సుసంధిషరతుల్ని సరిగ్గా పాటించకుండా మొరాయిస్తున్నదని అనుమానంవున్నదనీ, మళ్లీ కొంచెంశక్తి సంపాదించుకోగానే అది తనమీద కసితీర్చుకుంటుందనీ, భయంవున్న రోజుల్లో ఫ్రాన్సు పోలెండ్, జెకోస్లోవాకియాలతో విడివిడిగా రెండు ఒడంబడికలను చేసుకుంది. ఈ ఒడంబడికల అంతరార్థం యేమిటంటే, ఈ మూడురాజ్యాలలో ఏవొక్కదాన్ని అయినాసరే, తక్కినవి రెండూ దానికి సహాయంవెళ్లడం! పూర్వమే చేసుకున్న ఈఒడంబడికలను తోసిరాజుచేసి ఇప్పుడు తాము విడిగా జర్మనీతో రాజీపడితే అది సబబుగా వుండదుగనక తాము కొత్తగా చేసుకోబోతున్న ఒడంబడికకూ, పూర్వమేజరిగిన ఈరెండింటికీ పరస్పరవైరుధ్యంలేకుండా ఏదో ముడిపెట్టాలనికూడా బ్రయండ్ మరొకషరతు పెట్టాడు.

ఫ్రాన్సు కోర్కెలను మన్నించడానికి స్ట్రెస్‌మన్ అంగీకారాన్ని తెలియజేసిన మీదట ౧౯౨౫ అక్టోబర్ ౫వ తేదీని జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటన్, ఇటలీ, బెల్జియం, పోలెండ్, జెకోస్లోవాకియా రాజ్యాల ప్రతినిధులు స్విట్జర్లాన్‌డ్‌లోని లొకార్నో అనే చిన్నపట్టణంలో సమావేశం అయ్యారు. ఈ సమావేశంలో జర్మనీకి తక్కిన రాజ్యాలతోటి సమానమైన ప్రతిపత్తి ఇచ్చారు. సరైనమర్యాదను చేశారు. జర్మనీకిగల సాధకబాధకాలను ఎంతో సానుభూతితో విన్నారుకూడా! వార్సైల్సుసంధివాటినుంచి ఆ నాటివరకు జర్మనీ తక్కినరాజ్యాలవల్ల అటువంటిమన్ననను పొందలేదు. అందుచేత జర్మన్ ప్రతినిధులుసయితం మిగతావారి కష్టసుఖాలను వుదారబుద్ధితో ఆలోచించారు. ఉభయత్రా జరిగిన ఈ హృదయపరివర్తనవల్ల లొకార్నో సమావేశం ఏ పేచీలేకుండా సాగి, అతిశీఘ్రంగా అక్టోబర్ ౧౬వ తేదీని జయప్రదంగా ముగిసింది. జర్మనీ, ఫ్రాన్సు, బెల్జియం, బ్రిటన్, ఇటలీరాజ్యాలమధ్య ఒకటీ, జర్మనీ మధ్యనూ ఫ్రాన్సు, బెల్జియం, పోలెండ్, జెకోస్లోవాకియాల మధ్యనూ విడివిడిగా నాలుగూ, ఫ్రాన్సుమధ్యనూ, పోలెండ్, జెకోస్లోవాకియాల మధ్యనూ విడివిడిగా మరి రెండూ-మొత్తం ఏడు ఒడంబడికలు లొకార్నో సమావేశఫలితంగా జరిగాయి.

లొకార్నోలో జరిగిన ఏడుఒడంబడికలలోనూ జర్మనీ, బెల్జియం, ఫ్రాన్సు, బ్రిటన్, ఇటలీ రాజ్యాల మధ్య జరిగిన మొదటిఒడంబడిక ఒక్కటే చాలా ప్రధానమైనది. ఈ ఒడంబడికలోని మొట్టమొదటి షరతుప్రకారం పై అయిదురాజ్యాలు తమతమ స్వంతబాధ్యతమీదనూ, మొత్తం అందరిబాధ్యతమీదనూ

త్రిలో పూర్వభాగం ముగిస్తే, ౧౯౩౫ మే ౨౧ వ తేదీతో ఉత్తరభాగం ప్రారంభమైనదని చెప్పాలి. ఎందుచేతనంటే—ఆనాడు రీచ్‌స్టాగ్ (జర్మన్ పార్లమెంటు) లో ప్రసంగిస్తూ జర్మన్ డిక్టేటర్ హిట్లర్ ఇలా అన్నాడు—

"అనువుగాని ఏసంధినీ చేసుకోడానికి మేము అంగీకరించము. అయితే, మేము అధికారానికి రాకపూర్వం జరిగిన ప్రతిసంధినీ, అది వాలంటరీగా జరిగినదయితే తు చ తప్పకుండా పాటిస్తాము. ముఖ్యంగా లొకార్నో ఒడంబడిక విషయంలో తక్కినరాజ్యాలవారు సబబుతప్పకుండా వున్నంతవరకు మేముకూడా సజావుగా నడుచుకుంటాము. అయితే దాని షరతులలో కొన్ని ముఖ్యంగా రైన్‌లాండులో సైనికసంబంధమైన బందోబస్తు లేకుండా వుంచాలనే షరతు, కనివిని యెరగనంతటి కఠినమైనది. రైన్‌కు అటుపైపున ఆగోజాకారోజా అధికంగా సైన్యాలు చేరుతూవుంటే మమ్మల్ని చూస్తూ వూరుకోమనడం అన్యాయం!"

ఎప్పుడయితే "ఇది కని విని యెరగని షరతు సుమా" అనీ, "మమ్మల్ని చూస్తూవూరుకోమనడం అన్యాయం సుమా" అనీ హిట్లర్ అన్నాడో, అప్పుడే రైన్‌లాన్డ్ విషయంలో అతగాడు ఏదో అఘాయిత్యం తలపెట్టినాడని ప్రపంచం అనుకుంది. ఈ అనుమానం ఈసంవత్సరం మార్చి ౭ వ తేదీనాడు ఖాయపడిపోయింది!

మార్చి ౭ వ తేదీని హిట్లర్ సూత్రై, అరవైవేల మంది సైనికులను రైన్‌లాన్డులోకి పంపించి, ఆతరాత 'ఇలాపంపించాను సుమా' అంటూ ఒకప్రకటన చేశాడు. హిట్లర్ మామూలుగా వేసేయెత్తులలో ఇదొకటి! చెయ్యదలుచుకున్న పనిని దేనినో, ముందు చడీచప్పుడు లేకుండా చెయ్యడం; ఆతర్వాత ఇలాచేశానంటూ ప్రకటన! వార్సేల్సుసంధిని భిన్నంగా దేశంచేత ముందు ఆయ్యోధారణ చేయించాడు; ఆతర్వాత మే మిలా చెయ్యక తప్పిందికాదని చెప్పాడు! ఒకనాడు తెల్లవారేలోగా రెండు మూడు వందలమందిని చేశాడు; విప్లవభయంవల్ల గత్యంతరం లేకపోయిందని మర్నాడు ప్రకటించాడు! రైన్‌లాన్డ్ సందర్భంలో కూడా తిరిగీ ఇదేవరస!

రైన్‌లాండుకు సైన్యాలను తరలించడానికిగల కారణాలనూ, ఈ చిక్కును విడదీయాలంటే అందుకుగల షరతులనూ హిట్లర్ వుదాహరించాడు. అవి ఇవీ—

ఫ్రాన్సు రుష్యాలు కొత్తగా ఒడంబడికను చేసుకున్నాయిగనుక జర్మనీ లొకార్నోను తృణీకరించక తప్పిందికాదు.

రైన్‌లాండులో సైనిక సంబంధమైన బందోబస్తుల్ని చెయ్యకూడదంటూ వున్న ఒడంబడిక షరతును ఇకమీదట పాటించడం జర్మనీక్షేమానికి భంగకరం.

ఫ్రాన్సు, బెల్జియం రాజ్యాలుకూడా తమ సరిహద్దులలో కొంతభాగాన్ని ఏ బందోబస్తులేకుండా విడిచిపెడితే, జర్మనీకూడా అలా చెయ్యడానికి అభ్యంతరం లేదు.

తనకు పశ్చిమంగావున్న రాజ్యాలతో పాతిక సంవత్సరాలవరకు పరస్పరం పేచీలేకుండా వుండే షరతుమీద ఒడంబడికకు రావడానికి జర్మనీ సంసిద్ధంగా వుంది. అయితే, బ్రిటన్-ఇటలీ రాజ్యాలు ఇటువంటి ఒడంబడికకు గ్యారంటర్సుగా వుండాలి.

పైఒడంబడికలో 'హాలెండ్' కూడా చేరితే జర్మనీకి వ౦ంత సంతోషం.

పశ్చిమదిశనున్న రాజ్యాలతో వైమానికదళాన్ని గురించిన ఒడంబడికకు రావడానికి కూడా జర్మనీ తయ్యార్. ఇక తూర్పుదిక్కున వున్న రాజ్యాలతో సైతా పరస్పరం పేచీరాకుండావుండేట్లా ఒడంబడికను చేసుకోడానికి జర్మనీ సిద్ధం!

పైషరతులన్నీ అంగీకారమైతే, సాధ్యమైనంత త్వరలో సకలరాజ్యాలసమస్య ఖాయం బోరాల ద్వారా జర్మనీకి అనుకూలంగా పరిష్కరింపబడాలి.

హిట్లర్ విసిరిన ఈబాంబు యూరప్‌ను...... యూరప్‌నేకాదు, సమస్త ప్రపంచాన్నీ......అలజడి పెట్టింది! ఇక ప్రత్యేకంగా ఫ్రాన్సుపడిన ఆందోళన ఎంతో చెప్పడానికి వీలేలేదు. హిట్లర్ ప్రకటన జరిగినతర్వాత ఒక్కక్షణమైనా ఆలసించకుండా అది ప్యారిస్‌లోని బ్రిటన్, బెల్జియం రాయబారులలో "ఇక మన కర్తవ్యం యేమిటి"? అంటూ సంప్రదింపులను ఆరంభించింది. ఈసంప్రదింపుల ఫలితంగా లీగ్ కౌన్సిల్ (బ్రిటన్ ఆహ్వానం మీద) లండన్‌లో సమావేశం అయ్యింది. ఆసమావేశంతోపాటు లొకార్నోలో వొడంబడికలను చేసుకున్న రాజ్యాలప్రతినిధులు (జర్మనీ కూడా కలుపుకుని) వేరే సమకూడారు.

లండన్ లీగ్ కౌన్సిల్‌లో జర్మనీ లొకార్నో వొడంబడికలను తృణీకరించినదనే తీర్మానింపబడింది. పోతే, లొకార్నో సంతకపుదారుల సమావేశంలో భావికర్తవ్యాన్ని గురించి కొన్ని సూచనలు చేయబడ్డాయి. ఆ సూచనలు ఇవి:—

జర్మనీ లొకార్నోను ధిక్కరించింది గనుక, తక్కిన సంతకపుదారులు పరస్పరసహాయంకోసం ఏమి చేయవలసివుంటుందో నిర్ణయించడానికిగాను తమ అందరి సైనికాధ్యక్షులమధ్య సంప్రదింపులను జరపాలి.

ఫ్రాన్సు రుష్యాలమధ్య జరిగిన వొడంబడిక విషయంలో తనకున్న అభ్యంతరాలను హేగ్ కోర్టువారి ముందు పెట్టి, వారితీర్పును జర్మనీ శిరసావహించాలి.

హేగ్ కోర్టులో విచారణ జరుగుతున్నకాలంలో రైన్‌లాండులోని సైన్యాలసంఖ్య పెరగకుండానూ, అక్కడిదుర్గాలు వగైరాలు మరమ్మతుకాకుండానూ యథాతథంగా వుండడానికిగాను జరగతగిన జాగ్రత్తలను చెయ్యాలి.

జర్మన్‌రాజ్యంలో పడమటి సరిహద్దునుంచి ౨౦ కిలోమీటర్ల వరకు చిన్ని అంతర్జాతీయ సైనికదళాన్ని కాపుంచాలి.

ఈ యేర్పాటులన్నింటినీ అజమాయిషీ చెయ్యడానికి ఒక అంతర్జాతీయ సంఘాన్ని నియమించాలి.

ఈపై సూచనలకు అన్నింటికీ హిట్లర్ అంగీకరిస్తేనేగాని అతనితో రాయబారాలు జరపడానికి వీలులేదు.

లొకార్నో సంతకపుదారుల సమావేశంలో జరిగిన పైతీర్మానాలను సావకాశంగా ఆలోచించడానికంటూ లీగ్ కౌన్సిల్ అప్పటికిక సమావేశాన్ని చాలించింది. ఆతర్వాత హిట్లర్ లండన్ సమావేశాలవారు చేసిన సూచనలకు ప్రతిగా తాను ఏవో కొత్తగా కొన్ని సూచనలను చేశాడు. అందుమీదట బ్రిటన్ హిట్లర్‌కు జర్మనీ ఆశయాలను గురించీ యిటీవలి ప్రవర్తనను గురించీ ... స్పష్టమైన జవాబులు కావాలంటూ ... కొన్ని ప్రశ్నల్ని వేసింది. ఈ ప్రశ్నలను దీర్ఘంగా ఆలోచించి, తీరుబడిగా జవాబు చెబుతానని హిట్లర్ అన్నాడు అంతే! ఆనాటినుంచి ఈనాటివరకు, రెండుమూడు నెలలు తిరిగివచ్చినా, అతగాడి ఆలోచన ఇంకా తెగనూలేదు, తీరుబడి చిక్కనూలేదు!

ఇదీ రైన్‌లాండ్ సమస్య ఉత్త్ర ంలోని ఘట్టాలు టూకీగా. ఈ సమస్య ఎలా పర్యవసించనున్నదో చెప్పడం అసాధ్యమైన పని! ఇప్పటిలో జర్మనీ యుద్ధానికి సిద్ధంగాలేదనీ, బ్రిటన్-ఫ్రాన్సులను రెండింటినికూడా కాదని జయించుకురావడం కష్టమనీ హిట్లరు తీర్మానిస్తే ఏదోవిధంగా ఈ విషయంలో రాజీ పొసగవచ్చును. అలాకాకపోతే ఇదే రానున్న మహాసంగ్రామానికి దోహదం కావచ్చును.

ఈసమస్య ఎలాపర్యవసించనున్నదో చెప్పడం సాధ్యంకాని పని అయినా ఈసందర్భంలో తప్పొప్పులు యెవరివో నిర్ణయించటం మాత్రం తేలికే. అంచేత, ఈవ్యాసాన్ని ముగించడానికి ముందు ఆవిషయాన్ని కొంత చర్చిస్తాను.

లొకార్నో వొడంబడికను భిన్నంగా వెళ్లి రైన్‌లాన్డుకు సైన్యాలను తరలించడానికి ఫ్రాన్సు రుష్యాల మధ్య జరిగిన వొడంబడిక ప్రధానకారణమని ఘోషిస్తున్నాడు. అంచేత, ఫ్రాన్సు, రుష్యాల మధ్య జరిగిన ఈవొడంబడిక నిజంగా దుర్మార్గమైనదా అనే విషయాన్ని ముందుగా ఆలోచించాలి.

ఈవొడంబడికలోని ప్రధానమైన షరతులు ఇవి.—

ఫ్రాన్సు, రుష్యాల రెంటింటిలో దేనికైనా ఏదైనా యూరపియన్ రాజ్యంవల్ల భయకారణం వుంటే తమ క్షేమంకోసం నానాజాతిసమితి ప్రణాళికలోని పదియవ నియమాన్ని (Article X of the League Covenant) అమలుజరపడానికి ఏయేమి పద్ధతులు అవలంబించవలసివుంటుందో నిర్ణయించడానికిగాను వుభయులు సంప్రతించుకోవాలి.

ఈరెండురాజ్యాలలో ఏవొక్కటి అయినా అకారణదౌర్జన్యానికి గురిఅయితే, రెండోరాజ్యం వెంటనే దాని సహాయానికి రావాలి.

వొడంబడికలోని ఏషరతుకూడా నానాజాతి సమితి అధికార్యాన్ని సంకుచితపరచకూడదు. ప్రపంచ శాంతికోసం సమితి అవలంబించదలచుకునే మార్గాలకు అడ్డుకాకూడదు. సమితివిధించే బాధ్యతల్ని నిర్వర్తించడంలో ప్రతిబంధకం కాగూడదు.

ఈవొడంబడికను సమితికార్యాలయంవారు రిజిస్టర్ చెయ్యాలి. ఇది అయిదుసంవత్సరాలపాటు అమలులో వుంటుంది. నాలుగేళ్లు కాగానే ఈరెండు రాజ్యాలలో ఏవొక్కటైనా గడువుమించి వొడంబడిక అమలులో వుండవలసిన అగత్యం తనకు కనబడటం లేదని అభిప్రాయపడితే, అయిదు సంవత్సరాలూ కాగానే వొడంబడిక రద్దుఅవుతుంది. ఇటువంటిది జరగనిపక్షాన గడువు దాటినతర్వాతకూడా అది రద్దు కాదు. అయితే, ఆతర్వాత ఒకసంవత్సరం నోటీసు ఇచ్చి, ఏపక్షం అయినా సరే దాన్ని (కావాలంటే) రద్దుపర్చుకోవచ్చును.

ఈ ఫ్రాన్సు, రుష్యాల వొడంబడికషరతులకు, లొకార్నో వొడంబడికల షరతులకు ఏమంత భేదం కనబడదు. ఏదైనా కొంచెంభేదంఅంటూ వుంటే, అది ఇది:— లొకార్నో వొడంబడికలలో అకారణమైన దౌర్జన్యం (Unprovoked aggression) జరిగిందా, లేదా? అనేదాన్ని నిర్ణయించడానికి లీగ్ కౌన్సిల్ కు అప్పీలు చెయ్యాలని ఒకషరతు వుంది. ఇక్కడ ఆషరతు కనబడదు. అయితే ఇది ఏమంత పెద్దభేదం కాదు. ఈవొడంబడిక (లొకార్నో వొడంబడికలవలెనే) లీగ్ అధికార్యానికి లోబడి జరిగినదే. లొకార్నోలో ఫ్రాన్సు, పోలెండ్ రాజ్యాలమధ్యనూ, ఫ్రాన్సు- జెకోస్లోవాకియా రాజ్యాలమధ్యనూ వొడంబడికలు జరగలేదూ? ఇప్పుడు ఫ్రాన్సు, రుష్యా మధ్య జరిగిన ఈవొడంబడిక కూడా సరిగా అలాంటిదే అని చెప్పవచ్చును. దీనిలో కొత్తగాని, వైపరీత్యంగాని ఏమీ కనబడదు. ఇలాంటిసందర్భంలో జర్మనీ ఈ వొడంబడికను సాకుగా పెట్టుకుని, లొకార్నోను తృణీకరించడను అక్రమం.

తమమీద కుట్రగా ఫ్రాన్సు-రుష్యాలు ఈ వొడంబడికను చేసుకున్నాయని హిట్లర్ వాదం! దాన్ని వాదం అనడంకంటె పిచ్చివాదం అనడమే ఎక్కువసబబు! ఫ్రాన్సుకు ఇప్పుడు దానికున్న సామ్రాజ్యం ఏమీ చెక్కుచెదరకుండా వుంటే అక్కడికదే పదివేలు. పోతే, రుష్యాకు తన సామ్యవాదసంస్థలతో కిందుమీదుకావడం తప్పితే దైత్రయాత్ర చెయ్యాలని సంకల్పంలేదు. ఈ రెండురాజ్యాలకు ఇప్పుడు కావలసింది శాంతిగాని, యుద్ధంకాదు. ఇప్పటిలో యుద్ధం వస్తే వాటికి నష్టమేగాని, లాభం ఏమాత్రమూ వుండదు. పోతే, యుద్ధంవల్ల ప్రస్తుతం ఎవరికైనా ఏమైనా లాభించడానికి అవకాశం వున్నదా అంటే, జర్మనీకే అని చెప్పాలి. అంచేత, ఫ్రాన్సు-రుష్యాలు వొడంబడికను చేసుకున్నాయంటే అది ఆత్మరక్షణ కోసరంగాని అన్యరాజ్యాపహరణం చెయ్యాలని కాదు; భయంచేతగాని దురాశకొద్దీ కాదు.

ఫ్రాన్సు, రుష్యాలు రెంటికీకూడా జర్మనీఅంటే భయం వున్నమాట నిజం. ఈ వ్యాసం మొదట్లో వివరించినట్లు ఫ్రాన్సుకున్న భయం చిరకాలంనుంచి వచ్చిందే కాని, కొత్తదికాదు. హిట్లర్ హయాంవల్ల ఈ భయం మరింత పెరిగింది. హిట్లర్ తనస్వీయచరిత్రలో జర్మనీకి ఫ్రాన్సుఒక్కటే పెద్దశత్రువనీ, దాన్ని చితకగొడితేనే గాని జర్మనీ పైకిరాలేదనీ స్పష్టంగా రాశాడు. ఎన్నో

వుపన్యాసాలలోకూడా అతడు ఫ్రాన్సుమీద నిప్పులు చెరిగాడు. అంచేత, జర్మనీ అంటే ఫ్రాన్సుకు విపరీతమైన బెదురువుండటము సహజం.

పోతే, రుష్యావిషయం ఇక చెప్పనక్కరనే లేదు. రుష్యా అవలంబిస్తున్న బోల్షివిజంసిద్ధాంతాలకూ, హిట్లర్ ప్రచారంచేస్తున్న 'నాజీజం' సిద్ధాంతాలకూ తూర్పు పడమరల భేదం వుంది. బోల్షివిజం సామ్రాజ్య తత్వాన్ని ఖండిస్తుంది; నాజీజం దాన్ని పూజిస్తుంది. బోల్షివిజం ప్రయివేటుఆస్తి అంటూ వుండరాదంటుంది; నాజీజం అదే సంఘానికి ప్రాతిపదిక అంటుంది. బోల్షివిజం విశ్వసౌభ్రాత్రం మహత్తరమైన ఆదర్శం అంటుంది. నాజీజం దేశభక్తిని మించినది లేదంటుంది. బోల్షివిజం స్త్రీలకు పురుషులతోపాటు సమానస్వాతంత్ర్యం ఇస్తుంది. నాజీజం స్త్రీ పురుషునిబానిసగా వుండాలంటుంది. బోల్షివిజం ప్రస్తుత ప్రపంచస్థితినిబట్టి యుద్ధం తప్పనిసరి అయినా మొత్తంమీద అది చాలా దారుణమైన మానవవ్యవస్థ అంటుంది; నాజీజం యుద్ధంఅంటూలేనిదే అసలు మానవాభ్యున్నతి లేదంటుంది. బోల్షివిజం మానవునికీ మానవునికీ మధ్యవున్న వుచ్చనీచాలనే కృత్రిమభేదాలను తొలగించాలంటుంది. నాజీజం ఈభేదాలు ప్రకృతిసిద్ధంగా వచ్చాయనీ, అవిలేనిదే సంఘం శిథిలం అవుతుందనీ వాదిస్తుంది. బోల్షివిజం నూత్న మానవసంఘసౌధాన్ని నిర్మించాలంటుంది. నాజీజం పాతదాని పునాదుల్నే బలపరచాలంటుంది. ఈ రెండింటికీ ఇంతవైరుధ్యం వుండటంవల్ల, వాటిమధ్య ఎలాగూ సంఘర్షణ లేకుండా పోదు. అయితే, రుష్యా తక్కిన యూరప్‌తో సంబంధంలేకుండా తనదారిని తాను పోవాలనీ, తనయింటిని తాను చక్కబెట్టుకోవాలనీ ఆశిస్తున్నది. కాని హిట్లర్ మాత్రం బోల్షివిజంను హతమార్చడం తనకు భగవద్దత్తమైన లోకవిధి అంటూ అహంకారపడుతున్నాడు. తన వుపన్యాసాలలో రుష్యా అంటేగాని, బోల్షివిజం అంటేగాని తనకున్న విరోధాన్ని కప్పిపుచ్చడానికి అతడు ఏనాడూ ప్రయత్నించలేదుకూడా. చివరకు మొన్నను రైన్‌లాండుకు సైన్యాలను తరలించినతర్వాత చేసిన ప్రకటనలో సయితం ఫ్రాన్సుతో కొత్తగా వొడంబడికను దేనినైనా చేసుకోడానికి తనకు అభ్యంతరం లేదని చెబుతూ రుష్యాపేరైనా తనచెవికి సోకరాదన్నాడు! ఇలాంటిసందర్భంలో శాంతిని అభిలషిస్తున్న రుష్యాకు జర్మనీ అంటే భయంవుండటం అబ్బురము కాదు.

హిట్లర్ రచనలు, ఉపన్యాసాలు, ప్రకటనలు మొదలైనవి వట్టి ఆర్భాటాలని చులాకనగా త్రోసివెయ్యడానికి ఏమాత్రం వీలులేదు కూడా. అతగాడు కార్యవాదిగాని, కోతలరాముడుకాదు. పట్టినపట్టును ఒకపట్టాన విడిచేరకం కాదు. తనపంతం నెగ్గడానికి ఎంతపాపానికైనా వెరవని ఘటం. ఇలాంటివాడి వచనాలను 'సీరియస్'గా యెంచకపోవడం తప్పు.

పైగా, రాజ్యాధికారాన్ని సంపాయించిన మరుక్షణంనుంచీ కూడా హిట్లర్ యుద్ధప్రయత్నాలను చేస్తున్నాడు. ఈ ప్రయత్నాలలో కొంతరహస్యం; కొంతబహిరంగం. రహస్యమైనా, బహిరంగమైనా ప్రయత్నాలుమాత్రం బ్రహ్మాండమైనవి! వార్‌ప్లేన్సు, టార్పెడోస్, డిస్ట్రాయర్సు, సబ్‌మెరీన్సు, టాంక్సు, హొవిట్జర్సు, ఇదీ అదీ అని లేకుండా, అన్ని మారణసాధనలనూ చేకూరుస్తున్నాడు. ప్రతియువకునికీ సైనికశిక్షణ ఇస్తున్నాడు. యుద్ధనిధిని సేకరిస్తున్నాడు. మరెంతో సన్నాహాన్ని చేస్తున్నాడు. "ఇది అంతా వార్సెల్సు సంధిషరతులకు భిన్నం సుమా!" అని మందలిస్తే, "అయితే కావచ్చును" అని నిర్లక్ష్యం చేశాడు. "ఇది పనికిరాదు" అని శాసిస్తే "అలానా!" అంటూ నానాజాతిసమితినుంచి అలిగి లేచిపోయాడు!!

ఈయుద్ధసన్నాహంఅంతా యెవరిమీదకు? అయితే ఫ్రాన్సుమీదకు కావాలి, లేదా రుష్యామీదకు కావాలి. ఈరెండురాజ్యాలను విడిచి మరెవ్వరిమీదకూ కావడానికి అవకాశం లేదు. ఇటలీఅంటే జర్మనీస్థితిలోనే వుంది. దాన్ని యెదిరించడంవల్ల హిట్లరుకు వచ్చే లాభం లేదు. ఇక, బ్రిటన్‌మీదకు అని అనుకోడానికైనా వీలులేదు. ఎందుచేతనంటే — క్రిందటిసారి బ్రిటన్‌తో పేచీపెట్టుకోవడంవల్లనే జర్మనీ వోడిపో

వలసివచ్చినదనీ, ఏసందర్భంలోనూ బ్రిటన్‌కు వ్యతిరేకంగా పోకుండా జర్మనీ తన పూర్వప్రతిష్ఠను సంపాయించుకోడానికి ప్రయత్నించాలనీ హిట్లర్ వుద్దేశం! ఈవుద్దేశాన్ని అతను తన స్వీయచరిత్రలో స్పష్టంగా ప్రకటించాడుకూడా! తన వుపన్యాసాలలోనయితేం అతగాడు అయినదానికీ కానిదానికీ బ్రిటన్‌ను హర్షిస్తూ వుంటాడు. అలాఅంటే బ్రిటన్ సంతోషిస్తుందని కాబోలు! అనాగరికులైన భారతీయుల్ని బ్రిటిషువారు పరిపాలించవలసిందేననీ, బ్రిటిష్‌వారి పరిపాలన లేనిదే భారతీయులు మనలేరనీ పదేపదే అంటున్నాడు. అంచేత అతని యుద్ధసన్నాహం బ్రిటన్‌మీదకే నని అనడానికి బొత్తిగా వీలులేదు! పోతే, ప్రాగ్దిశను ఆస్ట్రియామీదకు, పశ్చిమాన పోలెండ్‌మీదకు కాగూడదా? అంటే, అయితే కావచ్చుననే అనవలసివస్తుంది. కాని, ఈ రెండు రాజ్యాలుకూడా చాలా స్వల్పమైనవి. వీటిని హిట్లర్ ఆశిస్తున్నాడంటే కేవలం వాటితోనే సంతృప్తిపడదామని కాదు. వాటిని ఆక్రమించుకుని అందుమూలంగా చేకూరిన అధికబలంతో ఇటు ఫ్రాన్సునూ, అటు రుష్యానూ దెబ్బకొట్టవలెననే! అంచేత, జర్మనీ యుద్ధసన్నాహాలను చూచి ఫ్రాన్సు, రుష్యాలు భయపడటంగాని, పరస్పరక్షేమంకోసం వొడంబడికకు రావడంగాని నిష్పాక్షికదృష్టిలో తప్పు కానేరదు.

హిట్లరుకైనా ఫ్రాన్సు-రుష్యాల వొడంబడికలో తప్పుగా ఎన్నవలసింది ఏమీ లేదని తెలియకపోలేదు. అయితే, దాన్ని ఎదిరించడంలో అతని ముఖ్యమైన వుద్దేశం ఇది: ఫ్రాన్సు-రుష్యాలలో ఏవొక్కదాన్ని అయినా అయితే జర్మనీ జయప్రదంగా ఎదర్పగలదుగాని, ఆ రెండురాజ్యాలు ఏకమైతేమాత్రం ఏమీచెయ్యలేదు. ఈ విషయాన్ని హిట్లర్ తన స్వీయచరిత్రలో పేర్కొన్నాడు. "యూరప్‌లో (బ్రిటన్‌ను మినహాయించి) ఏరెండు రాజ్యాలశక్తీ జర్మనీశక్తికి అధికం కాగూడదు! అలాకాకుండా వుండేలా (అవసరమైతే, యుద్ధానికైనా దిగి) జర్మనీ జాగ్రత్తపడాలి. లేకపోతే, జర్మనీ యూరప్‌కు నాయకమణి కాలేదు." ఈ ధోరణిలో అతగాడు స్వీయచరిత్రలో స్పష్టంగా రాశాడు. ఈ అభిప్రాయం ప్రకారమే అతగాడు ఈనాడు ఫ్రాన్సు-రుష్యాల వొడంబడికను ప్రతిఘటిస్తున్నాడు కూడా!

రైన్‌లాండుకు సైన్యాలను తరలించినతర్వాత చేసిన ప్రకటనలో హిట్లర్ చాలా పెద్దయెత్తే యెత్తాడు. ప్రాగ్దిశను బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియం, ఇటలీరాజ్యాలతోనూ, పశ్చిమాన పోలెండ్, జెకోస్లోవాకియా, హాలెండ్, లిథూనియా, యూగోస్లోవియారాజ్యాలతోనూ, ఇంకా ఏవేవో ఇతరరాజ్యాలతోనూ తాము సంధిచేసుకోడానికి సిద్ధంగావున్నామని అంటూ, ఒక్క రుష్యానుమాత్రం పూర్తిగా వెలివేశాడు. ఇలా అన్ని రాజ్యాలతోనూ సంధిని చేసుకుని రద్దిమాపుకుంటే, వొంటరిగా మిగిలిపోయే రుష్యాను క్షేమంగా యెదిరించవచ్చుననే అతని ఆశ!

రుష్యాను యూరప్‌లో ఏకాకిని చేస్తే, దాన్ని తాము జయించగలమని హిట్లర్ ధైర్యంగావుండటానికి ముఖ్యమైన వొకకారణం లేకపోలేదు! రుష్యా తూర్పు భాగాన యూక్రేనియా అని ఒకరాష్ట్రం వుంది. ఇది సువిశాలమైన రాష్ట్రం! పాడిపంటలకు పుట్టినిల్లు! ఖనిజసంపత్తికి పెట్టిందిపేరు! ఇక, అక్కడి ప్రకృతిరామణీయకత వర్ణనాతీతం! ఈ యూక్రేనియా రాష్ట్రాన్ని ఎలాగైనాసరే రుష్యాదగ్గరినుంచి హరించాలని హిట్లర్ వుద్దేశం! ఇలాగే జపానుకుకూడా రుష్యా పడమటిభాగంలో వొటర్‌మంగోలియాను, సైబీరియాను హరించాలని సంకల్పం. తమవలెనే జపానుకుకూడా రుష్యామీద కళ్లున్నాయి గనక, పశ్చిమంనుంచి తామూ, తూర్పునుంచి జపానువారూ వొకేసారి ఎదిరిస్తే, తమకు తప్పకుండా విజయం కలుగుతుందని హిట్లర్ లెఖ్ఖ! అయితే, తాము రుష్యామీదకు యుద్ధానికి వెడుతూ వుండగా వెనకనుంచి ఫ్రాన్సుపోటు వుండగూడదు! అంచేతనే ఫ్రాన్సు-రుష్యాలమధ్య పరస్పరసహాయంనిమిత్తం వొడంబడిక వుండరాదని ఈ తాపత్రయం అంతా!

ఫ్రాన్సు, రుష్యాల వొడంబడిక హిట్లరుఆశయాలకు ప్రతిబంధకం అయితే కావచ్చును గాని, ఆకారణం చేత అతగాడు లొకార్నోను తృణీకరించి, రైన్‌లాండుకు సైన్యాలను తరలించడం సబబుకానేరదు! పోతే, ఇతరకారణాలవల్లకూడా హిట్లర్‌చర్యను సమర్థించడానికి ఏమీ అవకాశం లేదు.

లొకార్నో వొడంబడికను జర్మనీ కావాలని కోరి చేసుకున్నది. అప్పటిలో ఆవొడంబడిక జరిగివుండక పోతే, జర్మనీ ఈసరికి అధఃపాతాళాన వుండేది! స్ట్రెసిమన్ ఆవొడంబడికకోసం తపించాడు; తీరా జరిగినతర్వాత అది తన జీవితానికి వొకఅలంకారమని గర్వపడ్డాడు. అటువంటి వొడంబడికను హిట్లర్... ఈనాడు తమ కిక దానితో నిమిత్తం లేదని...చులాకనగా తోసివేస్తే, ఇక అంతర్జాతీయపు వొడంబడికలకు విలువఅంటూ నిలుస్తుందా? లొకార్నోకు బదులుగా తాను కొత్తగా వొడంబడికలకు వస్తానని అతగాడు అంటున్నాడుగదా? రేపు...తానే ఎల్లకాలం వుట్టి గట్టుకుని వేలాడలేడుగనక...మరొకడు బయల్దేరి ఇంత చులాకనగానూ ఆకొత్తవొడంబడికలను తృణీకరించడని గ్యారన్‌టీ యేది?

ఇలా వివిధంగా చూచినప్పటికీ హిట్లర్ రైన్‌లాన్‌డుకు సైన్యాలను తరలించడం అక్రమమని సిద్ధాంతీకరించవలసి వస్తుంది. అతను చేసినచర్య అక్రమం కావడమేకాకుండా, త్వరపడిన కారణాన కొంత వరకు అనాలోచితంకూడా అయినట్టు తోస్తుంది.

హిట్లర్ త్వరపడటానికైనా తగినంతకారణం లేకపోలేదు. తాను రాజ్యాధికారానికి రాకముందు పరిశ్రమల్ని పునరుద్ధరిస్తాననీ, నిరుద్యోగసమస్యను పరిష్కరిస్తాననీ, కరెన్సీని గట్టిపునాదులమీద నిలబెడతాననీ, దేశాన్ని సుభిక్షం చేస్తాననీ అతగాడు ప్రజలకు ఏవేవో చాలావాగ్దానాలు చేశాడు. తీరా రాజ్యాధికారానికి వచ్చినతర్వాతమాత్రం వీటిలో శతాంశాన్ని అయినా నెరవేర్చలేకపోయాడు. అంచేత దేశీయవ్యవహారాలలో తన అసమర్థతను కప్పిపుచ్చుకోడానికిగాను అతగాడు విదేశవ్యవహారాలలో గడబిడలు చేస్తున్నాడు. స్వదేశంలో అశాంతి ప్రబలుతూవుంటే విదేశాలతో పేచీ పెట్టుకుని ప్రజాదృష్టిని స్వంతకష్టాలమీద లేకుండా తిప్పడం రాజనీతిలో వొకసూత్రం. హిట్లర్ ఈ సూత్రాన్ని మహాచక్కగా ప్రయోగిస్తున్నాడు! వార్సేల్సుసంధిని ధిక్కరించీ, సార్‌మండలాన్ని సంపాయించీ, ఆస్ట్రియాను కలుపుకోవాలని ప్రయత్నాలు చేసీ గతించిన నాలుగైదుసంవత్సరాలలో అతగాడు ఎప్పటికప్పుడు ప్రజాదృష్టిని ఏగోవొకగొప్ప విదేశాంగ విషయంమీద కేంద్రీకరింపజేశాడు. ఇప్పుడు రైన్‌లాన్‌డు ఆక్రమణంకూడా సరిగ్గా అందుకోసమే చేశాడు. అయితే, ఈసారిమాత్రం అతనియెత్తు అంత చక్కగా పారినట్టు తోచదు.

బ్రిటన్, ఫ్రాన్సుల దృష్టి — ఈ రెండింటిదృష్టి మాత్రమేకాక ప్రపంచంద్రుష్టి అంతాకూడా — ఇటలీ అబిసీనియాల యుద్ధంమీద లగ్నమైయుండగా, తాను చల్లగా రైన్‌లాన్‌డును ఆక్రమించివేస్తే, అంత చిక్కు రాదని హిట్లర్ లెఖ్ఖలువేశాడు. నానాజాతిసమితి ఇటలీమీద సాంక్షన్సును ప్రకటించడం, ఇటలీ వాటిని ఖాతిరు చెయ్యకుండా యుద్ధాన్ని సాగించడం, సాంక్షన్సును ఇంకా హెచ్చు చెయ్యవలెనా లేదా అనేప్రశ్న తెమలక వివిధరాజ్యాలవారు తికమకపడటం, బ్రిటన్ - ఇటలీరాజ్యాలమధ్య క్రమక్రమంగా స్పర్ధలు పెరుగుతూ వుండటం — ఇలాంటి సుసమయంలో తన రైన్‌లాన్‌డు పేచీ మహాబాగా పారగలదని హిట్లర్ ఆశించాడు. కాని, అతని లెఖ్ఖలు చాలావరకు తప్పిపోయినాయి.

రైన్‌లాండులో జర్మన్‌సైన్యాలు ప్రవేశించగానే ఫ్రాన్సుకు తత్తరపాటు పుట్టింది. బ్రిటన్‌కూడా ఇప్పటిలో యూరప్‌లో యుద్ధంవస్తే, అది యెలా పర్యవసిస్తుందో అనేభయంకొద్దీ జర్మనీకి ప్రతికూల భావం వహించింది. జర్మనీ దౌర్జన్యంఅంటే భయం వున్న బెల్జియం, పోలెండ్, ఆస్ట్రియా, జెకోస్లోవాకియా మొదలైన అల్పరాజ్యాలమాట ఇక చెప్ప

నక్కరలేదు. ఇందువల్లనే డు సాన్క్షన్సు విషయంలో తానుపొందుతున్న కష్టాల్ని తప్పించుకోడానికిగాను ముసోలినీ రహస్యంగా హిట్లర్‌తో సంధిచేసుకోడానికి ఆలోచనలు ప్రారంభించాడు. దీన్ని అంతాచూచి, వ్యవహారం శ్రుతిమించి రాగానపడుతున్నదని ఫ్రాన్సు, బ్రిటన్‌లు వెంటనే సాన్క్షన్సు వుపసంహరించుకున్నాయి, ఎలాగైనా ముసోలినీని బుజ్జగించాలని చూస్తున్నాయి. హఠాత్తుగా యూరపియన్ రాజకీయరంగంలో కలిగిన ఈ మార్పులవల్ల హిట్లర్‌పని కొంతవరకు ఇరకాటాన పడింది.

హిట్లర్, ముసోలినీలు యూరప్‌పాలిటి రాహుకేతువులులా వున్నారు. ఈయిద్దరు విడివిడిగావుంటేనే ఎప్పుడు ఏమి ప్రళయం వస్తుందోనని వివిధరాజ్యాలవారు భయపడుతున్నారు. ఇక వీరిద్దరు కలిస్తే చెప్పాలీ? ఈ అపాయాన్ని గ్రహించే బ్రిటన్, ఫ్రాన్సులు చల్లగా ముసోలినీతో రాజీపడ్డాయి. దీన్ని బట్టి హిట్లరును నొక్కడానికి ఈరాజ్యాలు నిశ్చయించుకున్నాయనే అనుకోవలసివస్తుంది!

ఇప్పుడిక హిట్లరుకు కర్తవ్యం? ప్రతికూలభావం హెచ్చుగావున్నదని రైన్‌లాండ్ విషయంలో రాజీపడటమా? అలాఅయితే స్వదేశంలో అతనిప్రతిష్ఠకు కళంకంరాదూ? ఇదీ ఇప్పుడు హిట్లర్ పరిష్కరించుకోవలసిన క్లిష్టసమస్య. దూరదృష్టికలిగి తెలివిగా అతగాడు ప్రస్తుతం సర్దుకుంటే సరే, లేకపోతే ఈ రైన్‌లాండ్‌వ్యవహారం మహాభీకరమయిన ప్రపంచ యుద్ధానికి దోహదం కాగలదు!

# రాధిక

## చావలి బంగారమ్మ

నా గుండెలోనబడి నలిగిపోయిన వాని
నయనంబులోనుండు నడకమార్పులుచూడ
నగలు కావలెన నాకు,
విలువైన
వలువకావలెన నాకు?

వెనుకజూచినజాలు, కినుకమానినజాలు,
పలుతెరచి నాతోడ పలుకకుండిననేమి,
కనుపించితే చాలదా,
తనమాట
వినిపించితే చాలదా?

ఇష్టమేలేకున్న, కష్టమే తనకున్న,
నిష్ఠురములైననే నిష్ఠతోవింటాను,
సృష్టిలో తానుకాని
వేదయిన
దృష్టిలోనికి వచ్చునా?

ప్రక్కనుండియుతాను పరుగువారినగాని
పరిమళించకపోన మరుగునుండినప్రేమ
పరులతో చెప్పగలనా,
నాలోన
ప్రవహింపకే మానునా?

# మెండలీయము—రక్తస్పర్శ

## (అనువృత్తము)

యన్. యమ్. వేణు

గాల్టన్ సూత్రములనుగూర్చియు, తద్విషయానుకూలముగ పియర్సన్‌వంటి శాస్త్రవేత్తల పరిశోధనలనుగూర్చియు నింతదనుక తెలిసికొంటిమి. మెండెలుమహాశయుడు గనిపెట్టిన మఱికొన్ని యంశములనుగూర్చి కొంత దెలిసికొందము.

ఆస్ట్రియాదేశమునందు బ్రన్ (Brunn) పట్టణమున మెండెలు (Mendel) ఒకానొక క్యాథలిక్ మతనివాసి. ఇహలోకవాంఛలను విడనాడిన యతి. తుచ్ఛసుఖ భూయిష్ఠమైన బాహ్యప్రపంచస్పర్శయే చొరరాని మఠాంతర్భాగనివాసియైన యీ యతీశ్వరుడు అతులితక్షమాశక్తిచేత విసుగుచెందక పదియేండ్లు నిరంతరాయముగ తనపరిశోధనలను కొనసాగించి ప్రపంచమునందలి పైరుపచ్చల యభివృద్ధికి, పాడిపంటల యౌన్నత్యమునకు నాధారభూతములగు కొన్ని రహస్యములను వెలిపుచ్చిరి. వాని ప్రయోగముననే రోగపీడ నెఱుగని కొన్ని ధాన్యజాతులు ప్రపంచమున వెలసినవి; హాలండు దేశము వెన్నమీగడలకు ప్రేపల్లెవంటిదని ఐరోపాఖండమున వినుతికెక్కినది; క్షీరము నక్షయముగ నొసగజాలు కామధేనువులవంటి గోవులకు పుట్టినిల్లని డెన్మార్కుదేశము ప్రఖ్యాతిగాంచినది. మెండెలు మహాశయుని కీర్తి యాచంద్రతారార్కము నిలిచియుండుగాక! వారి సూత్రము లిప్పుడు ఒక వృక్ష పశుజాతులయందేగాక మానవ సంఘోన్నతికై వారియందును ప్రయోగింప వీలగుచున్నది.

అనులోమ ప్రతిలోమ వివాహము లనుమాటలు మన ఆర్యావర్తదేశమునకు క్రొత్తవిగావు. స్వజాత్యుత్పత్తులకును, అనులోమ ప్రతిలోమవివాహ సంజనిత సంకీర్ణజాతులకును ఏఏవిధమున ఎంతెంతవఱకు ఏఏవిధములగు సంబంధములుండెనో యాయంశమును ఒకటికి పదిసార్లు పరీక్షచేసి అందలి లాభనష్టములను గుర్తెఱింగినవారరుదు. మెండెలు నివసించుచుండిన మఠప్రాకారములో రెండువిధములగు బఠాణిచెట్లు పెరుగుచుండుట యాతనికి దృగ్గోచరమయ్యెను. ఎనిమిదడుగుల ఎత్తుగలది యొకరకము; ఒకటిన్నర అడుగు ఎత్తుగలది రెండవది. వానిని జూచి యాతడు తనలోతా నిట్లు చింతించెను:

“పరిమాణమునం దింతవ్యత్యాసముగల యీ చెట్లు ఎట్లు వచ్చినవో ఎవ్వరును ఎఱుంగరు. పొడుగుచెట్టుగింజలను పాతిపెట్టినట్లయినచో పొడుగుచెట్టు మొలచును. పొట్టిచెట్ల విత్తనములు పొట్టిచెట్లనే యిచ్చును. కాని యీ రెండు విధములగు వృక్షముల సమ్మేళనాఫలితముగ గలుగు విత్తనము లెట్టిచెట్ల నిచ్చునో గదా!”

అని తలచుకొని అంతటితోనాగక స్వయముగ నాపరిశోధనకు సంకల్పించుకొనెను. ఇదియే మహాపురుషుల లక్షణము!

బఠాని చెట్లు పుష్పించు కాలమున పొడుగు బఠాణి చెట్ల పువ్వులనుండి పుప్పొడిని పొట్టిపువ్వుల కీలాగ్రముమీదను, పొట్టిపువ్వులలోని పుప్పొడిని పొడుగుచెట్లపువ్వుల కీలాగ్రముమీదను బడవేసి, తక్కిన తేనెటీగలు వానిని జేరనీక ఆ పువ్వులను కాగితపు తిత్తులతో నాతడు గప్పివైచెను. అందుండి వచ్చిన గింజలను సేకరించి వానినిజల్లి ఎట్టిచెట్లు మొలచునోయని మెండెలు ఆతురతతో వేచియుండెను. కొంతకాలమునకు చూతురుగదా! అందుండి వచ్చిన మొలకలన్నియు ఎనిమిదడుగుల ఎత్తునకు పెరిగెను! మెండెలు దీనినిగుర్తించి మఱల నాచెట్లనుండి బడసిన గింజలను

వల్లి యందుండి యుద్భవించిన బఠాణిచెట్లను పరీక్షించెను. ఈ చెట్లలో ననేకములు పొడుగుగను, కొన్ని పొట్టిగాను నుండెను. రెండవసంతానమున మరుగుపడి పోయిన 'పొట్టితనము' మూడవసంతానమున బయల్పడెను. మఱల ఈ మూడవ సంతానములో పరస్పర సంబంధము నుదర్చి అవెంతవఱకు స్వజాత్యుత్పత్తి నొసంగునో తెలిసికొనెను. ఆయా సంబంధమును, తత్సంబంధజనిత సంతానమును ఈ క్రింది వృక్షమువలన తెలియనగును.




ఈ మూడవతరమునందలి పొడుగు వృక్షముల లోని సంపర్క ఫలితముగ బడసిన సంతానమును పరీక్షించి అందు కొన్ని స్వచ్ఛందజాతులని, కొన్ని సంకీర్ణజాతులని తెలిసికొనబడెను. చాలమంది సలిపిన పరిశోధనలవలన మొత్తముమీద మిశ్రజముల సంతానములో మూడుపాళ్లు తల్లిదండ్రుల ననుసరించియు' ఒకపాలు తాతలలోనుండిన యొకగుణము మధ్య మరుగుపడిపోయినదియు నగుదాని ననుసరించియుండును. పొడుగుతండ్రులు పొట్టితల్లులవలన బడసిన సంతానమునందు పొట్టితనము మాయమైపోయినది. అన్నియు పొడుగుగానుండువానిలో, అనగా మిశ్రజములలో, పరస్పరసంపర్కజనితముగ గలిగిన సంతానమగు మూడవతరమునందు కొన్ని తమఅవ్వ ననుకరించినవి. రెండవ తరమున గన్పడని యీపొట్టితనము మూడవతరమున నెట నుండి వచ్చినది? మొదటితరములోని తల్లిదండ్రులలో నొకరికుండిన ఈపొట్టితనము రెండవతరమున ప్రబలగుణమగు పొడుగుతనముచేత మరుగుచేయబడినది. పొట్టితనము అమిశ్రితముగా నుండిననేగాని వెలుపలికి గన్పడజాలదు. మిశ్రముగా నుండినను తనతో జేరియుండు పొట్టితనము నడచివైచుశక్తి పొడుగుదనమునకు గలిగియుండును. కావున నీవిషయమున పొడుగుతనము "ప్రబలగుణ" మనియు పొట్టిగుణము "గుప్తగుణమని" యు (Dominant and Rece ssive characters) పిలువబడును. స్వచ్ఛందజాతుల సంతతియందు అచ్చము పొడుగుగానున్న పొడుగుతనమును, పొట్టిగానున్న పొట్టితనమును సమయుండుండును. ఇవి మిశ్రితములైనచో ప్రబలగుణమే బయల్పడి గుప్తగుణము అణగిపోవును. ఈ విషయము నీక్రిందివృక్షము విశదీకరించును.

చిత్రము ౨



DOMINANT & RECESSIVE CHARACTERS.

క=ప్రబలగుణోపేతలగు స్వచ్ఛందజాతులు
క'=సంతానము—ప్రబలగుణోపేతలు
గ=గుప్తగుణోపేతలగు స్వచ్ఛందజాతులు
గ'=గుప్తగుణోపేతలగు స్వచ్ఛందజాతులు [తండ్రి
క''=ప్రబలగుణోపేత యగు స్వచ్ఛందజాతి తల్లి లేక
గ''=గుప్తగుణోపేతయగు స్వచ్ఛందజాతి తండ్రి లేక తల్లి
స=సంతానము, మిశ్రజములు
స'=మిశ్రజములు
క'''=స్వచ్ఛందప్రబలగుణోపేతలు
గ'''=స్వచ్ఛందగుప్తగుణోపేతలు

మిశ్రజసంతానమునందు మూడుపాళ్లు ఏల ప్రబల గుణోపేతలై యుండెనో ఈచిత్రము తెలుపును. ఈమూడుపాళ్లలోను ఒకపాలు ప్రబలగుణోపేతయగు స్వచ్ఛందజాతిది; తక్కినరెండుపాళ్లును తలిదండ్రులవలె మిశ్రజములు ఒకపాలు స్వచ్ఛందజాతిదగు గుప్తగుణోపేతలు. ఇదేవిషయము నీక్రింద వేరువిధముగా గుర్తించబడినది.

'ప్ర' అనగా ప్రబలగుణోపేతలు.

'గు' అనగా గుప్తగుణోపేతలు.

రెండు 'ప్ర'లు గాని, 'గు'లు గాని ఆయాతెగకు చేరిన స్వచ్ఛందజాతిని సూచించును. రెండును గలసియున్నచో మిశ్రజములు.

ప్ర ప్ర × గు గు

ప్ర ప్రగు     ప్రగు ప్రగు

[ప్ర ప్ర]   ప్రగు   ప్రగు   [గుగు]

25%   50%   25%

పైవృక్షమునుబట్టి మిశ్రజసంతానమునందు నూటికి ఏబదిపాళ్లు సంకీర్ణజాతు లుండుననియు, తక్కిన ఏబదిపాళ్లును స్వచ్ఛందజాతు లనియు ఏర్పడును. ఈ ప్రయోగముల ఫలితముగ నెల్లెడల ననువర్తించు కొన్ని సూత్రములు మనము చెప్పవచ్చును. అవేవన:—

(1) స్వచ్ఛందజాతులలో పరస్పర సంపర్క ఫలితముగ స్వచ్ఛందజాతులే యుద్భవించును.

ఉదా. పొడుగుతల్లి × పొడుగుతండ్రి

సంతానము - అన్నిపొడుగు

సంతానము అన్నియు పొడుగు

(2) భిన్నస్వభావులగు రెండు స్వచ్ఛందజాతుల సమ్మేళన ఫలితముగ గలుగు సంతానము మిశ్రజములు. ఇవి తమ తలిదండ్రులలో ప్రబలగుణోపేతలగుదాని ననుసరించి యుండును. లేదా తలిదండ్రులు రెండును పోలక మధ్యరకముగా నుండును.

ఉదా: I. బఠాణి చెట్లలో—

స్వచ్ఛందజాతులు పొడుగు (తండ్రి) × పొట్టి (తల్లి)

మిశ్రజములు. సంతానము:—అన్నియు పొడుగు.

II. అండల్యూసియా కోళ్లు —

స్వచ్ఛందజాతులు —తెల్లపెట్ట × నల్లపుంజు.

మిశ్రజములు—అన్నియు నీలిరంగుకోళ్లు.

(తెలుపుగాదు, నలుపుగాదు)

అండల్యూసియాకోళ్లలో మిశ్రజములయందు గన్పడు క్రొత్తరంగునకు కారణము తలిదండ్రులలోని తెలుపును, నలుపును గూడ ప్రబలగుణములు. కావుననే రెండునుగాక, ఆరెండురంగులు గలిసిన ఊదారంగుజాతి యుద్భవించినది.

(3) మిశ్రజములలో స్వజాతిసంపర్కమువలన గలిగిన సంతానములో సగము స్వచ్ఛందజాతులుగను, తక్కినసగము సంకీర్ణజాతులుగను నుండును.

ఉదా. I మిశ్రజములు - బఠాణీచెట్లు

పొడుగు × పొడుగు

పొడుగు   పొడుగు   పొడుగు   పొట్టి

(స్వచ్ఛందజాతి.)   మిశ్రజములు   (స్వచ్ఛందజాతి)

25/.   50/.   25/.

II. మిశ్రజములు - అండల్యూసియా కోళ్లు

ఊదాపుంజు × ఊదాపెట్ట

నలుపు   ఊదా   ఊదా.   తెలుపు.

(స్వచ్ఛందజాతి)   మిశ్రజములు   (స్వచ్ఛందజాతి)

25/.   50/.   25/.

ఈవిధముగ కనిపెట్టబడిన యీవిధులు ఎన్ని విషయములందైనను అనువర్తించును. సౌకర్యముకొఱకు బఠాణీచెట్లనే తీసికొందము. పొడుగుబఠాణీచెట్టునకు ఒక పొడుగుతనమేగాక ఇంకను మఱికొన్ని గుణము లున్నవి. పువ్వులకు పొడుగుకాడలు, పసుపుపచ్చని గింజలు, ముడతలుపడిన గింజల పైపొట్టు, ఈలాటివన్ని యు కూడ దానివాని స్వభావము ననుసరించి ప్రబల గుణములుగా నైనను, గుప్తగుణములుగానైనను నుండ వచ్చును. మెండెలువిధుల ననుసరించి ఆయాగుణములు పైకిగనపడిన గన్పడును, లేదా అడగియుండినయుండును. ఇట్లు పెక్కుగుణములలో భేదించు స్వచ్ఛందజాతుల వలన బడసిన మిశ్రజముల సంతానములోని స్వచ్ఛంద మిశ్రజములకు గలిగిన సంఖ్యాసంబంధము చాల విపరీత ముగా నుండును. ఏది ఎటులున్నను మిశ్రజములు సంతానపరిశోధనలయందు తమగుట్టు బైటబెట్టును. రక్తములో రక్తము కలిసిపోయిన తమపూర్వీకులవృత్తాంతము నేడుగాకున్న రేపు తప్పక బయల్పడును. కాని వృక్షములు, తక్కినజంతువులలోవలె మనుష్యునియందిది కనిపెట్టుట దుస్సాధ్యము. కాని ఒక్కొక్కరి వంశచరిత్రము విచారించి ఆయావంశమునందెడతెగక గన్పడు గుణములను పరిశీలించినచో, కొన్నియెడల ఆయాకుటుంబములలో దలపెట్టిన వివాహములవలన ఎట్టిఫలితముగలుగునో ముందుగా చెప్పవచ్చును. అట్టి వివాహములవలన గలుగు సంతాన మెట్టిదిగనుండునో నాటికి ఎనుబదిపాళ్లు నూటిగ చెప్పవచ్చును. ఎల్లయ్యతండ్రి దుర్బలమతి యను కొందము. ఎల్లయ్య భార్య సీతమ్మ సామాన్యతరగతికి చేరిన స్త్రీ. అనగా దుర్బలమతియుగాదు, అట్టి ధీమంతురాలును గాదు. ఈ ఎల్లయ్యసీతమ్మలకు గలిగిన సంతానము మెండెలు రెండవసూత్రము ననుసరించి మిశ్రజములుగా నుండును. అనగా వారికి పుట్టుప్రతిబిడ్డయు తండ్రిలోని దుర్బలమతిత్వమును, తల్లియొక్క సామాన్యత్వమును గలిగి యుందురు. దుర్బలమతిత్వము గుప్తగుణముకావున పిల్లలెల్లరు పైకి సామాన్యమానవులవలె నుందురుగాని వారు నిశ్చయముగ దుర్బలమతిత్వవాహకులు. ఇట్టివారి కెవరికేని దురదృష్టవశమున దుర్బలమతియగు భార్య లభ్యపడెనేని ఇక వారి సంతానమునుగూర్చి చెప్పనక్కరలేదు. మెండెలు మూడవసూత్రము ననుసరించి వారిసంతానమున సగము మంది సంపూర్ణముగ దుర్బలమతులుగను, తక్కినవారు తద్గుణవాహకులుగను నుందురు. ఇదేవిధముగ తక్కిన వివాహములవలన సహితము గలుగు సంతానమును సూచించుచు వ్రాసిన చిత్రమును చూడుడు. (చిత్రము ౯).

చిత్రము ౯











త దుర్బలమతియగుతండ్రి

ద : సామాన్యముగా నారోగ్యవతియగుతల్లి

న : వారిసంతానము–అందఱుదుర్బలమతిత్వవాహకులు

ప : దుర్బలమతిత్వవాహకుడగుతండ్రి

బ = దుర్బలమతియగుతల్లి

య. మ : వారిసంతానము –మ : సంపూర్ణముగ దుర్బలమతులు. య : దుర్బలమతిత్వవాహకులు

ర : తలిదండ్రు లిరువురు దుర్బలమతులు

హ = వారిసంతానము – అందఱు దుర్బలమతులు

అ = తలిదండ్రు లిరువురు - ఆరోగ్యవంతులు

క్ష = వారి సంతానమంతయు ఆరోగ్యవంతులు

మెండెలు సూత్రము లీవిధముగ నెల్లెడలను అనువర్తించుటకు గల కారణమునుగూర్చి యాలోచింతము. సజీవములగు ప్రతివస్తువును అనేకములగు గుణములు కలిగి యుండును. నల్లరంగుపై తెల్లచుక్కలు కలిగిన దేహము, మృదుమధురగానము కోకిలస్వభావములు. నయనానందకరమగు రంగు, కమ్మనివాసన గులాబి

పుష్య గుణములు. శరవేగతుల్యమగు పరుగు పందెముగుఱ్ఱములయందే యుండును. బరువును లాగుశక్తి బండిగుఱ్ఱమున నుండును. విశాలమగు కాటుకకండ్లు, చక్కని నొక్కు వెండ్రుకలు, నిమ్మపండుచాయ, బాహుబలము, ఒకమనుజుని నుండును. మఱియొక్కరికి పిల్లికండ్లు, నిడుదైన నల్లనివెండ్రుకలు, చామనచాయ, సాహసము,ధైర్యము మొదలైనవి యుండి వ్యాధిమాఱుడై ఎనుబదిఏండ్లు జీవింపశక్తి గలిగియుండును. ఈవిధముగ నొక్కొక్కప్రాణియు బహుగుణయుక్తమై యుండును. ఇట్టి గుణములన్నియు మనకు పెద్దవానియందు గన్పడు రీతినే సూక్ష్మాతిసూక్ష్మమగు స్థూలబీజాశయమునందుగాని, సూక్ష్మబీజాశయమునందుగాని ఇమిడియున్నవని చెప్పినచో వింతగా దోచును. కమలియొక్క అందము, ఏనుగుయొక్క పర్వతాకారము, నక్కలోని టక్కరితనము, ఆయాజంతువునకు కారణభూతమగు స్థూలసూక్ష్మబీజాశయములందున్నదని నేను వాదించినచో తప్పక నన్ను కాళ్లుచేతులుకట్టినది “శేక్ష్యాకు” పిచ్చియాస్పత్రిలో బడవేయుదురు. కాని పెద్దవానిలోని ఆయా గుణములను వానికి సమకూర్చుటకు ముఖ్యాఆధారమైనది, మఱిమార్పుచెందనిది, నాశనమునెఱుంగనిది, ఏదేని యొక వస్తువిశేషములు స్థూలసూక్ష్మబీజాశయములయందుండి తీరవలయుననుట సత్యము. ఈవస్తువిశేషములు ఒకపురుషాంతరము మఱియొకపురుషాంతరమునకు ఏమార్పును జెందక వ్యక్తినుండి వ్యక్తికి మారుచు తదనుగుణముగ ఆకారస్వరసౌందర్యాదిగుణములను ఆయావ్యక్తికి చేకూర్చుచుండును. వీనినే (ఆవస్తువిశేషములను) ‘గీనీస్’ (genes-ఈఆంగ్లేయ పదమును ‘జీన్స్’ అనియుగూడ ఉచ్చరింతురు) లేక “గుణవాహకు” లందురు. ఈగీనీలు సంక్షేపింపబడిన పెద్దవానిగుణములని యనుకొనగూడదు. అవి ఇంచుమించుగా వెండి బంగారు, మొదలైన నాణెములవంటివి. అర్థణా పెట్టి ట్రాముటిక్కట్టు పుచ్చుకొనునట్లు, ఎదురింటమ్మకు తియ్యగూరనిచ్చి పుల్లగూర పుచ్చుకొనునట్లు ఈగీనీలను మార్చుకొనవచ్చును. నీలకంఠము అందమున కోతిపిల్ల; గానమాధుర్యము కోకిలను మించియుండును. అతనిభార్య హంసవేణి సౌందర్యరాశి; స్వరము గార్ధభస్వరము. పైన జెప్పినరీతిని స్థూలసూక్ష్మబీజాశయ సమ్మేళనమప్పుడు గలుగు “గీనీల” మార్పుచేత సౌందర్యమునకు సౌందర్యము, గానమునకు గానము రెండును వారిపిల్లలయందు మూర్తీభవించియుండవచ్చును. అనగా తండ్రిలోని గానవాహకులగు “గీనీలును”, తల్లిలోని సౌందర్యవాహకులగు “గీనీలు”ను మిళితమై స్థూల సూక్ష్మబీజాశయముల సమ్మేళన ఫలప్రదమైన దన్నమాట ఒక్కొక్కరిని తల్లిగర్భమునందు జరుగు ఈ అన్యోన్య ‘గీనీల’ మార్పు ఎంతముఖ్యమైనదో చదువరు లూహింతురుగాక! ఆక్షణమున గలుగు నీమార్పులు తద్గర్భఫలితముగ మున్ముందు కలుగబోవు బిడ్డయొక్క గుణాతిశయములకు కారణకర్తలగును.

ఇంతదనుక మనము తెలిసికొన్న అంపెల్యూశియా కోళ్లలో తెల్లవానికిని, నల్లవానికిని జనించిన పిల్లలు ఏల నీలిరంగు గలవిగానుండెనో యిప్పుడు చెప్పవచ్చును. వానిలో నల్లరంగునకును, తెల్లరంగునకును కారణకర్తలగు “గీనీలు” కలిసియుండవలయును. తండ్రిలోని సూక్ష్మబీజాశయమునందు అన్నిగీనీలును నల్లని రంగును కలుగజేయునవిగా నుండును; తల్లిలోని

చిత్రము ౧౦



గుణవాహకులు - వానిసమ్మేళన

A. 1. మేఘవర్ణదగుణవాహకులు 2. శ్వేతవర్ణదగీనీలు
B. వానిసమ్మేళన — గుణవాహకులమార్పు
C. 1. 2. మిశ్రితగుణవాహకులు

స్థూలబీజాశయములోని అన్ని గీనీలును తెల్ల రంగు నిచ్చునవిగా నుండును. ఇవి రెండును కలిసినప్పుడు గీనీలమార్పుచేత రెండును మిశ్రితములై పోయినవి. సూక్ష్మబీజాశయమునందు మేఘవర్ణదగీనీలు పదియు, స్థూలబీజాశయమునందు శ్వేతవర్ణద గీనీలు పదియు నుండినచో వీని సమ్మేళనలో కలుగు మార్పుచేత నైదు మేఘవర్ణదగీనీలు ఐదు శ్వేతవర్ణదగీనీలతో చేరి, పందికంటె నెక్కుడుగ గీనీలు ఏ బీజాశయమునందును నుండవు గావున తక్కిన ఐదు శ్వేతవర్ణదగీనీలు వేరుచేయబడి మరి ఐదు మేఘవర్ణద గీనీలతో చేరిపోవును. (చూడుము చిత్రము ౧౦). కావుననే మిశ్రజములు వర్ణాంతరములుగా

చిత్రము ౧౧




: నల్లపుంజు } అండల్యూషియా
: తెల్లపెట్ట } కోళ్లు
నీలిపిల్లలు — మిశ్రజములు

మండినవి. (చూడుము చిత్రము ౧౧). తక్కిన విషయములలోగూడ నిట్టిమార్పులు జరుగుచునేయుండునని మనము చెప్పవచ్చును. ఈవిధమైన 'మారుబేరము' స్థూలసూక్ష్మబీజాశయములలో కలుగుచుండిననేగాని మన యావశ్యకతలనుబట్టి మనకు ఏ విషయమునందెక్కువగా లాభము పొందగలమో అట్టిదాని కనుకూలించు పశుజాతులును, వృక్షజాతులును బడయుట దుర్లభమగును. బెహారీ ఆవులు, జర్సీయావులు, మైసూరులోని 'అమృతమహల్' జాతిఎద్దులు, దినమునకుపండ్రెండునుండి పదునైదు శేరులపాలనిచ్చు సింధుదేశపుఆవులు మొదలగు ఉత్కృష్టవంశపుపశువుల వంశవృద్ధిని గాపాడుటగూడ మెండెలు విధుల ననుసరించియే యుండును. ఇంతటి యథార్థమును దెలిసికొనజాలని కారణముచేత మనదేశములో పాడిపశువు లధోగతిపాలై, వెన్న మీగడలు కఱవై, పరదేశమునుండి దిగుమతియగు

"డబ్బీపాలు", "డబ్బీవెన్న", "క్రొవ్వునేయి" వాడ కలసినవారమై, ఆరోగ్యమునందు, దేహదారుఢ్యము నందు, బుద్ధిబలమునందు సర్వతోముఖముగ క్షీణదశ నొందుచున్నాము. ఆంధ్రదేశపు పాడిపంటల యౌన్నత్యమునకై ౧౯౧౨ వ సం. రమున ఆంధ్రభాషాభివర్ధనీ సంఘమువారిచే ప్రచురించబడ్డ శ్రీయుత కేతుమళ్ల రాజగోపాలరావుగారి పశుశాస్త్రము ఆంధ్రలోకమున కాదర్శప్రాయమై వారిని నిద్దురనుండి మేల్కొలుప జేసియుండవలసినది. కాని ఇంకను అట్టిభాగ్యము ఆంధ్ర దేశమునకు రాలేదు. ఆధునిక శాస్త్రపరిజ్ఞానమువలని లాభములను చేయిజారిపోనీయక పాశ్చాత్యదేశములు మానవభాగ్యోన్నతి కుపకరింపజేసికొనుచున్నవి. మన కట్టి శాస్త్రములు మనభాషలో లేని కొఱంతను దీర్చ పనుముకట్టిన శ్రీ ఆంధ్రసరస్వతీగ్రంథమండలివా రెంత యు ధన్యులు. వారికష్టములను వృథాపోనివ్వక వారిని సర్వవిధముల ప్రోత్సహించి, వారివలన కలుగు అద్వితీయ ములగు లాభములను పొందుట ప్రతియాంధ్రునికి విధి.

మెండెలుగారి సూత్రప్రయోగమువలన ఉత్కృష్ట పశు-వంగసములను వృద్ధిపొందించుటను గూర్చి పైని జెప్పిన పశుశాస్త్రమునందు విరివిగా చర్చించియుండు టచే నిచ్చట పూర్తిగ వివరింపక విరమించుచున్నాను. ఉదాహరణమునకు మంచి పాడియావుల విషయమై ఇప్పుడు తెలిసియుండు కొన్ని లెక్కల నిందొసగుచున్నాను. ఇంగ్లాండు, హాలండు మొదలగు దేశములయందు మంచి పాడియావులను గూర్చిన లిఖితరూపమైన చరిత్రలు చాలయున్నవి. ఒక్కొక్కతరగతి యావును ఎన్ని శేరుల పాలనిచ్చునదియు, ఏఏజాతి పాలలో నెంతెన్న యుండునదియు పరిశోధించి, ఆయావులనుండి మనము ఎక్కువవెన్న నివ్వగల పాలను విస్తారముగా నొసంగు క్రొత్తజాతియావులను బడయుట మెండెలు సూత్రముల ననుసరించి సులభసాధ్యము (చూడుము శ్రీయుత రాజగోపాలరావుగారి పశుశాస్త్రము). ఈ క్రింది లెఖలు విల్సన్ (Wilson) గారి గ్రంథమునుండి తీసికొనబడినవి.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| వరుస సంఖ్య | తరగతిపాలు 100 కు వెన్న శాతము (ఫ్యాట్) ప్రకారము సంఖ్యలు | 2026 జెర్సీ ఆవులలో 100 కు ఎన్ని ఆవులీ తరగతి పాలనిచ్చునవి | 1373 ఐర్షైర్ ఆవులలో 100 కు ఎన్ని ఆవులీ తరగతి పాలనిచ్చునవి | 2866 షార్ట్‌హార్న్ ఆవులలో 100 కు ఎన్ని ఆవులీ తరగతి పాలనిచ్చునవి |
| 1 | 2.3 | .10 | — | — |
| 2 | 2.4 | .24 | — | — |
| 3 | 2.5 | .54 | — | — |
| 4 | 2.6 | 1.33 | — | .07 |
| 5 | 2.7 | 2.76 | — | — |
| 6 | 2.8 | 6 07 | .18 | .38 |
| 7 | 2.9 | 7.94 | .36 | .76 |
| 8 | 3 0 | 12.68 | 1 82 | 1.19 |
| 9 | 3 1 | 12 09 | 3.42 | 2.37 |
| 10 | 3.2 | 15 45 | 4.45 | 4.33 |
| 11 | 3 3 | 11.50 | 9.83 | 6.63 |
| 12 | 3 4 | 9.58 | 14 86 | 9 46 |
| 13 | 3.5 | 7 89 | 13 40 | 11.54 |
| 14 | 3 6 | 4 68 | 13.91 | 11.54 |
| 15 | 3.7 | 2.96 | 11 94 | 12 21 |
| 16 | 3.8 | 2 07 | 11.58 | 11.20 |
| 17 | 3.9 | 1 08 | 5.60 | 8 90 |
| 18 | 4.0 | .54 | 4.73 | 6.70 |
| 19 | 4.1 | .20 | 2.04 | 5.16 |
| 20 | 4.2 | — | .88 | 3.14 |
| 21 | 4.3 | .24 | .51 | 1.50 |
| 22 | 4.4 | — | .22 | .70 |
| 23 | 4.5 | — | .15 | .38 |
| 24 | 4.6 | — | — | .76 |
| 25 | 4.7 | — | .15 | .21 |
| 26 | 4.8 | — | — | .07 |
| 27 | 4.9 | — | .08 | .07 |
| 28 | 5.0 | — | — | .03 |
| 29 | 5.1 | — | — | .03 |

ఈలెఖలు 'గ్రాఫ్' గీచినచో ౧౨-వ చిత్రమున చూపినరీతిని కానవచ్చును. దీనినిబట్టి హెచ్చుతరగతిపాలను (అనగా ౧౦౦. కి ౪ కంటె ఎక్కువగా చమురు

చిత్రము ౧౨



1. —— 2026. డచ్చి యావులను సూచించును
2. ...... 1373. ఎర్రని డ్యానిష్ గోవులు
3. 2866 ఐర్‌షైర్ ధేనువులు

పదార్థము నివ్వగల) ఇవ్వగల యావులు డచ్చి యావులలో లేనే లేవు. వానిసంతతినుండి ఐర్‌షైరు ధేనువులనుండి బడయునంతటి మేలుగడకముపాలను బడయుట దుర్లభము. కావున అట్టి పాలను మనము డచ్చి యావులనుండి బడయవలయునన్నచో మంచిజాతి ఐర్‌షైరు ఎద్దులకును డచ్చి ధేనువులకును సంపర్కము గదిర్చి సంతతి వృద్ధిచేయుట మంచిది. డెన్మార్కు దేశమున ఏబది సంవత్సరములవఱకుండి బడిన పాలలెక్కలనుండి ఆదేశము వారు తమపాడి నెట్లు వృద్ధిచేసికొనిరో మనము తెలిసికొనవచ్చును. ౧౮౯౭వ సం.మున పుట్టిన 'నాల్గవటారస్' (Taurus IV), ౧౮౯౬వ సం.రమున జనించిన 'లాంబెర్జి' (Lombjerge IV) అను నీరెండు ఎద్దులవలన డేనిష్ ఎర్రగోవులపాడి ఎంత అభివృద్ధినందినదో ఏ. యం.

చిత్రము ౧౩



అ. ఆ. కు గల చదరములు - టారస్ IV చేత దాటించబడిన యావులను దెలుపును.

చదరములలోని సంఖ్యలు - ఆయాయావునకు గలిగిన దూడలను దెలుపును.

నిలువుగీత ప్రక్కన ఉండు యంకెలు - దూడలపాలలో నెంత క్రొవ్వుపదార్థ ముండునది తెలుపును.

అడ్డగీత క్రింది యంకెలు - ఆవుల పాలలో నెంత యుండినదియు తెలుపును.

చిత్రము ౧౪



అ. ఆ. కు గల చదరములు—లాంబెర్జి IV చేత దాటించబడిన యావులను దెలుపును.

చదరములలోని సంఖ్యలు—etc —(13లో నుండు మాదిరియే యిచ్చటను యుండవలయును.)

క్రిసన్‌సన్ (A. M. Christensen) గారు వివరించియున్నారు. టారస్‌చేత దాటించబడిన యావుల పాలలో ౧౦౦కి ౩.౫౬వ వంతుమాత్రము క్రొవ్వుపదార్థముండినది. టారస్‌కు పుట్టిన దూడలపాడిలో నూటికి ౩.౭౫వ వంతు క్రొవ్వుపదార్థముండినది (చూడుము గ్రాఫ్ ౧౩). లాంజ్బెర్జి సంతతిలో నింతఫలితము గనపడలేదు. ఈ రెండు సంతతులకు చేరిన తల్లులయొక్కయు, పిల్లలయొక్కయు పాలలోని గుణమును చూపుచు వ్రాయబడ్డచిత్తరువులు చూడుము (చిత్రములు ౧౩-౧౪). ఈ విధములగు లెఖలు మనదేశములో నెప్పుడు లభ్యపడునో చూడవలయును. వీనికంతటికిని మెండెలు మాత్రప్రయోగమే ముఖ్యసాధనము. వానిని గ్రహించి చక్కనిమార్గములకుం గుపయోగించినచో మన కన్ని విధముల సౌభాగ్యము చేకూరును.



‘పాప’ —వాసన్.

# స్త్రీవిద్య-ఆర్థికస్వాతంత్ర్యము

కురుగంటి సీతారామయ్య

నారాయణరావుగారికి విశాల యేకపుత్రిక. ఆయన కామె అపరవయస్సులో పుట్టడం చేత యెక్కడాలేని ప్రీతి. అల్లారుముద్దుగా చూచుకుంటున్నాడు. ఆయన తప్పక స్త్రీలకు విద్య యియ్యాలనేకోటిలోవాడు. అంచేత విశాలను బళ్లోకి పంపాడు. విశాలకూడా ప్రతీక్లాసు ఫస్టుగా ప్యాసౌతూవచ్చింది. ఆయన డిస్ట్రిక్టలెక్టరుకాబట్టి యెప్పుడూ హైస్కూలున్నవూళ్లోనేవుండేవాడు. విశాల ౫వ ఫారంలోకి వచ్చింది. ౧౪ వ యేడు. శారదాచట్టా న్నుల్లంఘించటాని కాయనకు వీలులేదుకదూ? అంచేత పెండ్లాము బలవంత పెట్టినా ౧౪ వ యేడు నిండిందాకా ఆగాడు. తరువాతనే పెండ్లిప్రయత్నం మొదలెట్టాడు.

శ్రీనివాసరావుగారొక జాగీర్దారు. సాలుకు ౩౦ వేల రూపాయ లొస్తాయి. ఒక్కడే ఒక కొడుకు రామారావు. మంచి రూపసి. బుద్ధిమంతుడు. చదువులో కూడా యెక్కివచ్చాడు. పాపము ఇక బి. యే. పరీక్ష మూడుమాసాలుందనంగా శ్రీనివాసరావుగారు కాలంచేశాడు. అయినప్పటికీ తెలివిగలవాడవుటచేత రామారావు దుఃఖంలోవుండీకూడా పరీక్ష నెగ్గాడు. తల్లిమాటప్రకారము వుంటూ జాగీరులో ప్రజలందరి ప్రేమకూ పాత్రుడై యింటివద్దనే ఉన్నాడు. ఉద్యోగం చేసే వుద్దేశమే లేదు. ఓనాడు తల్లి

"అబ్బాయీ! పెండ్లిమాటేం చెప్పావు?" అంది.

"ఇదివరకే నా ఉద్దేశం చెప్పానుకాదూ?"

"గుంటూరులో డిస్ట్రిక్టలెక్టరు నారాయణరావు గారట! మొన్న మీ మామయ్యదగ్గిరికి కబురంపారట! నిన్న మామయ్య వచ్చి నాతో చెప్పాడు."

"ఏమైనా చదువు ఉందా పిల్లకు?"

"పిఫ్తుఫారమో యేదో చదువుతూందట! అయినా ఆడపిల్ల కంతచదు వెందుకులే!"

"చదువుకోనిపశువుని చేసుకోమంటావా యేమిటి?"

"అబ్బాయీ, నాకు తెలియక అడుగుతానుకానీ, ఆడాళ్లకు యింగ్లీషుచదు వెందుకురా?"

చదువుతూందని చెప్పిందికాబట్టి తల్లితో యిక చర్చించతలుచుకోలేదు రామారావు. మామా అల్లుడూ వెళ్లి పిల్లను చూశారు. పిల్ల నచ్చింది పిల్లాడికి. పిల్లాడు నచ్చాడు పిల్లకి. ఓరినోరు పలకరించి మాట్లాడారు. పెండ్లి యేప్రిలునెలలో అయింది గుంటూరిలోనే అతి వైభవంగా.

రామారావు అత్తవారింటికి తరుచుగా వస్తూ ఉండేవాడు. విశాలారామారావులు చిలకాగోరింకల్లాగ యింట్లో తిరుగుతూంటే నారాయణరావుగారికి చాలా సంతోషంగా వుంది. వాళ్లకికూడా ఓకిమీద ఓరికి ప్రేమ క్రమాభివృద్ధి పొందుతూవుంది. విశాల స్కూలు ఫైనలు ప్యాసైంది. వ్యక్తురాలూ అయింది. రామారావు పరేనని వప్పుకున్న మీదట విశాలను చెన్నపట్నం యింటర్మీడియేటుకు పంపారు. "క్వీనుమేరీకాలేజీ"లో చేరింది. ఇంటర్మీడియేటు రెండేండ్లు అయింది. ఫస్టుక్లాసులో ప్యాసైంది. తండ్రికి, భర్తకు మిక్కిలి సంతోషమైంది. శెలవల్లో విశాలారామారావులు గుంటూరులోనే ఉన్నారు. నారాయణరావుగారికి సర్వీసు పూర్తి కావటంచేత పించను తీసుకున్నాడు.

"నాన్నా, వచ్చేసోమవారం కాలేజీ తెరుస్తారు. వెళ్లకపోతే సీటు దొరకదేమో?" అన్నది విశాల.

"అయితే నీభర్త నడిగావా?"

"వాళ్లమ్మకు యింతమాత్రం ఇష్టంలేదట! కాని తన కభ్యంతరంలేదని చెప్పారు."

"నాదేముంది? నీ అత్తవారి సంగతి మాత్రం చూచుకో".

"చెప్పానుగా అక్కడున్న సంగతి!"

విశాల బి. యే. లో చేరింది. నారాయణరావు గారుకూడా గుంటూరులో ఇల్లు అద్దెకిచ్చి చెన్నపట్నం లోనే చేరాడు. రామారావుమాత్రం యింటిదగ్గిరే ఉండి పోయాడు. విశాలారామారావులకుమాత్రం ఉత్తరాలు నడుస్తూనేవుండాలి.

"ఏమిరా, అబ్బాయీ ఎంతకాలంరా నీపెళ్లాం చదువు?"

"చదువుకుంటే తప్పేముందే అమ్మా?"

"అంతులేదుట్రా చదువుకి? ఏం, ఉద్యోగాలు చెయ్యాలా, వూళ్లేలాలా?"

"నీ కొడుకు, కోడలు కూడా బి. యే. లైతే నీకు సంతోషంకాదే అమ్మా?"

"చట్టుబండలు!! నే బతికుండగా అది వచ్చి యీ యింట్లో తిరగటం, నీకడుపు నోకాయ కాయటం జరిగేట్టు కనపళ్లేదు."

రామారావు మరి మాటాడలేకపోయాడు. పాపం రామారావుతల్లి యీ సంభాషణ జరిగిన నెలదినాలకల్లా చనిపోయింది. మామగారికి సంగతి తెలియపరిచాడు. అత్తమామలు వచ్చారు. విశాలకు యిక పరిక్షలు 3 నెల లుండటంచేత రావటానికి వీలులేకపోయిం దన్నారు. రామారావుకు మనస్సు కొంచెము చివుక్కుమన్నది. కర్మాంతరా లైపోయాయి. నారాయణరావుగారూ, భార్యా మళ్లీ పట్నంచేరారు. తర్వాత నాలు గయిదుదినాలకు విశాల కీ కింది వుత్తరం వచ్చింది:



"చట్టుబండలు!! నే బతికుండగా అది వచ్చి యీ యింట్లో తిరగటం.

"శ్రీనివాసపురము,
౧౫-౧-౨౮

ప్రియా!

నీ ఉత్తరము అందింది. కర్మాంతరాలకు నీవు రాలేదని యెంతమాత్రం నా మనస్సులో లేదు. కాని మా అమ్మపోయినతర్వాత నామనస్సు నెనకటల్లె లేదు. ఇల్లు శూన్యమైంది. నీవొచ్చి యీ యింట్లో రాణివై తిరుగుతూండాలని తోస్తున్నది. మార్చితో బి. యే. పరీక్ష అయిపోతుంది కాబట్టి యీ విషయాన్ని కొంచెం మనస్సులో పెట్టుకో. మీ నాన్న గారితో సంప్రతించి ప్రత్యుత్తరం రాయి వెంటనే.

ప్రియుడు
రామారావు."

ఈ వుత్తరం చదివేటప్పటికి విశాలహృదయంలో భిన్నభిన్నభావాలన్నీ ఉత్పత్తి అయినాయి. రామారావుమీద తనకు ప్రేమ ఉన్నా, తా నాయనకు భార్యనుకదా అని అప్పుడు జ్ఞాపకమొచ్చింది. పెండ్లెందుకు చేసుకున్నానా అని పశ్చాత్తాపం కల్గింది. తన చదువు కంతరాయం కలుగుతున్నదే అని ఓప్రక్క, యెంతచదువుకున్నా ఓ మొగాడికి దాసీతనం చెయ్యటమేకదా ఆడదాని కర్మం అని మరోవైపున బాధించటం మొదలుపెట్టాయి. అనుశ్రుతంగావచ్చే ఆచారాలమీద అసహ్యం కలిగింది. వాటిని తిరస్కరించటానికి ధైర్యంలేదు. కాని ఆడదాని అస్వతంత్రత, అందువలన వచ్చినదైన్యము మనస్సును కలతపొందించాయి. ఇంతటితో చదువు కట్టిపెడదామా అంటే మనసొప్పటంలేదు. వీటి అన్నింటిమీద రామారావుస్థితి, చిత్తవృత్తి జ్ఞప్తికొచ్చాయి. హృదయం చలించింది. తన కత్యంతప్రియుడైన రామారావు కష్టపడుతున్నాడే అని చింతించింది. కాని తనకుమాలినధర్మముండదు కాబట్టి తన చదువు, తన స్వాతంత్ర్యము అన్న ఊహ అన్నిటిని కమ్మింది. తుదకు యేమైనాసరే తనకు స్వార్జనం చేసుకునే శక్తి వచ్చిందాకా తప్పక చదవవలసిందేనని నిశ్చయించింది. ఈపని రామారావుకు కోపము రాకుండా చెయ్యాలి. ఎట్లాగా అనే ఆందోళనతోనే రాత్రిఅంతా గడిచింది. ఒకటి, రెండు, మూడు, నాలుగు, కొట్టింది గడియారము. నిద్రపట్టలేదు. తుదకు బల్లమీదున్న కలము తీసుకుని యీ విధంగా రాసింది:

"లాయడ్ రోడ్డు, మద్రాసు
౧౬-౧-౨౮

నమస్కారములు!

మీ ఉత్తరము నా మనస్సును కలిచేసింది. ఈ మార్చి ౨౮ తేదీతో పరీక్షలు అయిపోతాయి. అప్పటికి మీరు తప్పక యిక్కడికి దయచేయండి. ఇంకా తొందరగా వస్తే యింకా సంతోషమే. నాహృదయం తమతోనే నిండియున్నది. మీ రిక్కడికొచ్చినప్పు డన్ని సంగతులు మనం మాట్లాడి నాన్నతో కూడా సంప్రతించవచ్చు. వెంటనే మీ శరీరారోగ్యము, చిత్తవృత్తి రాయండి. మీ ఉత్తరం చూచిందాకా నా కేమీతోచదు.

ప్రియురాలు
విశాల."

విశాల నెప్పుడు తన యింట్లో సంచరిస్తూవుంటే చూదామా అని ఉవ్విళ్లూరుతున్న రామారావుకు ఉత్తరం వచ్చిందనేటప్పటికి మనస్సు తత్తరించింది. ఉత్తరం విప్పటానికి చెయ్యి వణికింది. ఉత్తరంలో తాను రాసినదానికి సరియైన జవాబు రాయలేదే అని కొంచెం కోపం వచ్చింది. కాని పాపం విశాల తనయెడల అన్యథా వర్తించదన్న నమ్మకం కోపాన్ని పోగొట్టింది. ఓమూల "యెందుకు చదువుకున్న పిల్లను పెళ్లాడానా" అని కూడా తొంగి చూస్తూవున్నది. తన తల్లి కోర్క తీర్చలేకపోయినానే అని చింత పొందాడు. తుదకు మించిందిలేదు. చెన్నపట్నం వెళ్లి సంగతులన్ని నిర్ధారణ చేసుకుందామని మనస్సుకుదుర్చుకున్నాడు. ఇంకా దాదాపు రెండునెలలు ఆగాలె. రెండునెలలు రెండేండ్లుగా కనబడుతున్నాయి. ఇప్పుడే పోదామా అంటే, యెందుకు అనవసరం. పరీక్షచదువులో మునిగివుంటుంది విశాల. మరునాడు ఈ క్రిందివిధంగా రాసి పోస్టులోవేశాడు:

"ప్రియా!

నీవు రాసినప్రకారం నీ పరీక్షలు అయ్యేటప్పటికి నేను అక్కడికి రాగలను.

ఇట్లు
రామారావు."



విద్యుత్కిరణ ప్రసరణము ద్వారా సకల రోగములను కుదుర్చు నూతన సాధనము

౧. చర్మవ్యాధి నివారణము కొరకు చికిత్స పొందుచున్న బాలుడు.
G. S. A.



౨. ఇందు రోగి కపాలమునకు ఎక్సురే ఫోటో తీయబడుచున్నది.
G. S. A.



ఈ సంగ్రహలేఖ విశాలకు దుఃఖము కల్గించింది. స్వయంకృతాపరాధము! ఏమనుకునీ యేం లాభము లేదు. మనస్సు నిశ్చలం చేసుకుని పరీక్షకు గట్టిగా చదవటం మొదలుపెట్టింది. తప్పక ఫస్టుక్లాసులో ప్యాసవుతుందని, తమ కాలేజీకి గౌరవం కలుగుతుందని ప్రొఫెసర్లంతా అనుకున్నారు. ఇట్లా వుండగా ఇక పరీక్ష ౧౫ దినాలుందనగా విశాలతండ్రి ఒకబస్సు ప్రమాదంలో అకస్మాత్తుగా చనిపోయినాడు. విశాలా, తల్లీ కూడా దుఃఖసముద్రంలో మునిగారు. వెంటనే రామారావుకు టెలిగ్రాం యిచ్చారు. మరునాడు రైలులో రామారావు వచ్చాడు. కరోనరు (Coroner) విచారణై బస్సు ప్రమాదంవల్ల చనిపోయినట్లు తీర్పుచెప్పి శవాన్నియిచ్చేశారు. దహనాదిసంస్కారా లయినాయి. పాపము విశాలకు తనదుఃఖమేగాక తల్లియేడ్పుకూడాను. చదువేం సాగుతుంది? కర్మాంతరాలు అయిన మూడు దినాలకే పరీక్ష. రామారావు యింట్లో ఉన్నాడనే ధైర్యంతో విశాల పేపర్లు రాయకల్గింది. మొగడుపోయినా కూతురు, అల్లుడు యింట్లోవున్నారుకదా అని ముసలమ్మకూడా మనస్సు కుదుర్చుకున్నది.

పరీక్షలు అయిపోయాయి. అందరూకూడా దుఃఖాన్ని కొంచెం కొంచెముగా మరుస్తున్నారు. ముసలమ్మకూడా చేసేదేం లేదని, పిల్లలు సుఖంగా ఉంటే చాలని ఊరటపడ్డది. ఇట్లావుండగా ఓ రోజున విశాల యినప్పెట్టెలో కాగితాలు వెతుకుతూంటే అందులో ఓస్టాంపుకాగితం కనబడ్డది. రిజస్టరీకూడా చేసివుంది. కొంచెం చదివేటప్పటికి విశాలకు కండ్లకు నీళ్లొచ్చాయి. తల్లి ఆసంగతి చూసి

"అమ్మాయీ, యెందుకే కండ్లనీరుకారుస్తున్నావు" అని అడిగింది. విశాలకు నోట మాటరాలేదు. ఇంతలో రామారావు వచ్చాడు. విశాల కాగితము రామారావుచేతి కిచ్చింది. రామారావు చదివి "ఇది మామగారి విల్లండి అత్తగారూ." అన్నాడు.

"తమరు విల్లురాసినట్టు వారు నా కెప్పుడూ చెప్పలేదు; రాశారు కాబోలు" అన్నది ముసలమ్మ కళ్లొత్తుకుంటూ. ఈమె పెంకుటినుంచీకూడా వ్యవహారంలో జోక్యం కలగజేసుకునేదికాదు. విల్లులో నారాయణరావుగారు తన యావదాస్తిని ఉదాహరించారు. ఇల్లుతప్ప స్థిరాస్తి లేదు. మిగిలినదంతా బ్యాంకులో రొఖంగానే ఉంది. నారాయణరావుగారు లంచాలు యేమాత్రం పుచ్చుకునేవాడు కాదు. ఆయనఆస్తిఅంతా కష్టార్జితం. జీతంలోనుంచి ఆదాచేయబడిన బాపతు. మొత్తం ౬౦ వేలకు ఉంది. అందులో భార్యకు ౫,౦౦౦ ఆమెయిష్టప్రకారం చేసుకునేటట్టు రాశాడు. కూతురికి ౧౦,౦౦౦ ఆమెయిష్టప్రకారం రాశాడు. గుంటూరులో వున్న యిల్లుమాత్రము అల్లుడికి యిచ్చాడు. మిగిలిన ఆస్తిఅంతా విశాలారామారావులకు పుట్టెడి సంతానానికి చెందేటట్టు రాశివుంది. అట్లా సంతానం కలగకపోతే సంతానంపుట్టేవయస్సుమీరినతర్వాత విశాలా రామారావులు తమయిష్టమువచ్చినట్టుగా చెరిసగము ఉపయోగించుకోవచ్చు. ముసలమ్మ అంతా విని నిట్టూర్పువిడిచి "కుటుంబం నిలవడానికి యేమీచేయలేదే!" అంటూ రెండు అశ్రుబిందువులు కార్చింది. మళ్లీ కాగితాన్ని మడిచి పెట్టెలో పెట్టారు. ఆస్తికంతకూ తన్ను అధికారిగా చేయలేదే అని విశాల కేమైనా అంతస్సులో ఉన్నదేమోకాని పైకిమాత్రం కనపర్చలేదు.

నెలగడిచింది. విశాల పరీక్షప్యాసయినట్టు తెలిసింది. అందరూ సంతోషించారు. సుందరమ్మకూడా చదువుకున్న కూతుర్ని, అల్లుణ్ణి చూచుకుంటూ సంతోషిస్తూనేఉంది. ఆమెమనస్సు పరీక్షచేస్తే, వాళ్లిద్దరూకూడా ఉద్యోగంచేసి సంపాదించ నవసరంలేదు కాబట్టి, యికసుఖంగా యింట్లో కాపురంచేస్తూ సంతానాన్ని కనిముద్దుముచ్చట్లు జరుపుకుంటూ తాను జీవించినంతకాలం గడపాలని ఉంది. ఓనాడు ఈ అభిప్రాయాన్ని సూచిస్తూ కూతురితో "అమ్మాయీ, ఇద్దరూ చదువుకున్నారు. వయస్సువచ్చింది. ఈవూళ్లో ఉండనవసరంలేదు. కాబట్టి గుంటూరువెళ్లి మనం యిల్లు బాగుచేసుకుని ఉండిపోదాం. నీవు అన్నీ తెలిసినదానివి కాబట్టి నే నెక్కువగా చెప్పనక్కరలేదు" అన్నది.

విశాల బదులేమీ చెప్పలేదు. విశాలారామారావులు అన్యోన్యంగా ఉన్నారేకాని యింతవరకు దాం

సత్యధర్మాలు లేవు వారిమధ్య. ఈసంగతి తల్లికితప్ప యెవ్వరికీ తెలియదు. రామారావు మనస్సు నిగ్రహించుకుని కాలంగడుపుతున్నాడు. సుందరమ్మకు కూతురి ప్రవర్తన బోధపడటంలేదు. విశాలమనస్సులో యేముందో యెవ్వరికీ తెలియదు. ఇద్దరూ కలిసి బీచికి పోతూనే ఉండేవాళ్లు. రామారావుకు అనేకమార్లు బీచీ యిసుకలో వెన్నెలరాత్రి ఆమెను కౌగిలింతామా అని బుద్ధిపుట్టిందికాని, ధైర్యం చేశాడుకాడు. రెండునెలలు అయినతర్వాత ఓనాడు బీచిమీద యిద్దరూ నీళ్లకు దగ్గరగా కూచున్నారు. చుట్టుపక్కవాళ్లల్లో కొందరి కళ్లు వీళ్లమీదే ఉన్నాయి. కొంచెము సంధ్యచీకటి పడ్డది. ఇద్దరికి ౫,౬ అంగుళాల యెడంతప్ప లేదు. విశాల వేలుతో తడియిసుక తుళ్లగిస్తూ,

"నే నోమాట అడుగుతాగానీ, దాచకుండా సమాధానం చెబుతారూ" అన్నది.

"విశాలా, నీయెడలా దాపరికము?"

"నాపైన మీకు కోపము లేదుకదా?"

విశాల ప్రశ్న అడిగినరీతి బహుహృదయంగమంగా కనిపించింది రామారావుకు. ఆలస్యంచేస్తే ఆలోచిస్తున్నాడనుకుంటుందని, "కోపానికి కారణ మేముంది విశాలా?" అన్నాడు. చిన్నబుచ్చుకున్న విశాలముఖం వికసించింది చిరునవ్వుతో. "మీరు ఉత్తరంలో రాసిన విషయాన్నిగూర్చి ఆలోచించటానికి యింతవరకు సావకాశం లేకపోయింది. సంగతులన్నీ అవ్యవధానంగా జరిగిపోయినాయి. ఇప్పుడిప్పుడే మనస్సు కొంచెం శాంతిస్తున్నది. ఆసంగతులు మనం మనస్సువిప్పి మాట్లాడటానికి యిప్పుడు మీ కిష్టమేనా?"

రామారావు మనస్సు వక్క గంతేసినట్టయింది. "నాసంగతి నాకిష్టమా అని అడగాలా విశాలా?" అన్నాడు.

"మీకు నాయెడల సంపూర్ణానురాగం ఉందని దృష్టాంత మక్కరలేదు. ఆసంగతి నాకు నిశ్చయమే! నామనస్సులో తమరు తప్ప యితరపురుషబింబం లేదని సముద్రుడు ప్రమాణంగా మనవి చేస్తున్నా. మీకు నమ్మకమేనా?"

"ఆమాట నన్నడగాలా విశాలా?"

"నేను మిక్కిలి ధన్యను."

"నేనుకూడా అట్లాగేఅనుకుంటున్నా."

ఇద్దరిచేతులు అప్రయత్నంగా కలిశాయి. ఇదే పెండ్లి అయినతరువాత రెండో కరగ్రహణం. ఇద్దరూ స్పర్శసుఖం అనుభవించినట్టు దృష్టాంతంగా యిద్దరికి రోమాంచం అయింది. ఇద్దరికి కొంతసేపటిదాకా నోట మాటరాలేదు. విశాల దోవలోకి వస్తున్నదని, తనఆశ ఫలించేదినం వచ్చిందని



"రామారావు నిర్ఘాంతపడిపోయినాడు. నోటమాటరాలేదు."

రామారావు లోలోపల సంతోషిస్తున్నాడు. కొంత సేపటికి విశాల,

"మీ ఉత్తరములో రాసినట్టు యింకా కొన్నాళ్ల దాకా చెయ్యక చదువుకుంటే మీ చిత్తం మారి నాపైన ఉన్న ప్రేమ కేమైనా భంగం కలగదుకదా?" అన్నది.

రామారావు నిర్ఘాంతపడిపోయినాడు. నోట మాట రాలేదు. ఆశాహర్మ్యం ఒక్కమారు గుభాలున కూలింది. అనేక ఆలోచనలు ఒకటితరువాత ఒకటిగా గిరగిరతిరుగుతున్నాయి. తుదకు "నీయిష్టం అట్లా ఉంటే నేను చేసేదేముంది?" అన్నాడు.

కొంచెము చీకటి వ్యాపించింది. నీదికి వచ్చిన వాళ్లంతా లేవడం మొదలుపెట్టారు. విశాలారామారావులుకూడా లేచి సాగారు. ఏమీ మాట్లాడకుండానే యిల్లు చేరారు. ఇద్దరిమనస్సులూ ఆందోళనతో నిండి పోయినాయి. భోజనంముందరకూడా మాట్లాడలేదు. రామారావు చేయికడుక్కొని "విశాలా, బడలికగా ఉంది. నేనుపోయి విశ్రమిస్తాను" అన్నాడు. విశాల యేం మాట్లాడలేదు. ఇదంతా చూస్తూవున్న సుందరమ్మకు కొంచెము అనుమానమేశింది.

రామారావుకు నిద్ర రాలేదుకదా పైపెచ్చు మనస్సు ఆలోచనలతో నిండిపోయింది. "చదువుకున్నది చాలదూ? అంతున్నదీ? వివాహానికి పరమావధి యేమిటో యింతచదువుకున్నా తెలియలేదే? కామాంతురం కాలేదా? విపరీతంగా ఉందే? లోకాన్ని చూచైనా గ్రహించలేకపోయిందే? వాళ్ల నాన్నగారి పవిత్రాభిప్రాయంకూడా యీమెకు నచ్చలేదే? నామాటే తోసి రాజన్నప్పుడు యిక వాళ్లమ్మమాటంటే వింటుందీ? మా అమ్మ చెప్పినట్టే అయిందే? పోనీ నాయెడల ప్రేమలేదా అంటే అట్లా అనటానికికూడా వీలులేదే! సాయంకాలమేగా ప్రమాణంచేసింది! విశాల యెప్పటికీ ముఖప్రీతిమాట ఆడదు. పోనీ, నేను మరోవిధంగా ప్రవర్తిద్దామూఅంటే నామనస్సంతా విశాలతోనే నిండి ఉందే? మరియొక స్త్రీని స్పృశింపజాలను! "నాతి చరామి" అని బాసకూడా చేస్తినే! దానికి విపరీతంగా ప్రవర్తించి యిహపరాలకు దూరుణ్ణికానా? ఛీ నాతుచ్ఛ సుఖము!! ఇద్దరూ చెరోవేపుకు లాగితే సంసారం వీధులోనే! కాబట్టి నా అభిప్రాయప్రకారం ఆమె చేయకపోతే ఆమెయిష్టప్రకారం చెయ్యటం నావిధి." అనుకుంటూ యిద్దరి అభిప్రాయాల మంచిచెడ్డలను పరిక్ష చెయ్యటం ప్రారంభించాడు. "స్వసౌఖ్యం నా ఉద్దేశం. విద్యార్జనం ఆమె ఉద్దేశం. రెండిటిలో విద్యార్జనం పవిత్రతరం. కాబట్టి పవిత్రతరమైన విద్యార్జనంకోసం తుచ్ఛమైన నా స్వసౌఖ్యం వదలడం కర్తవ్యం." అనుకుంటూ మంచంమీద వెల్లికలా పడుకుని ఆలోచిస్తూ వుండగా తలుపు తట్టినట్లైంది. రామారావు లేచి తలుపుదగ్గిరికి వెళ్లి "విశాలా" అన్నాడు. "తలుపు తియ్యండి" అని వినపడ్డది. తలుపుతెరిచి విశాల లోపలికి వచ్చింది. రామారావు మంచంమీద కూర్చున్నతరువాత పక్కనున్న కుర్చీమీద తాను కూర్చున్నది. ఆమెముఖం చూస్తే ఆమెకుకూడా నిద్రరాలేదనీ, మనస్సు ఆందోళనతో నిండివుందనీ చెప్పకచెపుతూవున్నది.

"ఏం నిద్రరాలేదా విశాలా?"

"నాకుకూడా మనస్సు లేదనుకున్నారా?"

"మీ అమ్మ నిద్రపోయిందా?"

"ఆసంగతి చూచే యిట్లా వచ్చా. సాయంకాలము మీ మనస్సుకు కష్టంకలిగించానని తోచి క్షమాపణ చెప్పకుండామని మనస్సు తత్తరపడుతున్నది. నన్ను మీరు క్షమించానంటేనేగాని నామనస్సు కుదుట పడదు." అంటూ రామారావు రెండుకాళ్లను రెండు చేతులతో పట్టుకున్నది. రామారావు కరిగి నీరై పోయాడు. మరొకడైతే "అతివినయం" అనుకునేవాడే కాని రామారావు ఆమెహృదయం బాగా తెలిసినవాడు కాబట్టి ఆమెప్రవర్తనలో ఆయనకు ఆర్జవమే కనబడ్డది.

"నీ వేం తప్పుచేశావని క్షమించడం విశాలా! పిచ్చిదానా! లే" అంటూ విశాల లేవటానికి చేయూత

యిచ్చాడు. విశాల లేచి కూచుంది. ఇంకా మాట్లాడ టానికి తగిన మనఃస్థైర్యం చిక్కలేదు.

"నాకూకూడా యిందాకటినుంచీ ఆందోళన గానే ఉంది. ఆలోచించగా తుదకు నా తుచ్ఛసుఖం కంటె నీ ఉద్దేశం పవిత్రమైందని నిశ్చయించా." అన్నాడు రామారావు.

"నాకుకూడా సరిగా నాఉద్దేశం అట్లాగే తోచింది"

"జ్ఞానసంపాదనం పవిత్రకార్యంగాని అందులో స్వార్థ మేముంది విశాలా?"

ఎప్పుడైతే తనతో ఆయన యేకీభావం అవుతున్నట్టు కనపడుతున్నదో ఆమెకు కొంచెం ధైర్యం వచ్చింది. ఇదే సమయం తన అభీష్టం నెరవేర్చుకోటాని కని తోచింది. కాని ఆయన అభీష్టం బొత్తుగా తోసేసి తన అభీష్టం నెరవేర్చుకోటం సమంజసం కాదనుకున్నది. రెంటిని నెరవేర్చటం సాధ్యమైనంత వరకు మంచిదని ఆలోచించి,

"నేను మెడికల్ కాలేజీలో చేరుదామని ఉంది. మీ సహోదార్యాన్ని కనిపెట్టజాలనంత మూర్ఖురాలను కాను. మీరు వద్దనరనీ, నా అభీష్టం నెరవేరుస్తారనీ నాకు తెలుసు. కాని మీ అభీష్టం బొత్తుగా నెరవేర్చక పోవడం తప్పని నా అంతరాత్మ చెప్పుతున్నది. కాబట్టి ............"

"నా విషయమై నీ వంతమాత్రం ఆదుర్దా పడవద్దు. పురుషుడు పశువు. నీ వేమిచేసినా నాకు సంతోషమేనని నాతోడుగా చెపుతున్నా."

విశాలకు తనభర్తయొక్క ఆత్మపరీక్ష ఆశ్చర్యం కలిగించింది. అట్టివాణ్ణి భర్తగా బడసినందులకు తన్నభినందించుకుంది. అట్టినిష్కలంకప్రేమను తాను పరీక్షిస్తున్నందుకు తన్నుతాను నిందించుకున్నది. తన విద్యాభ్యాసంకూడా వదిలేదామా అన్నదాకాకూడా అభిప్రాయంపోయింది. కాని తనకు ఆర్థికస్వాతంత్ర్యము వస్తేనేగాని పురుషుడితో తనకు సామ్యం రాజాలదనే నమ్మకంచేత వదలేయ బుద్ధిపుట్టలేదు.

"నామనవికూడా కొంచెము చిత్తగించండి."

"నీవు అంతగా చెపుతానంటే వినకపోవటం తప్పు. ఏదీ కానీ! చెప్పు." అన్నాడు తుదకు.

"ఇక వారందినాలలో మెడికల్ కాలేజి తెరుస్తారు. కాబట్టి యీవారం మీ యిష్టప్రకారం......" విశాల తలవంచుకున్నది. ఈ మాటలు వినేటప్పుడు రామారావుమనస్సులో ఒకటివెంట వకటిగా రెండు ఊహలు తట్టాయి. ఆమె యిష్టముచొప్పునైతే ఆమెతో సంసారసుఖ మనుభవించటానికి తా నింకా యెన్ని సంవత్సరములు కనిపెట్టుకుండాలో మొదటిది. ౫ యేండ్లు!! తన సౌఖ్యంకొరకు ఆమె యెంత బేలైనది రెండవది. తనయెడల ఆమెకున్న ప్రేమయెంతో ఆమె ఆత్మార్పణంవల్ల తెలిసింది. తన యాశ మిక్కిలి తుచ్ఛమైందని మరీధృఢమైంది అతని మనస్సులో. ఆయనయొక్క స్వార్థత్యాగోద్దేశం గట్టిపడింది.

"విశాలా! అంతకక్కుర్తి అనవసరం. నన్నంత తుచ్ఛుణ్ణిగా తలచవద్దు." అంటూ వక్కమారు విశాల కుడిచేయి తీసుకుని దానిని తనపెదవులకు తాకించుకున్నాడు. విశాలకు పట్టరాని ఆనందం కలిగింది. కాని తన బేలతనానికి సిగ్గుపడ్డది. రామారావుకార్యదీక్షకు ఆశ్చర్యంపొందింది. పురుషహృదయంకంటె స్త్రీహృదయం మృదువైందని ఆమె కప్పుడు గోచరమైంది. కాని రామారావు చూపిన ఔదార్యానికి తాను చేయదలచుకున్న త్యాగము బహుస్వల్పమైందని కూడా తట్టింది. కొంతసేపు నిరుత్తరయై తలవంచుకుని కూచునే ఉంది. కొంతసేపటికి, "స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యం ఉంటేనే గాని భార్యాభర్తలు సమాన ప్రతిపత్తిగా ఉండజాలరని నేను మొదటనుంచీ అనుకునేదాన్ని."

"ఎంతపిచ్చిదానివి విశాలా! ఇప్పుడైనా నీ అభిప్రాయం మారలేదా? నా యావదాస్తీ నీ యిష్టప్రకారం చేయనిచ్చి దరిద్రుణ్ణి కావటానికి సిద్ధంగా వున్నానే! తండ్రి ౧౦,౦౦౦ యిచ్చిన తరుణికి ఆర్థిక స్వాతంత్ర్యాని కేమిలోటు?"



"ఒక్కమారు విశాలకుడిచేయి తీసుకుని దానిని తన పెదవులకు తాకించుకున్నాడు."

"మీ ఆస్తి నాది యెన్నటికన్నా అవుతుందా? మా నాన్న యిచ్చింది నాచదువుసూ, తర్వాత ఆసుపత్రి పెట్టుకోటానికీ సరిపోతుంది."

"ప్రేమపూరితులగు భార్యాభర్తలలో నీ నా భేద ముంటుందా విశాలా?" విశాల మాటాడలేదు. తుదకు కొంతసేపటికి,

"ఆర్థికస్వాతంత్ర్యములేని స్త్రీ పురుషుడికి దానిపై తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి భర్తచేత అర్థాంగిగాగాక ఆటవస్తువుగా తలచబడుతుందనికూడా నే ననుకునేదాన్ని."

"పురుషు లంతనీచులా విశాలా?"

"తమరు నన్ను క్షమించాలె. పురుషులందరూ తమవంటివారే అయితే ప్రపంచం స్వర్గమే అనచ్చు!"

"స్త్రీ లంతా నీవంటివాళ్లైతేకూడాను!"

ఈ మాట లన్నప్పుడు రామారావు నేత్రాల్లో ఆ ఘనఅంతరాత్మ ప్రతిబింబిస్తూవున్నది.

"మీ నిష్కలంకచిత్తవృత్తిని తలుచుకున్నప్పుడు మీ వంటి ఉత్తమునకు నేను తగనిదానవని నాకు తోస్తూవుంటుంది." అంటూండగా విశాలరెండు నేత్రాల్లోనించి రెండు అశ్రుబిందువులు రాలాయి. తన మనస్సుకు కష్టం కలిగించానే అని విశాల యెంతబాధ పడుతున్నదో రామారావుకు గోచరమైంది.

"విశాలా, నీవు యెంతమాత్రం దుఃఖించవద్దు. నాస్వార్థపరత్వం జ్ఞాపకంవచ్చినప్పుడు నాకు చాలా సిగ్గుగా ఉంటుంది. సంసారసౌఖ్యం తుచ్ఛం. నీ వంటి దాని ప్రేమే చాలు."

ఇద్దరికి పట్టరాని ఆనందం కలిగింది. నిరుత్తరులై అట్లై ఉండిపోయారు. తరువాత కొంత సేపటికి రామారావు,

"విశాలా, యిక వారందినాల్లో నేను యింటికి వెళ్లిపోదామని ఉంది." అన్నాడు.

విశాలకు యెట్లాగైనా రామారావును తనవద్దనే ఉంచుకోవాలని ఉందికాని దోవతోచటంలేదు. రామారావుకుమాత్రం తా నిక్కడవుంటే మనస్సు చలించి ఆమెచదువు పాడుచేస్తుందేమో అని ఉంది ఓవైపున. మరోవైపున ఆమెను చూస్తూ మాట్లాడుతూనైనా యిక్కడ వుందామనికూడా ఉంది. ఇంతలో విశాల,

"మీరు వెళ్లటానికి మనసొప్పటంలేదు. మీరుంటేనేగాని నాచదువు సాగదు. చిత్తము శాంతంగా వుండదు. ఇంతేకాక యిద్దరం యిప్పుడు విడిగా చెరోచోట వుంటే లోకులు పలుగాకులు, అపవాదులు పుట్టిస్తారుకూడాను. కాబట్టి మీ రిక్కడేవుండడం ఉచితం. మనస్సును ఊరికే యేమివ్యాపకం లేకుండా ఉంచడం కష్టంకాబట్టి నాకు వక ఆలోచన తోస్తున్నది" అన్నది. ఆలోచించగా విశాలతర్కం రామారావుకు నచ్చింది. ఇక్కడే వుందామనుకుంటున్న రామారావుకు విశాలమాటలు శ్రోత్రపేయాలుగా ఉన్నాయి. "తప్పక నీయిష్టప్రకారం చేస్తా"అన్నాడు.

"మీరు లాకాలేజీలో చేరండి. యం. యల్., యెప్రెంటిసుకలిసి అయిదేండ్లు అవుతుంది. ఇద్దరం గుంటూరులో ప్రాక్టీసుచేదాం."

రామారావుకు విశాలఆలోచన మిక్కిలి సంతోషం కల్గించింది. సరేనన్నాడు. విశాల కార్యం సఫలమైందని సంతోషిస్తూ,

"తెల్లవారుజాము కావచ్చింది. ఇక మా అమ్మ లేస్తుంది" అంటూ లేచింది. రామారావు "ఇక అయిదేండ్లదాకా అడగను" అంటూ ఆమెను వక్కమారు కౌగిలించి పెదవులు కలిపాడు. విశాలకూడా కండ్లు మూసుకుని ఆనందం అనుభవించినట్లే కనబడ్డది.

మరుదినము విశాల మెడికల్ కాలేజీలో చేరింది. రామారావు లాకాలేజీ తెరిచింతరువాత అందులో చేరాడు. సుందరమ్మకు మాత్రం యెంతమాత్రం మనస్సుకు బాగాలేదు.

"వృత్తి అల్లుడు దొరికాడు: యెట్లా వప్పుకున్నాడో? నాకు మాత్రం యెంతమాత్రం నచ్చలేదు. వీళ్లు అయిదేళ్లు చదివి,ప్యాసై, ప్రాక్టీసుచేస్తూ; అప్పుడా సంసారం? అందాకా నేను బతుకుతానో, లేదో? మాకు నీళ్లుచల్లే గతి కనపడలేదు. సంగతులన్నీ చూస్తే యీసంసారం సానుకూలపడాతుందని తోచదు. నేనూ పెద్దదాన్నైనా. ఎప్పుడో, యేమో? ఇవాళ విశాలతో చెప్పిచూస్తా. వినకపోయిందా నేను తప్పక పెంచుకుంటా" అని గొణుక్కుంటూ కుంపటి రాజేస్తుండగా అప్పుడే కాలేజీనుంచి వచ్చి చెప్పులు విప్పుతున్న విశాలకు ఆఖరుమాట చెవినపడ్డది.

"అమ్మా, యేమిటే పెంపుడంటున్నావు?"

సుందరమ్మ తలయెత్తి చూసింది. మొదట తన మనస్సు బైటపడ్డదని తట్టిందిగాని తరువాత కుండ పగలగొట్టినట్టు నిజం మాట్లాడాలని తోచి,

"అమ్మాయీ, నీకు తోచదు. ఒకరు చెబితే వినవు. ఇంకా యెన్నాళ్లు యీచదువు? మంచిపని కూడా 'అతి' అయితే దాన్నికూడా పిచ్చి అనే అం

టారు. నీవు నామాట విని చదువుకట్టిపెట్టు. ఇద్దరూ చక్కగా చదువుకున్నవాళ్లు. ఇక చదువు కట్టిపెట్టి సంసారంచెయ్యటం నామతం. "౨౦ యేండ్లు వచ్చిం తరువాత చదువుకోక నోటమట్టిగొట్టుకోనా" అన్నట్టు ౪౦ యేండ్లు వచ్చింతర్వాత యింకా సంసారమెందుకు? నీవు గనక చదువు మానకపోతే నాయిష్టం వచ్చినట్టు నేచేస్తా."

"ఎందుకమ్మా అంతకోపమూ, తొందరానూ? నా డాక్టరు పరీక్ష, నీ అల్లుడి యం. యల్. పరీక్ష వక్కమారు అయిపోతాయి. ఇద్దరం పోయి గుంటూరులో ప్రాక్టీసు చేస్తాము. మీ అల్లుడు సరే అన్నారు. నీకేమే అమ్మా?"

"నా కేమా? అవును. మీ నాన్న మీ కడుపు ఫలిస్తుందని, మా కిన్నినీళ్లు చల్లుతారు అనేకమూ నీకు పెండ్లిచేసింది! విల్లువల్లనే ఆయన ఉద్దేశ్యం స్పష్ట మౌతున్నది. ఆయన ఊపిరితో వుండగా మనవుల నెత్తు కుండానే పోయారు. నాగతికూడా అంతే పట్టించ దలచుకున్నావు నీవు. మాకు మొగపిల్లవాడు లేక పోయినా నీకడుపు ఫలించి దౌహిత్రుడు గతిఅవుతాడు గదా అనే ఆశ యీ నీచదువుతో అంతరించింది. నీ పుట్టినింటిని నిలబెట్టే బాధ్యత నీది."

"అయితే నన్ను యేంచెయ్యమంటే అలా చేస్తాను."

"యేమో? యేంచేస్తావో? నాకున్నవి ముష్టి ౫౦౦౦ రూపాయలు. దానికి పెంపు డెవరిస్తారు?" విశాల కొంచెం ఆలోచించి,

"అయితే అమ్మా! నాకు చదువుకు నెలకు ౫౦ చొప్పున ౫ యేండ్లకు మూడువేలు అవుతాయి. "నందో రాజా భవిష్యతి" తర్వాత చూదాం, మిగిలిన ౨ వేలు నీకిచ్చేస్తాను. నీవు దత్తుచేసుకో. నాకుకూడా పుట్టిల్లని, తమ్ముడని ముచ్చట తీరుతుంది."

సుందరమ్మముఖం వికసించింది. "వీళ్లమీద ఆధారపడేకంటె యిది బాగా ఉన్నట్టు తోచింది. వీళ్లకి పిల్లలు పుట్టే మరీ మంచిది. రెండు కుటుంబాలు నిలుస్తాయి. విశాల పింతండ్రిదగ్గిర పిల్లవాడుకూడా వున్నాడు. ఆస్తే కలవాళ్లుకారుకాబట్టి గంతేస్తూ యిస్తారు. కాబట్టి గట్టిచేసుకుంటే మంచిది. ఒకవేళ విశాలహృదయం మారుతుందేమో?" రామారావును పిలిచి ఆరోజునే మరిదికి ఉత్తరం రాయించింది. వాళ్లు సరేనన్నారు. ఒకమాసంరోజుల్లో అంతా సంపూర్తి అయింది. విశాలదగ్గిరివి ౨౦౦౦, సుందరమ్మదగ్గిరివాట్లో ౩౦౦౦, మొత్తం ౧౦,౦౦౦లు పిల్లవాడిపేర బ్యాంకులో వాడిమైనార్టీ వెళ్లింతర్వాత వాడికిచ్చేటట్టువేశారు. ముసలమ్మ తన స్వంతానికి ౨౦౦౦ అట్టిపెట్టుకుంది. పిల్లవాడికి పదోయేడు. మంచి రూపసికూడాను. బుద్ధిమంతుడు. వాడ్నికూడా మైలాపూరులో స్కూలులో వేశారు. వాడికి విఠల్ అని నూతనమైన పేరుంచారు. అంతా అనుకూలంగానే వెళ్లిపోయింది. రామారావుకు ఈ సంగతంతా చూడగా భార్యమీద ఆదరం హెచ్చింది. ఆమె సాక్షాత్తు దేవతగా కనపడుతున్నది.

దత్తతైంతర్వాత విశాలప్రోత్సాహంచేత యీ కుటుంబం పెనకటియిల్లు వదిలి యింకొక చిన్నయింట్లో ప్రవేశించారు. విశాలలోకూడా అనేకమార్పులు కలిగాయి. సబ్బుబిళ్లలు, సెంట్లు మానేసింది. రిక్షామానేసి ట్రాంమీద వెళ్లడం మొదలుపెట్టింది. మొత్తంమీద జీవనంలో నిరాడంబరత్వం వచ్చింది. కొన్నాళ్లకు రామారావు సంగతంతా గమనించి, ఒకరోజున

"విశాలా! మాట! నిన్నొకటి అడుగుతాను. కోపం రాదుకద!"

"మీమీదనే కోపంవస్తే యిక నాబ్రతుకు కెందుకు?"

"నీలో మార్పేదో కనపడుతున్నదే! కారణం చెప్పు విశాలా?"

"మానాన్నహయాంలో యిష్టమొచ్చినట్టు ప్రవర్తించా. ఇప్పు డట్లా వుండటానికి వీలున్నదా? చెప్పండి."

"విశాలా, నీవు నిర్దయురాలవు! నీకు సౌఖ్యం కూర్పలేని నా భాగ్య మెందుకు?"

"నా అభిప్రాయం మీకు తెలిసే మళ్లీ యిట్లా అంటున్నారు."

"విశాలా, మన ఉభయులలో యీ భేదం పెట్టుకోడం నాకు మిక్కిలి మనస్తాపం కలగజేస్తున్నది."

"పూర్వకాలంలోకంటె పరిస్థితులు మారలేదండి మరి? స్త్రీ స్వాతంత్ర్యం అనేదానికి అర్థంలేదు కాకపోతే."

"అయితే నాఘనం నీవు ముట్టవన్నమాట."

"మీకు కోపం యేమాత్రమొచ్చినా ప్రతివిషయంలోనూ మీకు లోబడ్డాననే తలచండి." విశాల యీమాట అనేటప్పటికి రామారావు పెదవి కొరుక్కున్నాడు. విశాలపైన మరింత గౌరవం హెచ్చింది.

"అదిగాదు, విశాలా, నీకు అయ్యే అన్ని ఖర్చులు నన్ను పెట్టనియ్యాడం నాకు సంతోషం కలగజేస్తుంది. తర్వాత నీయిష్టం."

"ఏదోమాటన్నానుకాని అవసరమైతే మిమ్మల్ని అడక్కతప్పుతుందా యేమిటి?"

"అంతేచాలు, సంతోషం. అవకాశమిచ్చావు."

"నావి ౫౦, అమ్మ ౨౫ యిస్తానన్నది. ౭౫ లో సంసారం గడవాలి."

"అయితే, విశాలా, నాకు రెండువరాలివ్వాలె."

విశాలకు నవ్వొచ్చింది. "మీరు కోరడం, నేను కాదనడమూనా" అన్నది. "సంసారంలో నావి ౫౦ రూపాయలు చందావేసుకో. నేనుమాత్రం అప్పనంగా తినడం న్యాయమా? మగోడేమిటంటే! గుంటూరులో యిల్లు మీనాన్నదేకాబట్టి దాని అద్దె నీవు చదువుకు వినియోగించుకో. ఈ రెండూ నీవు కాదనద్దు."

విశాల మౌనంతో అంగీకరించింది. అప్పటినుంచి రామారావు గుంటూరులోని యింటిఅద్దె విశాలపేర బ్యాంకులో వెయ్యటం మొదలెట్టాడు. తన యావదాస్తికి గుమాస్తాల నేర్పరచి ఆదాయం తనకు పంపేటట్టు ఏర్పాటుచేశాడు. విశాల కూడా మంచి అనువర్తనగా ఉన్నాడు. తెలివితేటలుగా చదువుతూనే ఉన్నాడని కనుక్కుంటే తెలిసింది. సుందరమ్మకు కూడా పిల్లాడంటే ప్రేమగానే ఉంది. వాడికి మంచి శ్రద్ధ అంతా విశాలే చూస్తూండేది. సుందరమ్మకు కూతురికి బుద్ధివచ్చి కడుపు ఫలించలేదనే కించతప్ప యితరవిచారం లేకుండావున్నది.

ఇట్లా కొన్నినెలలు గడిచింది. విశాల మెడికల్ కాలేజీలో చదువుతున్నా ప్రాక్టికల్ క్లాసులకు జనరలాస్పత్రికి వెళ్లేది. ఒకనాడు జనరలాస్పత్రికి వెళ్ళినప్పుడు, ఒక బ్రాహ్మణవితంతువు వారం దినాలకిందట ప్రసవంకావడానికి వచ్చినట్టు, ఆమె ఆదినం చనిపోయినట్టు, ఆమెకు షుమారు ౯ యేండ్ల కూతురున్నట్టు, ఆపిల్లను 'మా పిల్ల'ని యెవ్వరు అడగడానికి రానట్టు, ఆపిల్ల మిక్కిలిగా యేడుస్తూవున్నట్టు విశాలకు తెలిసింది. ఎంతైనా ఆడప్రాణం కాబట్టి విశాలకు జాలిపుట్టి సూపరింటెండెంటువద్దకు వెళ్ళి ఆపిల్లను తన కియ్యమని అడిగింది. ఆయన సరే అన్నాడు విశాలఆదరణచూచి ఆపిల్ల విశాలను కౌగలించుకొని వదలనేలేదు. విశాలకు కూడా ఆపిల్లవాలకం, బంగారుచాయ, ముద్దులమాటగట్టే ముక్కు, విశాలమైన కండ్లు, గుండ్రని మొగము, మలిచినట్టున్న సర్వావయవాలు చూసినప్పుడు ఒకవిధమైన అనిర్వచనీయమైన ప్రేమ ఉదయించింది. పైపెచ్చు ఆపిల్లస్థితి ఆమెప్రేమకు దోహదమైంది. ౧౫డిసెంబరు ౧౯౫౭ తేది సాయంకాలము ఆపిల్లను తీసుకుని వస్త్రా దోవలో షాపులో రెండురకాలు సిల్కు రెండుపరికిణీలు, ౨ చొక్కాలకు కొని యింటికివచ్చింది. రామారావు యింట్లో లేడు. సుందరమ్మ "ఈ పిల్ల యెవరు" అని అడిగింది మొగం చిట్లిస్తూ. అది సాయంకాల మవుటచేత, గుళ్లోకి వెళ్లేవేళవుటచేత, "ఒక బీదబ్రాహ్మణపిల్లలే అమ్మా!" అని విశాల అన్నప్పుడు సుందరమ్మ యిక లోతుకుపోకుండా తనదోవన తాను పోయింది. విశాల వెంటనే తన చేతిమిషనుమీద వక పరికిణీ, వక చొక్కా కుట్టి ఆపిల్లకి నీళ్లుపోసి వాటిని తొడిగింది. కాస్తసేపటికల్లా రామారావు వచ్చాడు. గదిలోకి వెళ్లి చొక్కాలు విప్పుతూవుండగానే విశాలవెళ్లి

"ఇవ్వాళ నేనొకపనిచేశాను. మీరు క్షమించాలె నన్ను!" అన్నది.

"నీ వెన్నటికీ తప్పుపనిచెయ్యవని నాకు నమ్మకమే. కాబట్టి అడక్కముందే క్షమించాను. చెప్పు. యేమిటో?"

జరిగినసంగతి చెప్పి దొడ్లోవున్న పిల్లని తెచ్చిచూపింది. రామారావుకు కూడా ప్రథమదర్శనంతోనే ప్రేమ అంకురించింది. ఆయనకూడా యెత్తుకున్నాడు. కాస్తసేపటికి విఠల్ వచ్చాడు బళ్లోనుంచి.

"అక్కా! యీఅమ్మాయి యెవరు?" అన్నాడు.

"నీతో ఆడుకోటాని కెవ్వరూలేరని పిలిపించాను తమ్ముడూ" వాడికిపట్టరాని సంతోషం కలిగింది. అప్పటినుంచి వాళ్లిద్దరికీ జీవికాజీవి. కొంతసేపటికి సుందరమ్మ వచ్చింది. అంతావిన్నది. అయిష్టంగావున్నా బ్రాహ్మణపిల్లేకదా అని మనస్సు కుదుర్చుకున్నది. సనాతనాచారానికి సూత్రం లేదుకామా?

ఈ పిల్ల వచ్చినప్పటినుంచి యింటికి వికవికమైన కొత్తకళ వచ్చింది. విశాలా రామారావులకుమధ్య యీపిల్ల ప్రేమస్థానంఅయింది. ఒకరిపై నొకరికి గల ప్రేమ పవిత్రతరం కావటం మొదలుపెట్టింది. ఇద్దరికీ కూడా యీపిల్లంటె పంచప్రాణాలు. దానికి "ఇందుముఖి" అని పేరెట్టుకున్నారు. "ఇందూ" అని పిలిచినప్పుడు ఆపిల్ల పలుకుతూంటే వచ్చే మధురస్వనము యిద్దరిమనస్సులను ఊచేసేది. విఠల్ పక్కనఉంటేనేగాని ఇందు అన్నం తినేదికాదు. ముసలమ్మకు యిదికూడా భగవద్విలాసమేనని క్రమక్రమంగా ఔదాసీన్యం పోయింది. విశాలాయిందు లోకగదిలోను, రామారావువిఠ్ఠలు లోకగదిలోను పరుండేవాళ్లు. విశాలారామారావులు చేసుకున్న బాసకు బద్ధులై, యిందు యిద్దరినికట్టేటి శృంఖలకాగా విద్యాభ్యాసంచేస్తున్నారు. ఇద్దరుపిల్ల లుండటంచేత వాళ్లకు బూట్లని, గౌనులని, ఆటవస్తువులని, పండగబహుమానాలని ఖర్చు కొంచెము హెచ్చింది. సంగతులు కనిపెట్టి రామారావు అత్తవారు బరువు అనుకోకుండా మొత్తం డేవాడు, విశాల తనభర్తకు ఖర్చుతగులుతున్నట్లు తెలిసికూడా తాను కాదంటే ఆయన కేమికోపం వస్తుందో అని ఊరుకునేది.

సామాన్యంగా మెడికల్ కాలేజీలోని ఆడవిద్యార్థులు శీలంచెడకుండా బయటకురావటం అరుదు.



"అక్కా! యీఅమ్మాయి యెవ్వరకో"

విశాల ఆటాగాక ని ంగా బయటికివచ్చింది. ఇద్దరికీ చదువు అయింది. విశాల ఫస్టున ప్యాసైంది. ఒక మెడల్ కూడా వచ్చింది. రామారావుకూడా యెక్వరో లైనాడు. విశాల్ స్కూలు ఫైనల్ అయినాడు. అనుకున్నదంతా అనుకున్నట్టయింది. విశాల అద్దిబాపతు కూడిన ౨౦౦౦ పెట్టి మానులు కొనటం మొదలుపెట్టింది. రామారావు గుంటూరుయింటికి కొన్నిమార్పులు వేయించటానికి వెళ్ళాడు. ఇల్లు తయారైంది. ఉత్తరం రాశాడు. సంసారం కదల్చుకుని ౧౬-౮-౩౩ తేదీన గుంటూరులో యింట్లో ప్రవేశించారు. రెండుగేట్లలో ఒకదానిమీద "కే. విశాలాక్షమ్మ, యం. బి. బి. యస్. ఫిజిషన్ అండ్ సర్జన్" అనిన్ని, రెండవదానిమీద "క. రామారావు, బి. ఏ., యం. ఎల్. అడ్వొకేటు" అనిన్ని బల్లలు కట్టారు. ఏనాడు యిద్దరు ప్రాక్టీసు మొదలెట్టారోకాని, రెండుగేట్లవద్ద బండ్లు, మోటార్లు అవిచ్ఛిన్నంగా యెప్పుడు ఆగుతూండేవి. ఒక్కయేడాదిలో విశాల బ్యాంకులెక్క ౧౦,౦౦౦ దాకా పెరిగింది. రామారావుకూడా జూనియర్లలో లీడరు అనిపించుకుంటున్నాడు. విశాల్ కూడా యింటర్మీడియేటు ప్యాసై బి. ఏ. లో చేరాడు. ఇందు ౧౫ యేండ్ల చిన్నదై మిసమిసలాడుతున్న యౌవనంతో వున్నది. ఇందూ విశాలుల పరస్పరప్రేమానుబంధము పెరుగుతూ పెనేసుకుపోతున్నది. విశాలారామారావులకు తీరుబడిలేదు. ఇద్దరికి పని యెక్కువైంది. స్వవిషయమే మరచారు. ఏకాస్త విరామమొచ్చిందంటే ఇందుతో గడిపేవారు. ౨౮-౧౦-౩౫ వరకు యిట్లాగడిచిపోయింది. ఒక్క సుందరమ్మమాత్రం యెప్పుడన్నా "యెప్పుడు వీళ్ళిక సంసారం చెయ్యడం." అనుకుంటూ పెదిమలు చప్పరిస్తూండేది. ఇందూవిశాలులుమాత్రం "ఎప్పుడా" అనుకుంటున్నట్టు కనపడేవాళ్ళు.

౨౮-౧౦-౩౫ తేదీన రామారావు కోర్టునుంచివచ్చి పడుకున్నాడు. విశాల యింటికి వచ్చేటప్పటికి ఇందు వాకిట్లోనే "బాబాయికి జ్వరంవచ్చింది "అనిచెప్పింది. వెంటనే విశాల కలవరపడుతున్న మనస్సుతో రామారావుగదిలోకి పోయింది. అప్పటికి అప్పుడే జ్వరము తీవ్రంగా హెచ్చుగానే ఉంది. రామారావు కళ్ళుమూసుకు నిద్రపోతున్నాడు. విశాల వళ్ళుపట్టుకు చూచింది. కాలిపోతున్నది. విశాల థర్మామెటరు తీస్తుంటేగా రామారావుకు మెలుకువ వచ్చింది. "వచ్చావు విశాలా! ఇక యెట్లాగయినా ఫరవాలేదు." అన్నాడు. "ఇదేమిటి యిట్లా అంటున్నారు?" అనుకుంటూ విశాల టెంపరేచరు చూచింది. ౧౦౪.౮ డిగ్రీలుంది. ఆమెకు కాళ్ళాడలేదు. రామారావు దాహంకావాలన్నాడు. ఇచ్చింది. వెంటనే కారు వేసుకెళ్ళి పావుగంటలో జిల్లాసర్జనును తీసుకొచ్చింది. ఇద్దరు పరీక్షచేశారు. ఒక యింజక్షను యిచ్చారు రామారావుకు కొంచెము నిద్రపట్టినట్టైంది. డాక్టరు వెళ్ళాడు. విశాల విస్తరి యెంగిలి చేసి మళ్ళీవచ్చి మంచంప్రక్కనే కూర్చుంది. ఇందూ విశాలులు చాలాదాకా మేలుకొని చెరోచోటాపడి నిద్రపోయినారు. ముసలమ్మ దేవుణ్ణిప్రార్థిస్తూ సావిట్లో కూర్చున్నది. అప్పుడప్పుడు ఆమెకు బ్యాంకులో విశాల సంతానానికిచ్చిన రూపాయలుమాత్రం జ్ఞాపకమొస్తున్నాయి. రాత్రి గడిచింది. మూడుదినాలైనా జ్వరం నార్మలుకు రాలేదు. నాల్గోరోజున మళ్ళీ పరీక్షచేసి "న్యూమోనియా" అని నిర్ధారణచేశారు. విశాలకు గుండెలలో రాయిపడ్డది. అనేకకేసులు యిటువంటివి చేసింది కాని స్వవిషయంలో మనస్థైర్యముండటం అరుదు.

దైవానుగ్రహం బాగావుంటే తప్ప తనగతి యేమౌను! పరిపరివిధాల బుద్ధి చలించింది. ౧౦ రోజున జీవిస్తాడో, లేదో అనే అస్థైర్యంతోచింది. ఆరోజు అమావాస్య. నాటువైద్యు లొచ్చి రెండుదినాలు గడిస్తే పర్వాలేదన్నారు. ఆరాత్రి విశాల తెల్లవార్లు మంచందగ్గరనే కూర్చుని రోగికి పరిచర్య చేస్తున్నది. రామారావు యేమేమిటో తనలోతాను గొణుగుకుంటున్నాడు. ౪ గంటలైంది. విశాలకు కొంచెం కునుకుపట్టింది. నిద్రలో తన తండ్రి కనపడి తనపైన గుడ్లురిమి "ఎంత బుద్ధిలేకుండా ప్రవర్తించావు విశాలా!!" అంటూవున్నట్లు కలగని ఉలికిపడి లేచింది. దేవుడు జ్ఞాపకంవచ్చాడు. తాను ఆర్థికస్వాతంత్ర్యమని రెండు



"దుఃఖ మాపుకున్నా ఆగటం లేదు. కారిననీళ్లకు అంతులేదు."

కుటుంబాలకు చేసిన అపకృతి మనస్సుకు తట్టింది. అందులో ఋషివంటి రామారావుకు జరిగిన అపకారము గోచరించింది. దుఃఖ మాపుకున్నా ఆగడం లేదు. కారిన నీళ్లకు అంతులేదు. మధ్యమధ్య రామారావు లేచినప్పుడల్లా కండ్లుతుడుచుకుంటూ కావలసిన పరిచర్య చేస్తూ వచ్చింది. తనను దూషించుకుంది. వైధవ్యం తల్చుకుంటే గుండెబద్దలవుతున్నది. ఆపదానికి యెన్నిఉంటే యేమి? భర్తలేకపోతే భగవంతుని ఉద్దేశ్యమునకు వ్యతిరేకంగా నడిచినట్లైనని నిశ్చయించుకుంది. తనకున్న ఆస్తి యెందుకు? చదువెందుకు? తన ఆర్థికస్వాతంత్ర్యేచ్ఛ తనను ముంచిందని అనుకుంది. రామారావులేని జీవితము తెరచాపతెగిన పడవ! జీవితములో యిక ఆదర్శమేముంది? జన్మ వ్యర్థము! వ్యర్థము! వ్యర్థము!

తెల్లవారింది. రామారావుకు కొంచెము నిద్ర పట్టినట్లున్నది. అందరు కాల్యకృత్యాలు తీర్చుకున్నారు. విశాల మళ్లీ మంచంపక్కకు చేరింది. సుందరమ్మ వేణ్ణీళ్లుకాయటం మొదలైన పనుల్లో ఉంది. ఇందూవిశాలలు చిక్క మొగాలతో గుసగుసలాడుకుంటున్నారు. జిల్లాసర్జనువచ్చి ప్రమాదావస్థ తప్పలేదని చెప్పాడు. విశాలకు అంత తెలివి యేమైందో! ఒకవిధమైన మాంద్యము పూనింది! నాటువైద్యుడొచ్చి నాడి చూశాడు. ఇంకా ధాతువు యథాస్థితికి రాలేదన్నాడు. సుందరమ్మవచ్చి తొంగిచూచి "అమ్మాయీ, యెట్లా వున్నది?" అని మెల్లిగా అడిగినప్పుడు విశాలకు ఆమెముఖం చూడటానికి సిగ్గెయ్యటమేగాక, ఆమెతో యేం సమాధానం చెప్పలేక కన్నీళ్లుకారుస్తూ ముఖం రెండు అరిచేతులతో కప్పుకుంది. సుందరమ్మ ముఖం చూస్తే కూతురితో "ఎందుకు దుఃఖిస్తావు. స్వయం కృతాపరాధమ"న్నట్టుంది. విశాల యెడల సానుభూతి చూపడానికి లోకాని కేంబట్టింది? పైగా లోకం యిష్టమొచ్చినట్టు అనుకుంటుంది. తాను దానిని ఆపగలదా? తాను లోకంలో ఉన్న ఆచారవ్యవహారాలకు లెక్క చేయనప్పుడు లోకం తనకు సానుభూతి చూపలేదని అనుకోడం తప్పు. తనకు ఆర్థిక స్వాతంత్ర్యమనే అభిప్రాయంచేత వక్కరోగికైనా ఉచితంగా చికిత్స చేసిందా? తెలివిగల దనిపించుకున్నదిగాని దానదయాపరురా లనిపించుకోలేదే? బ్యాంకిపుస్తకం నిండింది. కాని ద్రవ్యము ఆమెకిప్పుడు ఎంతమాత్రం జ్ఞాపకానికి రావటం లేదు. ఎంతద్రవ్యమైనా రామారావు నష్టాన్ని భర్తీ చేయగలదా? సంఘాన్ని ఉల్లంఘించటానికి ఇద్దరే సమర్థులు. మొదటివాడు స్థితప్రజ్ఞుడు. రెండోవాడు పిచ్చివాడు. విశాల యీ రెండురకాలలోది కాదు. ఇట్టిస్థితిలో సంఘము ఆమెను "విధవ" అన్నప్పుడు సంఘాన్ని లెక్కచెయ్యకుండా ఉండగలదా? అట్టిమనస్థైర్యం లేదు. పోనీ, మళ్లీ యెవరినైనా ప్రేమిద్దామా

అంటే రామారావుకు మనస్సు సంపూర్ణంగా అర్పించింది. మరియొకవ్యక్తికి అక్కడ చోటులేదు. కాబట్టి ఆ విధానం అసంభవం. ఇక ఆమెగతియేమిటి? సంగతులన్నీ తెల్సుకున్నకొద్దీ ఆమెగుండెలు పగిలిపోతున్నాయి. రామారావుస్థితిచూస్తే నిమిషనిమిషానికి అధోగతిగానే ఉందిగాన్ని యెట్టిధైర్యాన్ని యివ్వటంలేదు. మహాసముద్రంలో తుపాను కొట్టుకునే పడవల్లే ఆమె మనస్సుకొట్టుకుంటున్నది. మాటిమాటికి విస్తలు, ఇందు, సుందరమ్మకూడా గదివాకిటిదగ్గిరికి వస్తూండడం విశాలమొగం చూచి వెళ్లిపోతూ ఉండడం. వాళ్లనుచూసేటప్పటికి విశాలకూ దుఃఖం యెక్కువకావటం.

ఇట్లాఉండగా రామారావు అకస్మాత్తుగా కళ్లుమూసుకునే "మామగారూ! నాతప్పు క్షమించండి. విశాలపైన కోపపడకండి పూర్తిగా ఆమెతప్పు కాదు. చూడు విశాలా! మామగారు తనఉద్దేశం నెరవేర్చలేదని మనను కోప్పడుతున్నారు." అంటూ కేకవేశాడు. విశాల ఉలికిపడిలేచింది. రామారావుదగ్గిరికి వంగి మొగం తుడిచి "పరుండండి" అని కొంచెము ఆహారం యిద్దామని చంచాతో పాలుతీసుకుని నోట్లో పోసేటప్పటికి తెరిచివున్న నోట్లోనుంచి చిలవలుగుండా కారిపోయాయి. ఇదేమిటా అని ముక్కుదగ్గిర వేలుపెట్టింది. శ్వాసలేదు. గుండెల్దగ్గిర చెయ్యి పెట్టింది. వెంటనే గది వదిలి తన గదిలోకి పోయి తలుపు బిగించుకుంది.

రెండునెలలకు విచారించగా యిందూవిస్తలులకు వివాహమైనట్లున్నూ, సుందరమ్మ కాశీవెళ్లినట్లున్నూ, విశాలతనయింటిని స్త్రీశిశువైద్యశాలగా మార్చి తనద్రవ్యమంతా దానికిచ్చివేసి తా నందు జీవితాంతమువరకు సేవచేయ నిశ్చయించినట్లున్నూ తెలిసింది. స్త్రీలు ప్రాచీనసంప్రదాయములను విడవకుండా విద్యను అభ్యసించాలని, ఆర్థిక స్వాతంత్ర్యము మొదలగు ఆధునికాభిప్రాయాలన్నీ పొరబాటని, సంతాననిరోధము మొదలైన సూత్రాలు అస్వాభావికాలేగాక మానవపతనానికి కారణములని అప్పుడప్పుడు ఉపన్యాసాలిస్తున్నట్లు కూడా వినవచ్చింది.



# అంతర్జాతీయన్యాయము, న్యాయస్థానము



కపిల కాశీపతి

'నోరుగలవాడిదే రాజ్యం' అంటారు. ఈ సామెత పుట్టినరోజున ఎంతనిజమో, ఈనాటి వరకూకూడా అంతనిజమే. వ్యక్తులనడుమ సంఘంలో ఎల్లాగో, జాతులమధ్య లోకంలోకూడా నోరుగలవారిదే రాజ్యం. ఇప్పుడు అంతర్జాతీయవ్యవహారాలు ఈసంగతిని మరీ స్పష్టపరుస్తున్నవి.

ఒకరిహక్కులు ఒకరు అతిక్రమించకుండా, ఒకరిరాజ్యం ఒకరు ఆక్రమించకుండా వివిధప్రభుత్వాలనడుమ అనేక ఒడంబడికలు వున్నవి. వాటినే అంతర్జాతీయ రాజకీయవొడంబడికలంటారు. యూరపు మహాయుద్ధానంతరం, ప్రపంచశాంతి కాపాడడానికిగాను, పేరున్న పెద్దప్రభుత్వాలన్నీ కలిసి అనేక పరస్పర-వొడంబడికలు చేసుకున్నవి. వాటిలో ముఖ్యమైనది వర్సేయిల్సు వొడంబడిక. దాన్ని అనుసరించి ఇంకా ఎన్నో శాశ్వతమైనవీ, తాత్కాలికమైనవీ చిల్లరఏర్పాట్లు వున్నవి. గతసంవత్సరారంభంవరకూ ఈ పరస్పర వొడంబడికలు ఆరోజుకారోజు ఎక్కువ కావడమేకాని తగ్గలేదు. రెండుదేశాలకు ఏవిషయంలో ఎటువంటి బాంధవ్యమో చెప్పడానికి వీలులేనన్ని వొడంబడికలు అమలులోకి వచ్చినవి. యుద్ధానంతరం దాదాపు ఇరవైసంవత్సరాలు జరిగిన అంతర్జాతీయ రాజకీయకార్యక్రమం ఈ అంతులేని వొడంబడికల నిర్మాణమే. మేడకడితే మూడంతస్తులు నిలుస్తాయి, నాలుగు నిలుస్తాయి; అమెరికా అయితే నలభై ఏభై అంతస్తులు నిలుస్తాయి; కాని వందలూ వేలూ కట్టడమూ కష్టమే, కడితే అవి నిలవడమూ కష్టమే. అల్లాగే అంతర్జాతీయనిర్మాణం తన బరువుకి తానే శిథిలమైపోయింది. ఇరవై సంవత్సరాలు కష్టించి సృష్టించిన ఈ చిత్రహర్మ్యము కూలి కుప్పలై పోయింది. శిథిలావశిష్టమైన పాడుగోడలలో రాజకీయవేత్తలు దేవులాడుతున్నారు. కట్టడానికి ఇరవైసంవత్సరాలు పడితే, కూల్చడానికి ఇరవై రోజులు పట్టలేదు.

ప్రస్తుతం యూరపుప్రభుత్వాలకు అంతర్జాతీయవొడంబడికలు అతిక్రమించడం రివాజు అయిపోయింది. అపూర్వమయకిరీటధారులైన జర్మను నియంత నాజీ అనుచరులు రైనునదీప్రాంతంలో అడుగుపెట్టిన మరుక్షణంనుంచీ ఒక్కొక్కదేశమే తన బంధాలు తెంచుకోవడం ప్రారంభించింది. జర్మనీ లొకార్నో వొడంబడిక అతిక్రమించిందని ఆస్ట్రియా సెయింటు జెర్మెయిను వొడంబడిక అతిక్రమించినట్లు ప్రకటించింది. ఆ వొడంబడిక ప్రకారం ఆస్ట్రియాకు ఒక పరిమితి నాటి సేనాబలం వుండడానికి వీలు లేదు. ఇప్పుడాపరిమితి దాటి ఆస్ట్రియా బలంనిర్మించింది. నిర్బంధ సైనికశిక్షణ శాసనం అమలులో పెట్టింది. టర్కీ లాసేను వొడంబడిక రద్దుచేసి డార్డనెల్లీసు జలసంధి తీరంలో తనసేనలు నిలుపుతానని ప్రకటించింది. హంగేరీ, బల్గేరియా దేశాలుకూడా తాను చేసుకున్న వొడంబడికలు రద్దుచేసుకుని యుద్ధబలం వృద్ధిచేస్తామని తెలియజేస్తున్నవి. అంతర్జాతీయసమితిని ధిక్కరించి అబిసీనియాను ఆక్రమించిన ఇటలీ యూరపులో క్రొత్త ఎత్తులు వేస్తున్నది. యుద్ధానంతరం జరిగిన వర్సేయిల్సు సంధిషరతులు చిందరవందర అయిపోయి, అంతర్జాతీయ పరిస్థితులు ఖంగారుగా వున్న సమయంలో బుద్ధిమంతుల వైఖరి ఏవిధంగా వుండాలి?

ఒడంబడికలైనా మరేమైనా న్యాయంమాత్రం స్పష్టంగా కనుపిస్తూనేవున్నది. ఆ వొడంబడికలన్నీ అన్నిపక్షాలవారూ అంగీకరించి బుద్ధిపూర్వకంగా చేసుకున్నవి. ఇవి జాతిసమితిసంస్థాపనవల్ల బలపడినవి. ఈ వొడంబడికలు ధిక్కరించకుండా చూడడం జాతిసమితికర్తవ్యాలలో ముఖ్యమైనది. శాస్త్రీయంగా ఈ

వొడంబడికలు యూరపులోనేకాక, ప్రపంచంలోనే అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో ఒకభాగం అయిపోయినవి. శాస్త్రదృష్టిని అంగీకరించిన ముగ్గురునలుగురిలో ఎవరోఒకరు ఈ వొడంబడికలు ధిక్కరించి రద్దుచెయ్యమనడం తప్ప.

కాని, ఈ వొడంబడిక లన్నిటినీ నైతికదృష్టితో పరిశీలిస్తే శాస్త్రవాదనబలం తగ్గుతుంది. అసలు వొడంబడికలు చెయ్యడంలో వున్న ధర్మాధర్మాలు పరిశీలించాలి. కేవలం షరతుల్ని బట్టిగాని, చిత్తవృత్తిని బట్టిగాని న్యాయాన్యాయనిర్ణయం చెయ్యకూడదు. నిజపరిస్థితులు ఆ వొడంబడికల చట్రంలో ఇముడుతాయా, లేదా అనే ప్రశ్నకు జవాబివ్వాలి. ఉన్నవి వున్నట్టు తెలుసుకోవాలి.

మామూలువ్యవహారంలో కంట్రాక్టు జరిగినట్టే అంతర్జాతీయ వొడంబడికలుకూడా ఆ ఏర్పాటుకి లోబడే అన్నిపక్షాల ఏకీభావం వుంటే తప్ప చెల్లవు. ఒకదస్తావేజు వ్రాసేటప్పుడు పార్టీలిద్దరూ ఆ షరతులికి ఏకగ్రీవంగా అంగీకరిస్తేతప్ప అది చెల్లదు. బలవంతంగా భయపెట్టో, దగాచేసో దస్తావేజు వ్రాయిస్తే, ఆసంగతి కోర్టువారి ఎదుట నిరూపించగలిగితే, ఆ దస్తావేజు చెల్లదు. తుపాకితో కాలుస్తానని భయపెట్టి ఒకరిచేత వెయ్యిరూపాయిలకు ప్రామిసరీనోటు వ్రాయించుకోవచ్చు. కాని ఆ సంగతి కోర్టులో నిరూపించగలిగితే ఆ నోటు పనికిరాదు. అదేవిధంగా ఒకదేశాన్ని ఇంకోదేశం బలవంతంచేసి తనకు అనుకూలమైన వొడంబడికకు అంగీకరించేటట్టు చెయ్యవచ్చును. ఈ బలవంతం నిరూపిస్తే, న్యాయంచెప్పి, ఆ వొడంబడికలు రద్దుచెయ్యకలిగిన న్యాయస్థానం, న్యాయమూర్తులూ ఇంకా పుట్టలేదు. ఒకరి ఆస్తి మరొకరు అన్యాయంగా ఆక్రమిస్తే సివిలుకోర్టులో వ్యాజ్యంవేసి, తీర్పుపొంది, డిక్రీ అమలుపర్చుకోవచ్చును. ప్రతివాది డిక్రీ అమలు జరపకపోతే ప్రభుత్వం తనబలం ఉపయోగించి అమలు జరిపిస్తుంది. ఒకరు మరొకర్ని దౌర్జన్యంగా హింసపెడితే క్రిమినలుకోర్టులో కేసుపెట్టి అపరాధిని శిక్షకు పాలుచెయ్యవచ్చును. దౌర్జన్యంగా ప్రవర్తించినవారు శిక్షించబడ్డ దృష్టాంతాలు చూసి అంతా సవ్యంగా ప్రవర్తిస్తారనే నమ్మకం క్రిమినలులాకు మూలసూత్రం. సివిలుకోర్టు డిక్రీలు అమలుపర్చడానికిగాని, క్రిమినలుకోర్టు శిక్షలు వెయ్యడానికిగాని ప్రభుత్వబలం ముఖ్యం. ఆతీర్పుల వెనకాలవున్న ఆ ప్రభుత్వబలాన్నే ఇంగ్లీషులో "శాంక్షన్" అంటారు.

దేశాలలో ఆంతరంగికంగా న్యాయం పాలించినట్టుగా, దేశాలమధ్య అంతర్జాతీయంగా న్యాయం పాలించాలనే ఉద్దేశ్యం రాజకీయవేత్తలకు కలుగకపోలేదు. దాని ఫలితమే హాలెండులో హేగులో వున్న అంతర్జాతీయన్యాయస్థానమూ, స్విట్జర్లాండులో జెనీవాలోవున్న అంతర్జాతీయసమితీనూ. హేగుకోర్టు కొంచెం హెచ్చుతగ్గు దేశాలనడుమ సివిల వ్యవహారాలు పరిశీలించి తీర్పుచెప్పడానికి ఏర్పడ్డది. అంతర్జాతీయ సమితి ముఖ్యంగా దేశాలమధ్య క్రిమినలు వ్యవహారాలు ఆపుచెయ్యడానికి.

అంతర్జాతీయన్యాయం ఈ అంతర్జాతీయ న్యాయస్థానాలు ఎంతవరకు పరిపాలించినవో తెలుసుకోడానికి ముందు ఆ సంస్థల చరిత్ర తెలుసుకుంటే మంచిది.

జర్మను సేనలు రైనునదీప్రాంతం ఆక్రమించినప్పుడు లొకార్నో వొడంబడికలో సంతకంచేసిన ప్రభుత్వాలు ఒకతీర్మానం చేసినవి. ఫ్రాన్సు రష్యాతో చేసుకున్న పరస్పరసహాయపు వొడంబడిక లొకార్నో షరతులికి వ్యతిరేకం కాబట్టి, తటస్థప్రదేశమైన రైను ప్రాంతం ఆక్రమించి తాను కూడా ఆవొడంబడిక అతిక్రమించానని జర్మనీవాదన. అసలు ఫ్రాన్సు-రష్యా సంధి లొకార్నో షరతులికి వ్యతిరేకమా అనేసమస్య వచ్చింది. జర్మనీ వ్యతిరేకమంటుంది, ఫ్రాన్సు కాదంటుంది. ఈసమస్య పరిష్కారం ఎల్లా? జర్మనీని తనకేసును హేగుకోర్టులోకి తీసుకువెళ్లమని ఇతర వొడంబడికదార్లు సలహాఇచ్చినారు. చాలామందికి హేగులో ఒక కోర్టు వున్నదని అప్పుడు జ్ఞాపకంవచ్చింది. అదివరదాకా ఆసంగతి మర్చిపోయినారు. కారణం, హేగుకోర్టు అంతప్రాముఖ్యంగా పనిచేస్తున్నది కనుక.

ఈమధ్య మనదేశంలో శారదాచట్టానికి వ్యతిరేకంగా చేసిన అతిబాల్యవివాహాలన్నీ బందరు ఫ్రెంచిపేటలో జరగడం ప్రారంభించినవి. పెళ్లిళ్లలో కొట్లాటలు మనకు కొత్తకావు. ఫ్రెంచిపేట పెళ్లిళ్లలోకూడా కొన్ని తగాదాలు వచ్చినవి. వాటిలో ఒకదానిలో ఏదోవిధంగా ఒకపోలీసు కానిస్టేబుల్ ఇరుక్కున్నాడు. పెద్ద క్రిమినలు కేసు అయింది. ఈకేసు ఎవరు విచారించాలనేసమస్య వచ్చింది. ఫ్రెంచిపేట ఫ్రెంచివారి రాజ్యం. పుదుచ్చేరిలో వున్న ఫ్రెంచిప్రభుత్వంబాకా ఈసమస్య పాకింది. బందరులోవున్న బ్రిటిషు ఇండియా ప్రభుత్వపు న్యాయాధికారులు, బందరుకోర్టులికి ఈకేసు విచారించడానికి అధికారం వున్నదన్నారు. మద్రాసు ప్రభుత్వంవారూ, బ్రిటిషు ఇండియా ప్రభుత్వంవారూ కూడా అంతే నన్నారు. ఫ్రెంచిఇండియా ప్రభుత్వం వారుమాత్రం ఈకేసు ఏనాంలోవున్న న్యాయస్థానంలో విచారించాలన్నారు. చివరకు ఎటూతెగక ఈ సమస్య బ్రిటిషు ఫ్రెంచిప్రభుత్వాల అంగీకారంమీద హేగులో వున్న అంతర్జాతీయ న్యాయస్థానంలో పరిష్కరించాలని నిర్ణయించారు.

అసలు ఈ హేగుకోర్టు ఏమిటి? ఎన్నాళ్లనుంచి అక్కడ వున్నది? హేగులో వుండడానికి కారణం ఏమిటి?

చాలామందికి ఈప్రశ్నలకు జవాబు తెలియదు. ఆకోర్టుపేరుకూడా పూర్తిగా చాలామందికి తెలియదు. ఇంగ్లాండులో దీన్ని హేగుకోర్టు అంటారు. అమెరికాలో దీన్ని ప్రపంచన్యాయస్థానం అంటారు. ఈసంస్థ అసలు పేరు "పెర్మనెంటుకోర్టుఆఫ్ ఇంటర్నేషనల్ జస్టిస్," అంటే అంతర్జాతీయన్యాయపరిశీలన చేసే శాశ్వత న్యాయస్థానం.

ఈ సంస్థ హేగులో ఎందుకున్నదంటే కొంత చరిత్ర తిరగవేయ్యాలి. ముప్ఫైఎనిమిదిసంవత్సరాలక్రితం ప్రపంచప్రభుత్వాలన్నీ కలిసి ఒక శాంతిసమావేశం చేసినవి. ఈ సభ హేగులో సమావేశమైనది. దీర్ఘకాలం, తీవ్రంగా ప్రపంచశాంతి విషయమై తర్కించి, సర్వాంగీకారంగా ఒక సంప్రదాయం ఏర్పాటుచెయ్యడానికి నిశ్చయమైనది. అంతర్జాతీయసమస్యలు శాంతంగా పరిష్కారంచెయ్యడానికి కొన్ని ఏర్పాట్లు చెయ్యడమే ఆసంప్రదాయం. ఆ షరతుల పత్రం ౧౮౯౯ జులై ౨౯వ తారీకున సంతకంఅయింది. సరిగ్గా, ఒకరోజన్నా తేడాలేకుండా, అదేజరిగిన పదిహేనుసంవత్సరాలకు ఆస్ట్రియా బల్గేరియాతో యుద్ధం ప్రారంభించింది.

హేగు సమావేశంలో సృష్టించిన సంప్రదాయం పేరుమాత్రానికే. సంతకంచేసిన వారెవరూ కూడా ఆ షరతులు అనుసరించలేదు. కాని ఆ షరతులప్రకారం అంతర్జాతీయ సమస్యలు పరిష్కారం చెయ్యడానికి హేగులో ఒక పంచాయితీ ఏర్పాటుచేసినారు. దాన్ని "పెర్మనెంటు కోర్టు ఆఫ్ ఆర్బిట్రేషన్" అన్నారు. ఏసమస్యలకోసమయినా ప్రభుత్వాలు యుద్ధంచెయ్యదలచుకోకపోతే ఆసమస్యలు పరిష్కారం చెయ్యడానికి హేగుపంచాయితీ ఉండేది. "పెర్మనెంట్" అన్నమాటకి అర్థం శాశ్వతం. "కోర్ట్" అంటే న్యాయస్థానం. ఈ సంస్థమాత్రం శాశ్వతమూకాదు, న్యాయస్థానమూ కాదన్నాడో అంతర్జాతీయ న్యాయశాస్త్రవేత్త. ఈన్యాయస్థానం ఎల్లా వుండేదంటే, లోకంలోవుండే అమాంబాపతూ ఓవందో, రెండువందలమందో పేరుపొందిన న్యాయశాస్త్రపండితుల జాబితా తయారుచేసేవారు. ఏదైనా అంతర్జాతీయసమస్య పరిష్కారానికి వస్తే, ఈ జాబితాలో వున్నవారెవరైనా తీర్పుచెప్పడానికి కూచోవచ్చు. నిజానికి ఆవిధంగా కూచుని కొద్దో గొప్పో, చిన్నచిన్న అంతర్జాతీయసమస్యలు పరిష్కారంచేసినారు ఆ న్యాయమూర్తులు.

ఈ సంస్థ శాంతిసమావేశంజరిగిన హేగులోనే వుండాలన్నారు. ఒక పెద్దభవనం నిర్మించి పటాటోపంగా దానికి"శాంతిహర్మ్యం"అని నామకరణం చేశారు. ఆహర్మ్యం, ఆకోర్టూకూడా ఇంకా హేగులోనే వున్నవి. అప్పుడప్పుడు చిన్న ఫ్రెంచిపేట సమస్యలవంటి

అంతర్జాతీయ సమస్యలు ఆకోర్టుతీర్పులికి పంపుతూనే వుంటారు.

యూరపుమహాయుద్ధానంతరం వెర్సెయిల్సు సంధి సమావేశంలో అంతర్జాతీయశాంతి కాపాడడానికి జాతిసమితి నిర్మించినారు. సమితితోపాటు ఒక అంతర్జాతీయన్యాయస్థానం కూడా వుంటే బాగుండు నన్నారు. అంతా అంగీకరించడంచేత హేగులో వున్న కోర్టే దీనికింద మారుద్దామన్నారు. జాతిసమితి ప్రణాళిక పదునాలుగోసూత్రంలో ఈకోర్టు నిర్మాణ విధానం వున్నది.

ఈకొత్తకోర్టు జాతిసమితిలో ఒక ముఖ్యభాగం. అంతర్జాతీయ రాజకీయాలనుంచి అంతర్జాతీయన్యాయ శాస్త్రసమస్యలు విడదియ్యాలనే ఈకోర్టు స్థాపించడంలో వున్న ముఖ్యోద్దేశ్యం. జాతిసమితికౌన్సిలు అసెంబ్లీ రాజకీయాలు చర్చించేవి. అవి జెనివాలో స్థాపించినారు. ప్రత్యేకించబడ్డ న్యాయస్థానం వేరొకచోట వుండాలన్నారు. హేగులో అదివరకే కోర్టు వున్నది. దాని మారురూపమే ఈ కొత్తకోర్టుకూడాను. అందుకని అంతర్జాతీయ న్యాయస్థానం హేగులోనే వుంచడానికి నిశ్చయమయినది.

కొత్తగా నిర్మించిన "శాశ్వత అంతర్జాతీయ న్యాయస్థానం" నిజానికి శాశ్వతమే. వెనకటిమాదిరిగా ఒక్క భవననిర్మాణం, న్యాయశాస్త్రవేత్తల జాబితాలతోనే ఈ సంస్థ పూర్తికాలేదు. పదిహేనుగురు శాశ్వత న్యాయమూర్తుల్ని నియమించి, జీతం బత్తెం ఇచ్చి, వారికి కావలసిన హంగులన్నీ అమర్చినారు. నలుగురు డిప్యూటీజడ్జీలుకూడా వున్నారు. ఈ కోర్టు సంవత్సరానికి ఒకసారైనా కలుసుకుతీరాలి.

పూర్వపుకోర్టు తగాదాలు వస్తే పంచాయితీ చేసేది. ఈ కోర్టు తీర్పుచెబుతుంది. పంచాయితీకీ తీర్పుకీ వున్న భేదం అందరికీ తెలుసును. పంచాయతీలో బలవంతంలో లేదు.

లొకార్నో ఒడంబడిక షరతులప్రకారం, ఆ ఒడంబడిక విషయమై ఏతగాదాలు వచ్చినా హేగు కోర్టులో పరిష్కారం చేసుకోవాలి. ౧౯౩౩ ఫిబ్రవరి ౯ వ తారీకున జర్మనీ ఈషరతుకికూడా అంగీకరించింది. ౧౯౩౮ జానువరి ౫ వ తారీకున ఈసంగతి హేగుకోర్టుకి తెలియజేసింది. అంటేహిట్లరు అధికారంలోకి వచ్చి, నాజీప్రభుత్వం ఏర్పడినతర్వాత జర్మనీ లొకార్నో ఒడంబడికవిషయమై తగాదాలన్నీ హేగుకోర్టులో పరిష్కారంచేసుకుంటానని అంగీకరించిం దన్నమాట. ఆప్రకారం హేగుకోర్టుకి ఫ్రాన్సు రష్యా ఒడంబడికవిషయమై పితూరీ చెయ్యకుండా రైనుప్రాంతం ఆక్రమించడం హిట్లరుమాట హిట్లరే తప్పినట్టని ఒకశాస్త్రవేత్త అన్నాడు. అదీ హేగుకోర్టు చరిత్ర. ఇది అంతర్జాతీయన్యాయం నిర్ణయించే సివిలుకోర్టు అంటే తప్పలేదు.

జాతిసమితి క్రిమినలుకోర్టువంటి దని వ్రాశాను. ఆస్తికి సంబంధించిన హక్కులు పార్టీలలో ఎవరో ఒకరుగాని, ఇద్దరూగాని కోర్టువారిని వ్యాఖ్యారూపంగా నిర్ణయించమని అడిగితే సివిలుకోర్టు తీర్పుచెబుతుంది. ఎవరన్నా కొట్టుకుంటే, దౌర్జన్యం చేస్తే పోలీసువారో, ఫిర్యాదీలు స్వయంగానో ఆ సంగతి కోర్టు ముందుకు తెస్తే క్రిమినలుకోర్టు విచారించి అపరాధిని శిక్షిస్తుంది. ఇటలీ అబిసీనియాతో అన్యాయంగా యుద్ధంచేసినప్పుడు అబిసీనియా కోరగా జాతిసమితికి పితూరీచేసినాడు. సమితి ఇటలీ అపరాధిని అని తీర్పు జెప్పి, శిక్షించడానికి ఆంక్షలు ప్రయోగించింది.

మామూలుకోర్టులికీ ఈ అంతర్జాతీయ న్యాయస్థానాలకీ సామ్యం అంతటితో ఆగిపోతుంది. మామూలు కోర్టుల తీర్పులు అమలుపర్చడానికి ప్రభుత్వబలం వున్నది. క్రిమినలుకోర్టుశిక్ష విధించడానికికూడా తగిన రికరాలు వున్నవి. ఈ అంతర్జాతీయ న్యాయస్థానాల తీర్పులుగాని, శిక్షలుగాని అమలుపర్చడానికి వీలులేదు. ప్రభుత్వాలు పోలీసుశాఖగుండా కోర్టులతీర్పులూ, శిక్షలూ అమలుపరుస్తవి. ఈ అంతర్జాతీయ న్యాయస్థానాల తీర్పులు అమలుపర్చగలిగిన అంతర్జాతీయ పోలీసుశాఖలేదు. అంటే సంస్థలేగాని, వాటి వెనకాల "శాంక్షన్" లేదన్నమాట. ఇటలీ అపరాధిని

# శైశవము



'ఒక్క—ముద్దు' —వాసన్.



ఉత్తరం —వాసన్.

అని నిర్ణయించడమే గాని, ఇటలీని శిక్షించడానికి జాతిసమితికి బలంలేదు. జాతిసమితితరఫున అందరికంటే బలమైన ఒక అంతర్జాతీయసైన్యం వుంటేతప్ప, యుద్ధం ప్రారంభించినవాళ్ళని ప్రతియుద్ధంచేసి శిక్షించడానికి వీలులేదు. ఒకమనిషిని దురన్యాయంగా చంపితే, నేరస్థుణ్ణికూడా కోర్టు మరణదండనపాలు చేస్తుంది. ఒకదేశం అన్యాయంగా ఆక్రమిస్తే, అపరాధిని అయినదేశం ఆక్రమించాలి జాతిసమితి శక్తివుంటే. ఆశక్తి లేకపోవడంచేతనే సమితి ఏమీచెయ్యలేక తోకముడిచింది. న్యాయం కాపాడడానికి బదులు దురన్యాయానికి కారణం అయింది. మేజస్ట్రీట్లు లంచాలుతిన్నా, నేరస్థునికి భయపడ్డా అన్యాయం జరుగుతుంది. జాతిసమితిలో అంతే జరిగింది. ప్రపంచానికి క్రిమినలుకోర్టు అని వర్ణించిన అంతర్జాతీయసమితి తనతీర్పు అమలుపర్చలేకపోయింది. తన శిక్షతో నేరస్థుణ్ణి బంధించలేకపోయింది. క్రిమినలు కోర్టు శిక్షిస్తుందనే భయంపోతే మనవూళ్లో ప్రజల సంగతి ఏంగాను? అంతే ప్రపంచంసంగతి కూడానూ. నోరున్నవాడిదే రాజ్యం. ప్రపంచానికి సివిలుకోర్టు అని వర్ణించిన హేగూకోర్టులోపం కూడా ఇటువంటిదే. లోకార్నో వొడంబడిక విషయమైగాని, ఇతర అంతర్జాతీయ సమస్యలుగాని చర్చించి, న్యాయాన్యాయాలు నిర్ణయించడానికి ఈకోర్టుకి హక్కువున్నది. ప్రభుత్వాలకు ఇష్టమైతే ఆతీర్పు అంగీకరిస్తవి అసలు లోకార్నో వొడంబడిక గాని, వెర్సైయిల్సు సంధిగాని న్యాయమా, అన్యాయమా అని చర్చించే అధికారం ఈకోర్టుకి లేదు. వెర్సైయిల్సు సంధి ఫలితమే జాతిసమితీ, హేగూన్యాయస్థానమూనూ. ఆసంధి న్యాయమా, అన్యాయమా అని తర్కించలేవు, తర్కించవు. నిజానికి ఆసంధివల్ల జరిగిన అన్యాయం న్యాయం అనే పేరుతో నిలబెట్టడానికి ఏర్పడ్డవి ఈ రెండు సంస్థలూకూడా. జర్మనీనీ, ఇతరరాజ్యాల్నీ అన్యాయం చేసి ఎన్నో వొడంబడికలు సంతకంచేయించినారు. బలవంతంగా, దౌర్జన్యంగా చేయించిన ఈ పనులు న్యాయం అని చేయించినవారి వాదన. ఈ బలవంతం నిరూపిస్తే ఆ వొడంబడికలు రద్దుచెయ్య కలిగిన కోర్టు లేదు. శాస్త్రప్రకారం వొడంబడికలలో వున్న షరతులు అతిక్రమించడం తప్పే. అసలు ఆ వొడంబడికలే అధర్మమైనప్పుడు నూత్నసృష్టిని ఆ వొడంబడికల ధిక్కారం తప్పుకాదు. అది సహజం.

ఒకసారి సంతకంచేసినతర్వాత రాజకీయ వొడంబడిక అమలులోకి వస్తుంది. అది ఏ విధంగా సంతకం చేసినా సరే. వ్యక్తులు, అన్యాయాలు వుంటే, కోర్టుకి పోయి కంట్రాక్టును రద్దు చేయించుకోవచ్చును. దేశాలకు ఆ హక్కు లేదు. లేదుకాబట్టి, తగినంత బలం చిక్కగానే, ప్రతిప్రభుత్వం తనకు అనుకూలంగాలేని ప్రతివొడంబడికా ధిక్కరించడం ప్రారంభిస్తుంది. ఇది చాలా విచారకరమైన సంగతి. ఇటువంటి చర్యవల్ల అంతర్జాతీయవిశ్వాసం నశిస్తుంది. కాని ప్రస్తుతపరిస్థితులలో ఈచర్య తప్పనిసరి అవుతున్నది.

క్రమేణా ఈ విధమైన అంతర్జాతీయ వొడంబడికలవల్ల ఉపయోగంలేదనే నమ్మకం ప్రపంచంలో కలుగవచ్చును. ఒకానొక వొడంబడిక షరతులు దౌర్జన్యంగా అతిక్రమించకపోయినా, అదను చిక్కగానే శాస్త్రీయంగానే ఆబంధాలు తెంచుకోడానికి ప్రయత్నిస్తారు. ఎప్పుడు దాని అవసరం తీరిపోతుందో అప్పుడే ఆ షరతుకి తిలోదకాలు. ఎవరి అవసరం ముందుతీరితే వారు దొడ్డవారు. ఏరుదాటి తెప్ప తగలవెయ్యడమే.

కొద్దిరోజులక్రితం జపాను విసర్జించిన నావిక వొడంబడిక ఇటువంటి చర్యకు దృష్టాంతము. ప్రపంచంలోవున్న పెద్ద నావికప్రభుత్వాలన్నీకలసి ౧౯౨౨లో అమెరికా సంయుక్తరాష్ట్రాలలో వాషింగ్టను నగరంలో సమావేశమై నావికబలం విషయమై కొన్నిషరతులు నిర్ణయించుకున్నవి. ఆ షరతులన్నీ తాత్కాలికంగా అందరికీ సంతృప్తికరంగానే వున్నవి. అక్కడ చేరిన ప్రభుత్వాలు అమెరికా, బ్రిటను, జపాను. ఈ మూడుప్రభుత్వాల ప్రతినిధులూకూడా ఏకగ్రీవంగా అంగీకరించి తమలోతమకి ఎంతెంత నావికబలం వుండాలో నిర్ణయించుకున్నారు. అమెరికా బ్రిటను ప్రభు

త్వాలు పెద్దవి కాబట్టి వారిద్దరికీ కొంచెం ఎక్కువబలం సరిసమానంగా వుండాలన్నారు. జపాను చిన్నప్రభుత్వంకాబట్టి జపానుకి తక్కువబలం వుంటే ఫరవాలేదన్నారు. అమెరికాకీ, బ్రిటనుకీ అయిదేసి యుద్ధనావ లుంటే జపానుకి మూడని నిర్ణయించినారు. దాన్ని ౫: ౫: 3 రేష్యో అంటారు. ఈషరతులికి అంగీకరించినప్పుడు జపాను సంపూర్ణసంతృప్తితో ఆపని చేసింది. జపానుకి తక్కువ ఎందుకువుండాలనే ప్రశ్న రాకపోలేదు. అది ఆదేశానికి నామర్దా" అన్న ఉద్రేకపూరితులైన దేశభక్తులు లేకపోలేదు. కాని ఆనాడు ఆబలం జపానుకి నిజంగా సరిపోయింది. ఆ కారణంచేతనే నిశ్శంకగా జపాను ఆ వొడంబడిక అంగీకరించింది. ముందుముందు జాగ్రతకోసంమాత్రం ఆ వొడంబడికకు ఒక కాలపరిమితిమాత్రం నిర్ణయించింది. ఆపరిమితి దాటిపోయింది. జపానురాజకీయవేత్తల దృష్టిలో ఈనాడు అంతర్జాతీయవ్యవహారాలు పూర్తిగా మారిపోయినవి. వాషింగ్టను షరతులప్రకారం నిర్ణయించిన నావికబలం జపానుసంరక్షణకి చాలదు. అమెరికాతోనూ, బ్రిటనుతోనూ సమానమైన బలం వుండాలన్నారు. నావిక వొడంబడిక తిరిగీ నిర్ణయించుకునేటట్టయితే అందరికీ సమానబలం వుంటే గాని వీలులేదని జపానువాదన. అమెరికా బ్రిటను ప్రభుత్వాలు దీనికి అంగీకరించలేదు. వెంటనే జపాను వాషింగ్టను వొడంబడిక త్రోసిరాజన్నది. నావికబల నిర్మాణంలో స్వేచ్ఛగా వ్యవహరించడం ప్రారంభించింది.

లండనులో ఈమధ్య జరిగిన నావికసమావేశం భగ్నంకావడం విషాదకరమైన సంగతి అని అంతా అంగీకరిస్తారు. ఉన్న మూడు ప్రభుత్వాలికీ మనసు కుదరనప్పుడు ఒకనిర్ణయం ఎల్లా తేల్తుంది? వాషింగ్టను వొడంబడికకు కాలపరిమితి లేకపోతే బహుశః జపాను దౌర్జన్యంగా ఆ షరతులు అతిక్రమించేదేమో?

కాలపరిమితివున్న వొడంబడికలు విరమించుకుంటేనే ఇంత క్లిష్టసమస్యలు సంభవించినప్పుడు అసలు శాశ్వతంగా వుండాలని నిర్మించిన రాజకీయ షరతుల సంగతి ఏమిటి? ఏవిధమైన అంతర్జాతీయ వొడంబడికలూ శాశ్వతంగా వుండజాలవని ప్రస్తుతం యూరపు రాజకీయ వాతావరణంవల్ల తెలుస్తుంది.

ఈ విధంగా ఒక శాశ్వతరాజకీయనిర్మాణం సృష్టిద్దామని ప్రయత్నించి పప్పులో అడుగువేసినారు వెర్సెయిల్సుసమావేశంలో పెద్దలు. అంతా రాజకీయ వేత్తలే, మేధావులే. కాని, మానవప్రకృతి గమనించలేక, దురాశతో ప్రవర్తించినారు ఆప్రవర్తనఫలితం ఈనాటి ఖంగారు, యుద్ధభయం, మానవ జీవితానికి నిరంతరాపాయం.

వెర్సెయిల్సుసంధిషరతుల ప్రకారం యూరపు యుద్ధంలో వోడిపోయిన దేశాలు తమతమ రాజ్యభాగాలు వదులుకోవలసివచ్చింది. యుద్ధంలో గెల్చినవారికి కలిగిననష్టానికిఅంతులేనిపరిహారాలు అర్పించవలసివచ్చింది. వీటికితోడు తమ స్వాతంత్ర్యాన్ని అరికట్టే ఎన్నో షరతులికి అంగీకరించవలసివచ్చింది. ఈషరతులు ఎన్నో కష్టనష్టాలు కలిగించేవి, శాశ్వతమైనవి, అమర్యాదకరమైనవి.

యూరపుఖండం రెండుభాగాలు చేసినారు వెర్సెయిల్సుపెద్దలు: గెల్చినదేశాలూ, వోడిపోయిన దేశాలూ. వోడిపోయినదేశాల్ని శాశ్వతంగానీచత్వంలో వుంచాలని నిశ్చయించి, సంధిషరతులు నిర్ణయించినారు. అంతర్జాతీయసమితిప్రణాళికలో పందొమ్మిదవసూత్రం ప్రకారం సంప్రదింపులవల్ల తమకు కష్టంగా వున్న షరతులు క్రమేణా రద్దుచేసుకోవచ్చు. కాని దీనికి గెలుపొందినవారు అంగీకరించాలి. ఈ అంగీకారభిక్ష ఇచ్చే ధర్మబుద్ధి వారిదగ్గిర లేకపోయింది. వొప్పుకోకపోతే ఆ ప్రభుత్వాలు ఎదురుతిరిగి కొంప ముంచుతాయనే జ్ఞానంకూడా లేకపోయింది.

దురన్యాయం అయిన ఈ రాజకీయదుర్నీతి వోడిపోయిన దేశాలు చిరకాలం సహించవన్న సంగతి వెంటనే స్పష్టమైంది. వోడిపోయిన దేశాలలో ఎక్కువ అన్యాయం టర్కీకి జరిగింది. సెవ్రిసుసంధి షరతుల ప్రకారం టర్కీ కేవలం అస్వతంత్రరాజ్యం అయి

పోయింది. కాని ఆ నిర్ణయానికి లొంగివుండమన్నారు జీవశక్తివున్న టర్కీ ప్రజలు. ముస్తాఫాకమాల్‌పాషా అనే నాయకుడి యాజమాన్యంకింద విప్లవోద్యమం ప్రారంభించి, గెలుపొందిన మిత్రమండలివారి మెడలు వంచినారు. లాసేనులో మరొక సంధిసమావేశం చేయించి, అక్షరాలా తమకు కావలిసినవన్నీ గొంతుక మీద కూచుని లాక్కున్నారు. ఆ సమావేశంలో అంగీకరించిన షరతులలో డార్డనెల్లిసు సంరక్షణమాత్రం కొంచెం నీరసంగా వున్నది.

డార్డనెల్లిసు అనేది ఒక జలసంధి. మధ్యధరా సముద్రానికీ నల్లసముద్రానికీ ఇది దారి. యూరపు మహాయుద్ధంలో ఈ ఇరుకుప్రదేశంలో పట్టుకుని బ్రిటిషు నావల్ని చిందరవందర చేసినారు శత్రువీరులు. ఎప్పటికైనా ఇది చిక్కుప్రదేశమే నని, ఆ జలసంధి రెండుతీరాలూ కూడా రైనునదీ ప్రాంతంమాదిరిగానే తటస్థప్రదేశంగా వుంచాలన్నారు. టర్కీ ఆనాడు దానికి అంగీకరించింది. కాని యూరపులో పరిస్థితులు మారి, జర్మనీ రైనుప్రాంతం ఆక్రమించడంతోనే, తానుకూడా డార్డనెల్లిసు జలసంధి తటస్థప్రదేశంగా వుంచడానికి వీలు లేదని లోకానికి తెలియజేసింది. బ్రిటిషువారు టర్కీవాదన అంగీకరించి, లాసేను వొడంబడికదారుల సమావేశంలో ఇది చర్చించాలని సలహాయిచ్చినారు. అసలు దీనికి బ్రిటిషువారు అంగీకరించడంలో ఒకరహస్యం ఉన్నది. మధ్యధరాసముద్రంలో ఇటలీ వాయుబలం వృద్ధికావడమువల్ల బ్రిటిషు నావికబలం క్షీణించింది. మధ్యధరా సముద్రంలో బ్రిటిషు వారి బలం తగ్గితే ఇండియాకూ, ఈజిప్టుకీ దారి అపాయకరం అవుతుంది. అదీకాక బ్రిటషుకి చాలావరకు పెట్రోలు ఈరాక్ దేశంనుంచి రావాలి. ఈరాక్ పూర్వం టర్కీరాజ్యం. వెర్సైయిల్సు సంధిషరతులప్రకారం అది బ్రిటీషువారి పరిపాలనకింద వుండే మాండేటరీ ప్రభుత్వంకింద నిర్ణయించినారు. ఈరాక్ నుంచి మధ్యధరాసముద్రంలో వున్న హైఫారేవు వరకూ పెద్దగొట్టములు కట్టి పెట్రోలు అక్కడ పడవలలోకి ఎక్కిస్తున్నారు బ్రిటిషువారు. ఇప్పుడు మధ్యధరాసముద్రంలో వారి నావికబలం క్షీణించి, నావికాయానం ఆగిపోతే పెట్రోలు పర్షియా సంయుక్తాగ్రగుడంలోంచి ఆఫ్రికాచుట్టూ తిరిగిరావాలి. ఈ కారణాలవల్ల డార్డనెల్లిసుషరతులు అనుకూలంగా మారిస్తే పరిస్థితులేమన్నా బాగుపడతాయేమో ననే ఆశతో బ్రిటిషువారు డార్డనెల్లిసుషరతులు తిరిగీ చర్చించడానికి అంగీకరించినారు. పైకిమాత్రం టర్కీవాదన న్యాయమేనని ప్రకటించినారు. ఈసంబంధమైన సమావేశం మాంట్రూలో జరిగింది. కొత్తషరతులు నిర్మించి ఇటలీమినహా అంతా సంతకాలు చేసినారు.

ఒకవేళ ఈషరతులు మార్చడానికి వీలులేదని తక్కినప్రభుత్వాలు అంటే టర్కీ స్వయంగా అవి మార్చి, ప్రభుత్వాల్ని ధిక్కరించేవుండేది. టర్కీ అచిరకాలంలో యుద్ధబలం సమకూర్చుకుని, వెర్సైయిల్సు షరతులు తోసిరాజని తన సంపూర్ణస్వాతంత్ర్యం సంపాదించుకోగలిగింది. కాని వోడిపోయిన ఇతరదేశాలు, అనగా జర్మనీ, ఆస్ట్రియా, హంగేరీ, బల్గేరియా దేశాలు అంత అదృష్టం చేసుకోలేదు. వర్సైయిల్సు సమావేశంలో నిర్ణయించిన షరతులు చాలా వరకు ఆదేశాలు అనుసరించవలసివచ్చింది. ఆషరతులు విధిలేక ఆదేశాలు అనుసరించినా, అందులో వేటికీ ఆదేశస్థుల అంగీకారం లేదు. సంతృప్తితో వొప్పుకున్న షరతులు కావు అవి. బలవంతంచేసి అన్యాయంగా సంతకం చేయించాగు సంధిపత్రంలో ఈదేశాల ప్రతినిధులచేత. ధర్మదృష్టిని ఆషరతు లేవీ చెల్లకూడదు. నైతికంగా, ఆ షరతులన్నీ వీగైనప్పుడు అతిక్రమించవచ్చుననే భావం ఆదేశాల ప్రజలకు కలిగింది. ధర్మబుద్ధి వున్నవారంతా ఆవాదనలో వున్నబలం గ్రహించితీరాలి.

వోడిపోయిన దేశాలలో ఇటువంటి ప్రకృతి ప్రబలిపోతున్న దన్నసంగతి మిత్రమండలివారు గ్రహించకపోలేదు. అయినా దౌర్జన్యంవల్ల వార్ని అణిచివుంచుదామనే ప్రయత్నం బయలుదేరింది. ఈ ప్రయత్న దుష్ఫలితమే నేటి ప్రపంచపుచీకాకు, దుస్థితి, భయం. పోయిన యుద్ధానికి వెయ్యిరెట్ల తీవ్రతతో జననాశనం

చేసి లోకాన్ని స్మశానంచేసే మరోయుద్ధం పెనుభూతంలా లోకాన్ని దడిపిస్తున్నది.

కొందరు రాజకీయవేత్తలు వెర్సెయిల్సుసంధి అన్యాయం అని అంగీకరించినా లొకార్నో వొడంబడిక న్యాయం అంటున్నారు. స్విట్జర్లాండులో మనోహరమైన ప్రకృతిసౌందర్యంమధ్య, తటాకతీరాన సంతకంచేసిన ఆవొడంబడిక జర్మనీ స్వయంగా అంగీకరించింది కాబట్టి అదిమాత్రం అక్షరాలా అనుసరించాలంటున్నారు. ఇందులో న్యాయంకూడా నేతిబీరకాయవంటిదే. ఆనాడు ఈవొడంబడికకు అంగీకరించిన జర్మను రాజకీయవేత్త స్ట్రేస్మన్, ఫ్రెంచిరాజకీయవేత్త బ్రియాన్, ఇరుపక్షాలకూ సంతృప్తికరమైన షరతులే చేసుకున్నామని విశ్వసించివుండవచ్చును. కాని వారి సంతకాలు వారివారి ప్రభుత్వాల సంతృప్తివల్ల, వారి ప్రజల సంతృప్తివల్ల బలపడాలి. అది జరుగలేదు. అందువల్ల జర్మనీ ఫ్రాన్సు మనస్సులు నిజంగా కలవలేదు ఆనాడు. మనస్సులు కలవని కంట్రాక్టు చెల్లదు.

అసంతృప్తివల్ల జర్మనీ వెర్సెయిల్సు షరతులు అతిక్రమించడానికి ప్రయత్నించింది. ఫ్రాన్సు రైను నదీతీరంలో దుర్భేద్యమైన ప్రాకారాలు నిర్మించి తన పరిహద్దులు బలపర్చుకున్నది. జర్మనీ పరిహద్దుమాత్రం సంరక్షణలేకుండా తటస్థ ప్రదేశంగా వుండాలన్నది. లొకార్నో షరతులు న్యాయమో అన్యాయమో దీనివల్ల తెలుస్తుంది.

జర్మనీ ఫ్రాన్సుప్రజలకి నిజంగా లొకార్నో వొడంబడికలో నమ్మకంవుంటే రెండువేపులాకూడా పరిహద్దులు తటస్థప్రదేశంగా వుండాలి. కాని ఫ్రాన్సు "మాగినాట్ లైను" అని యుద్ధశిబిరాలు లేవదీసింది. జర్మనీ ప్రతిక్రియగా "హిండెన్‌బర్గులైను" లేవదీసింది. అమెరికా సంయుక్తరాష్ట్రాలికీ కెనడాడొమినియనుకీ తగాదాలు లేవు. పరస్పరవిశ్వాసం వున్నది వారి పరిహద్దులలో సైన్యాలకు తావులేదు. అల్లాగే పరస్పర విశ్వాసం వుంటే జర్మనీఫ్రాన్సుదేశాలుకూడా తమ పరిహద్దులు చల్లగా వుంచుకోవచ్చును. అల్లా వుంచుకో లేదు. కారణం విశ్వాసం లేకపోవడమే. శాశ్వతంగా జర్మనీ తన పశ్చిమపరిహద్దులు దేవుడికి అప్పజెప్పి, ఫ్రెంచివారి తూర్పు పరిహద్దులలో యుద్ధప్రయత్నాలు చూస్తూ వూరుకుంటుందని వూహించడం బుద్ధితక్కువపని. సంధిచేసిన స్ట్రేస్మన్ ఆ షరతులికి ఈ అర్థం వున్నదని ఎప్పుడూ అనుకునివుండడు ఫ్రాన్సు జర్మనీ సంబంధ బాంధవ్యాలు వృద్ధి అవుతాయని ఆశించినాడు. అందులో లొకార్నో ప్రథమసోపానం అనుకున్నాడు. ఆఖరుషరతు అని అంగీకరించలేదు.

జర్మనీ రైను ఆక్రమించడంవల్ల వచ్చిన విషమ సమస్య చర్చించేటప్పుడు ఇవన్నీ పరిశీలించాలి వూరికే లొకార్నోషరతులు పఠించి జర్మనీ అతిక్రమించిందంటే న్యాయంకాదు.

జర్మనీ లొకార్నో నిరాకరణం చరిత్రకు కొత్తదైనట్టూ, ఇదివరకు ఇటువంటిది కని విని ఎరుగనట్టూ బ్రిటిషు, జర్మను, బెల్జియను రాజకీయవేత్తలు ముక్కున వేలువేసుకుంటున్నారు. యూరపుచరిత్రకు ఇటువంటిసంగతి కొత్తకాదు. నిజపరిస్థితులికీ, రాజకీయ వొడంబడికలకీ సంబంధం లేనప్పుడు ఎప్పుడూ వొడంబడికలు ధిక్కరించబడుతూనే వున్నవి. ౧౮౭౧ వ సంవత్సరంలో రష్యా తనకు అనుకూలంగా లేని నల్లసముద్రానికి సంబంధించిన షరతులు అతిక్రమించింది. క్రిమియాయుద్ధంలో బ్రిటను, ఫ్రాన్సుదేశాలు రష్యాను వోడించినవి. అది చాలక ఆనాటి సంధిషరతులలో రష్యా నల్లసముద్రతీరంలో నావికస్థానాలు నిర్మించకూడదనే షరతు పెట్టినారు. రష్యాకు నల్ల సముద్రంలో నావలు వుండకూడదు. అంటే రష్యాకు నావికబలం వుండకూడదని అర్థమవుతుంది.

రష్యాదక్షిణపరిహద్దులు శాశ్వతంగా సంరక్షణ లేకుండా వుంచాలని ప్రయత్నం. తాత్కాలికంగా రష్యా విధిలేక ఆ షరతులికి అంగీకరించింది. అవి అతిక్రమించడానికి సమయంకోసంమాత్రం చూస్తున్నది. పదిహేను సంవత్సరాలతర్వాత ఫ్రెంచి ప్రష్యా యుద్ధం వచ్చింది. యూరపంతా అందులో మునిగిపోయింది. రష్యా వెంటనే నల్లసముద్రంలో నావిక

నిర్మాణం ప్రారంభించి బలం సంపాదించుకున్నది. తన అమర్యాద పోగొట్టుకున్నది. అదీ సంగతి.

అటువంటి పరిస్థితులే ఈ నాడు యూరపులో సంభవించినవి. జర్మనీ ధిక్కారం యూరపు అంతా ప్రబలివున్న అసంతృప్తికి ఒక రూపం. వెర్సెయిల్సు సంధి ఉసురుకొడుతున్నది యూరపుఖండాని కిప్పుడు న్యాయా న్యాయాలు పరిశీలించి, ధర్మసంస్థాపన చెయ్య గలిగిన ఉదారహృదయులు రాజకీయవేత్తలైతేనే గాని ఈ అలజడి సద్దుమణగదు. ఆ ఔదార్యం మాత్రం ఎక్కడా కనబడదు. సంకుచితదృష్టి సంక్షోభానికి కారణం అవుతుంది. రాజకీయవేత్తలు దూరం చూడ లేకపోతే దగ్గరలోనే లోకవినాశనానికి కారణం అవుతారు.

---



'వెకిలినవ్వు' —వాసన్,

# మోక్షగుండం విశ్వేశ్వరయ్య

ఆంధ్రులు భారతదేశపు దక్షిణభాగమునం దంతట వ్యాపించి యున్నారను సంగతి యందరికి తెలిసినదే. మైసూరు సంస్థానమునందు వారి సంఖ్య దాదాపు ౧౧ లక్ష లున్నది. అనగా నచ్చటి ప్రజలలో ఆరవవంతు ఆంధ్రులే. దేశభాష కర్ణాటక మగుట వలన వారు సాధారణముగా దానినే వ్రాయుచు, చదువుచు నుందురు. కాని యిండ్ల యందుమాత్రము మాతృభాష యగు తెనుగునే యుపయోగించుచున్నారు. ఇట్టిమైసూ రాంధ్రులలో ననేకులు ప్రసిద్ధికివచ్చియున్నను ముగ్గురిని మనము ప్రముఖులుగా నెన్నుకొనవచ్చును. మైసూరు నగరవాస్తవ్యులై రమారమి ఏబది సంవత్సరములు పత్రికా సంపాదకులుగాను, తదితర విధములుగాను ప్రజాసేవ యొనర్చి, కొన్నిసంవత్సరముల క్రిందటనే కేవల వార్ధక్యమువల్ల కాలధర్మము నొందిన ఎం. వెంకటకృష్ణయ్యగా రొక్కరు. కటికబీదలుగా జీవయాత్రను ప్రారంభించి తన బుద్ధిచాతుర్యముచే నున్నతపదవులను బొంది, చివరకు మైసూరుప్రభుత్వమున రెండవమంత్రిగాను, మైసూరు విశ్వ విద్యాలయమునకు మొదటి వైస్‌ఛాన్సెలరుగాను నుండిన హెచ్. వి. నంజుండయ్యగారును ఆంధ్రులే. ఇక భారతదేశమునందేగాక యితర దేశములయందుకూడ గొప్ప ఇంజనీయరుగా ప్రఖ్యాతి నొందిన మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు మరియొకరు. ఈముగ్గురు తమకేగాక తమ దేశమునకుగూడ మహత్తర కీర్తిదెచ్చిన మహనీయులు. ఇందు విశ్వేశ్వరయ్యగారి జీవచరిత్రను ప్రస్తుతము మనము కొంత విశదముగా పరిశీలింతము.

విశ్వేశ్వరయ్యగారి పూర్వీకులు మోక్షగుండ మను గ్రామమునుండి మైసూరు దేశమునకు కొన్ని శతాబ్దములక్రిందట వలసవచ్చిరి. ఆగ్రామము గోదావరి జిల్లాలో నున్నదని కొందరును, కర్నూలుజిల్లాలోని నంద్యాల కనిమిదిమైళ్లదూరమున నున్నదని మరికొందరు నందురు. వారు ములకనాటి శాఖకు జేరిన వైదిక బ్రాహ్మణులు. విశ్వేశ్వరయ్యగారి తండ్రిపేరు శ్రీనివాసశాస్త్రులు. ఆయాన వైద్యశాస్త్రమునందును, సాహిత్యమునందును చాలా నిపుణుడు; కాశీక్షేత్రము నందు పదిసంవత్సరములపాటు విద్యనేర్చి, యోగాభ్యాసముజేసిన మహనీయుడు. అతని దైవభక్తికిని, వివేచనాశక్తికిని ఒకచిన్న తార్కాణ-స్వగ్రామమునకు చేరువనుండుచిత్రావతినదినుండి వారొక్కనాడు తమయాహ్నికమును ముగించుకొని మధ్యాహ్నమింటికి వెళ్లుచుండగా నొకపంచముడు వారిని సమీపించి దాహమును దీర్చుకొనుటకు నీరడిగెనట. అప్పుడు జాతిభేదమును గమనింపక వెంటనే వానికి చేతనున్న నీటినిచ్చి దాహశమనము జేసిరట. అంతేగాక మరల స్నానాదికములేవియు చేయక తిన్నగా వెళ్లి యిల్లుజేరిరట. దీనికొరకై సంఘస్థులు వారిని కొంత బాధపెట్టిరి గాని, చివరకు వారి దొడ్డతనమును గ్రహించి సమాధానపడిరట. ఈకాలము నందుకూడ ఇట్టి ధైర్యచర్యలను గ్రామములయందు

జూచుట చాల కష్టము. అట్టితరి ౭౦ సంవత్సరముల క్రిందటిమాట చెప్పనక్కరలేదు.

ఇట్టి నిజజ్ఞానికి ౧౮౬౧-వ సంవత్సరమున సెప్టెంబరు ౧౫-వ తేదినాడు ఇప్పుడు మైసూరు సంస్థానమున కోలారుజిల్లాలోనుండు చిన్నబళ్లాపురం తాలూకా ముద్దేనహళ్లియను గ్రామమునందు విశ్వేశ్వరయ్యగారు బుట్టిరి. శాస్త్రవేత్తయయిన తండ్రి పుత్రుడు చాల ప్రాముఖ్యమునొందునని ముందేగ్రహించినను అతనికి ఇంగ్లీషుచదువును నేర్పుటకుమాత్ర మిష్టపడలేదు. అయినను బాలుడు ప్రాథమికవిద్యాభ్యాసము జరుగునప్పుడే తన సూక్ష్మబుద్ధిని జూపి సహపాఠులలోనెల్ల నద్వితీయుడుగానుండెను. కొంతకాలమునకు ఆయన చిన్నబళ్లాపురమును వదలి ఉత్తమవిద్యకొరకు బెంగళూరికి రావలసివచ్చెను. అచ్చట మైసూరుప్రభుత్వమునందు ఉపకార్యదర్శియయి మంచిస్థితిలోనుండిన తనమేనమామయగు హెచ్. రమయ్యగారి పోషణయందు విశ్వేశ్వరయ్యగారు జేరిరి. వెంటనే ప్రసిద్ధిజెందిన సెంట్రలు కాలేజిలోజేరి తమ సూక్ష్మబుద్ధికిని, అసదృశశక్తికిని తగినటుల బి. ఏ. పరీక్షయందు గణ్యతగ నుత్తీర్ణులయిరి. పిమ్మట ఎం. ఏ. పరీక్షకు చదువవలెనను నభిలాష వారి కుండెడిదిగాని యది సఫలముగాలేదు. అప్పుడేగాక సర్కారునౌకరిలో నుండునపుడు కూడ రెండుపర్యాయములు వారాపరీక్షకు ప్రయత్నించిరిగాని దేహారోగ్యము చెడుటవలన దానిని మానుకొనవలసివచ్చినది. అయితే బి. ఏ. పరీక్ష కాగానే వారికి మైసూరుప్రభుత్వపు విద్యార్థివేతనము దొరికినది. దాని సహాయములో వారు పూనాపట్టణమును జేరి యచ్చటి యింజనీయరింగ్ కాలేజీలో చదువ నారంభించిరి. ౧౮౮౩-వ సంవత్సరమునందు వారు బొంబాయి విశ్వవిద్యాలయపు ఎల్. సి. యి. పరీక్షలో ప్రథమశ్రేణియందు ప్రథమస్థానమును బొంది బంగారుపతకమును కూడ సంపాదించిరి. అప్పుడు బొంబాయిప్రభుత్వము ప్రథమస్థానమును బొందిన విద్యార్థులకు తామే యుద్యోగము నిచ్చునట్లు వాగ్దాన మిచ్చియుండిరిగాన విశ్వేశ్వరయ్యగారికి వెంటనే అసిస్టెంటు ఇంజనీయరుపని నొసంగిరి. అప్పుడు వారికి వయస్సు ౨౩ సంవత్సరములు మాత్రమే.

తర్వాత వారు ఎనిమిది పదిసంవత్సరములదాక నాసిక్, కాండేషు, పూనాజిల్లాలలో పనిజేయుచుండిరి. ౧౮౯౪ నందు సింధుప్రాంతమునకు జేరిన సుక్కూరుపౌరసభవారు వారిని తమ నీటిసరబరాయి విషయముగా ఇంజనీయరుపదవియందు నియమించిరి. అచ్చటి పనులను సర్వసమ్మతముగా జేయుటకు సుమారు రెండుసంవత్సరములు పట్టినవి. వెంటనే సూరత్ పౌరసభవారు వారిని అదేపనికొఱకు నియమించిరి. అచ్చటి పనులనన్నిటిని సర్వోత్కృష్టముగా జేయునంతలో వారికి జిల్లాయింజనీయరుపదవి యొసగబడెను. ౧౮౯౭ వ సంవత్సరమునందు వారికి పూనా సెంట్రల్ డివిజన్ సూపరింటెండింగ్ యింజనీయర్ పనియయినది. దానితో వారు చీఫ్‌యింజనీయరుకు సహకారిగా నుండునటులకూడ నియమింపబడిరి. విదేశసంచారము జేయవలెనను కుతూహలము వారికి చిరకాలముగ నుండెడిది. ౧౮౯౮ లో వారు ఫర్లోసెలవును బొంది చీనా, జపాను మొదలగు దేశములయందు బహుళముగా సంచరించి యచ్చటి ఆచారపద్ధతులను, రాజ్యాంగక్రమములను బాగుగా గ్రహించిరి స్వదేశమునకు తిరిగిరాగానే పూనాజిల్లా యిరిగేషన్ ఎగ్జిక్యూటివ్ యింజనీయరుగా వారు నియమింపబడిరి. తర్వాత రెండు సంవత్సరములలో వారికి బొంబాయి స్యానిటరియింజనీయరు, స్యానిటరిబోర్డు మెంబరుల పదవు లొసంగబడినవి. ఈ సమయమునందు ఇండియన్ యిరిగేషన్ కమిషన్ రాగా దానియెదుట వారు సాక్ష్యమిచ్చిరి. కమిషన్ వారి యద్భుతప్రజ్ఞను, వారి యసాధారణానుభవములను మెచ్చి చాల శ్లాఘించిరి. సార్వభౌమప్రభుత్వముకూడ వీరికంటె సాహసవంతులయిన యింజనీయరులు అరుదని తమ చేవ్రాలుతో అభిప్రాయమును వీరికి దెల్పిరి. ౧౯౦౪లో సిమ్లాలో నొక యిరిగేషన్ మహాసభ జరిగినది. దానికి బొంబాయి ప్రభుత్వము తమ ప్రతినిధిగా విశ్వేశ్వరయ్యగారిని బంపిరి. పిమ్మట రాజధాని యొక్క స్యానిటరి యింజనీయరుగాను, పబ్లిక్

వర్క్సుశాఖయొక్క కార్యదర్శిగాను రెండుద్యోగములను ఏకకాలమునందే నిర్వహించునటుల వారు ఎన్నుకొనబడిరి. ఈవిధముగ ౨౨ సంవత్సరములు ప్రభుత్వోద్యోగము జేసిన పిమ్మట వారు విరమించుటకై సర్కారు అనుమతిని గోరిరి. ఆ కాలమునందు జాతీయులకు చీఫ్ యింజనీయర్ పదవి నిచ్చుచుండలేదు. దానివలన వారికి తమ యుద్యోగమునందు విరక్తి పుట్టుట సహజమే. ఇంకెన్ని సంవత్సరము లుండినను వారికి లభింపదగిన పైయుద్యోగము లుండలేదు. అందువలన వారు విశ్రాంతిబొందుటకు సర్కారుఅనుమతిని గోరి అచిరకాలమునందే దానిని బొందిరి. బొంబాయి ప్రభుత్వముకూడ వీరి మహత్కార్యములనుబట్టియు, వీరి యసాధారణబుద్ధి కార్యదీక్షలనుబట్టియు వీరిని చాల శ్లాఘించి విశేషవిశ్రాంతివేతన మివ్వవలెనని సార్వభౌమ ప్రభుత్వమునకు వ్రాసిరి. దానికొరకు కొంతకాలములో అనుమతినికూడ బొందిరి. ఈ సందర్భమున మూర్ మెకన్సి యను పబ్లిక్ వర్క్సుశాఖకుజేరిన యాంగ్లేయోద్యోగస్థుడు బొంబాయి చట్టసభయందు జెప్పిన దేమన "The D. P. W. of the Bombay Presidency had become the poorer by the retirement of that talented engineer, Mr. M. Visveswarayya" అనగా "చాలాసామర్థ్యశాలియగు విశ్వేశ్వరయ్యగారు తమయుద్యోగమునుండి విశ్రాంతిబొందుటవలన, బొంబాయిరాజధానియొక్క పబ్లిక్ వర్క్సుశాఖకు ఒక గొప్పనష్టము కలిగినది."

తర్వాత విశ్వేశ్వరయ్యగారు మరల విదేశ సంచారమునకు బయలుదేరిరి. యూరోపు, అమెరికా ఖండములందెల్ల సావధానముగా తిరిగి యచ్చట రాజులతోను, ముఖ్యాధికారులతోను, విద్యావంతులతోను, పరిశ్రమాభివృద్ధియందు కంకణబద్ధులయిన కోటీశ్వరులతోను పరిచయమేకాక స్నేహ గౌరవములనుకూడ సంపాదించిరి. ఇటలీదేశపు ముఖ్యపట్టణమయిన రోమునందు వారుండగా, హైదరాబాదు సంస్థానములో మూసానది ప్రవాహమువలన అనేకానర్థములు సంభవించినవి. అవి మరల తటస్థింపకుండ నివారించుటకు తగిన ఏర్పాటులు చేయవలెనని నైజామ్ ప్రభుత్వము గొప్ప యింజనీయరు ఒకడు కావలెనని ఇండియా ప్రభుత్వమును అడుగగా వారు విశ్వేశ్వరయ్యగారిని జూపిరి. అట్టిప్రకారమున విశ్వేశ్వరయ్యగారు మాతృభూమికి మరల రాగానే హైదరాబాదు సంస్థానమునం దధికారము వహించి, ప్రవాహనిరోధార్థముగా నొక రిజర్వాయరును గట్టుమని సూచించిరి. ఇతరములయిన యూహాపోహలనుగూడ వారిచ్చిరి. వాటియందు ఇప్పుడు ఉస్మాన్సాగర మను సుప్రసిద్ధమయిన రిజర్వాయ రొక్కటి. అప్పుడు మైసూరు సంస్థానము వారిని చీఫ్ ఇంజనీయరుగా రమ్మని కోరిరి. అదివరకు ఆపదవిని భారతీయు లనుభవించియుండలేదు. అటువంటి యాహ్వానమును తిరువాన్కూరు మొదలగు సంస్థానములు అదివరకే యిచ్చియుండినను మాతృభూమి యను వాత్సల్యముతో వారు మైసూరునకే వచ్చిరి. ౧౯౦౯ నుండి ౧౯౧౨ వరకు వారు మైసూరునందు చీఫ్ ఇంజనీయరుగా నుండిరి. తర్వాత రాజా సర్ టి. మాధవరావుగారి కుమారుడయిన ఆనందరావుగారు సంస్థానపుదివానుపదవినుండి విశ్రాంతిబొందగా శ్రీమన్మహారాజు గారు విశ్వేశ్వరయ్యగారిని ఆపదవికి నియమించిరి. ఒక చిన్నసంగతిని మన మిచ్చట గమనింపవలయును. ౧౯౧౧ వ సంవత్సరమునందు మద్రాసు ప్రభుత్వము మెట్టూరు ఆనకట్టనుగురించి తీవ్రముగా యోచించియుండిరి. అయితే విశ్వేశ్వరయ్యగారు కన్నంబాడికట్టను ప్రారంభింపగా వారు తమ యుద్దేశ్యమును విడువవలసివచ్చినది.

అమాత్యపదవియందు విశ్వేశ్వరయ్యగారు దాదాపు ఆరుసంవత్సరము లుండిరి. ఆ కాలమునందు వారు దేశాభివృద్ధికొరకు జేసిన కార్యములు చిరస్మరణీయములనిన నతిశయోక్తిగాదు. సంస్థానమునందెల్ల నూతనచైతన్య మొకటి యుద్భవించినది. ప్రజలయందు క్రొత్త యుత్సాహము బొడమినది. దూరాలోచనలు, వాటికి తగిన స్థైర్యప్రయత్నములు వారు చేయసాగిరి. తమకాలమునందు విశ్వేశ్వరయ్యగారు జేసిన కార్యములలో కొన్నిటినిమాత్రము మన మిచ్చట గమనింతము. ప్రపం



మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు



లిన్‌లిత్‌గో ప్రభువు - భారతదేశ రాజప్రతినిధి

చమునందెల్ల ప్రసిద్ధిజెందిన కృష్ణరాజసాగరము, భద్రావతియందలి యినుముపరిశ్రమ, సోపుగంధం నూనెపరిశ్రమలు, మైసూరు బ్యాంకు, మైసూరు వాణిజ్యసంఘము, మైసూరు విశ్వవిద్యాపీఠము, రైల్వేయభివృద్ధి, నిర్బంధవిద్యాభ్యాసము, మలేనాటి (కొండసీమల) పురోవృద్ధినీ, రొదిగించు గొప్పపరిశ్రమలు, కర్ణాటకసాహిత్యపరిషత్తు, సార్వజనిక పుస్తకభాండాగారములు, ప్రజాప్రతినిధిసభయొక్క వర్ధంతి అధినివేశము, గ్రామపంచాయతీల స్థాపన, అర్థసాధక సభ. కేవలము ఆరుసంవత్సరములలో నింతపని జరుగుటనగా చాల అపూర్వమనియే చెప్పవలయును. పైగా, విశ్వేశ్వరయ్యగారు సంస్థానపు అర్జనశక్తిని హెచ్చించుటే గాక, ప్రభుత్వపు ప్రతిశాఖను సంస్కరించి పనులు చాల విచక్షణతతోను, దర్పముతోను జరుగునటుల జేసిరి. క్రొత్తపరిశ్రమలు స్థాపింపబడుటచే ఎంతోమందికి జీవనోపాయములు గలిగినవి. ఇన్ని సత్కార్యములను జేయుచుండెడి మంత్రివరుని జూచిన శ్రీమన్మహారాజుగారికి ఎక్కువ ప్రీతిగౌరవము లుద్భవించుట సహజమే గదా! ఈవిషయమును మన మొక్కయుదాహరణముతో చూడవచ్చును. ౧౯౧౭ - వ సంవత్సరమున మైసూరువిశ్వవిద్యాలయపు ప్రథమపట్టప్రదానమహోత్సవము జరిగినది. అప్పు డగ్యక్షతవహించి హాస్నెలరుగా సంభాషించుసమయమున మహారాజుగారిట్లు నుడివిరి: "మన రాజ్యపు మంత్రివర్యులయిన సర్ ఎం. విశ్వేశ్వరయ్యగారికి మేము, మాప్రజలు ఎంతవరకు కృతజ్ఞులనుట ఈమహాసభయందు దెలుపుటకు నామనస్సు చాల సంతసించుచున్నది. ముందు మనకందరికిని స్వప్నప్రాయముగా నుండిన విశ్వవిద్యాలయము ఈరోజున మన కెదురుగా సాక్షాత్కరించి నిలిచియుండుటకు వీరి దేశాభిమానము, వీరి యుత్సాహము, వీరు పట్టుదలతో జేసిన సాధనములే ముఖ్యకారణములు. ఈ విద్యాపీఠస్థాపన విషయములో అందరికంటె నెక్కువగా వీరిపేరే ఆచంద్రార్కస్థాయిగా నుండును."

ఆరుసంవత్సరములయినతర్వాత, అనగా ౧౯౧౮ డిసంబరుమాసములో వారు అమాత్యపదవిని విసర్జించి విశ్రాంతిబొందిరి. అంతకుముందుగా వారు మంత్రాలోచనమందిరమునందు అధికారులసభ నొకటిని జేర్చి తమ యభీష్టములనుగూర్చియు, తమ కార్యములనుగూర్చియు నీ విధముగ నుడివిరి. దీనిలో వారి యౌదార్యచిత్తమును, పట్టుదలయు స్పష్టమగుచున్నవి. "సుమారు ఆరుసంవత్సరములక్రిందట నేను దివానుపదవిని వహించినపుడు ప్రజలొసగిన యాహ్వానపత్రికకు ఈ విధముగా ప్రత్యుత్తరమిచ్చితిని. 'నాకు ఇంకను ఉన్నతిపదవిని, ఎక్కువ గౌరవమును రావలెనని మీరు కోరుచున్నారు. అయితే నాకు సేవకు అవకాశము దొరకినదే చాలు. కొన్నిసంవత్సరములుగా స్వార్థవిషయ మేదియు నాకంతగా నచ్చుటలేదు. శ్రీ మన్మహారాజుగారి కృపవలన ప్రజాసేవకు నాకీ యవకాశము దొరికియున్నది. ఇకకొన్ని సంవత్సరములదాక నా రాజుగారియొక్కయు, నామాతృభూమియొక్కయు సేవ నాకు దొరకియుంటే చాలు. వీరి సౌఖ్యమే నాకోరిక. వీరిమెప్పే నాయిష్టార్థము. ఈవాక్యములయందు సూచింపబడిన తత్వమును కాలదేశవర్తమానముల ననుసరించి సాధ్యమయినంతవరకు ఆచరణయందుంచియున్నానని నేను మనవిజేయుచున్నాను. నన్నుగురించి ఈపక్షు హితవాడి, ఆపక్షు విరోధియని అక్కడక్కడ చెప్పుకొనవచ్చును. అయితే నేను నిష్పక్షపాతిగా రాజప్రజలయొక్క యభివృద్ధినే కోరుచుంటినని కాలక్రమమున వ్యక్తపడును. నాసంకల్పములు సఫలములు గ లేదని నామనస్సు చాలఖిన్నతనొందుచున్నది. సాధింపగలిగిన యనేక కార్యములు సార్థకములుగాక నిలిచియున్నవి. అయినను నాకాలమునందు ప్రజలు ప్రభుత్వముపై విశ్వాసభరితులుగా నుండినదానికి వారికి నే ననేకవందనము లర్పించుచున్నాను.........మరియు నావిషయమునందు శ్రీమన్మహారాజుగారికి విశ్వాస మపరిమితముగా నుండెడిది. దానిని దలచుకొనినపుడెల్ల నాకు యావజ్జీవము అమందానందము గలుగుచుండును."

ఆశ్చర్యజనకముగా, విశ్వేశ్వరయ్యగారు మంత్రిపదవిని వదలిన రెండవరోజే వారి తల్లిగారు స్వర్గస్థురాలైరి. ఆమెకు అంత్యకర్మలన్నిటిని సావధానముగా జేసినతర్వాత మరల వారు విదేశసంచారమునకు బయలు

చేరిరి. ఆసమయమునందు సర్ విఠల్‌దాస్ దామోదర్ ఠాకర్‌సే మొదలయిన భారతీయ మహనీయులు జపానునం దుండగా వారిని విశ్వేశ్వరయ్యగారు వెళ్లి కలిసికొనిరి. వీరందరికిని, చైనాదేశపు కోటీశ్వరుడయిన విక్‌జాక్ ఎక్ గారికిని యిండోజాపనీసు అసోసియేషన్ తరఫున దాని యధ్యక్షులయిన కౌంటు ఎకుమరుగారు తమ భవనమునం దొక సత్కారము నొసగిరి. ఆసమయమున వారు చేసిన ప్రసంగములో విశ్వేశ్వరయ్యగారి బుద్ధిసామర్థ్యములను చాలపొగడిరి. విశ్వేశ్వరయ్యగారు దానికి సమయోచితముగ ప్రత్యుత్తరమునిచ్చుచు తాము ౨౧ సంవత్సరములక్రిందట జపానుదేశమునందుండినదియు, టోకియోనగరము జపానుసామ్రాజ్యపు ముఖ్యపట్టముగా నియమింపబడిన ముప్పదియవ వార్షికోత్సవమునందు తాము హాజరుగా నుండినదియు సభ్యులకు దెలియబరచిరి.

౧౯౨౧-వ సంవత్సరమునందు బెంగళూరు వాస్తవ్యులు వారి షష్టిపూర్తిశాంతి మహోత్సవము జరుపుచు నొకమహాసభను సమావేశపరచిరి. దానికి సర్ కె. పి పుట్టణ్ణశెట్టిగా రధ్యక్షత వహించి విశ్వేశ్వరయ్యగారిని, వారి మహత్కార్యములను పొగడుచు, అటువంటి మహనీయులు మైసూరు దేశమునందు జన్మించుట తమ యదృష్టమని నుడివిరి. అచ్చట సమావేశమైన సభ్యుల పరముగా అభినందనసందేశ మొక్కటి వారికి పంపవలెననికూడ అచ్చట తీర్మానింపబడెను.

తర్వాత విశ్వేశ్వరయ్యగారు ఏయధికారమును స్థిరముగా వహింపలేదు. అయినా ఎన్నియో కమిటీలకు మెంబరుగా నుండి చాల యుపయోగమయిన పనులను జేసియున్నారు. అట్టిపనులలో కొన్నిటినిమాత్రము మన మిక్కడ చూతము. ౧౯౨౫-వ సంవత్సరమున క్రొత్తఢిల్లీపై జేయబడిన ఖర్చులను పరీక్షించుటకు ఒక యుపసంఘమును సర్కారు నియమింపగా దానికి మెంబరుగా విశ్వేశ్వరయ్యగారు ఎన్నుకొనబడిరి. అంతకు కొంత పూర్వముగా ఇండియన్ ఎకనామిక్ యిన్‌క్వయరీ కమిటీకి అధ్యక్షులుగానుండి చాల యుపయోగకరమైన రిపోర్టు నొకటిని తయారుచేసిరి. బొంబాయి బాక్ బే రిక్లమేషన్ కమిటీకి ఉపాధ్యక్షులుగా నుండి లండన్నగరమునందు బొంబాయి గవర్నరుగా నుండిన జార్జులాయిడ్ గారిని నాలుగైదుగోజులు తీవ్రముగా బరీక్షించిరి. బొంబాయి కరాచీనగరముల పురపాలకసంఘముల యార్థికస్థితులను కూడ వారీమధ్య పరీక్షించిరి. అటులనే మద్రాసునందు జేయవలెనని యాహ్వానము వెళ్లినదిగాని విరామములేక వారా పనిని చేబట్టలేదు. బొంబాయి విశ్వవిద్యాలయము పరిశ్రమవిద్యాభివృద్ధి (Technology) కొరకు సంఘమొకటిని ఏర్పాటుచేసి విశ్వేశ్వరయ్యగారిని అధ్యక్షులుగా నియమించినది. ఆంధ్రవిశ్వవిద్యాలయపు పట్టప్రదానోపన్యాసమునుగూడ వారొకానొకప్పుడు ఇచ్చిరి. మరియు అణ్ణామలై, ఆంధ్రవిశ్వవిద్యాలయములకు పరిశ్రమ విద్యాభివృద్ధి విషయముగా తగిన ఏర్పాటులను జూపించిరి. హైదరాబాదునగరమును బాగుపరచుటకు కొన్ని మార్గములనుకూడ వారు సూచించిరి. చివరకు దాదాపు పదిసంవత్సరముల క్రిందట బెంగుళూరి యందు హిందూముసల్మానులకు కలహములురాగా వాటికి కారణము లేమని విచారించుటకు ఏర్పడిన సంఘపు అధ్యక్షత వారి కివ్వబడెను. అప్పుడు వారు సిద్ధపరచిన రిపోర్టువిషయము అందరికిని తెలిసియేయుండును. దేశాటనమన విశ్వేశ్వరయ్యగారికిచాల కుతూహలము. ఇప్పటికిని భారతదేశమునందే కాక యితరదేశములందు గూడ సదా సంచరించుచు జ్ఞానముసంపాదించుటే కాక తమ యారోగ్యమునుకూడ వారు చాలాజాగ్రత్తతో కాపాడుకొనుచున్నారు. ఇప్పటికి వారికి ౮౫ సంవత్సరములయినను ౨౫ సంవత్సరముల బాలునివలె సదా పనిజేయుచుందురు. వారి దేహదార్ఢ్యమును దెలుపుటకు ఒక చిన్నయనుభవము నిచ్చట వర్ణింపవచ్చును. ౧౯౩౮-వ సంవత్సరమున, అనగా విశ్వేశ్వరయ్యగారికి ౭౩ సంవత్సరముల వయస్సప్పు డొకప్రొద్దున ౧౦ ఘంటలప్పుడు వారు నందికొండను విరామములేక ౮౫ నిమిషములలో నెక్కిరి. ఇరవయి సంవత్సరముల క్రిందట ౩౫ నిమిషములు మాత్రము వారికి

గావలసియుండెను. వెంటబోవుచుండిన సర్ పి. ఎస్. శివస్వామిఅయ్యరుగారు స్వతః ఎక్కలేక డోలీలో పైకి వెళ్లిరి.

విశ్వేశ్వరయ్యగారి ముఖ్యాభిప్రాయ మేమనగా భారతదేశమునందు దారిద్ర్యమును బోగొట్టి పాశ్చాత్య దేశములతో సమానముగా జేయవలయుననుటయే. అందుల కనుగుణముగా దొడ్డ పరిశ్రమలను స్థాపింపవలెననియు, వర్తకసంఘముల నభివృద్ధి పరుపవలెననియు వారనేకపర్యాయములు పలుచోట్ల జెప్పియున్నారు. అట్లుచేయనియెడల దేశపు నిరుద్యోగసమస్య నివారింపబడదని వారి దృఢవిశ్వాసము. అందువల్లనే మైసూరునందు దివానుగా నుండినపుడు వారు పరిశ్రమలను వృద్ధిపరచుటకు చాల తీవ్రప్రయత్నములు చేసిరి. ప్రాయశః వారికి చర్మామొదలగువాటియందు అధికవిశ్వాసము లేదు. కొన్ని మాసములక్రిందనే వారు యూరోపులో నెల్ల బాగుగా సంచరించి భారతదేశమునందు మోటారు పరిశ్రమను స్థాపించుటకు గావలసిన సంగతులను దెలిసికొనివచ్చిరి. ఆప్రయత్నములనే యిప్పుడు బొంబాయిలో జేయుచున్నారు. వారికి గల ధనికులసహాయమునుబట్టి ఆప్రయత్నము సఫలముగుననుటకు సందియములేదు. ఇట్టి దేశాభిమానులును, అసాధారణ బుద్ధిసహాయములు గల మహానుభావులునుండగ దేశాభివృద్ధి తొందరగనే జరుగవలయును. విశ్వేశ్వరయ్యగారు జన్మించినది మైసూరయినను సర్ సర్వేపల్లిరాధాకృష్ణయ్యగారివలె వారి ఖ్యాతి భారతదేశమునందేకాక లోకమంతట వెల్లడియయియున్నది. అటువంటివారి జీవితములు పామరులకు ఆదర్శనీయములే గాక ఉత్సాహకరములుగా కూడ నుండగలవు.



# తిల్లిక

## జి. జాషువ

బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఆంధ్రపత్రికలోఁ బ్రచురించిన 'తిల్లిక' శబ్దవ్యాసమునకుఁ బ్రతివిమర్శగా శ్రీయుతులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ఆషాఢమాసభారతిలోఁ వ్రాసిన వ్యాసమును జూచితిని. 'తిల్లిక' యచ్చ తెనుఁగుపదము గాదు, 'తిర్వాళిఘు' యను నరవపదము వ్యవహారభ్రష్టమై 'తిల్లిక' యైపోయినదని శాస్త్రిగారు వేదోవిఘ్నముగా వారివాదనను బలపఱచుకొనిరి. ఈశబ్ద మెన్నివేషములువేసి ఆంధ్రులలో 'తిల్లిక' యై నిలిచెనో చర్చించుటకు వీరిచ్చిన ఆధారములు చాలవు. భాషలన్నిటియందును శబ్దముల కిట్టి సమీపసంబంధము గోచరించుచునే యుండును. ఇట్టి మీమాంసకు దిగుచో తిరువళక్కలు వంటలక్కలయ్యెదరు. 'ఆనె' (అరవమున నేనుఁగు) వ్యవహారభ్రష్టమై 'ఏనుఁగు, ఏనిక' యగును. తిర్వాళిఘులనుండి తిల్లికలకన్న తిరుగళ్లధ్వనియే విశేషముగా వినఁబడుచున్నది. ఇట్లే ప్రతిమాటయు నన్యభాషాపదమై తేలిపోయి, ఆంధ్రభాష ముక్కుమొగము లేనిదై యెంగిలిభాష యైపోవును.

"ఆపదము గ్రంథస్థము కాలేదు, వాడుకలో లేదు. రామచంద్రశాస్త్రిగారు గుంటూరు మండలవాసులు వ్యవహరించుచుందురని వ్రాసినారు. అది ఆ ప్రాంతములలోనూ లేదు. గుంటూరుపండితుల నిద్దఱి నడుగ మే మాపదము వినలేదండి అన్నారు." అని శాస్త్రిగారు వ్రాసినారు.

'తిల్లిక' మాపైపుఁ బసిపిల్లలకును గొట్టినపిండి. 'తిల్లికలో నూనె లేదు. తిల్లిక పెద్దజేయుము' అని మేము వ్యవహరింతుము. పెద్దజేయుమన్న నార్పుమని యర్థము. ఆర్పుమన్న నం దశ్లీలార్థము కలదనికాఁబోలు మాతెలుఁగు లిట్లనుచుందురు. పసుపు, కుంకుమ, బియ్యము మున్నగు పదార్థములు 'లేవు. అయిపోయినవి' అనుట కూడదనికాఁబోలు గంజాముమండలవాసులు పసుపు నిండుకొన్నది. బియ్యము నిండుకొన్న వని సదర్థమున వాడుచుందురు. పెద్దజేయుమనుటయు నిట్టిదే యగును. గోదావరిమండలమునఁ బుట్టి పెరిగిన శాస్త్రిగారు, నిఘంటువుల నాధారము చేసికొని, యెంతక న్నెఱుఁగని పండితులపలుకులు ప్రమాణములనుగాఁగొని చిరకాలమునుండి వెలుఁగుచున్న మామండలము 'తిల్లిక' నార్పివేయఁబోయి, దేవుఁడు మేలుచేసి, 'వాడుకలోనుండిన నుండవచ్చు'నని కొంత'కనికరము' చూపినారు. సంతసము. ఆంధ్రశబ్దము లేప్రాంతముల నేయేవిధముగా వ్యవహరింపఁబడుచున్నవో తెలిసికొనవలయు నన్న గ్రామీణుల నిత్యజీవనము, వారి యాచారవ్యవహారములు స్వయముగాఁ బరిశీలించినవారికిఁగాని కేవలగ్రంథచక్షువులకు దుస్సాధ్యము. శ్రీనాథుఁడు ప్రయోగించిన 'కూర్పాసము' 'తగటుకూసము' వాడుకలో లేదని నిన్న మొన్నటివఱకుఁ దలంచుచుంటినికాని అది రేనాటిరెడ్లకు నిత్యవ్యవహారమున నున్నదని విని ఆశ్చర్యపడితిని.

"దేవపూజాసమయముల వెలిగించు దీపములని యర్థముగాని, సామాన్యముగా వెలుగునకై పెట్టుకొను దీపములు అని యర్థముగాదు." అని వ్రాసిరి. ఇక్కడి పూజారుల కీమాట వాడుకలో లేదు. ఇంటిదీపమే తిల్లిక. ఈ 'తిల్లిక' నాగరజనులమాట. పండితుల కొకవేళఁ దెలిసియును బలుకరు. పలికిన నవమానమే మో! కావ్యనాటకాదులయందును, నిఘంటువులయందును లేనిపదము లనేకములు నేఁడు వాడుకలో వినఁబడుచున్నవి. ఈశబ్దమునకు మూలపద మిదమిత్థమని నిర్ణయించుటకు నిఘంటువు లుపకరింపవు. నైఘంటికులలో నొక్క బ్రౌనుదొరగారు మాత్రమే తిల్లిక దీపమని వ్రాసి తెలుఁగువారి మన్ననకు గుఱియైరని సంతసించుచున్నాఁడ. సాంఘికవర్ణనలకుఁ బ్రసిద్ధిపడసిన హంసవింశ

తికాగునకు 'తిల్లిక' నుడి చెవినిబడలేదనుట వింత గాదు. వినఁబడియుఁ బ్రయోగింప నిష్టపడియుండఁడు. జిగటాతో, పంజులతో, సూర్యప్రభలతో, మొంబత్తులతో నూరేఁగిన శ్రీమంతుఁడేమో వ్యవహారమున లేని, సామాన్యులకు గ్రాహ్యముగాని వికృతపదములతోఁ బాఠకులను కలవరపెట్టుటలోఁ గలరసము 'తిల్లిక' లోఁ గలదని గ్రహింపఁగలఁడా? మహాకవులు ప్రయోగింపనంతమాత్రమున శబ్దము లంతరించునా? పాండిత్యమునకును, లోకజ్ఞానమునకును గడుదూరము. నాశివాజీ గ్రంథము నిటీవల నొకానొకపండితునకు వినిపించుచుండ నందలి "దిక్కులనిపచ్చినెత్తురులు చేరలతో జగద్రావి, హంసముక్కమెక్కి, కపాలపాత్రికల నించిన క్రొవ్వు భుజించి, యెముకల ముక్కలు చేసి, అందుగల మూలుగు పీల్చి," అనుపద్యమును విని "మూలుగు" క్రొత్తమాట నిఘంటువులననే వినాలేదంషి యనుట విని విభ్రాంతిపడితిని. నాయెఱిఁగినంతమట్టుకు పండితులలో ననేకులకు మాలమాదిగభేదమే తెలియదు. మాలలను మాదిగలనుగా, మాదిగలను మాలలనుగా వ్రాయుట పరిపాటియై పోయినది. శంకరకవి హరిశ్చంద్రలో మాతంగికన్యలను మాలకన్యలనియు, వీరబాహుని మాలవాఁడనియు వ్రాయుట కడుంగడు చిత్రము. మాతంగి మాదిగది గాని మాలది గాదు కొలువులలో మాతంగపులకు మాలకన్యలు వత్తురా? కాటికాపరి మాలవాఁడగునా? విచారింప నిది గొప్ప ప్రమాదము. అది ప్రమాణముగా గ్రహించుచు నాధునికహరిశ్చంద్రనాటక కర్తలందఱును బప్పులోఁ గాలుపైచినారు. పండితులు ముందేనియు నీతారతమ్యమును గ్రహించి, యిట్టిస్వల్పదోషములను సవరించుకొందురుగాక. 'తిల్లిక' వాచకలో జీవించి యున్నదని తెలిసికొని రచయితలు తమకావ్యములలో నుచితస్థానము నిచ్చి యాదరింపవలయునని ప్రార్థన.



కమలాలయ సరోవరము - త్యాగరాజస్వామి దేవాలయము

# కవులు - అసహ్యపు వర్ణనలు

'సోదరి'

కవితాలోకములోనికి నానాటికి హెచ్చు నాగరికతవలె స్త్రీలు రాను మొదలిడినారు. పూర్వముకంటె సంఖ్య చాలమటుకు ఎక్కువయినదని మనము రూఢిగా చెప్పగలము. అందును కవిత్వము వ్రాయువారికంటె చదివి ఆనందించువారిసంఖ్య యెక్కువఅని చెప్పించుకొనకయే మనము తెలిసికొనగలము.

పద్యము వ్రాయునప్పుడైనను గద్యము వ్రాయునప్పుడైనను కవిహృదయము ఉయ్యాలనూగును. ఊపు వ్రకరగాపోక సరిగాఊగినవాడే సరియైనకవి యనిపించుకొనును. కవి తనఉయ్యాల ఎవరికిని అడ్డమురాకుండునటుల, ఎవరిమనసులు నొవ్వనటుల ఊచుకొనవలెను.

ఇప్పటి కవితాలోకములో స్త్రీలకు ఉన్నతాసనములు లేవు స్త్రీలు శీలము, జ్ఞానము, హృదయము గలవ్యక్తులని బహుశః మరచి యిట్లు కవులు వ్రాయుచుందురో! లేక స్త్రీలు విద్యనేర్చినను, నేర్వకున్నను జ్ఞానములేనివ్యక్తులని వారిమనసునకు తోపదో! స్త్రీలు కేవలము భోగవస్తువులని వర్ణించివర్ణించి వదలుదురు. నిజముగా యోచించిన ఒకరికొకరు భోగవస్తువులు. భోగవస్తువే అయినంతమాత్రమున తమసిగ్గుకూడ పోవునటుల ఆరీతి వ్రాయుట తమకు న్యాయమేనా? వైద్యునియొద్దకు పోవువారలకు 'అంతయు వైద్యునికి విదితంబేకదా' యని దిగంబరులై వెడలుడని చెప్పుచున్నారా అని తోపచేయుచున్నదీ కవులకవిత్వము!

ఈనడుమ ఒకసోదరు డొకచారిత్రకమైన నవల వ్రాసెను. అందు ఒకానొక అధ్యాయమున-ఒకసుందరమైన బాలుని చూచి యీతని స్త్రీగా నేలపుట్టింపలేదని బ్రహ్మదేవుని దిట్ట నారంభించిరట చూచిన వారలు! అగుచో చూచినస్త్రీలనందరిని అనుభవింప వీలుకలదేమో ఆకవివ్రాసినకాలములో! మగవానిని చూచినంతనే "స్త్రీగాకపోయెనే" అని ఊహ జనించినప్పుడు స్త్రీకానిపించిన ఏలజనింపకుండును? ప్రతిపురుషునకు సుందరినిచూచినప్పుడు మనము లట్లు ఉవ్విళ్లూరునా? లేక కవిగారి స్వానుభవమగునా? అగుచో కవిగారు యజ్ఞము చేసి రంకుతెలుసుకొనినారని ఊహింపవలయునా? మరియొక అధ్యాయమున - వితంతువులు మన్మథావస్థభరింపజాలక విలపింతురట! వితంతువిలాపము నింకొకరీతిగా వర్ణించుటకు మనకవిగారికి భాషాపాండిత్యము కొరతపడినదికాబోలు 'నాజూకులేదురా వంశీగారిసుబ్బిగా' యన్నట్లు. ఇంకొకఅధ్యాయమున ఒకయువతి జలక్రీడాసమయమున ఒకపురుషుడు నదియొడ్డున నిలువబడి అట్లనే వచ్చి ఒడ్డుననున్న ఆమెవస్త్రములను తీసుకొనుమని అనినాడట. ఆపురుషుడు ఆమెను చిన్నప్పటినుండి ఎత్తుకొనిన చిరపరిచితుడే అయినను వానిఎదుట లంగోటి (Napkin) మాత్రమే ధరించియున్న ఆమె వస్త్రములను తీసికొనుటకు ఇచ్చగింపలేదుట. కాని బలవంతముమీద వక్షోజములమీద చేయి కత్తెరగా పెట్టుకొని వస్త్రముల నందికొనినదట. ఆపురుషుడు చేయి అట్లెందుకుపెట్టుకొంటివని 'నీవు చిన్నప్పటినుండి నన్ను ఎత్తుకొన్నవాడవే అయినను నా యౌవనమును అదృశ్యము చూచుటకేకదా వచ్చితివి' అనిఅన్నదట. చూచితిరా విచ్చలవిడి! ఇటువంటి అధ్యాయములుగల పాత్రముపేరు చారిత్రాత్మకమైననవల!!

ఇప్పుడు వచ్చు పత్రికలు ఇంతకంటె తలపన్నివైనను వాటిపేర్లు మాసపత్రిక యన్నట్లు వాటిజీవితము కూడ మాసమే. పత్రికలేకాక కొన్నిసమితులు ఇటువంటి గ్రంథములు వ్రాసియు, వ్రాయించియు ఈ వ్రాతలకు ఎక్కువప్రాముఖ్య మిచ్చుచున్నవి. నిండు ఊబిలోనికి దిగినవానికి సహాయము చేయబోతే వెళ్లినవాడు వచ్చునది నమ్మికలేదన్నట్లున్నది ఆవింత.

వాఙ్మయమునకు పుస్తకముల అలమారీలో స్థానము ఉన్నట్లు తోపదు.

ఈనడుమ యింకొక అలజడి: 'గ్రాంధికమా గ్రామ్యమా' అని. భాషాజ్ఞానములేక భాష పాడుచేయుచున్నారని గ్రాంథికవాదులు; భాషకు అందము కావాలంటే గ్రామ్యముకావాలి' అని గ్రామ్యభాషావాదులు. గ్రాంథికమైనను రోతవ్రాతలనుంచి వాఙ్మయము చెడదా? గ్రామ్యమైనను నీతిగా వ్రాసినచో చెడదుగదా.

ఈనడుమ ఒకసభలో ఒకకవిసోదరుడు, సభ్యులలో సగముమంది స్త్రీలైనదికూడా గమనించక బాలింతపాలపొంగు వర్ణింప మొదలుపెట్టెను. అంతములేని ఆపాలపొంగు వర్ణనకు స్త్రీలు తమతలలు వంచుకొనిరి. ఒకమారొకకవిగారు 'నేను స్త్రీని కవిత నల్లునప్పుడు మాతృభావముతో తలంతు' నని చెప్పగా ఇంకొకగర్వపోతు 'స్త్రీని ఎప్పుడు మాతృదేవిగా భావించెదవా' యని హేళనచేసినాడట.

పూవులతాకిడులచేత వాడిపోవుమనములుగల పూబోండ్లు పఠించుటకు అనువగుకవిత నల్లుట కవులయొక్క ముఖ్యోద్దేశమైయుండిననేకాని నలుగురు ఏవగించుకొనక చదివి ఆనందించునటు లుండదు.

వ్రాతలనుండి లోకులు నీతినేర్చుకొనుటకైనను, సంస్కారణమునకైనను, భావకైనను, హాస్యమునకైనను, చమత్కారమునకైనను అవకాశముండవలెను. కాని, వంచినతల యెత్తకుండ ఒకరికొకరు చదివి వినిపించుకొనుటకుగాని ఏహ్యమైనవ్రాతల ముఖ్యోద్దేశమేమైయుండును?

ఈరకముగలవి ఏవో కొన్ని పత్రికలలోనే యుండిన వాటిని ఏవగించుకొనువారు అతట్టు చూడరు; కాని యిప్పుడు ఏపత్రిక పట్టిచూచిన అవిలేనిది మందుకేని ప్రతి వాటి కొక కారణమున్నది. "మేము డబ్బుకొరకు పత్రికలు ప్రకటించెదము. ఈమాదిరి తమాషాగా వ్రాసిననేగాని ఎక్కువ అమ్మబడవు. లోకుల నాకర్షింపవు" అని సమాధానములు వచ్చుచున్నవి. కాని కొందరు నవలలు వ్రాయుదురు. కొందరు చారిత్రక నవలలు వ్రాయుదురు. కొందరు పద్యములు వ్రాయుదురు. వీటి నన్నిటిని పుస్తకములుగా నచ్చొత్తింతురు. వీరిపుస్తకములు అదృష్టము పట్టినచో ఏతరగతికైనను పఠించుపుస్తకములుగా పెట్టవచ్చును; పెద్దపెద్ద గ్రంథాలయములలో పుస్తకములుగా మారవచ్చును. తరగతులలో ఈకాలపు, మనోబలములేని మనబాలబాలికలకు ఉపాధ్యాయుడు ఈబోధనలు బోధించిన వీ రెటువంటివారు లవుదురు ముందు?

పూర్వపుకవులు స్త్రీలను వర్ణించినారనిన పూర్వకాలములోని మనతాతలు, తండ్రులు ఆవ్రాతలను చదివి చలింపలేదు. వారికి మనోబలము మెండు. మరి యీకాలమునకు తగినవి యీకాలమునకు వ్రాయబడవలెనుగదా!

ఇటుప్రక్క మాసపత్రికలు, అటుప్రక్క గ్రంథాలయములలో నిదేమాదిరి పుస్తకములు, తరగతిలో ఉపాధ్యాయునిబోధనలు! అటువంటిదే ముఖ్యపుస్తకము (Text) అయినచో నీశతాబ్దపు బాలబాలికలు 'అంకుల్ షామ్' (Uncle Sham) అను పుస్తకములోని వ్యక్తులుగా మారరా?

కవులభావనలకు కొంత పరిహద్దు కావలయునని స్త్రీలోకము కవిమహాశయులను అధికారస్వరముతో ఆజ్ఞాపించకుండ, దాచిపెట్టినటుల అడుగకుండ, దీనస్వరముతో వేడుకొనుచున్నది గాన సోదరులు పాటింతురుగాక!

# గ్రహచారము

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

"నా గ్రహచార మట్లుంటే నేనేమిచేస్తాను."

మన కేదైన దురదృష్టము సంభవించినయెడల ఈవిధముగ ననుకొనుట సర్వసామాన్యము. కాని చాల మందికి అట్లనగా నేమో విశదముగా తెలియదు. మన జీవితము చాలమట్టుకు సూర్యాదిగ్రహముల చారము పైననే ఆధారపడి యున్నదనియు, అట్టిచారమునుండి కలుగు మంచిచెడ్డలు జన్మకాలమునందు ఈగ్రహములతో మనకుండుసంబంధమునుబట్టి మారుచుండుననియు జ్యోతిష్కులు చెప్పుచున్నారు. కాని జ్యోతిషము వట్టిబూటకమనియు, జ్యోతిషశాస్త్రము తప్పులతడకయనియు కొందరు దూషించుచుండ, జ్యోతిషమునే సంపూర్ణముగ నమ్మి ప్రయాణము మొదలుకొని కోట్లకొలది రూపాయలకుమించిన స్టాక్ ఎక్స్ఛేంజి (Stock Exchange) వ్యాపారములవరకును జీవితచర్యలనన్నిటిని సమగ్రముగనో, అసమగ్రముగనో జ్యోతిషముపైననే యాధారపడి నడుపుకొనువారు కోట్లకొలది జనము మనలోనే కాక పాశ్చాత్యులలో గూడ గలరు. ఇది సరియా, కాదా యనువిషయముతో మన కిట ప్రసక్తి లేదు. కాని గ్రహచారమువలన మన కేవిధముగనైనను మార్పులు కలుగునాయనిమాత్రము మనమందరమును యోచించవలసినదే. భూమిపైనున్న ప్రతియొక్కనికిని ఒక్కొక్కగ్రహముయొక్క చలనమువలన ఎట్టిమార్పులు కలుగుచున్నవో భౌతికశాస్త్రము తెలుపజాలదు. కాని గ్రహములకును భూమికిని ఎట్టిసంబంధ మున్నది, గ్రహముల చలనమువలన భూమిపై నెట్టిమార్పులు కలుగుచున్నవి మున్నగు విషయములుమాత్రము నక్షత్రశాస్త్రమునుండియు, భౌతికశాస్త్రమునుండియు తెలిసికొనవచ్చును.

కావున, గ్రహము లెవ్వి, ఇవి ఎట్లుద్భవించెను, వీనికి మనభూమితో నెట్టిసంబంధ మున్నది మున్నగు విషయముల నిట చర్చింతము.

గ్రహము లెవ్వియని అడిగినయెడల ఏచిన్నిబాలకుడైనను సూర్య, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శను లని సులభముగ జెప్పివైచును. ఈఒక్కొక్క గ్రహముపేరనువారములో ఒక్కొక్కదినముపేరుండుట వలన ఈ ఏడుపేర్లను తెలియనివారుండరు. ఇంకను కొంచె మెరిగినవారి నడిగినయెడల గ్రహములు తొమ్మిదనియు, మిగిలిన రెండుగ్రహములు రాహుకేతువులనియు చెప్పుదురు. రాహుకేతువులు నిజముగ ఇతరగ్రహములవంటివిగావు. ఇవి ఛాయాగ్రహములనియు, వీనికి స్వతస్సిద్ధముగ కొంతయేశక్తిగలదనియు సుప్రసిద్ధము. కాన వీనిని గ్రహములక్రింద జేర్చ వీలుబడదు. పైజెప్పిన గ్రహములుమాత్రమే కాక ఇంకను రెండుగ్రహములు చాలమందికి తెలిసియేయుండును. వీనిని భౌతికశాస్త్రజ్ఞులు నెప్ట్యూన్ (Neptune) అనియు, యురేనస్ (Uranus) అనియు అందురు. వీనిని ఇంద్రుడనియు, వరుణుడనియుకూడ ఇటీవల కొందరు వ్యవహరించుచున్నారు. ప్లూటో (Pluto) అను ఇంకొకక్రొత్త గ్రహమునుగూడ ఇటీవలనే కనిపెట్టినట్లు వార్తాపత్రికలలో కొందరు చదివియేయుందురు. దీనినిగూడ జేర్చినయెడల గ్రహములసంఖ్య మొత్తము పదియైనది.

కాని కొంత యోచించినచో ఈజాబితా సరియైనదికాదని బోధపడగలదు. ఇందు సూర్యచంద్రులను గైకొందము. సూర్యుడు గ్రహరాజు; అధిక తేజోవంతుడు; స్వతస్సిద్ధముగ ప్రకాశింపగలవాడు. ఇతరగ్రహములన్నియును సూర్యుని వెలుగుననే ప్రకాశించుచున్నవి. అట్టి సూర్యుని గూడ ఇతర గ్రహములతోపాటు లెక్కపెట్టుటకన్న స్వయంప్రకాశములగు నక్షత్రములలో జేర్చుటయే సమంజసము. ఇక చంద్రుడన్ననో, ఇతడు భూమిచుట్టును తిరుగుచు భూమిపైననే యాధారపడియున్నవాడు. ఇట్లే బృహస్పతిచుట్టును, శనైశ్చరుని చుట్టును తిరుగుచు వానిపైననే యాధారపడి

యందు చంద్రులుగూడ కొందరుగలరు. కాన చంద్రుని భూమితో జేర్చి లెక్కపెట్టవలసినదేకాని ఒకప్రత్యేక గ్రహముగ లెక్కించ వీలులేదు.

సూర్యచంద్రులను రెంటిని దీసివైచినను గూడ మనజాబితా ఇంకను సరిగా లేదు. ఏలయన, మనభూమి నెందు జేర్చవలెను? చాలకాలమువరకును భూమి విశ్వమునం దొక స్థిరమైన మధ్యస్థానమునం దున్నదనియు, గ్రహములన్నియు భూమిచుట్టును తిరుగుచున్నవనియు తలంచిరి. కాని ఇప్పటికి కొన్ని నూర్ల సంవత్సరములకుపూర్వమే భూమిగూడ సూర్యునిచుట్టు తిరుగు నొక గ్రహమేయని శాస్త్రజ్ఞులు నిర్ధరించిరి. స్థూలదృష్టికి మినుకుమినుకుమని కాన్పించు గురుశుక్రులవలెనే భూమిగూడ యొక గ్రహ మనుట విచిత్రముగ నున్నను, మనము కుజగోళమునకో, లేక గురుగోళమునకో ఎగిరిపోయి అటనుండి చూచినచో భూమిగూడ మినుకుమినుకుమనుచు కొంచెము శ్యామవర్ణముతో నొక సాధారణమైన చుక్కవలెనే కాన్పించును. ఇతర గ్రహములతోపాటు సూర్యునిచుట్టును తిరుగుటయే కాక ఇతర గ్రహము లెట్టి మూలద్రవ్యముల (Elements) తో చేయబడియున్నవో భూమియు అట్టి మూలద్రవ్యములతోనే చేయబడి యున్నదని శాస్త్రజ్ఞులు యంత్రపరిశోధనలను జేసి కనుగొని యున్నారు. పై కారణములను బట్టియు, కొన్ని ఇతర కారణములను బట్టియు భూమియు నొక గ్రహమే యని లెక్కింపవలసినదే.

గ్రహములను గూర్చియు, సూర్యునిగూర్చియు శాస్త్రజ్ఞులు ఏవిధముగ పరిశోధనచేతురు? అంత దూరమునన్న వానినిగూర్చి ఏవిషయములనైనను ఎట్లు కనుగొనవగును? అను ప్రశ్నలకు కొంత సమాధానము కలిగినగాని శాస్త్రసిద్ధాంతములు గూడ పిట్టకథలవలె దోచును. భూమి ఎట్టి మూలద్రవ్యములతో చేయబడినదో కనుగొనుట సుకరమే. రసాయనశాస్త్రము నెరిగినవా రెవ్వరైనను భూమియందున్న వివిధపదార్థములను రసాయనశాస్త్ర రీత్యా విభజన (Analyse) చేసి భూమియందుండు మూలద్రవ్యము లెవ్వియో సులభముగ నిర్ధరించవచ్చును. కాని కోట్ల కొలది మైళ్లదూరమునం దున్న కుజగ్రహముగాని, శని గ్రహముగాని, సూర్యుడుగాని ఎట్టి మూలద్రవ్యములతో చేయబడియున్నవో ఎట్లు చెప్పనగును?

ఇట్టి విచిత్రకార్యమును సాధించుట కొక చిన్న యంత్రము గలదు. దీనిని స్పెక్ట్రోస్కోప్ (Spectroscope) అందురు. స్పెక్ట్రోస్కోప్ (వర్ణప్రదర్శకయంత్రము) అనగా స్పెక్ట్రమ్ (Spectrum)ను తయారుచేయుయంత్రమని యర్థము. స్పెక్ట్రమ్ అనగానేమి? సూర్యకాంతి తెలుపుగనున్నట్లు కంటికి కనబడుచున్నను తెలుపను నొక ప్రత్యేకవర్ణము లేదనియు, వివిధవర్ణములుగల కాంతులు కలసి తెల్లరంగగుననియు, సూర్యకాంతి నిజముగ ఇంద్రధనుస్సునందు గోచరించు సప్తవర్ణముల సమాహారమే యనియు మనలో చాలమందికి తెలిసియే యుండును. కాని సప్తవర్ణసమాహారమైన సూర్యకాంతి కొన్ని సందర్భములందు విభజనము (Analyse) చెంది సప్తవర్ణములును వేరువేరుగా నున్నట్లు కాన్పించును. ఇందునకు ఇంద్రధనుస్సే (Rainbow) ఒక యుదాహరణము. మేఘములలోనుండు చిన్నచిన్న వర్షబిందువులు సూర్యకాంతిని విభజించి సప్తవర్ణకాంతులను విడదీయుటవలననే ఇంద్రధనుస్సు గోచరించుచున్నది. త్రిఫలకపట్టక (Prism)మను నొక ముక్కోణాకారపు గాజుముక్కతోగూడ సూర్యకాంతి నీవిధముగ విభజింపవచ్చును. అట్లు విభజనము చెందినపుడు ఏడువిధములగు కాంతులుగ (అనగా ఇంద్రధనుస్సువలె) కనపడుదానినే స్పెక్ట్రమ్ అని యందురు. సూర్యకాంతినేకాక మరి ఏకాంతినైనను త్రిఫలకపట్టకముతో విభజించి దాని స్పెక్ట్రమ్‌ను జూడవచ్చును. అట్లుజేసినచో వివిధవర్ణము లాక్రమించు పరిమాణమునందును, కొన్ని ఇతరవిషయములందును గూడ సూర్యకిరణముల స్పెక్ట్రమునకును ఇతరకాంతుల స్పెక్ట్రముల

౧. భారతి యువసంవత్సర ఫాల్గున మాసపత్రికయందు ఈ విషయమునుగూర్చి ఇదివరకే కొంత తెల్పి యున్నాను.

కును భేద ముండును. ఇతరకాంతులందుగూడ ఒకదాని స్పెక్ట్రిమున్నట్లు ఇంకొకదాని స్పెక్ట్రిముండదు. విద్యుద్దీపపుస్పెక్ట్రమున్నట్లు ఆముదపుదీపపు స్పెక్ట్రిముండదు. ఇవి రెంటికిని భిన్నముగ కొవ్వవిస్పెక్ట్రిముగాని, ఎఱ్ఱగా గాలిన ఇనుపముక్క స్పెక్ట్రిముగాని, మండుచున్న మెగ్నీషియము (Magnesium) స్పెక్ట్రిముగాని యుండును. ఇట్లే ప్రతిమూలద్రవ్యమునకును ఒక ప్రత్యేకస్పెక్ట్రి ముండుటవలన స్పెక్ట్రిమునుబట్టి మూలద్రవ్య మెద్దియో నిర్ధరింపవచ్చును. కాన ఏగ్రహమైనను సరే దానియం దేయే మూలద్రవ్యములున్నవో కనుగొనవలయునన్న స్పెక్ట్రొస్కోప్ యంత్రసహాయము వలన దాని స్పెక్ట్రిమును పరీక్షజేసి చెప్పవచ్చును.

మనముగూడ దేని స్పెక్ట్రిమునైనను జూడవచ్చును. భౌతికశాస్త్రజ్ఞులవద్దను, నక్షత్రశాస్త్రజ్ఞులవద్దను ఉన్న స్పెక్ట్రొస్కోపులను కడు జాగ్రత్తతో చాల ధనమును వ్యయముజేసి తయారుజేసియుందురు. కాని స్పెక్ట్రిము విశదముగ గన్పడి దానియందలి విశేషములన్నియు సాధ్యమైనంత స్పష్టముగ గన్పడవలయుననుటొక్కటే వీనియన్నిటియందును ఉన్న విశేషము.

ఇట్టియంత్రముతో సూర్యుని పరీక్షించి సూర్యుని స్పెక్ట్రిమునందు కలసియున్న నానావిధములైన స్పెక్ట్రిములను విడదీసి యర్థముచేసికొని అందుగూడ ఇనుము, మెగ్నీషియము మొదలగు భూమియందున్న వస్తువులే ఎన్నియో కలవని నిశ్చయించిరి. కాని క్రీ. శ.









కొంచెముధనము వ్యయముజేసి మనముగూడ నొక స్పెక్ట్రొస్కోపు యంత్రమును తయారుజేసికొనవచ్చును. ఒక తిఫలకపట్టకము నొకచిన్న పెట్టెలో నుంచి అందు కొంచెము కాంతిమాత్రమే లోన ప్రవేశించుటకు వీలుండునట్లు పెట్టెయం దొక చిన్నరంధ్రమునుమాత్రము జేసియుంచినచో దాని సహాయమున

౧౮౬౮వ సంవత్సరమున సూర్యుని స్పెక్ట్రిమునందు అప్పటివఱకును ఎవరికిని తెలియని ఒక క్రొత్త మూలద్రవ్యము కనబడెను. వారికి తెలిసి నంతమట్టుకు భూమియందున్న ఏ వస్తువునకును ఇట్టి స్పెక్ట్రిము లేనందున బహుశః ఇది సూర్యునియందు మాత్రమే యుండు ఒక క్రొత్తద్రవ్యమని తలచి పాశ్చాత్య

శాస్త్రజ్ఞులు తమకు గీర్వాణప్రాయమైన గ్రీసుభాషయందుండు హీలియస్ (Helios) అను సూర్యుని పేర ఈ మూలద్రవ్యమునకు హీలియమ్ (Helium) అని నామకరణముచేసిరి. కాని దీనితరువాత సుమారు ౨౭ సంవత్సరములకు అనగా క్రీ. శ. ౧౮౯౫-వ సంవత్సరమునందు సర్ విలియమ్ రామ్సే (Sir William Ramsay) అను నొక గొప్పశాస్త్రజ్ఞుడు యురేనియనైట్ (Uranianite) అనునొక క్రొత్త ఖనిజమును పరిశోధించుచు హీలియమ్‌వంటి స్పెక్ట్రము ఇందు గూడ గాన్పించుటజూచి యాశ్చర్యచకితు డాయెను. ఇంకను కొన్ని పరిశోధనలు జరిగినపిమ్మట హీలియమ్ పైఖనిజములోనేకాక భూమిపైనున్న మరికొన్ని ఖనిజములలోగూడ నున్నదని స్పష్టమాయెను. వాయువిమానములను (air-ships), బెల్లూనులను (balloons) నింపుటకు హీలియము నేడు విశేషముగ ఉపయోగపడుచున్నందున దీనిని తయారుచేయుట ఇప్పుడు సర్వసాధారణమైనది.

స్పెక్ట్రొస్కోప్ సహాయమువలన సూర్యునిలోను, ఇతరగ్రహములలోను ఉన్న మూలద్రవ్యములను పరీక్షింపగా ఇంతవరకు మనకు భూమియందున్నవే ఇందును గాన్పించుచున్నవి. భూమియందున్న ౯౨ రకములను మూలద్రవ్యములలో ౬౬ రకములు సూర్యునియందు గాన్పించుచున్నందున భూమియు, సూర్యుడును ఒక్కటేరకపు పదార్థములతో చేయబడియున్నారని విశదమాయెను. గ్రహములన్నిటిలో గూడ ఇట్టి మూలద్రవ్యములే కాన్పించుచున్నందున సూర్యుకును, గ్రహములన్నియును ఒకటేరకపు పదార్థములచే చేయబడియున్నవనియు, ఒకటేకుటుంబమునకు సంబంధించిన వనియు స్పష్టమాయెను.

ఈస్పెక్ట్రొస్కోపు యంత్రమునగల పరీక్షించి అత్యంత దూరమునయున్న ఏగ్రహమైనను ఎంతటివేగముతో ప్రయాణించుచున్నదో కనుగొనవచ్చును. స్పెక్ట్రొస్కోపును ఒకగ్రహముపై కేంద్రీకరించి దాని స్పెక్ట్రమును కడుజాగ్రత్తగ పరీక్షించినయెడల, అది మెల్లగ కుడిప్రక్కకో, లేక ఎడమప్రక్కకో జరుగుచున్నట్లు తెలియును. దీనికి కారణము గ్రహము చలించుచుండుటయే. స్పెక్ట్రము ఊదారంగుండు పైపునకు కదలినయెడల భూమిని సమీపించుచున్నదనియు, ఎరుపురంగుండుపైపునకు కదలినయెడల భూమికి ఇంకను దూరముగా పోవుచున్నదనియు నర్థము. స్పెక్ట్రము నియతస్థానమునుండి ఎంతదూరము చలించినదో చూచి దానినిబట్టి గ్రహ మేపైపునకు ప్రయాణించుచున్నదియు, ఎంత వేగముగా ప్రయాణించుచున్నదియు లెక్కచేసి తెలిసికొనవచ్చును.

స్పెక్ట్రొస్కోపు సహాయమున మనకు తెలియగల విషయముల నన్నిటిని ఇట వివరింప సాధ్యముగాదు. కాని భౌతికశాస్త్రజ్ఞుల దీపసంధ్యమున అత్యంతోపయోగకరములును మరిరెండు సాధనములనుగూర్చియు ఇట తెలిసికొనవలయును. మొదటిది దూరదర్శినీయంత్రము (Telescope); రెండవది ఫోటోలు (Photos) దీయు కామెరా (Camera). కామెరా ఉపయోగమునుగూర్చి మనకందరకును తెలిసియే యున్నది. కొన్ని సందర్భములందు మన కంటికి కనపడిన దానికన్న ఫోటోయందు ముద్రితమైన చిత్రమే సుగతరప్రమాణమని యెంచవచ్చును. ఇంతకును కంటితో జూచినదాని నట్లే జ్ఞాపకముంచుకొనుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఒక గ్రహముస్థానముగాని, గ్రహణములనుగాని, ఒక లోకముక్క పరిమాణమునుగాని ఎంత గొప్ప శాస్త్రజ్ఞునికైనను, చిత్రకారునికైనను కంటికి కనపడినట్లుగనే చిత్రించుటకు సాధ్యముగాదు. ఇట్టి విషయములందు ఏకొంచెము భేదము కలిగినను అది నిష్ప్రయోజన మగును. కాన ఉన్నదున్నట్లుగనే ముద్రించి శాశ్వతముగ నుంచుకొనుటకు కామెరాయంత్రమే అసమాన సాధనము.

కామెరా సహాయమే లేకున్నచో ఎంత శ్రేష్ఠమైన దూరదర్శినీ యంత్రమున్నను కొన్ని కొన్ని యంశములు తెలియకనేపోవచ్చును. ఫోటోచిత్ర మేవిధముగ తయారగునో తెలిసినవారికి ఈ విషయము సులభముగా

నర్థమగును. వెల్తురెక్కువగాలేని ఒక ఇంటిలోనో, లేక గుడిలోనో ఫోటోచిత్రమును దీయవలెనన్న మన మేమి చేతుము? ఫోటోదీయవలసిన వస్తువువైపు కామెరాను గురిజేసి, కామెరా ఏమాత్రమును కదలకుండ నుండునట్లు సుస్థిరముజేసి కామెరాలెన్సు అద్దము (Lens) న కడ్డముగా నుండు మూతను దీసివైచి ఒకటి రెండు సెకండుల కాలము మాత్రముగాక కొన్ని నిమిషముల కాలము వఱకే ఉంచివైతుము. అట్లుచేసినచో లెన్సు అద్దమును తెరచియున్నంతకాలమును ఉన్న కొద్దిపాటి వెల్తురే మఱలమఱల ఫోటోనెగెటివు (Photo Negative) మీద చిత్రమును ముద్రించుచు, మొదట నస్పష్టముగనున్న చిత్రమును క్రమముగ సుస్పష్టముగ కనుపడునట్లుజేయును. తగినంతకాలవిరామ మొసంగినచో గర్భగుడిలోనున్న విగ్రహముకూడ మంచివెలుతురులో నున్న విగ్రహమువలె ఫోటోయందు సుస్పష్టముగగాన్పించును. ఈవిధముగనే కామెరాను దూరదర్శినీ యంత్రమునకు సరిగాచేర్చిపెట్టి పరిశోధించవలసిన ఆకాశభాగమునకు దానిని గురిజేసి కొన్నిఘంటలవఱకే వదలివైచినచో కంటి కతిసూక్ష్మముగను, సందిగ్ధముగను గనపడు నక్షత్రములుగాని, మరి ఇంకేవైనను గాని ఫోటోయందు చాల స్పష్టముగా దెలియును.

ఈసందర్భమున కామెరా కింకొకవిశేషప్రయోజనముగూడగలదు. ఆకాశమున గనపడుచున్న చుక్కలలో గ్రహము లెవ్వియనియు, నక్షత్రములెవ్వియనియు సందేహము కలిగినపుడు కామెరా మనకెక్కువగ సహాయపడగలదు. నక్షత్రములు మన కత్యంతదూరమున నున్నందున అవి వేగముగప్రయాణించుచున్నను భూమికి సంబంధించినంతవరకును అవి స్థిరముగనున్నట్లే భావించవచ్చును. నక్షత్రములతో పోల్చి చూచినయెడల సూర్యుని కతిదూరముననున్న ప్లూటో గ్రహముకూడ సమీపముననే యున్నదని చెప్పవచ్చును. భూమికిని సూర్యునికిని సుమారు తొమ్మిదికోట్ల ముప్పదిలక్షలమైళ్ల దూర మున్నదని మనకందరికిని తెలియును ఇది యధిక దూరమే. కాని మన కత్యంతసమీపముననున్న నక్షత్రముగూడ ఇంతకంటె సుమారు రెండున్నరలక్షల రెట్లధికమగుదూరమున (అనగా సుమారు ఇరవైయైదులక్షల కోట్ల మైళ్లదూరమున) నున్నది. కాన సందిగ్ధముగనున్న చుక్కలవైపు దూరదర్శినీయంత్రమునకు చేర్చిపెట్టిన కామెరాను కేంద్రీకరించి కొన్నిఘంటలకాల మట్లే ఉంచివైచినయెడల ఫోటోయందు నక్షత్రములు ఏమాత్రమును కదలినట్లు గాన్పించక స్పష్టముగ గాన్పించును. గ్రహములుమాత్ర మట్లుగాక గీతలవలె అస్పష్టముగ గాన్పించును. ఫోటోదీయించుకొనుటకు కూర్చున్నవారిలో ఎవరైనను పొరబాటున కదలినయెడల ఫోటోయందు వారి యాకారము ఎట్లు గాన్పించునో మనకందరికిని తెలియును. అట్లే ఫోటోనుబట్టి ఏఏచుక్కలు చలించినవో, ఏవి చలించలేదో నిర్ధరించి చలించినవి గ్రహములనియు, మిగతవి నక్షత్రములనియు కనుగొనవచ్చును.

దూరదర్శినీయంత్రమునుగూర్చి యధికముగ జెప్ప నక్కఱయేలేదు ఎంతవర్ణించినను శతసహస్రాంశములందు నీలాకాశమును ఒక్కమారైనను ఈ యంత్రముతో జూచినగాని దీని ప్రయోజనము బోధపడదు. ఇందువలన గల్గు ఆనందము చెప్ప సాధ్యముగాదు. ఒకటే పర్యాయము మనకు సాధారణముగ ౩౦౦౦ నక్షత్రములకన్న నధికముగ గనబడవు. కాని 3 అంగుళముల కాంతిప్రవేశకద్వారము (Aperture) గల ఒక చిన్న దూరదర్శినీయంత్రముతో జూచినను గూడ ఇంతకంటె ఎన్నియోనూర్ల రెట్లధికముగ నక్షత్రములు గనపడును. సాధారణదృష్టికి కనబడని నక్షత్రములుగూడ దీనివలన స్పష్టముగ వానికున్న రంగులతోసహా అసమానలావణ్యముతో నొప్పారుచు దృగ్గోచరమగును. దూరదర్శినీయంత్రమే లేకున్నచో నేటికిని గ్రహములనుగూర్చిగాని, నక్షత్రములనుగూర్చిగాని, కడకు సూర్యచంద్రులను గూర్చియైనను మనకు విశేషము లెవ్వియు తెలిసియుండవు.

దూరదర్శినీయంత్ర మొక రాక్షసికన్నువంటిది. చిన్నవానిని ప్రభూతములుగ కనుపడునట్లు చేయగల శక్తి (Magnifying)దీని కున్నను, ఆశక్తికంటె అధికకాంతిని ప్రోగుచేయగల శక్తియే ఈసందర్భమున అత్యంతప్రయోజనము. మనకంటిపాప (వెల్తురును చొరనిచ్చు రం

ధ్రము) వడ్డముగ గొలచినచో ఒకఅంగుళములో ఐదవ భాగమును మించదు. కనుకనే మన కంటిపాపగుండా ప్రవేశించు వెల్తురు చాల అల్పము. ఒకఅంగుళమువెడల్పు రంధ్రముగల దూరదర్శినీయంత్రముగూడ మన కంటిపాప కంటె ఇరవైయైదురెట్లు అధికముగ కాంతిని ప్రోగుచేయ గలదు. రెండంగుళముల వెడల్పు రంధ్రముగల దూరదర్శినీ యంత్రము సుమారు నూరురెట్లధికముగ కాంతిని సేకరించును. అమెరికాయందు విల్సనుకొండపైనున్న దూర



యెర్క్సుదూరదర్శినీయంత్రము (Yerkes Telescope) (ఈయంత్రమున కాంతిప్రవేశకద్వారము 40 అంగళముల వెడల్పుగలదు.)

దర్శినీయంత్రమునందలి రంధ్రము సరిగా నూరంగుళముల వెడల్పు గలదు. సామాన్యముగ మన కంటిపాప గుండా పోవు వెలుతురునకన్న దీనిగుండ సుమారు ౨౫ లక్షలరెట్లధికముగ వెలుతురు పోవును. ఇంతటి సూక్ష్మయంత్ర సహాయమున్నందుననే శాస్త్రజ్ఞులు సాధారణదృష్టికి గనపడని అత్యంత దూరముననున్న నక్షత్రములనుగూడ పరీక్షించుటయే కాక అంతకన్న దగ్గరగనున్న గ్రహములనుగూర్చి దినదినమును ఎన్నియో నూతనాంశములను గనిపెట్టుచున్నారు.

నక్షత్రశాస్త్రమునకు దూరదర్శినీయంత్రమును, స్పెక్ట్రొస్కోపు యంత్రమును ఎంత ఉపయోగకరములో ఇప్పటికి కొంత విశదమైనది. కాని అంతకన్నను మిన్నయైన సాధనము శాస్త్రజ్ఞుల బుద్ధిబలమే. బుద్ధిసూక్ష్మతచేతను, జాగరూకతచేతను మానవు డెట్టి యంత్రసహాయము లేకయే యోచించి సిద్ధాంతీకరించిన అమూల్యవిషయము లెన్నియో యంత్రపరిశోధనలవలన నిజములని తేలినవి. నక్షత్రశాస్త్రాభివృద్ధియందు సంభవించిన ఇట్టి వింతలలో నొకటి రెండైన ఇట పేర్కొనవలసినదే.

మొదటిది నెప్ట్యూన్ గ్రహమును కనుగొన్న విచిత్రవృత్తాంతము. గ్రహము లన్నియు సూర్యుని చుట్టును వలయాకారముగ నున్న ఒక నియతపథమున దిరుగుచుండునని మనకందరకును తెలిసిన విషయమే. ఈ భ్రమణము సూర్యుని ఆకర్షముపైనను, సమీపమునందున్న పెద్ద పెద్ద గ్రహముల యాకర్షముపైనను ఆధారపడియున్నవి. కాన ఒక గ్రహమునకు సంబంధించిన ఆకర్షప్రత్యాకర్షముల నన్నిటిని లెక్కచేసి సమన్వయించి ఆగ్రహము సూర్యుని కెంతదూరమున, ఎట్టి పంథ నవలంబించి ప్రయాణముజేయునో దృఢముగ జెప్పవచ్చును. ఈ విధముగ లెక్కచేసి చూచి పిమ్మట యంత్రసహాయముచే గ్రహముల చారమును కన్నులార పరీక్షించి తమ సిద్ధాంతములకును, గ్రహములు నిజముగ అనుసరించుచున్న పంథకును ఏమైన భేదమున్నదా, లేక రెండును ఒకటేనాయని పరీక్షించి చూడ సిద్ధాంతము లన్నిటను సరిగా సరిపోవుచున్నను యురేనస్ గ్రహపంథనుగూర్చి మాత్రము వ్యత్యాసము గల్గుచుండెను. యురేనస్ గ్రహమునకు సమీపమున నెప్ట్యూన్ గ్రహ మనున దొకటున్నదని, వారి కప్పటికి (అనగా సుమారు నూరేండ్లక్రితము) తెలియనందున వారి లెక్కలలో అప్పటివరకు వారికి తెలిసిన ఇతరగ్రహములును, సూర్యుడును యురేనస్ గ్రహముపై జరపు ఆకర్షకప్రత్యాకర్షకశక్తులనుమాత్రమే వారు లెక్కించి వరుణ యురేనస్గ్రహప్రయాణపథమును నిర్ధరించిరి. కాని ఎంత జాగ్రత్తగ లెక్కవేసిచూచినను తమ సిద్ధాంతమునకును, యంత్రపరిశోధనలనుండి తెలిసిన ఈగ్రహపు నిజమైన పథమునకును చాల వ్యత్యాస మున్నందున శాస్త్రజ్ఞుల కొక గొప్ప అనుమానము కలిగెను. ఒక్క యురేనస్ గ్రహమునందు మాత్రమే తమ లెక్క లేల తప్పులై యుండును? కాన ఇందున కేదో కారణ ముండవలయుననియు, బహుశః తమకు తెలియని క్రొత్తగ్రహమేదైన యురేనస్గ్రహమునకు సమీపమున నుండి తన యాకర్షకశక్తిచే కొంతమట్టుకు వరుణగ్రహపథమునందు మార్పులు కలిగించుచుండవలెననియు, శాస్త్రజ్ఞులు సందేహపడజొచ్చిరి. క్రీ. శ. ౧౮౪౩ వ సంవత్సరమునందు ఆడమ్ (Adam) అను ఒక శాస్త్రజ్ఞుడు, అల్పవయస్కుడైనను జ్ఞానైకరతుడై, ఈయూహలనే యాధారము చేసికొని ఇంతవ్యత్యాసము కలుగవలెనన్న ఈ గ్రహముపై ఎట్టి ఆకర్షకశక్తి ఎచ్చటినుండి ప్రసరించవలయును అను అంశమును లెక్కచేసి తీర్మానించుటకు పూనుకొనెను. ఈలెక్కల ఫలితముగ ఆకాశమునం దొక నిశ్చితప్రదేశమున నొక క్రొత్తగ్రహముండవలెనని తేలెను. అదేసమయమున లి వెర్రియర్ (Le Verrier) అను నొక ఫ్రెంచి శాస్త్రజ్ఞుడుకూడ విశేషపరిశ్రమ యొనర్చి ఆకాశమునం దొక క్రొత్తగ్రహ ముండవలెనని సిద్ధాంతముచేసియుండెను. ఇతని సిద్ధాంతమున ఈగ్రహమున కిచ్చిన స్థానమునకును, ఆడమ్సు (Adams) నిశ్చయించిన స్థానమునకును స్వల్ప వ్యత్యాసమే యున్నందున కొంత పరిశ్రమ చేసి

శాస్త్రజ్ఞులు వీరిద్దరి సిద్ధాంతములను సమన్వయించి ఆస్థానములను తమ యంత్రములతో పరీక్షింపగా సరిగా అచ్చటనే యొక చుక్క గాన్పించెను. దీని నిది వరకే వారుచూచియున్నను లెక్కలేనన్ని నక్షత్రములలో నిదియు నొక్కటి యని తలచిరిగాని, ఇది యొక గ్రహమనియు, మన సూర్యకుటుంబములోనిదే యనియు అంతవరకును వారికి తెలియనేలేదు. ఇప్పుడది గ్రహమనియు,స్థావరమైన నక్షత్రము(Fixed Star) గాదనియు విశదమాయెను. దీనికి నెప్ట్యూన్ అని పేరిడిరి.

ఇప్పటికిని యురేనస్ గ్రహపథమునుగూర్చితమలెక్కలందు కొంతవ్యత్యాసము కలుగుచునే యుండెను. పైగా క్రొత్తగా కనిపెట్టిన నెప్ట్యూన్ గ్రహపథమునందు గూడ తమ సిద్ధాంతములకును గ్రహమనుసరించిన పథమునకును వ్యత్యాసము గాన్పింపజొచ్చెను. కడుజాగ్రత్తతో ఈ వ్యత్యాసములను, అందునకు తగిన సమాధానములను పరిశోధించి మరియొక నూతనగ్రహము గూడ ఆసమీపమునందే యుండవలెనని శాస్త్రజ్ఞులు తీర్మానించిరి. పిమ్మట కొంతపరిశ్రమచేయగా ప్లూటో అను ఇంకొక క్రొత్తగ్రహముగూడ గాన్పించెను. ఈ గ్రహమును గనిపెట్టి ఇంకను ఆరుసంవత్సరములైనను గాలేదు.

ఇంతకంటె విచిత్రము గలదా! మానవుడు కేవల మొక్క బుద్ధిబలముచేతనే,యంత్రములు మొదలగు మరిఏ ఇతరసహాయము లేకనే లెక్కలుచేసి అంతమాత్రముచేతనే "ఆకాశమునందు ఫలానాస్థలమునందు జూచినయెడల అక్కడ నొక చుక్కగనిపించును. అది ఒక గ్రహముగాని నక్షత్రముగాదు." అని చెప్పి ఆగ్రహ మెంతతూకముగలదో, అది సూర్యుని కెంతదూరమున నున్నదో, సూర్యునిచుట్టు నొకమారు తిరుగుటకు దాని కెంతకాలముపట్టునో మున్నగువిషయములను సులభముగ చెప్పగలడు.

ఇట్టి బుద్ధిబలముతో మానవు డింతవరకును సూర్యునిగూర్చియు, గ్రహములనుగూర్చియు ఏమేమి కనిపెట్టియున్నాడు? భూమితప్ప ఇతరగ్రహము లేవైన వాసయోగ్యములా? అందు జీవరాసు లేవైనగలవా? ఇతర గ్రహములయందుగూడ భూమియందువలెనే పగలు రాత్రిభేదములును, ఋతుభేదములును గలవా? అందును కొండలు, సముద్రములు, మేఘములు, గాలి మొదలగునవి గలవా? అనుప్రశ్న లెన్నియో బయలుదేరును. వీనినిగూర్చి కొన్ని ముఖ్యాంశము లిట తెలిసికొందము.

భూగోళశాస్త్రమును సుకరముగను, సమగ్రముగను పఠించవలెనన్న విశేషముగ ప్రయాణములు సల్పవలెను. మనము గ్రహములనుగూర్చి విశేషముగ తెలిసికొనగోరుచున్నాముగాన మనముగూడ నొక్కొక్క గ్రహమునకును ప్రయాణము జేతము. మునుముందు సూర్యునికి సమీపమునందున్న బుధగ్రహమునకు బోదము.




ఈ గ్రహము సూర్యునికిని భూమికిని మధ్యనున్న యంతరాళమునం దున్నది. సూర్యుని కత్యంత సమీపమున నుండుటచేత దీనిని విశదముగ పరీక్షించుటకు సాధ్యము గాదు. ఇది ఒక చిన్నగ్రహము. దీని వ్యాసము (diameter) భూమివ్యాసములో సగముండదు. సూర్యునికి అత్యంత సమీపమున నున్నందున ఇది అన్నిగ్రహములకన్నను శీఘ్రముగ సూర్యునిచుట్టును తిరిగి ప్రదక్షిణము చేయగలదు. ఒకొక గ్రహమును సూర్యునిచుట్టు తిరిగి ఒకమారు ప్రదక్షిణముచేయుటకు పట్టు కాలమునే దానికొక సంవత్సరమని మనము లెక్కించుచున్నందున

బుధగ్రహపు సంవత్సరము భూమియందలి కాలగణన రీత్యా ౮౮ దినములకు మించదు.

బుధగ్రహమునందు పగలు, రాత్రి యను విభేదమే యున్నట్లు గాన్పించదు. సూర్యునివైపు ఎల్లప్పుడును ఒకప్రక్కమాత్రమే త్రిప్పియుండుటచేత ఈగ్రహము సూర్యునిచుట్టు నొక్కమారు ప్రదక్షిణము చేయుటలో తనచుట్టునుగూడ తా నొకమారు తిరిగినట్లగును. ఇందునుగూడ భూమికిని ఈ గ్రహమునకును ఎంత భేద మున్నదో చూతుము. భూమి తనచుట్టును తా నొకమారు సుమారు ౨౪ గంటలకాలములో తిరుగును. కాన భూమియం దింత కాలమున కొకదిన మని యందుము. ఇట్లే బుధుని గూర్చియు లెక్కించినయెడల బుధుని సంవత్సరమునకును దినమునకును భేదమే లేదని చెప్పవలసివచ్చును. అసలు రాత్రి పగలు భేదమే లేదని ఇదివరకే తెలిసికొంటిమి. సూర్యునివైపున ఉన్న భాగమున సతతము పగలే. మిగిలిన యర్ధభాగమున ఎల్లప్పుడును రాత్రియే. ఋతుభేదముగూడ లేనందున ఒక యర్ధభాగమున కెల్లప్పుడును గ్రీష్మఋతువే, మిగత యర్ధభాగమునకు నెల్లప్పుడును హేమంతఋతువే యని చెప్పవచ్చును. ఉష్ణముగనుండు వైపున సీసమునైనను కరిగించగల అత్యుష్ణము. భూమిపైనకన్న ఈ గోళముపైనఉష్ణము ఏడురెట్లధికము; కాని శీతలముగ నుండు వైపున సతతమును అనిర్వచనీయమగు శీతలము, అంధకారమును. బుధగ్రహముచుట్టును తిరుగుటకు ఒక చంద్రుడైనను ఉన్నట్లు గాన్పించదు. కాని ఈవిషయమును గూర్చి దృఢముగ జెప్ప వీలులేదు. ఒకొకమారు ఈ గ్రహము సూర్యునికి ఎక్కువదూరమున నుండును. అప్పుడే ఇది మనకు సూర్యోదయమునకు పూర్వము స్పష్టముగ గాన్పించును. కొన్నిమార్లు ఈగ్రహము సూర్యుని కడ్డముగ ప్రయాణించునట్లు మన కగుపడును. అత్యుజ్జ్వలమైన సూర్యబింబమున కీచిన్నగ్రహ మడ్డమైనపుడు ఇది యొక నల్లని మచ్చవలె గాన్పించును. ఇంత కన్న నెక్కువగ ఈగ్రహమునుగూర్చి తెలియదు.

భూమికిని సూర్యునికిని మధ్యనున్న గ్రహములలో రెండవది శుక్రగ్రహము. ఇది భూమిపథమునకు లోపైపున భూమిప్రక్కనే యున్న గ్రహము. ఇది ఎల్లప్పుడును దట్టమైన మేఘములచే కప్పబడియున్నందున ఈగ్రహగోళపు పైభాగమైనను ఎట్లున్నదో పరీక్షించుటకును కడకు ఈగ్రహముపైనున్న వాయువు (Atmosphere) నందే మూలద్రవ్యము లున్నవోకూడ కనుగొనుటకును ఆస్పదములేదు. కాని శుక్రగ్రహమునందలి విశేషమేమన, ఈగ్రహమునందిప్పుడున్న పరిస్థితులనుబట్టి చాలపూర్వకాలమున ఒకప్పుడు భూమియందలి పరిస్థితు లెట్లుండెనో తెలిసికొనవచ్చును. భూమిపైకన్న ఇందు ఉష్ణము రెండురెట్లధికముగ నుండును, కాని కోట్లకొలది సంవత్సరములకుపూర్వము భూమిగూడ ఇట్లుండినందున అప్పుడు భూమిమీద నెట్టి జీవరాసు లుండెనో నేడు అట్టిజీవరాసులే ఇందును ఉండవచ్చునని కొందరు తలంచుచున్నారు. భూమిని వదలినయెడల ఒక్క కుజగ్రహమునందుతప్ప జీవరాసులు మరెచ్చటను లేవని కొందరు వాదించుచున్నను, బహుశః కుజగ్రహమునందుకన్న శుక్రునియందే జీవరాసు లున్నవేమో యని తలచుటకు ఎక్కువ ఆస్పద మున్నది.

శుక్రుని పరిమాణము సుమారు భూమియంతయే యుండును. సూర్యునిచుట్టును ఒకమారు తిరుగుటకు శుక్రునికి మనదినములు సుమారు ౨౨౫ పట్టును. భూమివలెనే శుక్రుడుగూడ తనచుట్టు తానే తిరుగుచుండును. కాని అట్లుచేయుట కెంతకాలము పట్టునో మనకింకను దెలియదు. ఆకాశమునం దన్నిటికన్నను శుక్రగోళమే చాల యందమైనది. భూమికిని సూర్యునికిని మధ్యనుండుటవలన బుధుని వలెనే శుక్రునికిని కళాభేదములు (Phases) సంభవించుచుండును.౧ శుక్రుడు మనభూమికి సమీపమున నున్నపుడు ప్రకాశించినంత స్వచ్ఛముగ సూర్యచంద్రులుతప్ప ఇంకేవియు ప్రకాశించవు. మనకు తెలిసినంతవరకును శుక్రునిచుట్టును తిరుగు చంద్రులులేరు.

౧. అనగా చంద్రునికివలెనే కళలు హెచ్చుచు తగ్గుచునుండును.

మన మనుసరించుచున్న క్రమమునుబట్టి భూమియే మూడవగ్రహము. ఇతరగ్రహములపైనుండి పరీక్షించి చూచినయెడల భూమి గూడ మినుకుమినుకుమని కాంచెడు శ్యామవర్ణముతో ప్రకాశించుచున్నట్లు గాన్పించునని ఇదివరకే తెలిసికొంటిమి. భూమి దినమున కొకసారి తనయక్షము౧ (axis) చుట్టును, ౩౬౫ దినముల కొకతూరి సూర్యునిచుట్టును తిరుగుననియు మీ యందరికిని తెలిసిన విషయమే. భూమి అక్షము సూర్యుని వైపు ౨౩½ డిగ్రీలు ముందునకు వంగియున్నందున భూమి సూర్యునిచుట్టును తిరుగునప్పుడు మొదలు పైభాగమునకును పిమ్మట ఆరునెలలకు క్రిందిభాగమునకును సూర్యునికిరణములు సూటిగా తగులును. అట్లు సూర్యకిరణములు తగులు భాగమున కప్పుడు గ్రీష్మఋతువని నిర్ధారణముజేసి దానినుండి ఋతువిభాగము నేర్పరచియున్నారు. అంతకంటెను విశేషముగ భూమినిగూర్చి ఇట వ్రాయనక్కరలేదు.

భూమిపథమునకు వెలిభాగమునన్న మొదటి గ్రహము కుజుడు. చాలకాలమునుండియు ఈగ్రహమునుగూర్చి శాస్త్రజ్ఞులును, పామరులునుగూడ విశేషోత్సాహమును, శ్రద్ధయును గనుపఱచియున్నారు. ఇందుకు కారణము ఈగ్రహముపైన జీవరాసు లున్నవను నమ్మకమే. ఇట్టి నమ్మకమునకు ఒకటి రెండు చిన్న యాధారములుగూడగలవు. ఈగోళముపైన చక్కగ నిలువుగీతలవలెగాన్పించునవి బహుశః సూక్ష్మబుద్ధిగల ఇందలి జంతువులు నిర్మించిన కాలువలేమో (Canals) యని శాస్త్రజ్ఞులుతలచుచున్నారు. ప్రకృతియందుసాధారణముగ నిలువుగీతలు గానరావు. ఇంతమాత్రమేకాక ఈ కాలువలు ఒకదానికడ్డముగ నొకటి (Intersection) యుండుట వలన ఇవి స్వభావసిద్ధమైనవి గావను నూహ ఇంకను ప్రబలినది. భూమియందువలెనే ఇందును హిమరాశియుతములైన ధ్రువము (Polar caps of ice) లుండుటయు అందలి హిమరాసులు భూమియందువలెనే పెరుగుచు తరుగుచు నుండుటయు, దీని యక్షముకూడ వంగి యుండుటయు, ఋతుభేదమునుబట్టి చెట్లు చేమలు ఇందుగూడ మారుచుండుటయు, అన్నిటికన్న ముఖ్యముగ ఈ గ్రహముపైన గాలి (Atmosphere) యుండుటయు బట్టిచూడ బహుశః కుజగోళమున జీవరాసు లున్నవేమో యను అనుమానము స్థిరమగుచున్నది.

కాని కుజగోళమునందుండు గాలియందు తగినంత ప్రాణవాయువు (Oxygen) లేదనియు, భూమిపైనున్న వాయువుతో పోల్చి చూచినయెడల ఇందు ప్రాణవాయువు వేయిరెట్లు తక్కువగ నుండుననియు ఇటీవల తెలిసినది. కాన మనకు తెలిసినట్టి జీవరాసు లేవియు అం దుండజాలవు. ఐనను కాలక్రమముగ సంభవించిన అట్టి మార్పున కనుగుణముగ అత్యల్ప ప్రాణవాయువుపైననే ఆధారపడి జీవించగల జీవరాసులు అచ్చట నుండవచ్చును. చాల కాలమువరకును మహాసముద్రాగాధమునందు ఎట్టి జీవరాసులును ఉండజాలవని పామరజనమును, శాస్త్రజ్ఞులునుకూడ తలచిరి. నీటిలో అంత యడుగున ఎట్టి వెల్తురును చొరలేదుగాన అం దెట్టి జీవరాసులును ఉండవను నమ్మక మప్పటికి సహేతుకముగనే యున్నట్లు గన్పట్టెను. కాని అట్టి క్లిష్టపరిస్థితులలోగూడ జీవించుటకు తగిన సౌకర్యముల నేర్పరచుకొని అనేకజీవరాసు లందు జీవించుచున్నవని నేడు మనకు తెలియుచున్నది. అట్లే కుజగ్రహమునందు గూడ ఆ పరిస్థితులకు తగినట్లు పరిణామము జెందిన జీవరాసు లుండవచ్చునని డా. హెన్రీ నారిస్ రసల్ (Dr. Henry Noris Russel) మొదలగు శాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. మనము తంత్రీరహిత వార్తాహరణము (Wireless message) జేసినచో బహుశః ఈగోళమునందలి జీవులు దానిని అర్థముచేసికొని (మన మేదో తెల్ప ప్రయత్నించుచున్నామని యైన దెలిసికొని) మన కేవిధముగనైన నొక ప్రత్యుత్తర మొసంగదరేమో యని చాలమంది రేడియో (Radio) యంత్రములతో నానా ప్రయత్నములను జేయుచున్నారు. కాని ఇంతవరకును ఇందువల్ల ఎట్టిఫలితమును గలుగలేదు. ఇటీవల ఈ గ్రహము భూమి కత్యంతసమీపమునకు వచ్చెను. అప్పు

౧. అనగా ఉత్తరధ్రువమునుండి దక్షిణధ్రువము వరకును ఉన్నట్లు మనము భావించురేఖ.

డైనను గూడ మన కచ్చటినుండి ఎట్టి ప్రత్యుత్తరమును రాలేదు. కడ కట్టి విశేషసంబంధమునుగూడ మన మిదివరకును ఈగ్రహముతో నేర్పరచలేమైతిమి.

కుజుని ఎరుపురంగు సుప్రసిద్ధము. కుజగోళము పైనున్న ఇనుము ప్రాణవాయువుతో జేరి ఐరన్ ఆక్సైడ్ (Iron-oxide) అను ఎరుపుపదార్థముగ మారి నందుననే గోళమున కంతటికిని ఈ ఎరుపురంగు కలిగిన దేమోయని తోచుచున్నది. అట్లయినచో పూర్వము ఇందు ప్రాణవాయువు అధికముగ నుండెనేమో!

బృహస్పతి:—ఈగ్రహము ఇతరగ్రహము లన్నిటి కన్నను పెద్దది. దీని వ్యాసము భూమివ్యాసమునకన్న ౧౧ రెట్లు అధికము. ఇతరగ్రహముల నన్నిటిని కలిపి ముద్దజేసినను అది బృహస్పతిగ్రహమంత పెద్దదిగ నుండ జాలదు. ఆకారమునకు తగినటుగనే దీనిచుట్టును తిరుగు చంద్రులు తొమ్మండ్రు గలరు. వీరిలో నలుగురిని ఒక చిన్న దూరదర్శినీ యంత్రముతో గాని, ఒక బైనాకులర్స్ (Binoculars) తో గాని చూడగలము. బృహస్పతి గోళము చుట్టును వాతావరణ మేఘములు (Atmospheric clouds) దట్టముగ జుట్టుకొనియున్నందున ఎట్టిసూక్ష్మమైన దూరదర్శినీయంత్రముచేతనైనను వీటిని భేదించి లోభాగమును పరీక్షించుటకు సాధ్యముగాకున్నది. వీనికిలోన గోళమును చుట్టియుండు ద్రవరూపమున నున్న మేఘములకులోన ఘనపదార్థ మేదైనను న్నదో లేదోగూడ మనకు దృఢముగ దెలియదు. ఇప్పటికి తెలిసినంతవరకును ఇందు స్వతస్సిద్ధమైన (అనగా సూర్య రశ్మిపై నాధారపడని) ఉష్ణ మేదియు ఉన్నటుల గాన్పించదు. ఏది ఎట్లులున్నను ఈగోళముపైన మనకు దెలిసినట్టి ప్రాణిరాసు లేవియు నివసింపజాలవు. ఏల యన, దీనిచుట్టును అమ్మోనియా (Ammonia), మిథేన్ (Methane) అను విషవాయువులుదప్ప సాధారణపు గాలి ఒకింతయు లేనందున ప్రాణిరాసు లేవియు వీనిని పీల్చి బ్రతుకజాలవు.

భూ, సూర్యులనడుమనున్న దూరమునకన్న బృహస్పతి సూర్యులనడుమనున్న దూరము సుమారైదింతలెక్కువ. ఒకసారి సూర్యునిచుట్టును తిరిగివచ్చుటకు బృహస్పతికి సుమారు ౧౨ సంవత్సరములకాలము పట్టును. దీనినిబట్టియే పూర్వము బార్హస్పత్యమానమున నబ్దపరిగణనము చేసినటు శాసనదృష్టాంతము గలదు. గుప్తవంశపురాజులును, కదంబవంశపు రాజులునుగూడ తమ దానకాలములను బార్హస్పత్యమానముననే తెల్పిరి. ఐనను తనచుట్టును తాను ౧౦ గంటలలో నొక మారు తిరుగగలదు. భూమికన్న ఇంత పెద్దదగు గ్రహము ఇంతవేగముగ తనచుట్టు తాను తిరుగుకొను చుండుట ఒకవిశేషమే. బృహస్పతి సూర్యుని చుట్టి తిరుగు ౧౨ సంవత్సరములకాలములో నొక్కొకరాశి యందు ఒకసంవత్సరము చొప్పున నుండును. ఇతడుండు రాశినిబట్టి వివిధప్రదేశములందు పుష్కరప్రవేశము కలుగు చుండును. బృహస్పతి సింహరాశియందున్నప్పుడే గోదావరి పుష్కరప్రవేశమగును.

శనైశ్చరుడు:—పేరునుబట్టియే ఈ గ్రహము సూర్యునిచుట్టు నొక్కమారు తిరుగుటకు చాలకాలము పట్టునని వ్యక్తమగును. బృహస్పతికంటె ఇది సూర్యునికి సుమారు రెండింతలదూరమునం దున్నందున దీనిప్రయాణ మార్గము చాలనధికమైనది. దీని సంవత్సర మొక్కటి మన ౩౦ సంవత్సరములకు సరిపోవును. ఇంతదూరమున నున్నందున నిందు చలి మిక్కుటము. బృహస్పతిపై నున్నట్లే ఇందును అమ్మోనియా, మిథేన్ విషవాయువులే యున్నందున ఎట్టిప్రాణిరాసులును ఇందు బ్రతుక జాలవు.

శనైశ్చరుని చుట్టును సరిగా గోళముమధ్యరేఖ (Equator) కెదురుగ ఒకదాని తరువాత నొకటిగ మూడు

---

౧. బైనాకులర్స్ అను యంత్రమునుండి జూచినచో దూరముననున్న వస్తువులు దగ్గరనున్నట్లు గాన్పించును. కాని ఈ యంత్రము దూరదర్శినీయంత్రమువలె చిన్నవిగ గన్పడు వానిని పెద్దవిగ నున్నట్లు చూపలేదుగాన ఈ బైనాకులర్స్ యంత్రము శాస్త్రజ్ఞుల కంతగా ఉపయోగపడదు. కాని పాశ్చాత్యదేశములందు నటుల ముఖవైఖరిని, నాట్యమును పరీక్షించుటకు, సర్కసుప్రదర్శనములను జూచుటకు దీనినెక్కువ వాడుదురు.

కడియములు (Rings)ఉన్నవి. వీనిలో ఈ గోళము మధ్య రేఖకు కడుదగ్గరగనున్న కడియము ఆరేఖను ౭౦౦౦ మైళ్ల దూరముననున్నది. కడుదూరముననున్న కడియము వ్యాసము ఒకలక్షయెబ్బదియొక్క వేల మైళ్లకు మించియుండును. అసంఖ్యాకములైన చిన్నచిన్న చంద్రకలో (Moonlets), లేక ఉల్కలో (Meteors) చేరి ఈ కడియములరూపముగ గాన్పించుచున్నవి.

శనైశ్చరునికి తొమ్మిదిమందియో, లేకపదిమంది యో చంద్రులుగలరు. బృహస్పతియంత పెద్దదిగాకున్నను ఈగ్రహము భూమికన్న ఎన్నియోరెట్లు పెద్దదైనందున [౧] ఈ గ్రహమున కిన్నిచంద్రులుండుట ఏమివిశేషము? వీరందరిలో పెద్ద టైటన్ (Titan) సుమారు మన చంద్రునంత యుండును. బృహస్పతివలెనే నిబిడమేఘాచ్ఛాదితమైన ఈ గ్రహగోళమును గూర్చి మనకింతకంటె నెక్కువగ తెలియదు.

రాత్రివేళ శనైశ్చరగోళమునందు చాల విచిత్రముగ నుండును. ఇంద్రధనుస్సువలె ఆకాశమునందుండు కడియములు సూర్యరశ్మిని ప్రతిఫలింపజేయుచుండును. ఒకటి చాలదన్నట్లు కొన్నిచంద్రబింబములు వెన్నెలగాయుచునేయుండును. కాని ఏమైననేమి? ఈ గోళమెంతమాత్రమును ప్రాణివాసయోగ్యముగాదు.

యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహములను గూర్చి మనకంతగా తెలియదు. యూరేనస్, నెప్ట్యూన్ గ్రహములు భూమికన్న చాల పెద్దవి. వీని వ్యాసము సుమారు ౩౦,౦౦౦ మైళ్లుండును. కాని ప్లూటో బుధుని కన్న చిన్నగ్రహమని తోచుచున్నది. యురేనస్‌కు నలుగురు చంద్రులును, నెప్ట్యూన్‌కు ఒకచంద్రుడును మాత్రమున్నట్లు తెలియుచున్నది. ప్లూటోకు చంద్రుడేయున్నట్లు కనపడదు. ప్లూటో సూర్యున కత్యంత దూరమున నున్న గ్రహము. అనగా ఇది భూసూర్యులకు మధ్యనున్న దూరమునకన్న ౪౦ రెట్లధికము దూరమున గలదు కొననే ఈ గ్రహము సూర్యునిచుట్టు నొకమారు ప్రదక్షిణము చేయుటకు ౨౫౦ సంవత్సరములకాలముపట్టును. ఈగ్రహమునం దెప్పుడును శీతలముగను, అంధకారముగను ఉండును.

ఇప్పటికి నవగ్రహములకును ప్రయాణముచేసినట్లయినది. కాని ఇంకను రెండు ముఖ్యప్రదేశములకు మనము ప్రయాణము చేయలేదు. అవి సూర్య, చంద్ర గోళములు. సూర్యుని ముందు గైకొందము. భూమిపై మన యునికికి సూర్యుడే యాధారము. మన వెల్తురునకును, ఉష్ణమునకును, ఆహారమునకును మనము సూర్యునిపైననే యాధారపడియున్నాము. సూర్యునికంటెను దేదీప్యమానముగ ప్రకాశించున దేదియును లేనట్లు మనకు కనబడును. మనకు సూర్యుడే దైవము.

కాని వాస్తవ మరసిచూడగా రాత్రి మనకంటికి కనబడు లెక్కలేనన్ని నక్షత్రములలో సూర్యుడుకూడ నొక్కడే. సూర్యుడంత ప్రకాశవంతమైన నక్షత్రముగూడ గాదు. సాధారణముగ మనకంటికి తేజోవంతములుగ గనిపించు నక్షత్రముల కున్న ప్రకాశములో నలభైఇంట నొకపాలు ప్రకాశముగూడ సూర్యునికి లేదు. ఐనను మనకు సూర్యుడే గొప్ప. ఇతరనక్షత్రములతో పోల్చిచూచినచో సూర్యుడంత పెద్ద వస్తువుగా గాన్పించక పోవచ్చును, అంతదూరముగ నున్నట్లుగూడ దోచకపోవచ్చును. కాని భూమితో పోల్చి చూచినయెడల సూర్యుడెంతయో పెద్దగనున్నటులను, కడుదూరమున నున్నటులను విదితమౌను. మన భూగోళమువంటి గోళములను సుమారు ౧౩ లక్షలను జేర్చి ముద్దచేసినచో సూర్యగోళపు ప్రమాణముగల గోళమొక్కటి తయారగునేమో. సూర్యునిచుట్టును తిరుగు గ్రహములన్నిటిని గలిపి ముద్దచేసినను ఆముద్ద సూర్యునిలో ఏ అత్యంత స్వల్పభిన్నాంశముగనో కన్పడును.

ఇంతప్రాముఖ్యమైన సూర్యగోళమునకు ప్రయాణము చేయకతీరునా? కనుక దూరదర్శినీయంత్రసహాయమున మానసికవిమానముపై సూర్యగోళమునకు ప్రయాణింతము. నిజముగ మనప్రయాణము నిట్లుచేయుటయే క్షేమము. లేకున్నచో భూగోళమును వదలి కొంతకాల

౧. భూమివ్యాసము ౮,౦౦౦ మైళ్లు; శనైశ్చరుని వ్యాసము ౭౪,౦౦౦ మైళ్లు.

ము ప్రయాణము చేయగనే నీరు మంచుగ మారుశీతలస్థితి కన్న అత్యంతశీతలమగు పరిస్థితులలో మనము మొత్తముగ ఘనీభవింతుము౧. పిమ్మట సూర్యుని సమీపించిన కొలదిని అనిర్వచనీయమగు ఉష్ణమున దహింపబడి వాయురూపమును బొందుదుము. సూర్యగోళమునందలి ఉష్ణ పరిస్థితులను మన మూహించుకొనజాలము. సూర్యగోళము పైభాగమున సుమారు ౬౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీల (Centigrade degrees) ఉష్ణమును, గోళము మధ్యను సుమారు రెండుకోట్ల పదిలక్షల సెంటిగ్రేడు డిగ్రీల ఉష్ణమును ఉండును.

ఎంత జ్వరమువచ్చినను మానవుని దేహమునందలి ఉష్ణము ౪౦ సెంటిగ్రేడు డిగ్రీలకు మించదు.౧ దీనిపైన ఒకటి రెండు డిగ్రీల ఉష్ణ మధికమైనను మరణ మాసన్నమైనదని తలచుము. అట్టిచో మనము సూర్యగోళమున కెట్లు ప్రయాణము చేయగలము ?

సూర్యగోళముమీద కొన్ని నల్లనిమచ్చ (Sun-spots) లగుపడుచుండును. కొన్నిమారు లీమచ్చ లధికముగ నుండును. కవంగముల వలె (Funnel-shaped) గనపడు వీనిని సుడిగాలు లనవచ్చును. సూర్యగోళపు అంతర్భాగమున నున్న వాయువులు అందలి అత్యధికోష్ణముచే చెలరేగి తక్కువ యుష్ణముగల ఉపరిభాగమునకు వచ్చుటకు ప్రయత్నించుటచేత ఈవిధమగు సుడిగాలులు కలుగుచున్నవి. ఇవి చాల యుష్ణముగ నున్నను ఇతర భాగములకన్న ౨౦౦౦ సెంటిగ్రేడుడిగ్రీల ఉష్ణముతక్కువగలవిగాన నల్లగ నున్నట్లు గాన్పించును. ఇంతయుద్రేకముతో చెలరేగుచున్న ఉష్ణవాయుతుపాను లందుండి సూర్యగ్రహణమునకు ప్రయాణము చేయనగునా ?

సూర్యునియందుండు మచ్చలనుగూర్చి చాల కాలమునుండి పరిశోధన జరుగుచున్నను ఇప్పటికిని వాటినిగూర్చి పూర్తిగ తెలిసికొనుటకు సాధ్యముగాలేదు. శ్రీశంకరాచార్యులవారు ఈమచ్చలను జూచినట్లు మనకు తెలియుచున్నది. అంతకు పూర్వమే ఎందరో వీని నెరింగియుండిరట. క్రీస్తుపూర్వము సుమారు మూడునాలుగువేల సంవత్సరములకు పూర్వమే చీనాదేశస్థులు వీనినిజూచి వితర్కించినట్లు కొన్ని యాధారములు తెల్పుచున్నవి. ఈమచ్చ లధికమగుటయం దొక క్రమపద్ధతి యున్నట్లు తోచు

౧. సాధారణముగ నీటిని మంచుగనట్లు చేయు శీతలపరిస్థితిని ఆధారముగగొని దీనిని శూన్యముగ లెక్కించి ఉష్ణ మధికమగు కొలదిని ఒకడిగ్రీచొప్పున నీరు కుతకుత యుడికి ఆవిరియగుస్థితిని ౧౦౦ డిగ్రీల ఉష్ణమని శాస్త్రజ్ఞులు సెంటిగ్రేడు పద్ధతిప్రకారము తలచుచున్నారు. కాని ఇంతకంటె నధికమగు ఉష్ణపరిస్థితులను, శీతల పరిస్థితులనుగూడ మనము దినమును జూడగలము. ఇనుమును కరగజేయుటకును, సీసమును కరగించుటకును ౧౦౦ సెంటిగ్రేడు డిగ్రీల ఉష్ణము చాలదు. అట్లే మంచునకు కొంతయుప్పుచేర్చినచో శూన్యమునకన్న తక్కువయగు శీతలస్థితి సంభవించును. అట్టిస్థితి శూన్యమునకన్న తక్కువగాన-౧ మొదలుకొని క్రమముగ శీతల మధికమగు కొలదిని-౨౭౩ సెంటిగ్రేడు డిగ్రీల వరకును లెక్కింతురు. -౨౭౩° డిగ్రీలకన్న శీతలమగు స్థితియే ఉండ సాధ్యముగాదు. అట్టిస్థితికి రాకపూర్వమే అన్ని వాయు, ద్రవపదార్థములును ఘనీభవించును. అట్టిఘనస్థితిలో (Solidstate) కణముల వ్యాపారము (Molecular actionand motion) ఇసుమంతైనను ఉండదు. శాస్త్రజ్ఞులు బహుప్రయాసపడి తమ యంత్రములతో ఇంతకు ఒకటిరెండు డిగ్రీలు మాత్రమధికముగ ఉష్ణముగల పరిస్థితులను సృష్టింపగలిగియున్నారు.

౧. అసలు మానవదేహోష్ణమును కొలుచు థర్మామీటరు యంత్రము (Thermometer) ౪౩, లేక ౪౪ సెంటిగ్రేడు డిగ్రీలకు మించిన యుష్ణమును కొలచుట కవకాశము లేకుండునట్లు నిర్మించియున్నారు. కాని ఇందలి లెక్క సెంటిగ్రేడ్ పద్ధతినిగాక, ఫారెన్‌హీట్ (Fahrenheit) పద్ధతి ననుసరించినందున మన దేహమునందలి ఉష్ణము ౯౮.౪ డిగ్రీలని మనము సాధారణముగ జెప్పుదుము.

చున్నది. ౧౧ ౧/౩ సంవత్సరముల కొకమారు ఈమచ్చ లధికమై తగ్గిపోవుచుండును. ఈమచ్చ లధికమైనపుడు మన భూమిపైనగూడ కొన్ని విశేషములు సంభవించుచున్నవి. వానినన్నిటిని ఇట విశదీకరింప సాధ్యము గాదు. కాని ఈమచ్చలకును మన శీతోష్ణస్థితియందు ఒకొ్కకమారు కలుగు అత్యధికములైన మార్పులకును ఏదోసంబంధ మున్నటుల దోచుచున్నది.

సూర్యగోళము అంతర్భాగమునుండి అత్యధికోష్ణముతో కాగుచున్న పదార్థము పైకెల్లప్పుడునుబలముగ చిమ్ముచుచేయుండును. ఇట్లు చిమ్ము ఊటలనే సూర్య



సూర్యగోళము-అందలిమచ్చలు (Sun-Spots)

-౨౫ ౧

తుంగములు (Solar prominences) అని యందురు. ఈ సూర్యతుంగములు సూర్యబింబమునకు చాలదూరము (అనగా ఒక్కొక్కప్పుడు ౫ లక్షల మైళ్లదూరము) వరకును వ్యాపించగలవు. సూర్యునికి మనమింత దూరమున నున్నందున మన కట్టిభయమును లేదు. లేకున్నచో ఒక్కమారు ఈసూర్యతుంగములు భూమిపై బడినయెడల భూమియంతయు కుమ్మరికొలిమిలో నొక చిన్నగురిగింజవలె మాడుమైపోవును.

ఈసూర్యతుంగములనుగూర్చియు, సూర్యబింబము చుట్టునుఉజ్జ్వలముగ ప్రకాశించుపరివేషము (Corona) ను గూర్చియు విశేషముగ పరిశోధించుటకు అపరిమిత కాంతివలన సాధ్యముగాదు. సంపూర్ణ సూర్యగ్రహణము లందు సూర్యబింబమంతయుమరుగుపడుటవలన కాంతితగ్గి వీనినిసులభముగ పరిశోధింపనగును. కాని సంపూర్ణ సూర్యగ్రహణములు ఎన్నియో సంవత్సరములకొక్కమారుగాని తటస్థించవు. అప్పుడు గూడ నవి కొన్ని నిమిషముల కధికముగా నుండవు. సాధారణముగ సంపూర్ణ సూర్యగ్రహణము కొన్ని సెకండుల కాలమునుండి ౭ నిమిషముల వరకును ఉండవచ్చును. అందువలన ఆధునిక శాస్త్రజ్ఞులు ఈ విషయమును పరిశోధించుటకు వారి కిదివరకును దొరకిన కాలమునంతయు చేర్చి చూచినను ఒక గంటకు మించదు. అందువలననే సంపూర్ణ సూర్యగ్రహణమనినయెడల శాస్త్రజ్ఞులు బహు ప్రయాసకోర్చి ఎన్నియో వేలమైళ్లు ప్రయాణముచేతురు.

చంద్రుడు:—సూర్యునికన్న చంద్రుడే మన ప్రయాణమునకు తగిన గమ్యము. హెచ్. జి. వెల్సు (H. G. Wells) అను ఆంగ్ల సారస్వత ప్రపంచమునందలి మహామహుడు చంద్రబింబమునకు ఇద్దరు మనుష్యులు ప్రయాణము చేసినట్లు ఒక విచిత్రకథను వ్రాసియున్నాడు. నిజముగ అన్నిటికన్నను చంద్రునిపైననే మన కిష్టమెక్కువ. సౌమ్యముగను, ఉల్లాసకరముగను మనకు వెన్నెలగల్పించు నను కారణముననో, లేక చంద్రబింబముగూడ భూమినుండి వీడిపోయిన ఒక భాగమగుటచేత మనకు దానితోగల విశేష సంబంధముననో, ఏలకోగాని చంద్రుడు మనల నెక్కువగ ఆకర్షించుచున్నాడు. కాని ఈ చుక్కలరేడు చూచుట కంత పెద్దగనున్నను నక్షత్రములతోగాని, గ్రహములతోగాని పోల్చుట కేమాత్రమును సాటిరాడు. భూచంద్రులకుగల సంబంధమునందలి విశేషమంతయు భూచంద్రుల సామీప్యముపైననే యాధారపడియున్నది. చంద్రుడు భూమికి సుమారు రెండులక్షల నలభైవేల మైళ్ల దూరమున నున్నాడు. భూమికింత దగ్గరగనున్నదింకేమియు లేనందున చంద్రునియాకర్షణశక్తి భూమిపై ఏవైపునకు ప్రసరించినయెడల ఆవైపు భూమియందలి నీరును, భూమియుగూడ ఆకృష్టములై సముద్రపుపోటు (High Tide) రూపముగ పరిణమించును. సముద్రపు జలరాశియేకాక భూభాగముగూడ ఈ యాకర్షణకు లోనై సాగుచున్నదనియు, అట్టి సాగుదలవలన న్యూయార్క్ (New york) నగరమునగున్న ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ (Empire State Building) అను గొప్పసౌధమునకును, ప్యారిస్ (Paris) నగరమునందున్న ఐఫల్ టవర్ (Eiffel Tower) అను స్తంభమునకును సామాన్యముగనుండు దూరము నకన్న ౬౩ అడుగులు తగ్గుననియు శాస్త్రజ్ఞులు పరిశోధించి తెల్పియున్నారు. భూమి తనచుట్టును తాను ౨౪ గంటలకు ఒకమారు తిరుగునుగాన ఇంతయంతరమునందు భూమియందలి ఏప్రదేశమునందైనను రెండుమార్లు పోటు (High tide) కలుగును. వీనికి సరిగ మధ్యకాలమునందు పాటు (Low tides) కలుగును. భూమియక్షములో పాతికయక్షముగల ఈచంద్రుడు (చంద్రునియక్షము ౨,౧౦౦ మైళ్లు) భూమిపై నెంతకలత కలిగించునో చూచినయెడల ఇక ఇంతకన్న ఎన్నిరెట్లో పెద్దవిగనున్న గ్రహములును, నక్షత్రములును పొరబాటున మన భూమిని సమీపించినయెడల ఎంతటి యనర్థమును చేయగలవో యూహించుకొనవచ్చును.

వెల్సు నవలయందు వ్రాసినట్లు మనమును చంద్రగోళమునకు ప్రయాణము చేసితిమనుకొందము. అందేమున్నదో చూతము. కాని అచ్చటికి పోకమునుపే మనము ప్రాణవాయువును బుడ్లలోనో, మరి ఇంకే విధముగనైననో భద్రముచేసి వెంటగొనిపోవలెను. చం

ద్రునిపై గాలియే (Atmosphere) లేనందున మనము ఇచ్చటినుండి ప్రాణవాయువును సేకరించుకొనిపో వనియెడల ఊపిరిపీల్చుట కందేమియు లేక వెం టనే చనిపోవుదుము.

గాలిలేనందువలన అం దెట్టిధ్వనులును వినిపిం చవు. ధ్వనికెరటములు గాలియందే ప్రయాణించగలవు౧ గాన గాలిలేకున్నచో మన చెవియొద్దనే ఒకనగారా వాయించినను మన కేమియు వినబడదు. ఇద్దరు మను ష్యులు చంద్రగోళముపైన దిగి ఒకరితోనొకరు మాట లాడుకొనినట్లును, చప్పట్లు చరచినట్లును ఇంకెన్నియో విధముల ధ్వని కలిగించినట్లును వెల్సుదొర తన నవల యందు వ్రాసియున్నాడు. కాని నిజముగ చంద్ర గోళమునం దట్టిదేమియు సంభవింపదు. ఇంతేకాక గాలిలేనందువలన సూర్యకాంతి సర్వదిశలకును ప్రసరిం చుటకు (Diffuse) సాధ్యముగాదు. అందువలన సూర్యు డు ప్రకాశించుచున్నప్పుడుగూడ నల్లని యాకాశమునందు నక్షత్రములు స్పష్టముగను, ప్రకాశవంతముగను గాన్పిం చుచుండును.౧ భూమిచుట్టును గాలిచుట్టుకొని యున్నం దున భూమినుండి ఇంత ప్రకాశవంతముగ నెప్పటికిని నక్షత్రములు గానరావు.

ఒకవిషయమునందుమాత్రము వెల్సునవలయందలి మనుష్యులకువలె మనకును అత్యంతాశ్చర్యము కలు గును. వెల్సునవలలో నొకడు తనప్రక్కనున్న ఒకచిన్న కాలువనో, లేక గోతినో దాటుటకై ఒకగంతు వైచె నట. వెంటనే తా ననుకున్నదానికన్న ఆరురెట్లు దూర మధికముగ ఈవల వచ్చి పడెనట. చంద్రగోళమునందు మనము ఆరింతలు తక్కువ బరువుందుము. ఇక్కడ ఒక మణువురాతి నెత్తలేని వాడుగూడ అందు ఆరుమణువుల భార ము నవలీలగ నెత్తగలడు. స్థూలకాయులగు వారుతాము ఎత్తుగ నెగురు పందెమునందు (High jump) సమర్థులనిపించుకొన వలెనన్న చంద్రగోళమునకు బోయిన యెడల చాలననుకూలముగ నుండును.



చంద్రగోళము-ఉపరితలము.

చంద్రునిపైన నాలుగడుగు లిడినంతనే అది మృతిచెందిన లోకమని ఒకబలమైన యభిప్రాయము కలుగును. చంద్రగోళ మున నీళ్లులేవు గ్యాసులులేవు. ఎట్టి చెట్టు చేమలును లేవు. పీల్చుటకు గాలియైన లేదు. పైకి జూచిన నల్లని యాకాశము మన యాకసమువలె మనోహరముగ నింకెచ్చటనైననుండునా? ఉపరితలము గూడ ఏదోజీవకళ నశించినదాని వలె పాడిపాడిగ, చెమ్మ ఇసు

౧. ఈవిషయమునుగూర్చి ఆంధ్రపత్రికధాతసంవత్సరాదిసంచికలో నా 'కర్ణపిశాచి' వ్యాసమును చూడ నగును. (పుటలు ౧౧౯-౧౨౨)

మంతయు లేకయుండును. అంతయు బీడుభూమి. ఎటువైపుచూచినను పచ్చిగడ్డిగాని, ఆకులలములుగాని ఏమియు గనపడవు.

చంద్రునిపైన ఎత్తయినకొండలు గలవు. వీనిలో కొన్ని మనహిమాలయమంత (అనగా ఐదారు మైళ్లు)ఎత్తు గలవు. ఈ కొండలకు మధ్య మైదానములు. ఈమైదానములనే పూర్వీకులు సముద్రములని తలచి వీనికి ప్రశాంతిసముద్రము (Sea of Tranquility), మధుసముద్రము (Sea of Honey) మున్నగు పేర్లు పెట్టిరి. చంద్రునియందు నీరేలేదని వారి కప్పటికి తెలియదు. చంద్రగోళమున మనము ముఖ్యముగ పరిశోధింపవలసిన యంశము అందలి అగ్నిపర్వతముఖములు (craters). ఇట్టి ముఖములు సుమారు ముప్పైవేలు ఇందుగలవు. ఇవి నిజముగ అగ్నిపర్వతములవలన నేర్పడినవా, లేక ఉల్కలు ఇందు విశేషముగ పడుటవలన సంభవించినవా యని శాస్త్రజ్ఞుల కొక తీరని సందేహ మిప్పటికిని గలదు. ఈ అగ్నిపర్వత ముఖములలో కొన్నికొన్ని చిన్నవి. కాని ౧౫౦ మైళ్లకు మించిన వ్యాసముగల పెద్దపెద్దవి గూడ ఇందు గలవు.

చంద్రలోక మొక విచిత్రలోకము. ఇందు నెల కొకతూరి సూర్యోదయమగును. అనగా మన కొక పక్షమంతకాలము చంద్రుని కొకరాత్రియే. సూర్యుడు ప్రకాశించుచున్నప్పుడు ఇందు అమితోష్ణము. సూర్యుడస్తమించగనే అమితశీతలము. ఋతువులు లేవు. ఉషస్సు లేదు. సంధ్యారాగము లేదు. సూర్యోదయాస్తమయములు భూమియందువలె క్రమక్రమముగ గాక హఠాత్తుగ సంభవించును. పైన గాలియుండినయెడల ఇట్లెప్పటికైనను జరుగునా?

చంద్రుడు భూమిచుట్టును ఒక్కమారు ప్రదక్షిణముచేయుటకు ౨౯½ దినములకాలము పట్టును. ఇంతకాలములో ఇతనికాంతి పెరుగుతరుగులకు లోనగుచున్నది. దీనినే కళలుమారుటయనియందుము. భూమిచుట్టును తిరుగుటలో కొంతకాలము భూ-సూర్యులకు మధ్యగ చంద్రుడు ప్రయాణించవలసివచ్చును. సరిగా ఈ రెంటికిని మధ్యగనున్న దినమునందు ఉజ్జ్వలసూర్యప్రకాశము వలన ఇత డేమాత్రమును గనపడడు. అట్టిదినమునే యమావాస్యయని యందుము. కాని ఇతడు ప్రయాణము చేసినకొలదియు ఈ స్థలమునకు దూరమై సాయంత్రము మనకు కొంచెకొంచె మధికముగ కనబడుచువచ్చి పున్నమనాడు సరిగ భూమికి అవతలప్రక్కన నుండుట వలన సంపూర్ణబింబముతో ప్రకాశించును. అనగా, చంద్రునికిగాని, ఇతరగ్రహములకుగాని స్వతస్సిద్ధమైన కాంతి ఏమాత్రమును లేదు గాన, బింబముపైన బడిన సూర్యకాంతియంతయు ప్రతిఫలన (reflect) మగుచున్నదని యర్థము.

ఇప్పటికి మన ప్రయాణము ముగిసినది. మనది యనదగు ఈ సూర్యమండలమున (ప్లూటోగ్రహ మున్నస్థలము వరకును సూర్యమండలమే), ఇంకను, జ్యోతిక (asteroids) లనియు, తోకచుక్క (comets)లనియు, ఉల్క (meteors) లనియు కొన్ని విశేషములు గలవు. కాని వానినన్నిటినిగూర్చి విశదముగ తెలిసికొనవలెనన్న సూర్యమండలమును దాటిపోయి నక్షత్రమండలములనుగూర్చియు ఆకాశద్వీపజగత్తు (island-universes) లనుగూర్చియు కొన్ని విషయములు మును ముందు తెలిసికొనవలెను. ఈ విషయములు సరిగా బోధపడినగాని అసలు ఈ గ్రహము లెట్లుద్భవిల్లెనో కూడ అర్థముగాదు. వానినన్నిటినిగురించి రాబోవు సంచికయందు వ్రాసెదను.



బాలెంతరాలు —రామారావు.

# నల్లపొంగులు

## వి. దుర్గాప్రసాదరావు

౧

"దీనా దీనా! అదేమిటే ఆ పుంజు పెట్ట నల్లా పొడుస్తోంది!" అని తార దినమణికి చూపించింది.

"నీసిగ్గుచిమిడిరిక దే!" అని దీన తారబుగ్గలను పిడికిళ్లతో పొడుస్తూ అటునించి మొహంమరల్చి సంభ్రమపు నవ్వు నవ్వింది.

తార తెల్లబోయి చూసింది. తార కేమీ అర్థమవలేదు. తల్లిచాటున పెరిగినపిల్ల కాదు. తండ్రిపోషణ. చాలానాళ్లవరకు తండ్రినితప్ప ఇతరలోకం ఎరుగదు. దీన కొత్తగావచ్చినపొరుగువాళ్ళపిల్ల. ఇద్దరూ ఒకే ఈడువాళ్లు. పొటీకరిస్తూన్న జవ్వనము. దీన స్త్రీప్రపంచములో పెరిగినపిల్ల. చిన్ననాటినుంచీ ఊహాలు పెద్దవి. ప్రపంచమంతా ఊహించుకోగలశక్తిగలది. తారో, అమాయకురాలు. ఆమె ప్రశ్నలో అమాయకత్వం తప్ప మరేమీ లేదు. చిన్ననాటినుంచీ తోటిపిల్లలు చెప్పేకథలూ, అవీ విన్నదీనకి తార తన్ను మించినజాణ అనిపించింది. లేకపోతే అంతనిర్లజ్జగా అడిగిఉండదు అనుకొంది. అమాయకత్వం అని ఎంతమాత్రమూ తోచలేదు

"దీపాలెడుతున్నారు. నేపోతాను" అంది దీన.

"కొంచెం ఉండవే. మానాన్న ఇప్పుడే వస్తాడు. సరేకానీ. దీనాఎందుకే—".

"ఏం నంగనాచివే!–నే పోవాలమ్మా, మాఅమ్మ తిడుతుంది" అంటూ దీన లేచి వెళ్లిపోయింది.

ప్రొద్దుగూకిందని తారకూడా లేచి కసవూడ్చి నీళ్లు చల్లి వీథిగుమ్మాలకు ముగ్గెట్టి, ఇంట్లో దీపాలువెలిగించింది. ప్రొద్దున్న చాకలి తెచ్చినమడత కట్టి వంట ముగించుకొని తండ్రికోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిల్చుంది. ఎంతసేపటికీ తండ్రి రాలేదు. "అయ్యవచ్చాక భోంచేస్తాడు. ఆకలేస్తోం"దని తనుపెట్టుకొనితిని, మళ్లీ తండ్రికోసం వీథిగుమ్మంలో ఎదురుచూస్తూ నిలబడ్డది. మునుపు కొన్నిమాట్లు ఇలాగే ఆలస్యంగా వచ్చాడు తండ్రి. ఒకొక్కప్పు డర్ధరాత్రి అయేది.

నూరుగజాలలోపున ఇళ్లు లేవు. ఇళ్లవరుసకు కొంతఇవతలగా సందుమొగలో మ్యునిసిపల్ లాంతరు కొట్టుంది. ఆదీపానికి కొద్దిదూరంలోనే తారాడుతూ ఉన్న ఒకవ్యక్తి. తార అతన్ని చూడలేదు. ఆలోచిస్తూ తండ్రికోసం తార అక్కడేకూర్చొని చూస్తోంది.

తారకు మళ్లీ కోళ్లు మనస్సుకు వచ్చాయి. పుంజు పెట్టనెందుకు బాధపెట్టింది? ఆమాటడిగితే దీన అల్లా ఎందుకు నవ్వింది? దీననవ్వులో సిగ్గు,రహస్యము ఉన్నాయి. తార కేమీతోచలేదు. నాయననడిగితే! ఎందుకో తండ్రినడగకూడదని తార కనిపించింది. తల్లి ఉంటే తల్లి నడిగేది. తనతల్లి ఎలాఉండేదో తార సరిగ్గా ఎరుగదు. కాని తల్లిరూపం చిననాడెప్పుడో తనకు తెలియకుండానే ఆమెచిత్రించుకొన్నది. రాను రాను అదే తల్లినిజరూపమని ఊహలో ఉన్నది. ఆ రూపసైజాన్ని ఆమెఎప్పుడూ ప్రశ్నించలేదు. ఆతల్లి రూపమే అప్పుడామెను వ్యామోహితనుగా చేసింది. తల్లిఉంటే ఎన్నో అడుగుదు ననుకొంది. దీనకు తల్లి ఉండబట్టే ఆసంగతి తెలుసు. దీనకు తప్పకుండా తెలుసు. లేకపోతే అలానవ్వదు. . . .

దూరాన్న దీపంవంక చూస్తూ ఆలోచిస్తూన్న తారకు అకస్మాత్తుగా ఒక మొగము కనపడింది. తండ్రి మొగమేమో అని చూసింది. కాదు. కాని ఎవరో ఆమె చూచిన మొగమే.

అకస్మాత్తుగా ఆమెకు జ్ఞప్తికివచ్చింది. ప్రొద్దున్న దీనతో నీళ్ళకు పోయినపుడు బిందెలు క్రిందకు దించి ఇద్దరు రేవులో నవ్వుతూ మాట్లాడుకొంటూన్నారు. ఆమెప్రక్కకు తిరుగుండి దీన హాస్యాలకి నవ్వింది. దూ



"ఆలోచిస్తూ తండ్రికోసం తార అక్కడేకూర్చొని చూస్తోంది."

రాన్న ఈమనిషి నిలబడి మీసం సన్నగా దువ్వుతో మందహాసం చేశాడు. ఆమె హాసం ఆగిపోయింది. తొందరగా నీళ్లు నింపుకొని బయలుదేరి అతన్ని దాటి దూరంవచ్చాక "దీనా, ఆమనిషెవరే" అని అడిగింది "జమీందారుకొడుకు, చాలాచెడ్డవాడు." తార ఊరికే "ఏంచంపుతాడా ఏమిటే" అంది పరాకుగా. "నీమొహం! చంపడు! ముద్దెట్టుకొంటాడు; కాదు ముద్దులతో చంపుతాడు" అని నవ్వటం మొదలుపెట్టింది. దీనమాటలు తార కర్థమవలేదు. ప్రొద్దున్నా అవలేదు. సాయంత్రం అంతకంటేను. తారకెందుకో ఒళ్ళు గగుర్పొడిచింది. నిద్రపోతానుకొని తలుపు గడైవేచి పడుకొంది.

ఏవో ఆలోచనలతో నెమ్మదినెమ్మదిగా కునుకుపడుతూ ఉంది. ఎందుకో మళ్ళీమళ్ళీ జమీందారు కొడుకూ, చిరునవ్వూ, కోపమ్మూ, తార వ్యంగోక్తులూ మనస్సుకు వచ్చాయి. ఆమెకేమీ అర్థమవలేదు. అల్లాగా కునుకుపడుతూంది.

వీధి తలుపు కొట్టినచప్పుడైంది. ఆమెపంచేంద్రియాలూ నిద్రపోతూన్నాయి. సగముమనస్సు నిద్రపోతూంది. సగముమనస్సు అలవాటుచేత మెళకువగా ఉంది. ఆసగము మనస్సు ఆ చప్పుడువింది. నిద్రలో ఆమెవెళ్ళి తలుపు గడతీసి నిద్రపోతూనే మళ్ళీ వచ్చి పడుకొంది.

ఆమెకు కలవచ్చింది. ఆమె వక కోడిపెట్టయినట్టు. ఒకపెద్దకోడిపుంజు ఆమెచుట్టూ తిరగడం మొదలు పెట్టింది. ఆమెకు తప్పుకొనేందుకు త్రోవ కనబడలేదు. అకస్మాత్తుగా ఆపుంజు ఆమెను తినరెక్కలతో ఆవరించింది. తనగోళ్ళతో ఆమెగుండెలను చీరటం మొదలుపెట్టింది. ముక్కుతో ఆమెమొగమంతా పొడవడం మొదలుపెట్టింది.

ఆమెకు ఇది కలఅన్నజ్ఞానము తప్పలేదు. కాని అజ్ఞానము. ఆమెలో మహాభయము కలిగించడం మాన

లేదు. ఆమె కళ్ళు తెరవటానికి ప్రయత్నం చేసింది. కాని కంటిరెప్పలు విప్పుకోలేదు. గట్టిగా కేకవేయబోయింది. తనకేక తనకే వినబడదు. "ఇది చెడ్డకలమటుకే!" అని మనస్సుకు ధైర్యం చెప్పుకోటం మొదలుపెట్టింది. కాని ఆమెకు భయం పోగలేదు.

అప్పుడు ఆమె నింకా బిగ్గగా ఆవరించింది. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వేగిరించాయి. ఆమెగుండె దడదడ కొట్టుకొంటూంది. రక్తమంతా ఆమెగుండెలకు ఆమెముఖానికి పాకింది. ఆమెవొళ్ళంతా అతిఆవేగంతో వొణికిపోయింది. ఈభయావస్థ తప్పించుకోటానికి అతి ప్రయత్నంతో ముగము పక్కకు తిప్పుకొంటూ అస్పష్టంగా గొణుగుకొంది. బలవంతాన కళ్ళు తెరచి మళ్ళీ కళ్ళుమూసుకొని కవ్వున కేకవైచింది. ఆమెగుండె కొట్టుకోగలిగినంతవేగంగా కొట్టుకొని కొట్టుకోటం మానివేసింది. ఆమెఉచ్ఛ్వాసనిశ్వాసములు లేవు.

జమీందారుకొడుకు తెల్లబోయాడు. తననిండు కౌగిలిలోనుంచి ఆమెను వదలేశాడు. ఆశరీరం అలాగే బిగుసుకుపోయింది.



జమీందారుకొడుకు కిదంతా యేమీ అర్థంకాలేదు. అతని కిది అపూర్వానుభవము. అతని కౌగిలిలోను వెంతబలవంతపెట్టబడిన స్త్రీకూడా చనిపోలేదు. అతనితల గిఱ్ఱున తిరిగిపోయింది. అతనివ్యాపారాలలో ఇంతకుమున్నెప్పుడూ అతనికి చలనము కలగలేదు. నేడతనిమనస్సు క్షుభితమైపోయింది.

అతనికి నాటిచర్యంతా మనస్సులో గిఱ్ఱున తిరిగింది. ఆమెను ప్రొద్దున్న నీలాటిరేవులో చూశాడు. పదారేండ్లజవ్వనము. నున్నని చెక్కులు. అమాయకపుపెదవులు. ముద్దులగాని వర్ణించలేని కంఠము. అతనికర్థంకాని జ్యోతు లీనేకళ్ళు. నవ్వుతో అతనివంక చూసింది. అతన్ని చూసి నవ్వాపేశింది. కాని జవ్వనిలక్షణం అది. విముఖత్వం అని కాముకు డనుకోడు. స్వర్ణప్రతిమలాంటి ఆమెరూపము తడిసినచీరలో సగముసగము కనబడి పూర్ణనగ్న స్వరూపంకన్న వేయిరెట్లు మోహితుణ్ణి చేసింది. తనకాముకత్వానికి ఇంతకుముందు అతనడ్డరుగడు. ఇప్పుడుండవచ్చునని తోచనైనా తోచలేదు. మును వెందరో అతనిసౌందర్యానికి దాసీలయారు. తరువాత కొందరు స్వచ్ఛమైనస్త్రీలను అతను బలవంతపెట్టి చెరిచాడు. అలాలసవృత్తి అతనిలో పెరిగిపోయింది. కాని పాపాచరణమన్నబుద్ధి అతని కెప్పుడూ తోచలేదు. తోచుటకు తీరిక కలుగలేదు. సహజంగా సౌందర్యమూర్తి; అంతకన్నా తనసౌందర్యాన్ని తనుకర్తించినవాడు. అనేకమందిస్త్రీలచే నవమన్మథుడని పొగడబడ్డాడు. నేడొకపసిబాల అతన్ని కాదంటుందా? అతనిరసికత్వమంతేనా.

ఆమెవెంటపడుం రానపోయి ఆమెయిల్లు గుర్తుపట్టాడు. రెడ్డికూతురు. రెడ్డి భయంకరుడు. అపాయం జారుశీకామాన్ని వృద్ధిపరుస్తుంది. దానికొక ఔన్నత్యం కలిగిస్తుంది అతనిమనస్సులో.

రెడ్డి ఊళ్లోలేడని తెలుసుకొన్నాడు. సాయంత్రం చీకటిపడ్డతర్వాత ఆయింటిసమీపాన కాసేపు తారాడి, పిల్ల ఒక్కరితేఉండటం గ్రహించి, యింటిదగ్గరకు వెళ్ళి మెల్లిగా తలుపుకొట్టాడు. ఆమెవచ్చి తలుపుతీసి వెంటనే చరాలున లోపలికి పోయింది. ప్రౌఢలనెరిగిన అతను, ఆమె తప్పకుండా తన్ను మోహించిం దనుకొన్నాడు. ఆమెపోయినత్రోవనే లోపలికి పోయాడు. ఆమెమంచంమీద పడుకొనినిద్రనటిస్తూంది. స్త్రీలు మును పిట్టినటనలు చూపించటం అతనెరుగును. కాని ఇంత బాగా మునుపెవరూ నటించలేదు. ఆమె జాణతనమును అభినందించుకొన్నాడు. నిద్రగొప్పగానటిస్తూంది. ఆమెనుదురు క్షీరసముద్రంలా నున్నది. ఆమె చెక్కులు పాలుకారుతున్నట్లనిపించాయి. నిద్రపోతూన్న సముద్రంమీద అలల్లాగు ఆమెపైట లేస్తూ పడుతూఉంది. బహుజాగ్రత్తగా ఆమెకు తెలేకుండా అత డామెనాచ్ఛాదితనుగా చేశాడు. గట్లెరుగని కామం అతనిలో వెల్లువలై పోయింది. రాహువు చంద్రునట్లు అత డామెను కప్పేశాడు. అతనిచేతు లామె నావరించాయి. అత డామెమొగమంతా ముద్దులతో నింపేశాడు. ఆమె అతనిముద్దు తప్పించుకొంటూ వద్దువద్దని గొణుగుతో పక్కకు తిరిగింది.

పూర్తిగాచెలరేగిన అతనికామాన్ని అతడే ఆపలేకపోయాడు. ఆమెను మరింత బిగ్గ కౌగిలించుకొన్నాడు. ఆమె కళ్ళు తెరిచి మరల మూసికొని కెవ్వున కేకవైచి బిగుసుకుపోయింది.

అతనికామము ఆక్షణము అతన్ని విడిచి పోయింది. విస్మయభయాలతో ఆమెను వదిలి అతను లేచాడు. ఆమె కదలలేదు. అట్లాగే బిగుసుకుపోయింది. మళ్ళీ ఆమె వక్షముపై చేయిపెట్టి గుండె ఆడుతున్నదా అని చూశాడు. ఆచెయ్యి ఆక్షణాన కామము ఎరుగదు.

అతనిగుండె దడదడ కొట్టుకొన్నది. కామము వదిలిపోయిన కంకాళాన్ని భయము ఆవేశించింది. అతని మోకాళ్లు బరువు లెక్కాయి. అంతనిస్సత్తువ అతనెప్పుడూ ఎరుగడు. అంతవరకు నిశ్చలంగా ఉన్న కిరసనాయిలుబుడ్డిదీపము గంతులువేయడం మొదలుపెట్టింది. దీపంక్రీనీడలు గదిగోడలనిండా పిశాచీనృత్యాలు మొదలుపెట్టాయి.

ఆమెవంక చూస్తూ నిర్ఘాంతపోయి అత నలాగే నిలుచున్నాడు. అంతవరకూ అతనెరుగని ప్రకృతి ఒకటి అతనిలో బయలుదేరింది.

"పసిబాలను నీకామాంధతచే హత్యచేశావు" అని ప్రకృతి గట్టిగా అరవడం మొదలుపెట్టింది. అతను గట్టిగా చెవులుమూసికొన్నాడు. "హత్య! హత్య! పసిబాలను నీకామానికి బలియిచ్చావు" అంటూ అంతఃకరణ ఇంకాగట్టిగా అరవడం మొదలుపెట్టింది. అతను మూల్గుతూ "నేనుకాదు" అనిగట్టిగా అన్నాడు. "నేను కాదు" అని ప్రతిధ్వని అతనికి గట్టిగా వినపడింది. అతను నలువంకలా చూశాడు. మళ్ళీ ఆమెముఖమువంక చూశాడు. ఆమెముఖములో ఆభీతి అట్లాగే చిత్రింపబడి ఉంది. "అయితే నేనే ఈహత్య చేశానా" అనిమెల్లగా అతను



" ఆమెవంకచూస్తూ నిర్ఘాంతపోయి అత నలాగేనిలుచున్నాడు."

రోదించాడు. "ఆ! ఔను!" అంటూ గట్టిగా అతని అంతఃకరణ జవాబు చెప్పింది. "అన్యాయము! అన్యాయము!" అని అతను సన్నగా విలపించాడు.

"ఆమె నావంక చూసి నవ్వింది. లేకపోతే నే నామెను మోహించను."

"అబద్ధం! ఆమె నీవంక చూసి నవ్వాపేసింది. నిన్ను కామాంధకారం కప్పింది."

"మరి ఆమె తలుపెందుకు తీసింది"

"నువ్వెరుగుదువు. ఆమెతండ్రి అనుకొని తీసింది"

"లేదు! అంతా ఉత్తది. నామోహాన్ని ఆమె ప్రేరేపించింది. నాకౌగిట మహోద్రిక్త అయింది."

"మూఢుడా! ఉద్రిక్త కాదు. భయంచే ఆమె నాడులు, నరాలు ఉబికిపోయినవి. ఆమె రక్తవేగం నీ కామానికికాదు, భయంచేత. ఆమె నీ కౌగిలికి చచ్చిపోయింది."

"అంతా అబద్ధం! అంతా అబద్ధం" అంటూ అతను లోపల ఏడ్వ మొదలుపెట్టాడు. కొంచెం పెద్ద గాలిచే కిటికీతలుపు కదలి చప్పుడయింది. ఆ గాలి చలికి దగ్గరపొదలో గుడ్లగూబ కూతపెట్టింది. అతను మేలుకున్నాడు అప్పటికి. అతనికి పారిపోవాలని బుద్ధి కలిగింది. ఆ తరువాత అక్కడ నిలవటాని కతనికి ధైర్యం చాలలేదు. గుమ్మందాకాపోయి వెనుకకు చూచాడు. అతనిదృష్టి ఆమెఅనాచ్ఛాదితదేహముమీదికి పోయింది. వెనుకకుపోయి, ఆమెచీరతో ఆమెఒళ్ళంతా కప్పేడు. ముఖమువంక చూడకుండామని అతిప్రయత్నం చేశాడు. అతనికి తెలియకుండా అతనికళ్లు వాలుచూపులు చూచాయి. ఆ ముఖంలో "జాలి" అతన్ని వణికింప చేసింది. ఏముఖం అతన్ని అక్కడకు లాక్కొచ్చిందో ఆ ముఖమే అతన్ని అక్కడనుంచి తరిమేసింది. మరల వెనుకకు తిరగకుండా వీధితలుపు చేరవైచి అతను మెట్లు దిగాడు. ఒక్కసారిగా అతని కాళ్ళల్లోకి విపరీతమైనశక్తి వచ్చింది. అతను పరుగెత్తడం మొదలుపెట్టాడు. దీపస్తంభం వద్ద అత నొకవ్యక్తిని రాచుకొంటూ పోయాడు. ఆ వ్యక్తి మొగం కొద్దిగా కనుపడ్డది. రెడ్డి.

ఎక్కడికో తెలియకుండా ఇంకా పరుగెత్తడం మొదలుపెట్టాడు. గుడ్డిఎద్దులాగు తిరిగినచోటికే గుండ్రంగా తిరగటం మొదలుపెట్టాడు. అతనితల గిఱ్ఱున తిరుగుతోంది. అతను చెరిపినస్త్రీలు అనేకరూపాలు దాల్చి అతనిముందర వికటాట్టహాసాలు మొదలుపెట్టారు. అతనికి లోకంఅంతా తన్ను అన్యాయం చేస్తోందనిపించింది. తన్నాబాల ప్రేరేపించినదని ఎన్నోమార్లు తనకు గట్టిగా చెప్పుకొన్నాడు. కాని అతనిలో ఆవేళ ప్రేరేపింపబడిన నూతనప్రకృతి అంతఃకరణ అతని మాటలు వినలేదు. అతనిపూర్వకృత్యాలన్నిటికీ ఇప్పుడే అతన్ని ఈసడించటం మొదలుపెట్టింది. పశ్చాత్తాపమనేది అంతకుముందెప్పుడూ అతనెరుగడు. అందుచే ఈ కల్లోలము ఆదుకోలేకపోతున్నాడు.

ఇంతలో ఎవరో వెనుకనుంచి దుడ్డుకఱ్ఱతో అతని నెత్తిమీద గట్టిగా కొట్టారు. అతనితల దిమ్మెక్కిపోయింది. అబ్బాఅంటూ అతను స్మృతిఎరుగకుండా పడిపోయాడు. అతన్ని అంతఃకరణ ఇక బాధించలేదు.

## 3

రెడ్డి యింటికివచ్చి తలుపుదగ్గర "తారా!" అని కేకవేశాడు. బదులు లేదు. అతను తలుపుకొట్టబోయాడు. తలుపు తెరుచుకొంది. అతనిమనస్సుకేదోకీడుతట్టింది. మెల్లిగా లోపలప్రవేశించి "అమ్మాయీ! అమ్మాయీ!" అంటూ కేకవేస్తూ నలుదిక్కులా కలయచూశాడు. గదిలోపరుపుమీద పడుండివున్నది కూతురు. అతనికేదో భయము వేసింది. ఆమెముఖంలో భీతి అతనుగ్రహించ లేకపోలేదు. "అమ్మాయీ" అంటూ జబ్బపట్టుకు లేవదీయబోయాడు. వళ్ళు చల్లగా కొయ్యబారిఉంది. అతనికి దుఃఖము పొంగుకొంటూ వచ్చింది. ఆపుకొని దగ్గరఉన్న డాక్టరుదగ్గరకు పరుగెత్తాడు. డాక్టరు వచ్చి చూసి పెదవివిరిచాడు.

"అయ్యా, ప్రొద్దున్న కులాసాగానే ఉందండి. పురుగేమైనా ముట్టిందా" అని అతిదీనంగా అడిగాడు

రెడ్డి. డాక్టరు రెడ్డివంక చూసి "రెడ్డీ, నువ్వు ధైర్యము గలవాడవు కనుక చెపుతున్నాను. ఈమె అకస్మాత్తుగా గుండె ఆగిపోవటంచేత పోయింది. ఈమెకు అసలు గుండె జబ్బున్నదనుకోను. ఒకమహాభయము ఈమెను కలిచివేసింది." అని నెమ్మదిగా "ఈమె నెవరో బలవంతము చేశారు. కామవృత్తి ఎరుగని ఈమె ఆ ఉద్రేకంచేత భయంచేత చనిపోయింది."

రెడ్డి కకస్మాత్తుగా దీపందగ్గిర తన్నుతోసికొని పరుగెత్తినవ్యక్తి జ్ఞప్తికివచ్చాడు. జమీందారుకొడుకు! ఇంతవరకూ ఏదోగా తనమనస్సు చెప్పుతున్న సంగతి అతని కొక్కసారిగా వ్యక్తమయింది. తన ఏకపుత్రిని మానభంగము చేసి చంపినవానియెడ ప్రతిహింస ఒక్కసారిగా అతన్ని ఆవరించింది. తలుపు చాటున పెట్టిన దుడ్డుకఱ్ఱ పుచ్చుకొని వీథినిపడి జమీందారుకొడుకు పోయినత్రోవను పరుగెత్తాడు. జమీందారుకొడుకు పచ్చికబయలులో గుండ్రంగా తిరుగుతున్నాడు. వెనుకగా పోయి అతనితలమీద గట్టిగా మోదాడు. అతని తల పగిలింది. అబ్బాఅంటూ మొదలు నరికిన చెట్టులాగ అతను నేల కూలిపోయాడు.

రెడ్డికి తెలివివచ్చింది. నీటిచుక్కతో పాలపొంగు చల్లార్తుంది. రక్తదృశ్యాన్నగాని రక్తపుపొంగు చల్లారదు. అతని రక్తోద్రేకం తగ్గాక అతనికృత్యం అతనికి కన్నులకట్టినట్లయింది. తనుచేసినహత్యవల్ల తనగర్భశోకం ఏమాత్రమూ చల్లారలేదు. హింసకు ప్రతిహింస విధానము కాదని అతనికి అప్పుడు తోచింది. అతని జీవితం నిరాశాపూరితము.

రెడ్డి సరాసరి మేజస్ట్రేటుగారింటికి పోయి నిద్రలో ఆయనను లేపి, "అయ్యా, నేను జమీందారు కొడుకుని చంపాను, నన్ను ఖైదుచేయండి" అన్నాడు. నిద్రలో లేచిన మేజస్ట్రేటు కేమీ అర్థంకాలేదు. అతనికిది కలలాగున తోచింది. ఇద్దరు జవానులకు "ఇతన్ని రిమాండులో ఉంచం"డని ఆజ్ఞాపించాడు.



"అబ్బాఅంటూ మొదలునరికిన చెట్టులాగ అతను నేల కూలిపోయాడు."

తీర్పులో ఆతనికి ఆజన్మఖైదు విధించారు.

పదిఏండ్లకు రాజుగారిజన్మదినోత్సవమున "మంచి నడతగల పాతఖైదీలను వదిలేయమని" ఫర్మానా వచ్చింది. వార్డరు ఖైదీలను వదలుతూ తనకుతోచిన నీతులు చెపుతూ సల్లాపాలాడుతూ వాళ్ళను విడుదల చేస్తున్నాడు

"నెంబరు ౭౬"

ఒకవృద్ధుడు ఒకక్రోటనులో పూలమొక్కలోని నక్షత్రంలాంటి ఒకచిన్నపూవును అతిప్రేమతో తన వేళ్లఎముకలతో నివురుతున్నాడు. తనకన్నీటితో అతనా మొక్కను పెంచాడు.

"నెంబరు ౭౬"

వృద్ధుడు తలత్రిప్పి అతనివంక చూశాడు "నిన్ను విడుదల చేశారు. నీకు కావలిస్తే ఆమొక్క తీసుకుపోవచ్చును." వార్డరుది జాలిగుండె.

వృద్ధుడు లేచి బయటకు క్రోటను పట్టుకొని వెళ్లాడు.

వార్డరుకు అతనిచరిత్ర జ్ఞాపకమునకు వచ్చింది. "పాపము ఇత నమాయకుడు, శిక్షకు తగడు."

ముసలివాడా మొక్కను పట్టుకొని మరల యథాస్థానమునకు వచ్చి కూర్చొన్నాడు!

"మళీవచ్చావేం" అన్నాడు వార్డరు ఆశ్చర్యంతో. ముసలివాడు మాట్లాడకుండా స్థిరంగా అక్కడే కూర్చొని, "తారా!" అని ఆ పూవును ముద్దెట్టుకొని సాంధ్యాకాశమువంక చూశాడు.

ఆకాశవీధి వొంటరిగా మెరుస్తూన్న తార అతని వంక చూసి మురిసింది.

---

# 'మదిదున్నకబ్రతుకవచ్చుమహి'

# పాలెస్టయిను

యూదులయు, అరబ్బులయు సంఘర్షణతో పాడుగొలకు దారిపట్టి ప్రపంచదృష్టికి కేంద్రమైన పాలెస్టయిను దేశము మహమ్మదీయులకు యాత్రాస్థలము. కేవల మొక్క మహమ్మదీయులకే కాదు, క్రైస్తవులకును నది పుణ్యభూమి. జెరూసలెము, బెత్లెహాము లీ పరగణా లోనివే. ఒకప్పుడిది టర్కీ సామ్రాజ్యమునుండి మహా సంగ్రామకాలమున బ్రిటిషువారి యధికారములోనికి వచ్చినది. వారు దీనిని బాల్ఫోరు డిక్లరేషను ననుసరించి యూదులకు జన్మదేశముగా నిచ్చివైచినారు. ఇక నది మొదలు. యూదుల సంఖ్య యేటేట నంతు పెరుగుచు వచ్చినది. వారి తెలివితేటలకును, విత్తబలమునకును ముందు అరబ్బులు పనికిరానివారైరి. యూదుల ఆక్రమణ అప్రతిహతముగ ముందుకు సాగుచువచ్చినది. చివరకరబ్బులకు దేశభ్రష్టతకూడ కలుగునేమో యన్నంతవరకు ముదిరిపోయిన దాయాక్రమణ. భూములు వారివే. పంటలు వారివే. పరిశ్రమలు వారివే. తుదకు కూలినాలి చేసుకొనుటతో తృప్తిపడియుండుటకైనను నరబ్బులకు వీలులేకపోయినది. ఇక ఉపేక్షించినచో లాభములేదని యరబ్బుల నాయకులకు తట్టినది. యూదుల యాక్రమణ నరికట్టిన సరియే, లేకున్న తిరుగుబాటు తిరుగుబాటే యని యరబ్బులు నడుము కట్టినారు. తిరుగుబాటు అవక్రవిక్రమముగ సాగుచున్నది. అల్లకల్లోలములు మెండుకొన్నవి.



కుడిచి కూర్చొని కాలక్షేపము చేయుచున్న అరబ్బులు (హులే సరోవర ప్రాంతమున)



ఒళ్లు విరుచుకొని పాటుపడుచున్న యూదులు



పండ్లతోటలకును, కాయగూరలతోటలకును। ఆస్పదమైన డాగేనియాని వేశమున టొమాటో పొలములందు జర్మనుయూదులు పనిచేయుట

అసలు అనాదిగ నీదేశమున నుండునది యరబ్బులు. వారి సంఖ్యయే యం దెక్కువ. క్రైస్తవులును, యూదులును బహు కొద్దిమంది. ఈ యల్లకల్లోలములో క్రైస్తవులును అరబ్బులపక్షమే చేరుచున్నారు. జనసంఖ్యా ప్రాబల్యమునుబట్టి యరబ్బు లీ దేశమును తమదిగనే భావించుచున్నారు. అటు యూదులు బ్రిటిషువారి యధికార ప్రదానముతో దీనియందు స్వత్వము నారోపించుచున్నారు. యూదుల ఈయాక్రమణ ధర్మసమ్మతమైనను కాకున్నను, వారి శక్తి సామర్థ్యములకు ఫలముగ నీదేశము వ్యావసాయికముగను, పారిశ్రామికముగనుగూడ అభివృద్ధి గాంచియున్నది.

పంటలు విపరీతమైనవి. పరిశ్రమ లతిశయిల్లినవి. ఇప్పుడది ప్రాత పాలెస్టయినుకాదు. అంతయుక్రొత్త.

మొత్త మిప్పుడు పాలెస్టయినులో ౧౯౭ యూదుల నివేశములుగలవు. రామత్ రహేల్ మొదలు మెటుల్లావరకు గల ఈపరిమితప్రదేశమున ౭౧ వేల యూదులు నెలకొనిపోయినారు. వారి సాగుబడికి ౩౭౫౦౦౦ఎకరముల భూమి లోబడిపోయినది.

జాఫాకును హైఫాకును నడుమనుండు పైరుపచ్చలనివేశములందు నారింజ, ద్రాక్షపండ్లు విశేషముగ పండుచున్నవి. జాఫానారింజపండ్లు ప్రసిద్ధిచెందియున్న









## అయనోత్ వద్దగల వ్యవసాయశాలలలో బాలికల వ్యవసాయ కృత్యములు

ఈపాలస్తీనావైశాల్యము తొమ్మిదివేల చదరపుమైళ్లు. జనాభా దాదాపు పదకొండులక్షలు. సాధనోపాయములులేక, చూచుకొను దిక్కుమాలి ఈదేశము పూర్వము కరవుకాటకములకును, బీదతనమునకును ఆస్పదమైయుండినది. భూమి సాగుబడిలేక బీడువారియుండినది. యూదులరాకతో దాని కొక యపూర్వతేజము దయించినది. భూమి విశేషముగ సాగుబడికి వచ్చినది.

వి. పలువిధములైన ధాన్యములును ఈ నివేశములందు పండింపబడుచున్నవి. యంత్రసామగ్రిని వీరు తమవ్యవసాయ, పారిశ్రామిక విధానములందు విరివిగ నుపయోగపరుచుకొనుచున్నారు. బాలబాలికలకు వ్యవసాయవృత్తిని బోధపర[illegible]ధ్ధందు పాఠశాలలనుగూడ నేర్పరచియున్నారు. నీటిసరఫరాకును, విద్యుచ్ఛక్తి నిర్మాణమునకును జోర్డానునది వీరి కతిగ నుపయోగపడుచున్నది.



ఈన్ హా హోరేష్‌లోని నారింజతోటలు



నారింజపండ్లను రకమువారీగా ఏర్పరచి ఎగుమతికి పెట్టెలలో పదిలపరచుట

స్త్రీ పురుషులు జాతివ్యత్యాసములేక అందుపాటుపడుచుందురు. వ్యవసాయ, పారిశ్రామిక కార్యములందేకాక గృహకృత్యములందును, పశువుల పెంపకమందును గూడ స్త్రీలు ఎంతో ఉత్సాహమును, నేర్పును చూపుచుందురు. పాటుపడినవారికి ఫలము దక్కుననుటకు వీరి దృష్టాంతము చాలును. మొత్తముమీద వీరు దీని నొక వ్యవసాయ భూమిగ చేసివైచినారు. ఇందు పండు పండ్లు, ధాన్యములును ఇంగ్లాండు మొదలగు దేశములకు విరివిగ నెగుమతి యగుచున్నవి. అడవులను పెంచి తన్మూలముగగూడ లాభము గాంచవలయునని పట్టుదలతో యూదులు నిరస్తపాదపములయిన పర్వతప్రాంతములందు సయితము శ్రమకోర్చి చెట్లనునాటి, పెంచి పెద్దయడవులను నిర్మించి యున్నారు. దేశమున కెంతో సౌభాగ్యమును సమకూర్చియున్నారు. యూదుల ఈపట్టుదలకు, కార్యదీక్షకు, గొప్పదనమునకు భీతిల్లి యరబ్బు లప్పుడప్పుడు యూదుల నివేశములమీదబడి యల్లర్లు చేయుచువచ్చిరి గాని యంతమాత్రమున యూదులు వెనుకకు తగ్గలేదు. కార్యశూరులు వారు! సాయుధపాణులయి అల్లర్లు రాకుండ తమనివేశములను కాపాడుకొనుచు చేపట్టిన కార్యవ్యవసాయమున ముందుల కురుకుచున్నారు. ఏటేట దేశదేశములనుండి యూదు లింకను వచ్చుచు వీరిసంఖ్యను మరింత వృద్ధిపరచుచున్నారు. తమకు హక్కుభుక్తముగ జన్మదేశముగ సంక్రమించిన ఈదేశమును బంగారుభూమినిచేసికొనవలయునని యూదులు పలుపాట్లు పడుచున్నారు. అరబ్బులను మాపోపమియు, స్వపతనాశంకయు నావహించినవి. తిరుగుబాటున కుపక్రమించినారు. యూదుల కార్యములను భంగపరుప యత్నించుచున్నారు. యూదుల ఈ దురాక్రమణమునుండి తమ్ము కాపాడవలయునని ప్రభుత్వమునకు మొరలిడుచున్నారు. కాని ప్రభుత్వము యూదుల తరఫుననే యున్నది. అరబ్బుల నణచుటకు తీవ్రప్రయత్నములు చేయబడుచున్నవి.

దేశసౌభాగ్యమునకు పాటుపడుట లక్ష్యముగా గలవా రొకరు. అనాది సిద్ధమైన స్వత్వమును కాపాడుకొనగోరువారు మరియొకరు. ఎవరిగతి యెట్లున్నదో పరికింపవలయును.

'ఆచార్య'



# వెలిచెర్ల శాసనము

వంగోలు వెంకటరంగయ్య

వెలిచెర్ల నెల్లూరుజిల్లా కోవూరుతాలూకాలో నొక శ్రోత్రియగ్రామము. దీని నోఢ్రదేశప్రభు వగు ప్రతాపరుద్రగజపతి శాలివాహన శకవర్షంబులు ౧౪౩౨ నకు సరియగు క్రీ. శ. ౧౫౧౦లో పులుగుళ్ల నివాసి కొండయద్విజరాజునకు "అద్రిక్రయాది" సర్వభోగ సమన్వితముగ దానముచేసినాడు. దానసేసువు శాసనమున నగపడలేదు. దానకాల మీక్రింది శ్లోకమున తెలుపబడియున్నది.

కరరామాబ్ధిశీతాంశు సంఖ్యాక శకవత్సరే,
ప్రమోదోదన్యబ్దవరే మాసే కార్తికనామని
శుక్లత్రితీయాదివసే భార్గవస్యచ వాసరే

అనగా ప్రమోదూత నామసంవత్సర కార్తిక శుద్ధతృతీయా శుక్రవారమని తెలియుచున్నది. "ప్రమోదూత"కు "ప్రమోదోదన్యబ్దవరే" అనియున్నది. సంవత్సర నామములవరుసలో "ప్రమోదోఽథ ప్రజాపతిః" అనియున్నది. ప్రమోదూత అను రూపమెట్లు వచ్చినదో తెలియకున్నది. "ప్రమోదోద"యనుట "ప్రమోదూత"యొక్క వికారము కాబోలు. శకవర్షము కరరామాబ్ధిశీతాంశు సంఖ్యాకమయి యుండుటచే 'అంకానాం వామతో గతిః' అను న్యాయానుసారముగ నది శాలివాహన శకమున ౧౪౩౨ అగుచున్నది. దానకాలము క్రీస్తుశకమున ౧౫౧౦ అక్టోబరు ౪ది అగుచున్నది.

కర = ౨; రామ = ౩; అబ్ధి = ౪; శీతాంశు = ౧; మొత్తము ౨౩౪౧ దీనిని తలక్రిందుగ చదువ వలెను. అట్లు చదువగా ౧౪౩౨ అగుచున్నది.

క్రీ. శ. పదియారవ శతాబ్దిమధ్యకాలము వరకును ఓఢ్రగజపతుల సామ్రాజ్యము ఉత్తరమున గౌడదేశము మొదలు దక్షిణమున కాంచీమండలమువరకును వ్యాపించినటులున్నది. దానమీయబడిన గ్రామము వెలిచెర్ల జలదంకిస్థలమున పాంకనాండి సీమలోనిదిగ నున్నది. జలదంకి నెల్లూరుజిల్లా కావలితాలూకాలో నొకగ్రామము. అది ప్రాతకాలములో ప్రఖ్యాత గ్రామముగ నుండినది. నెల్లూరుజిల్లాలో కొంతభాగమునకు పాంకనాండు (పాకనాడు) అనువ్యవహార మనేకశాసనముల నగపడుచున్నది. ఈవెలిచెర్ల శ్రోత్రియ మిప్పటికిని దానమును పొందిన కొండయ్యగారి సంతతి వారి కనుభవము జరుగుచున్నది. వారిలో నొకరగు బ్రహ్మశ్రీ పులుగుళ్ల వెంకటరమణయ్యగారు ప్రకటనకొరకీశాసనమును దయతో నిచ్చిరి.

ఈశాసనము మూడురాగిరేకులపై నున్నది. ఒక్కొకరేకును పరక ($\frac{1}{8}$) అంగుళము మందము, ఎనిమిదింబరక ($8\frac{1}{8}$) అంగుళముల పొడవు, మూడుంబరక ($3\frac{1}{8}$) అంగుళముల వెడల్పును గలిగి దృఢముగ నున్నది. ఈరేకులను గూర్చియుంచుటకై ఎడమతట్టున ముప్పాతిక అంగుళము పొడవుగల తొడిమలు గలవు. వానిలోనుండు రంధ్రముగుండ యుంగరముండినది కాబోలు. ఆయుంగరమిపుడు లేదు. మూడవరేకుయొక్క తొడిమయు విరిగిపోయినది. మొదటిరేకును, మూడవరేకును శాసన గ్రంథమున కట్టలవలెనున్నవి. మొదటిరేకు మొదటి ప్రక్కనను మూడవరేకు రెండవప్రక్కనను ఏమియు వ్రాతలేదు. శాసనము మొదటిరేకు రెండవప్రక్కన మొదలిడి మూడవరేకు మొదటిప్రక్కవరకు వ్యాపించియున్నది. మొదటిరేకున నొకపుట, రెండవరేకున రెండుపుటలు, మూడవరేకున నొక్కపుట మొత్తమున కీశాసనము నాలుగుపుటలపై నున్నది. మొదటిరేకుపై పంద్రెండుబంతులు గలవు. మిగిలినమూడింటిమీద పుటకు తొమ్మిదివంతుననున్నవి.

శాసనలిపి ప్రాయికముగ నిప్పటి తెలుగక్షరముల బోలియున్నది. కొన్నియక్షరములుమాత్రము కొంచెము భిన్నరూపములుగ నున్నవి. ఈ శాసనాక్ష

రములందు సాధారణముగ ద, డ, ట, అక్షరము లేక రూపముననున్నవి. సంపర్భమును బొల్లు అక్షరనిర్ణయము పాఠకుడు జేసికొనవలసియుండును. "శ" అను నక్షరము శ్రీ యిటులుండును. మొత్తముమీద తెలుగు జదువ గలవారు దీనిని సులభముగ జదువగలరు.

దానమీబడిన గ్రామపు జెల్లు బెలుపుమాటలు దప్ప మిగిలిన శాసన భాగమంతయు సంస్కృతమున నున్నది. అందునను నాల్గవపుటలోని "తస్య గ్రామస్య శీమాచిహ్నాని శిలా స్తంభై శ్రిస్థైజైయాని" అను నక్షరములుదప్ప మిగిలినదంతయు ఇరువదిమూడు శ్లోకములుగ నున్నది. మొదటిశ్లోకము గణాధిపతి ప్రార్థన, రెండవది ఆదివరాహస్తుతి, మూడవది దాత్రన్వయమూల మగు నాదిత్యస్తవము, నాలుగుమొదలు పదునాల్గువరకు దాతృవంశ కీర్తనము, పదునైదవశ్లోకము, పదునారింట కొంతయు దానకాలబోధకములు. పదియారునందలి మిగిలినభాగమును, పదునేడును గ్రామనిర్దేశము, పదునెని మిదియు పందొంబదియు ప్రతిగ్రహీతృవంశకథనము, ఇరువది ఇరువదియొకటి దానవస్తువునం దాదాని స్వత్వ స్వామ్యములు. ఇరువదిరెండు ఇరువదిమూడు అభిశాపక శ్లోకములు. ((౨౨) ఏకైవభగినీలోకేత్యాది ౨౩ స్వదత్తాంపరదత్తాం వేత్యాది.)

శాసనపుటక్షరములుమాత్ర సొంపుగనున్నను వర్ణక్రమదోషము లనేకములున్నవి. వీనిలో గొన్ని వ్రాయసగాని తప్పులును కొన్నిశిల్పివిగ నుండగలవు. ఏత్వ ఓత్వముల పొల్లులు సాధారణముగ నగపడవు. అను స్వారమునకు పరముగ నుండు హల్లునకు ద్విత్వము గల్పించుట సర్వసామాన్యము: సంస్సర్గ, అంబోభ్భజి, అంబ్బుజాత, సుగంధ్ధ, ప్రఫుల్లంత్తి, కుంబ్భొ, పంచ్చ జెంకృట, కొండ్డయ, వెమొగ్యంచ్చ, దంఢ్డు, దత్తాంవ్వా ఇత్యాదు లెన్నియేని గలవు. ఒకచోట విఘ్నాఘయ నుటకువి ఘ్నాభయయనియున్నది.

ఇంకొక విధమగుతప్పులు — సప్తాన్నై, దుగ్ధా, హారేద్రక్షీణలోచనం, సర్వాం, కీర్తి, వర్త్తి ఇట్లివి వ్యాకరణదృష్టిచే తప్పులుగనున్నను వ్రాతగాండ్రకు సహజములుగ నున్నవి. వ్యాకరణశాస్త్ర మామూలాగ్రము లెస్సగ జదివిన యొక "వెంకుభట్టు"గారు చేవ్రాలు చేయవచ్చు నంతటికి "వెంకృంబోఢ్లు" అని చేయుదురు. సుశబ్దాపశబ్ద వివేకము లేకగాదు యిట్లు స్ఖాలిత్యము లేర్పడుట - వాడుకక్రింద పోవుచున్నవి. తప్పులకు సమర్పణ మెట్లున్నను తెలుగున కీదుర్గతి యనాదిగనున్నది. బ్రౌను ఈవిషమస్థితిని దిద్దుబాటుజేయ దలపెట్టక దీనినూర్జిత పరచినాడు.

ఇందలివ్రాతయం దింకొక విశేషమేమన రేఫ సంయోగము వచ్చినచోట్ల నంతయు వలపలగిలకనె హర్చియున్నారు. "కర్త" యని యిపుడు వ్రాయుచోట "కర్త్త" అనియేయుండును. ఇప్పటి వ్రాత వాడుకలో వలపలిగిలక మృగ్యమగు చున్నను తెలుగు వైపురైటరుకు అక్షరముక్రింద నక్షరము చేర్చుటకంటె వలపలిగిలకయే వాటముగనుండును.

శాసనశ్లోకములు రమ్యములుగ నున్నవి. రెండు స్థలములలో మాత్రాధిక్యము గనుపడుచున్నది. (౧) రెండవపుట ఎనిమిదవబంతి: పాత్రైః బేహారామహాపాత్రైః ఇచట "బేహారా"యనుటకు బదులు "బేహ్ర"యని జదివిన సరిపోవును. (౨) మూడవపుట ౫-౬ బంతులలో:-"నారాయణయజ్వనః పౌత్రాయ" యని యున్నది. ఇందు రెండక్షరము లధికముగనున్నవి. "నారాయణార్యపౌత్రాయ" యనిచదివిన సరిపోవును. అట్లయిన వ్యాయప్రయాసముల కోర్చి గడించిన "యజ్వ" బిరుదములోపించునని భీతిగలదు.

ఇవిగాక నాల్గవపుట ౧-౨ బంతులలో "తస్య గ్రామస్య శీమాచిహ్నాని శిలా స్తంభై శ్రిస్థైజైయాని" యని యున్నది. ఈమాటలకు "ఈగ్రామముయొక్క పొలిమేరలగుర్తులు రాతి స్తంభములచే తెలిసికొనవగును." అని స్థూలముగ నర్థము జేసికొనవచ్చును. పదవిభాగము జేసి యర్థముచెప్పుటకు వలనుగాకున్నది. అపశబ్దములుగ నున్నవి. బహుశః ఈ వాక్యము యిటు లుండవచ్చును:-

"తస్య గ్రామస్య సీమాచిహ్నాని శిలాస్తంభైస్స్నిగ్ధః జ్ఞేయాని" అని. మరియు మొదటిపుట ౮-౯ పంక్తులలో

"జగ్రాహపశ్చాత్త్యైలుంగాణదుర్గాణ్" అని యున్నది. "తెలుగాణదుర్గాణ్" అని యనుస్వార రహితముగ నున్నయెడల ఛందోభంగము లేకుండ "నుప జాతి" కుదురుచున్నది.

ఈ శాసనమువలన ఓఢ్రగజపతుల ప్రాభవోన్న తులు తెలియగలవు. కూటస్థపురుషుడు కపిలేంద్రుడు దక్షిణభూమిపాలుగ జయించినట్లున్నది. (సభూపతి ర్దక్షిణభూమిపాలాన్ విజిత్య పుట ౧, పంక్తులు ౭,౮) అట్లులుగాకుండిన ఓఢ్రదేశమునకు కడు దక్షిణమున నుండు వెలిచెర్లగ్రామమును వీరిసంతతివారు దాన మిచ్చుట సంభవించియుండదు. అదిగాక ప్రతాపరుద్ర గజపతి పాంకనాంటి చొక్క మండలనాయకత్వ బిరు దమునుగూడ వహించియుండినాడు. రెండవపుట ౧౬ పంక్తిలోని "పంచగౌడాధినాయక" యను బిరుదము వలన నుత్తరమున గౌడదేశము వీరి యేలుబడికి లోబడి నదిగ నుండవలెను. మరియు పశ్చిమమున తెలుగాణ దుర్గముల బట్టుకొనినవారని పుట ౧ పంక్తులు ౭-౯ లలో దెలియుచున్నది. తెలుంగాణ మనగా యిప్పటి హైదరాబాదు రాజ్యములోని తూర్పు భాగమంతయని చెప్పనగును. దానకర్తయగు ప్రతాపరుద్రగజపతి మహా రాజాగారి బిరుదములజూడ వీరి వీర్యశౌర్యప్రతాపము లమేయములుగ నుండవలెను:-

(౧) శ్రీమద్రాజాధిరాజేంద్రపంచగౌడాధినాయక,
(౨) వీరకేదార,
(౩) మానగోవిందలాంఛన
(౪) విద్యానిధి
(౫) పాంకనాండిచొక్కమండలనాయక
(౬) త్రిభువనతోడరమల్ల
(౭) రణబణిజార

ఇట్టి బిరుదములు శుష్కస్తావవాక్యములని నిర్లక్ష్యము జేయవలను గాదు.

ఈ బిరుదములలో "రణబణిజార" యనునది శాబ్దబోధప్రకరణమున సంచుక స్పృహణీయమగుచున్నది. ఇందలి మొదటి మూడక్షరములును వణిక్-శబ్దముల జ్ఞాపకపరుచుచున్నవి. బియ్యములోనగు భోజన సామగ్రుల బండ్లమీదను, గంతయెద్దులమీదను వేసికొని గ్రామగ్రామాలకు సంచరించి వ్యాపారము చేయువర్తక జనమునకు "బణిజార" యని పేరైనటుల కొన్ని ఆధునిక నిఘంటువులవలన దెలియుచున్నది. ఇందలి కడ పటిభాగమగు "అర" యనునది తచ్ఛీలమును (వ్యాపార శీలమును) దెలుపు ప్రత్యయముగనున్నది. పూజరి, టక్క రి, దగువరి, నేర్పరి, తీర్పరి, ఒంటరి ఇత్యాదుల పోల్ప దగును. ఒకపుడు వృత్తినర్మమున కాశ్రయమైన ఈ పేరు కాలక్రమమున సామాన్యవాచకమై (Gineral Name) గుప్తమై వ్యాహారముగ నుండువాడని రూఢియైయుం ఆర్ద్ర గ్వ్యవస్థయెటులున్నను తెలుగు తెగల లోని "బలిజ" శబ్దమున కిది మూలముగ నుండునా? అన్ని వ్యాపారములు చేయువారు ఆతెగలో నున్నారు. ఉప్పుబలిజలు, గాజుల బలిజలు, పగడాల బలిజలు, ఇత్యాదులు. వారికి శెట్టిపట్టముగలదు.

ఈ శాసనమున తెలుగువారి నాకర్షించు శబ్ద మింకొకటి కలదు—"తెలంగాణ" యనునది. ఆంధ్ర బ్రాహ్మణులలో తెలుగాణెపు తెగవారు బహుజన మున్నారు. ఈశాసనమున "జగ్రాహ పశ్చాత్త్యైలుంగాణ దుర్గాణ్" (౧ పుట-౮-౯ పంక్తులు) అని యుండుటవలన ఇది యొకదేశభాగమై ప్రభుత్వసంపదయు గలిగి కోటలు పేటలుగల రాజ్యముగ నుండెనని స్ఫురించుచున్నది.

తెలిసికొనవలసిన విషయమింకొకటియు కలదు. ప్రతాపరుద్రగజపతి బిరుదులలో "పాంకనాండిచొక్క మండలనాయక" యను నొకటి గలదు. పాంకనాంటిలో చొక్కమండల మేభాగమో?

ఈ శాసనము రెండవపుటలో నుండు "పాత్రైః బేహరా మహాపాత్రైః" అను మాటలు ఓఢ్రదేశమున గౌరవవాచకములుగ నున్నవి. అనగా రావు, నాయుడు, మొదలియారు, చౌదరి లోనగు పట్టపుపేర్లవంటివిగ నున్నవి. మహాపాత్రులు అను పట్టము ప్రాయికముగ ఓఢ్రబ్రాహ్మణులకుమాత్ర మన్వయించునని తెలియు చున్నది.

ఈ శాసనాంతమున దాతయొక్క చేవ్రాలుండ వలసినచోట యీ చిహ్నమున్నది:—



ఈ చిహ్నముయొక్క వివరణము అనేకవిధము లుగ నూహింపబడగలదు:—

(౧) ఈ చిహ్నమున మొదటియక్షరము కవర్గము లోని రెండవయక్షరమగు "ఖ"యని యూహింపబడి నది. ఓఢ్రదేశమునందలి వ్రాతయొక్క సంప్రదాయముల ననుసరించియు, భాషాసంప్రదాయముల ననుసరించియు ఫలానివారి చేవ్రాలు అనుటకు బదులు — అను నక్షరమును వ్రాసి దానివరుసన పేరువ్రాసికొనుట యను ఆచారమని అనేకసంవత్సరములు గంజామువిశాఖలోని ఓఢ్రభూయిష్ఠములను ప్రదేశములలో సబురిజిస్ట్రారుగ నుండినవా రొకరు విశేషానుభవజ్ఞులు దెలిపిరి. తెలుగు వారు "చేవ్రాలు" అనుమాటను స్వనామాంతమున జేర్చునటుల కొన్ని జాతులవారి వాడుకలలో "చేవ్రాలు" నకు సరియగు భాషాపదము స్వనామమునకు ముందు వ్రాయుట కలదు. మహమ్మదీయులు సాధారణముగ "దస్తఖత్" అనుమాటను ముందువ్రాసి దానిప్రక్కన తమతమపేళ్లను వ్రాయుదురు. ఈ యూహ సరియని అంగీకరించిన "ఖ" అను నక్షరమువలన సూచింప బడిన పూర్ణశబ్ద మెద్దియోని విచారింపవలసియున్నది. "ఖత్" అనుమాటయొక్క మొదటి యక్షరముగ నుండునా? ఖత్ అనగా వ్రాత, జాబు ఇత్యాద్యర్థములు గలవనియు, ఇది పార్సీ (Persian) మాటయనియు ఉర్దునిఘంటువులలో నున్నది. క్రీ. శ. ౧౫౦౦ నాటికే పార్సీ భాషకు ఈ దేశమున నింత వ్యాప్తి కలిగినదా యని సంశయింప వచ్చునుగాని ఆ కాలమునకే మొగలాయి సామ్రాజ్యము ప్రబలియుండినదనియు ఓఢ్రదేశమునకు నాతిదూరవర్తులగు కొన్ని మహమ్మదీయ రాజ్యములు వెలసియుండినవనియు జ్ఞప్తియుంచుకొనిన ఈ సందేహ నివారణము కాగలదు.

"ఖ" యను గుర్తు చేవ్రాలుకు సమానార్థక మని గ్రహించినను మిగిలిన భాగముయొక్క అర్థము దుస్సాధముగ నున్నది. ఈ భాగమునకు ఖడ్గాకారము చెప్పనగును. ఈ అనుమానమును అనింద్యముగ నుండ వచ్చును. దాతయొక్క బిరుదములను జూడ వాని శౌర్య ప్రతాపములకు ఖడ్గము (Sword) అనురూపమగు చిహ్నముగ నుండవచ్చును. అట్లయిన, ఈ కత్తిరూపము నకు మొదటనుండు మూడుసొగసున్నలు కత్తియొక్క పిడి (handle) గ నుండగలవు. మిగిలినభాగము కత్తియే. మూడవసున్న క్రింద నుండుగీత యేమిగ నుండునో? ఇది త్రాడుయొక్క ప్రతిరూపమా? అట్లయిన దీనియర్థ మేమిగనుండునో. తరువాత, మూడుసున్నలలోనుండు

∠ 9 ५ ०५ గుర్తులకును చుక్కలకును అర్థము తెలియవలసియున్నది. పై గుర్తులనుజూడ ఇవి నాగర ములో ౮, ౭, ౫, ౫ అంకెలవలె నున్నవి. వీనిప్రయోజన మేమియో తెలియవలెను.

(౨) ఈ శాసనాంతచిహ్నమునుగూర్చిన యింకొకయూహ యేమనగా:—

ఈ చిహ్నమంతయు ఖడ్గాకృతియనియు, "ఖ" రూపము ఖడ్గముయొక్క సింహముఖమనియు (lion-head), దానివెనుకనుండు మూడువృత్తాయతములు కత్తి పిడియనియు, మూడవసున్నక్రిందినుండిపోవు గీత ప్రతాపరుద్రగజపతియొక్క రణఖణిజారచిహ్నమనియు, శత్రురాజుల బంధించుత్రాడనియు ఓఢ్రపరిబృఢగణము లోనివారును, దేశచరిత్రజ్ఞులును, సాహితీశేఖరులును, శాసనపరిశోధకులును, సంప్రదాయజ్ఞులునునగు శ్రీ విద్యాధరసింగ్ దేవ్ ఓ. యల్. గా రూహించిరి. సున్నల నడుమనుండు అంకముల యొక్కయు, చుక్కల యొక్కయు వివరణము ఇంకను సూచింపబడవలసి యున్నది.

విజ్ఞులెవరయిన ఈ చిహ్నముయొక్క సంపూర్ణ తాత్పర్యమును, దెలిపిన వంద్యులగుదురు.

ఈ వెలిచెర్ల అగ్రహారీకులకును, గ్రామరైతులకును జిరాయతిరైతుహక్కుల విషయమై వివాదములు పొసగి కావలి డిస్ట్రిక్టుమునసబుకోర్టులో అగ్రహారీకులు ౧౯౧౭ సం॥ అసలు నె ౩౮౮ రు దావాచేసియుండిరి. ఆ దావాలో అగ్రహారీకు లీ శాసనమును అర్ గుర్తు (Ex. R) గా దాఖలుచేసి జయమును బొందిరి.

# మూలము

## మొదటిరేకు : రెండవప్రక్క

౧. గణానా మధిపః పాయాత్ గండమత్తాలి నిస్వనైః । భక్తసంఘాత విఘ్నౌఘాన్
వారయన్ వార

౨. ణాననః ॥ పారావార విశృంఖలోర్మ్మిఘటలి ప్తఘ్నాం నిమగ్నాం భువం । దంష్ట్రా
గ్రేణ సము

3. ద్ధరన్ సపులకైః స్వేదోద్గమా మాత్మనః । సంసర్గానుభవేన రోమపటలి స్వేదోద
బిన్దూ

౪. నివ । క్రీడాక్రోడకళేబరోవతు సదా సప్తార్ణవీముద్వహన్ ॥ అస్తిత్రయీమూలమూ

౫. ర్త్తిరాదిత్యోమహసాన్నిధిః । అంభోజినీనాంజీవాతుర్హరేద్దక్షిణలోచనం ॥ తద

౬. న్వయాబ్ధా[1]వుదభూన్మహారాజః । కళానిధిః శ్రీకపిలేంద్రనామా । యత్కీర్త్తిచంద్రద్విత

౭. యోరిభూభృత్ । కరాంబుజాతానినిమీలయంత్తి ॥ సభూపతిర్దక్షిణభూమిపా

౮. లాన్విజిత్యవిద్రాణనపారిజాతః । అనన్యసాధారణసాహసశ్రీ ర్జగ్రాహపశ్చాత్త్యై

౯. లుంగాణదుర్గాన్ ॥ పుణ్యైస్తదీయైఃపురుషోత్తమాంశ్యా త్పుత్రోభవత్ శ్రీపురు

౧౦. షోత్తమేంద్రః । సుగంధయః స్తత్కవితావిలాసా సంఖ్యావతాంకర్ణరసాయనాని ॥

౧౧. దివానిశంతస్యమహీశ్వరస్య ప్రతాపభానౌపరిదృశ్యమానే । నాకాపగాయాంనలినానిని

౧౨. త్యం నాతిప్రఫుల్లం త్తినకుట్మలంతి ॥ పుత్రోభవత్తస్యగజేశ్వరస్య ప్రతాపరుద్రఃపరసైన్య

1. యాబ్ధౌ అనియుండవలెను.

## రెండవ రేకు మొదటి ప్రక్క

[redacted]

౧౩. రౌద్రః సగౌడరాజస్యబలానిజిత్వా। ప్రత్యగ్రహీద్రాజ్యమధిజ్యధన్వా॥ మత్తేభ
౧౪. కుంభ్యానమరేషుయస్య। దృష్ట్వాపలాయ్యస్వపురం ప్రవిశ్య। భయాకులా గౌళ
౧౫. పతిఃకదాపి। బిబ్బికుచౌనక్తిందినమాహతెస్మ॥ సభూపతిమ్మహారాజో రాజేంద్రపర
౧౬. మేశ్వరః। శ్రీమద్రాజాధిరాజేంద్రపంచగౌడాధినాయకః॥ యశశ్శ్విరకేదారొమాః
౧౭. గోవింద్గలాంచ్ఛనః। విద్యానిధిఃపాంకనాండిచొకమండలనాయకః॥ త్రిభువనతోడర
౧౮. మల్లారణబణిజారఃప్రతాపవిరవరః। శ్రీవెంక్కటగజరాజః ప్రతాపరుద్రః
౧౯. ప్రతాపమార్తాండః॥ వుండ్రకొండమహాదుర్గకటకెమణిశోభితె।
౨౦. సింహాసనెసమాసినొవిద్వజ్జనసమావృతె॥ పాత్రైఃబేహారామహా
౨౧. పాత్రైస్సామంతైపరిసేవితః। పాలయన్ పృధివింసర్వాంపురుహూ

రెండవ రేకు : రెండవ ప్రక్క



౨౨. తయివాపరః ॥ కరరామాబ్ధిశీతాంశుసంఖ్యాకశకవత్సరే । ప్ర
౨3. మోదొదన్యబ్దవరెమాసెకా_ర్తికనామని ॥ శుక్ల త్రితియ్యాదివసేభా
౨౪. గ్గవస్యచవాసరె । వుదయాచలదుగ్గస్యపూర్వభాగ్రెప్రతిష్ఠితె ॥ జ
౨౫. లదంక్యాస్థలెపాంకనాండిసిమ్నివిరాజితం । వెలిచెల్ల గ్రామరత్నంపులు
౨౬. గుళ్లనివ్వాసినె ॥ శ్రీభరద్వాజగోత్రాయయజుశ్శాఖాప్రవ_ర్తినె ॥ నారా
౨౭. యణయజ్వనఃపౌత్రాయధమ్మయస్యాత్మసూనవె । కొండ్డయద్విజరాజా
౨౮. యసమస్తగుణశొభినె । సహిరణ్యోదకైద్ధారాపూర్వంకృత్వాసమాదరాా
౨౯. త్ ॥ షట్త్రింశదావెదసకరహితంనిరుపాధికం౦ఆచంద్రార్కపుత్రపౌత్రపార
30. ంపర్యానుశాసనం ॥ అదిక్రయాదియోగ్యంచ్చసవ్వభొగసమన్వితం । ప్రాదా

## మూడవరేకు : మొదటి ప్రక్క



3౧. దుర్గాం జగన్నాథసన్నిధౌదమ్మాం వృద్ధయె ॥ తస్యగ్రామస్యశీమాచిహ్నానిశిలాస్తం

3౨. భైశిస్తక్షైయాని ॥ గ్రామంతూర్పుననదండ్లుదొవనుగుంటనురాఇన్ని ఆగ్నెయాన

33. చల్లానువిడంపుల్లలొ రాఇదక్షిణాన చెముళ్లగుంట్టనుఆపడమటికట్టువనురా

3౪. ఇన్ని నైరుతిమూలను రెవడిగుంటపడమటికొమ్మునరాఇపడమటనిల్వు రాఇవాయు

3౫. వ్యాననాంగుదండ్ల రాఇఉత్త రానపుష్పం జెర్వుతూర్పునగొమ్మునరాయిఇశాన్యాన

3౬. ముద్దులగుంట్టదండ్లనురాయిఇవిమెల్లపొలంసంజ్ఞలు ॥ యెకైవభగినిలొకెనవ్వా

3౭. షామెవభూభుజాం । నభొజ్యానకరగ్రాంహ్యావిప్రదత్తావసుంధరా । స్వద

3౮. త్తాంపరదత్తాంవ్వాయొహరేద్వసుధామిమాం । షష్టివర్షసహస్రా

3౯. ణివిష్టాయాంజాయతేక్రిమిః ॥

# నక్షత్రమండలము

(ధాతృ సంవత్సర శ్రావణ, భాద్రపదమాసములు)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు చూచి పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను. ఇందు

| | | |
|---|---|---|
| 1936 ఆగస్టునెల 8 తేదీని రాత్రి 8-55 గంటలకును, | ఆగస్టు 29 తేదీని రాత్రి 7-31 గంటలకును | చూపబడినట్లు |
| ,, 15 ,, ,, 8-27 ,, | సెప్టెంబరు 6 ,, ,, 7-3 ,, | నక్షత్రాదులు |
| ,, 22 ,, ,, 7-59 ,, | | కనబడును. |

**13.** 8- 19 ౨౭౯

"ఇదం స్వరిదమిదాస వామ
మయం ప్రకాశా ఉర్వాంతరిక్షం."

ఋగ్వేదము X. ౧౨౪.౬

ఇదిగో! చూచితిరా? మన యీభూలోకమునకు పైన అపారమైన అంతరిక్షము వ్యాపించియున్నది. ఆపయిదృశ్యము దివ్యమై ప్రకాశించుచున్నది! స్వర్గ సంబంధమైన తేజస్సుతో కూడుకొని అరంగము ఎంతో మనోహరమై ఒప్పుచున్నది.

ఈసంవత్సర శ్రావణబహుళషష్ఠి ౮-౮-౯౬ నుండి అధికభాద్రపద బహుళఅష్టమి ౮-౯-౩౬ వఱకు నసమాసములో రాత్రి తొలిజామున నాకాశమున నగపడు ఖగోళచారుల సందర్భములను పరిశీలింతము.

## పాలవెల్లి (The milky way)

"నభోరమా వక్షోజహారలతిక" అని మన కవులచే వర్ణింపబడుచుండు నీనవశదృశ్యము ఈ మాసమునందు రాత్రి తొలిజామున ఉత్తరసమీపపు ఈశాన్య దిశనుండి దక్షిణ సమీపపు నైరృతి దిక్కునకు యామ్యోత్తరరేఖను గడిచి ఆకాశమున కడ్డుగా వ్యాపించియున్నది. ఇట్లు విభాగింపబడిన ఆకాశపుఖండములు రెండింటిలో తూర్పునైపున్న ఖండము చిన్నదిగాను, పడమటి వైపున్నది పెద్దదిగాను కనబడుచున్నది. తెల్లని నురగవంటి యీ వెల్లువ మధ్య చిన్న శ్యామసీమలు రెండును, వాటికి దిగువగా నల్లని పట్టువంటి ఛాయాపథమును చక్కగా పరికింపతగియున్నవి. ఈశాన్యమున కొంత విరివిగానున్న యీ తెలుపు మధ్యశ్యామసీమల కడ సన్నగిలిసను గగనమధ్యమును సమీపించుసరికి మరల విస్తరించి వ్యాపించియున్నది. ముఖ్యముగా మూల, ఉత్తరాషాఢ ప్రాంతములందును, అ క్రింద వేదికా మండల ప్రాంతములందును తెలుపు దట్టముగానున్నది. అగ్నివేదికనుండి వెడలిన పొగయే ఇట్లు తెల్లనై ఆకాశమున తోచుచున్నదని పాశ్చాత్యగాథలున్నవి.

### First Magnitude stars

మిక్కిలి తేజోవంతమునై నక్షత్రరాజములని చెప్పదగిన ఇరువదింటిలో ఈమాసమునందు ఆరుమాత్రమే ఇపుడు కానవచ్చుచున్నవి.

అవి ఏవేవి యనగా

౧. కన్యారాశిలో చిత్ర. (Spica in Virgo.)

౨. భూతేశమరుద్గణములో స్వాతి (Arcturus in Bootes)

3. వృశ్చికములో జ్యేష్ఠ (Antares in Scorpio)

౪. వీణామండలములో బ్రహ్మ (Vega in Lyra)

౫. గరుడమండలములో శ్రవణము (Altair in Aquila)

ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut in Pisus Astralis)

ఇట్టి మేలుచుక్కలు అచట కనబడుచున్నను, గ్రహములవలన కొంత తేజోవృద్ధి కనబడుచున్నది.

## గ్రహములు

శుక్రుడు సూర్యాస్తమానముకాగానే ఆగస్టు ౮ తేదీనుండి పడమట ఉదయించుచుండును. ఈమాసాంతమున, అనగా సెప్టెంబరు ౬ వ తేదీ నాటికి మఘ, పూర్వఫల్గుని, ఉత్తర నక్షత్రముల గడచి హస్తలో నగపడును. కావున మనపటమందు చూపుటకు వీలు తక్కువగానున్నది. గురుడు జ్యేష్ఠలో వక్రగతిమాని ఋజుగతి పొంది దివ్యముగా ప్రకాశించుచున్నాడు. మనమాసాంతమువఱకు జ్యేష్ఠలో ఋజుగతి కలిగి కనబడుచుండును. శని పూర్వాభాద్రలో కొంతవరకు ఋజుగతిని, పిమ్మట వక్రగతిని పొందుచున్నాడు. మందుడగుటచేత ఇంచుమించుగా ఉన్నచోటనేయున్న ట్లగపడును. బుధ దిప్పుడు కానరాడు.

పడమటనుండి తూర్పునకు సూర్యాస్తమయమైనప్పటినుండి తూర్పునకు వరుసగా శుక్రగ్రహము, చిత్రనక్షత్రము, జ్యేష్ఠనక్షత్రము, గురు గ్రహము, శనిగ్రహము మంచి కాంతితో మెఱయుచుండ, ఉత్తరాకాశమున స్వాతి, బ్రహ్మ, శ్రవణ నక్షత్రములును, ఆగ్నేయమున ఇంద్రద్యుమ్నుడును చక్కగా వెలుగుచు, ఆకాశరంగముయొక్క శోభను వృద్ధిచేయుచు రమ్యముగా తోచుట గమనింపతగియున్నది.

## ఉత్తరాకాశమున

ధ్రువక్షితిలో, చిన్న ఎలుగుతోక చివరను ధ్రువుడు మెఱయుచున్నాడు; తోకలో కశ్యప, మహేంద్రులును, తోకమూల అగ్నియు, అగ్నికెదురుగ మిత్రుడును, వీరి కెదురుగా ధాతవిధాతలును అగపడుచున్నారు.

వాయవ్యదిశను విఘ్నేశ్వరు డస్తమించినాడు. పెద్ద ఎలుగులో క్రతు, పులహ, పులస్త్య, అత్రి, ఆంగీరస, వసిష్ఠ, మరీచి- అను సప్తఋషులును త్వరలో అస్తమింపబోవుచున్నారు. రెండు ఎలుగుల మధ్యను నరకాసురుడు ఘోరసర్పాకారముతో మెలికలు తిరిగి మెఱయుచున్నాడు.

ఈశాన్యమున పాలవెల్లిగా నుద్భవించిన అప్సరసలు ఇపుడే బాగుగా ఉదయించి మెఱయుచున్నారు. ధ్రువక్షితినుండి వెలువడి ఊర్వశీ పురూరవసులు పాలవెల్లిలోనికి వ్యాపించి మెఱయుచున్నారు.

## పడమట

మఘ, పూర్వఫల్గునీ నక్షత్రము లస్తమించినవి. ఉత్తర ఫల్గునీ నక్షత్రములు మాత్రము కనబడుచున్నవి. అందును దక్షిణమునకున్న చుక్క ఎక్కువ తేజస్సుతో మెఱయుచున్నది.

ఉత్తరఫల్గుని కెగువ హస్త నక్షత్రమునందలి చుక్కలు చక్కగా కానవచ్చుచున్నవి. హస్తముక్కలు క్రాంతివృత్తముపైగాక ఆ క్రిందను దక్షిణముగానున్న వార్తికము (Corous) చుక్కలని చాలమంది అభిప్రాయము కలిగియున్నట్లు కనబడుచున్నది. ఈ యంశము స్పష్టముచేయుటకు ఈ ప్రక్కను కన్యారాశియొక్క పెద్ద పటమును, ఆ సమీప నక్షత్రగణములయొక్క స్థానములను వివరముగా చూపుచు నిచ్చుచున్నాను. 'హస్తా పాణినాంపంచ' అను వర్ణనమును గమనించి, క్రాంతివృత్తసమీపముననే కానవగు నీ నక్షత్రసమూహము నిట పొందుపఱుచుచున్నాను. ఆ దిగువనున్న వార్తికపు (Corvus) - పక్షి వ్యూకము నోటబడకుండ అశ్వినీదేవతలచే రక్షింపబడినట్లు పెక్కుఋక్కులుగలవని ఈవఱకె మనము చూచియున్నాము. హస్త సువర్ణహస్తమువలె మెఱయుచు సవితృదేవతాకమై ఒప్పుటకూడ చూచియున్నాము. ఈ Corvus ఎప్పుడును హస్తకాదాలదనియు, హస్తరూపము పటములో సూచింపబడినట్లు ప్రత్యక్షగోచరమనియు నా విన్నపము. మఱియు "కన్య" అగ్నికుండ సముద్భవ, అయోనిజ అని మన మనేకసారులు ప్రశంసించియుంటిమి. తులారాశిలో ఇంద్రాగ్ని దైవత్యమై కులాల చక్రము వంటి గుండ్రని ఆకారముతో నొప్పు విశాఖ అను అగ్నికుండమునుండి కన్య సముద్భవించుటకూడ ఈ పటమందు చూడనగును. కన్య పరిసరమునగల భూతేశ, మరుద్గణములను (Bootes), కన్యయొక్క వేణి యని చెప్పదగిన Coma Berenices కేశీమండలమును, దిగువ అహీనహుపాదులను కూడ ఈ పటమున చూడనగును.

## దక్షిణాకాశమున

అశ్వతర మండలము కొంత అస్తమించినది. కొంతమాత్రము కాననగుచున్నది. అశ్వినుల ఈటె పోటుచే సుక్కిన వృకమును త్వరలో అస్తమింపనైయున్నది. బహు యజ్ఞములు చేసిన బలిచక్రవర్తి ఇంకను యజ్ఞవేదికపై హోమము చేయుచుండ దట్టముగ వెడలిన పొగయే యీ ధవళరూపమున నడచెనా అని పించుచు, మూల, ఆసాఢా నక్షత్రప్రాంతముల నతిసాంద్రమై "పాలవెల్లి" తోచుచున్నది. ఆ ప్రక్కనే బలిగంశజుడును, మయూరచిహ్నము కలవాడును నగు బాణాసురుడున్నాడు.

## తూర్పున

మీనరాశి రెండుచేపలలో నొకటి ఉదయమైనది. ఆదిగువ కుంభరాశిలో శని మెరయుచున్నాడు. ఆగ్నేయమున ఇంద్రద్యుమ్నుడును, కుంభమున శనియు జోడుగా వెలుగుచున్నారు. కుంభరాశి కధిపతియైన వరుణునిగూర్చిన ఈ క్రింది స్తుతివాక్యము ఋగ్వేదము నుండి ఎత్తి వ్రాయుచున్నాను.




"కవిః కవిత్వాది విరూపమాస
జద్రప్రఘాతీ వరుణో నిరపః
సృజత్ క్షేమంకృణ్వా......"౧౦-౧౨౪-౩.

"ఓ వరుణుడా! కవి ఆకాశమునందు తన బుద్ధి బలముచేత రూపము నిశ్చయించుచున్నాడు. ప్రమాదము లేకుండ క్షేమముగా జలములను ప్రవహింపనిమ్ము"— వర్ష ఋతువగు శ్రావణ భాద్రపద మాసములలో, ఇప్పటి వలె ఉత్తరహిందూస్థానమున వర్షము లధికమై వరద పొడిచి జలప్రళయమైనపుడు వేదఋషు లిట్టి ఋక్కులచే జలస్థానమున కధిపతియైన వరుణుని ప్రార్థించెడి వారు

ఈశాన్యభాగమున పాలవెల్లి కెరలు ఇంద్రమద ఇపుడే తోచుచున్నది. ఆప్రక్కనే పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములతో కూడిన పెగసస్ చతురస్రము (Square cf Pegasus) కలదు. దీనినే వేదకాలమునాడు అహిర్బుధ్న్య మనుచుండిరి.

## మధ్య నక్షత్రములు

ఒకప్రక్క వాయుమూర్తి (స్వాతి) యును, రెండవప్రక్క గరుడమూర్తి (శ్రవణము)యును సేవింప పాలసముద్రమున (Serpens శేషునిపై పవ్వళించిన శ్రీ మహావిష్ణువు ఇపుడు గగనమధ్యరేఖదాటి పడమటికి వ్రాలియున్నాడు. విష్ణుని నాభికమలసంజాతుడును, వీణాధారిణియైన వాగ్దేవి సరస్వతి (Lyra) ముఖమున నిడుకొన్నవాడునగు బ్రహ్మ గగనమధ్యరేఖను సమీపించుచున్నాడు. ఈదంపతులకు వాహనమని వర్ణింపబడు హంసము-రాజహంస Cygnus- పాలవెల్లిలో తేలియాడుచున్నది. ధావళ్యమునుబట్టి క్షీరసముద్రముగా భావించుకొనుచున్నను, ప్రాచీన వాఙ్మయమున

నిది స్వర్గాపగ-ఆకాశగంగయనికూడ వ్యవహరింపబడుచుండెను. దివిజగంగాతరంగములలో నీరాజహంస చరించుటను గూర్చిన వర్ణన యొకటి ఋగ్వేదమునుండి యీ క్రింద చూపెనగును:—

ఋగ్వేదము X. ౧౨౪-౮.

“బీభత్సూనాం సయుజం హంసమాహు
రపాం దివ్యానాం సఖ్యే చరంతం.

దివ్యాపగతో సఖ్యముచేసి చరించుచున్న రూపము హంస అని చెప్పెదరు. ఈ హంస బీభత్స స్వరూపముగల జలములతో కలిసి చరించును.

ఈ హంస స్వరూపములో కానవచ్చు ముఖ్యమైన చుక్కలు ఒక శిలువవంటి రూపమును స్ఫురింపచేయును కావున పాశ్చాత్యులు వాటిని రాజహంస యొక్క శిలువచుక్కలు అని చెప్పుచుందురు (Cros of Cygnus).

పాలపల్లికి తూర్పుగా నారదాములును, శ్రవణమున కావల వసుదేవతాత్మకమైన ధనిష్ఠచుక్కలును కలవు.



త్యాగరాజస్వామి దేవాలయ సరోవరమున తెప్పలు. తిరువారూరు. A. A.



# కలగూరగంప



## ఔరంగజేబు—అతని అసామాన్య ప్రేమ : మరణ శాసనము

౯౦ సంవత్సరాలు జీవించి, మొగలాయీ సామ్రాజ్యము గడగడలాడునట్లు పరిపాలించి, హిందూమత విధ్వంసమునకు కంకణము కట్టుకొని, మహమ్మదీయులలోనే సున్నీ తెగవారలను హింసించి, తన కుమారులచేత గూడ ద్వేషింపబడి కష్టములనేకాని సుఖమెరుగని ఔరంగజేబు చక్రవర్తి ౧౭౦౭ సం. మార్చి ౩ వ తేదీన చనిపోయెను. ఇతనిలో సుగుణ, దుర్గుణములు అతిశయించినవి.

రాజ్యవ్యవహారములను ఇతడు స్వయముగా చేసికొనువాడు; కటికినేలను చాప పరుచుకొని పరుండువాడు. దినమునకు ౫ వేళలను నమాజుచేయువాడు. మద్యమును వాసనమూసి యెరుగడు. ప్రతిమహజరును స్వయముగా చదువుకొని ఉత్తరువులను తానే వ్రాయువాడు. మంత్రులకు, సేనాపతులకు ప్రతి స్వల్పవిషయమునను సలహా నిచ్చుచుండెడివాడు అతిధైర్యశాలి. దినమునకు మూడుగంటలు మాత్రము నిద్రపోయి, తక్కిన కాల మంతయు నేదో ఒక కార్యమున నిమగ్నుడైయుండెడివాడట. రాజకీయములలోను, కట్టుబాటులలోను చాల శ్రద్ధ తీసుకొనువాడు. ఇన్ని సుగుణము లున్నను ఇతనికి దయ యను మాట లేదు. అన్నిప్రక్కలను ఇతనికి శత్రువులే. ఇతడు ప్రతివానిని అనుమానించినట్లే ప్రతివాడును ఇతని ననిన అసహ్యించుకొనువాడు. మతమౌఢ్యమే కారణముగా, హిందూమతముపై నితడు దాడి సలుపుట మొగలాయీ సామ్రాజ్యనాశనమునకు పునాదియైనది. దేనిని ఖ్యాతిగాంచిన అక్బరుచక్రవర్తి మహాసామ్రాజ్యమును నిర్మించెనో దానినే చెడగొట్టి యితడు సామ్రాజ్యనాశనమునకు కారకుడయ్యెను.

ఔరంగజేబు తన ముగ్గురు సోదరుల చంపించి రక్తపు కాలువలను దాటి సింహాసన మెక్కినాడు. తన అయిదుగురు కుమారులలోనలుగురిని ఎప్పుడో జైలులో నుంపించినాడు. తన మార్గమునకు ఆటంకమని తోచిన ప్రతివానిని హింసించి చంపినాడు. ఇరువదేండ్లవాడగు యితని పుత్రుడగు సుల్తానును చచ్చువరకును ఒకప్పుడు జైలులో నుంపించినాడు.

ఇటువంటి విచిత్రస్వభావము, రాతివంటిగుండె గల్గిన, ఆర్గురు బిడ్డలు పుట్టిన తరువాత, తన ముప్పదియైదవయేట-అతడప్పుడు దక్షిణదేశమునకు రాజప్రతినిధిగా నున్నాడు. అతని పినతల్లిగారి జనానాలోని యొకపాటకత్తెను అసామాన్యముగా ప్రేమించెను. అది చాల విచిత్రము! ఈ విషయము చరిత్ర గ్రంథములందు పేర్కొనబడలేదు. అతడొకసారి తన పినతల్లిగారి యింటికి వెళ్లుట సంభవించెను. హీరాబాయి యను నొక పాటకత్తె తోటలో సమీపమున తిరుగుచున్న ఇతనిని గమనింపక పూలుగోయుచుండుట నితడు చూచెను. ఆమె రూపము, నడక, భావప్రకటనలకు అతనిమనసు పరిపూర్ణముగా వశమైనది. అతడామెను ప్రేమించెను. సిగ్గువిడిచి పట్టుదలతో అతడామెను తన పినతల్లిగారి జనానానుండి లేవదీసుకొనిపోయెను. ఇంద్రియనిగ్రహము నతడప్పుడు కనపరుచలేకపోయెను. ఆమె మద్యపాత్రను తీసుకొనివచ్చి త్రాగుమని చేతికందివ్వ, అతడు నిరాకరించలేక మద్యమునెడ తనకు గల అసహ్యమునంతయు నడచుకొని దానిని త్రాగుటకు సిద్ధపడినాడు. కాని యామె మద్యపాత్రను లాగుకొని క్రింద పడవైచి 'నా ఉద్దేశము మీ ప్రేమను పరీక్షించుటయే. హేయమగు ఈ మద్యముతో మీ పెదవులను కలుషితముచేయుట కాదు' అని చెప్పినది. ఈ విషయము 'వజీర్-ఉల్-ఉమారా' అనుగ్రంథమందున్నది.

హీరాబాయి చాలలేతవయసులోనే చనిపోయినది. అతడామెకొరకు మిక్కిలి దుఃఖించెను.

రాజమహలులోని పెక్కురు చనిపోయిరి. అతడు జీవించియేయుండెను. తన కుమారులే తనచావు నెదురు చూచుచుండ, బ్రతికిన ప్రతి నిముషమును మొగలాయీ

సామ్రాజ్య వినాశమునకు కారణమగుచుండ నతడు జీవించెను.

అతడు చనిపోవునపుడు మొగలాయీ సామ్రాజ్యమును తన కుమారు లెటు పంచుకొనవలయునో సూచించుచు నొక కాగితమును వ్రాసి పెట్టుకొనెను. కాని వారు దానికి కట్టుబడియుందురా? ఏబదిసంవత్సరములకు పూర్వము షాజహాను చక్రవర్తియే అట్లొనర్చిన యెడల ఔరంగజేబు దానికి కట్టుబడియుండెడివాడా?

౧౭౧౭ సం. మార్చి ౮ వ తేదీన ఈచక్రవర్తి చనిపోయెను. ఇతడొక మరణశాసనమును గూడ వ్రాసియుండెను. ఇతని స్వభావము తెలియుటకు అందలి సూచనలు కొన్ని ఈక్రింద నివ్వబడినవి.

ఒకటవది—పాపాత్ముడ నగు నాపక్షమున పవిత్రుడగు 'హసాన్' గారి గోరీమీద నొకతెల్లని చలువదుప్పటమును కప్పుడు. ఏలనన పాపసముద్రములో మునిగినవారికి ఆతనిరక్షణమే శరణము.

రెండవది—నేను కట్టి, అమ్మిన టోపీల బాపతు ౮-౨-౦ మహల్దారు ఆలీబేగ్ వద్ద నున్నది. ఆధనమును నాకొరకు ఖర్చుపెట్టుడు. ఖురానును వ్రాసి అమ్మిసంపాదించినవి. ౩౦౫ రూపాయలున్నవి. వానిని ఫకీరులకు పంచిపెట్టుడు. ఆధనమును నాకొరకు ఖర్చుపెట్టవలదు. ఏలనన ఖురానును వ్రాసి సంపాదించిన ధనము అన్యాయార్జితమని షియా తెగవారి నమ్మకము.

నాలుగవది-నాతలకు కుళ్ళాయిలేకుండా పూడ్చిపెట్టుడు. పాపాత్ములు ఉత్తితలతో తనదగ్గరికి వచ్చినపుడు భగవంతుడు వారిని కరుణించును. నాశవపుపేటికపై తెల్లని ముతికగుప్పటమును కప్పుడు. దానిపైన ఛత్రమును కట్టవద్దు. సంగీతము పాడవద్దు.

పదునొకండవది: ఎవరును నీకుమారులను నమ్మవద్దు. మీ జీవితములో నెప్పుడును వారిని గారాబముగా పెంచవద్దు. రాజులచిత్తములు చంచలము లను మాట మరువకుడు.

పండ్రెండవది: రాజ్యపరిపాలనమునకు మూలాధారము మంచివేగు. ఒక్కక్షణ మేమరియుండిన కలుగు నష్టమునకు జీవితపర్యంతము విచారించవలసియుండును. శివాజీ తప్పించుకొనిపోవుటకు నా అజాగ్రత్తయే కారణము. అది నాకు తీరనినష్టమును కలిగించినది.

ఈ పెక్కంశములవలన ఔరంగజేబు చనిపోవునప్పటికి అతనియనుభవ మెట్టిదో స్పష్టముగా తెలియుచున్నది. అతడుచేసిన కొన్నిపొరపాటుల కతడు చాల విచారించినాడు. ఏమైనను మొగలాయీ సామ్రాజ్యనాశనమునకు కారణమీతడే.

'చక్రవర్తి'

## రూటరు వార్తాహార సంఘవృత్తాంతము

ఇది చాలవిచిత్రమైన వృత్తాంతము..౧౮౫౫ సం. అక్టోబరునెలలో ఒకనాటి ఉదయము లండనులోని గొప్ప దినపత్రికలలో నొకటగు 'మార్నింగ్ ఎడ్వర్ టైజరు' అను పత్రికా కార్యస్థానములోని సంపాదకుని గదిలోపలి కొక అపరిచితుడు ప్రవేశించెను. అతడు మృదువుగా 'నా పేరు రూటరు; బహుశా మీరు దానిని వినియుండరు' అనుచు సంపాదకునితో పరిచయము కలుగజేసికొనెను. సంపాదకుడును 'గ్రాంటు' మెల్లగా 'అంతటి భాగ్యము నాకు పట్టలేదు' అని బదులు పలికెను.

"నేను ప్రష్యను దేశీయుడను. ఈ లండనులోని ఐరోపీయసంస్థలకు, కొన్ని సంవత్సరములనుండి వార్తాహరుడుగా పనిచేయుచున్నాను. అందువలన, పెక్కు ఐరోపీయ ప్రభుత్వములకు సంబంధించిన చాలమంది పెద్ద మనుష్యుల పరిచయము నాకు కలిగినది. విద్యుత్తంత్రుల సాహాయ్యమున సప్రమాణములగు వార్తలను ప్రస్తుతము మీ కందు వార్తలకంటె చాల త్వరగా అందజేయగలను. ముఖ్యమగు సంగతి చాల తక్కువ ప్రతిఫలమునకు. ఇక్కడకు వచ్చుటకు పూర్వము "టైమ్సు" పత్రిక సంపాదకునితో కూడ మాట్లాడితిని" అన్నాడు రూటరు.

"అత డేమనినాడు? ఆవిషయము నాకు కావలయును. ఏలనన, 'టైమ్సు' ఇంగ్లండులోనే కాక

యూరపుఖండమున కంతటికిని ప్రముఖమైనపత్రిక" అని నాడు గ్రాంటు. "అతడు సరిగా నేమియు చెప్పలేదు. తనపనిని తాను ఇతరులకన్న బాగుగా చేసుకొన గలుగుదునన్నట్లు ఏమో చెప్పినాడు. అది నాకు అవసరము లేదన్నట్లు నాకు తోచినది." అన్నాడు రూటరు.

ఆరోజులలో విదేశీయ వార్తాగ్రహణమునకు 'మార్నింగ్ ఎడ్వర్‌టైజరు'నకు నెలకు ౪౦ పౌనులు అగుచుండెడిది. రూటరు సప్రమాణములైన విశిష్టములైన వార్తలను నమ్మకముగా ముప్పదిపౌనులకే అందజేయుటకు ఒప్పుకొనెను. నెలకు పదిపౌనుల ఆదా ఆరోజులలో అది సాధారణవిషయము కాదు. అయినను గ్రాంటు తటపటాయించుట చూసి, రూటరు 'నేను ఒప్పుకొనిన తక్కువప్రతిఫలము మీరు సమ్మతి కలిగించవచ్చును. అయినను ౧౫ దినములవరకు వార్తలను మీకు ఉచితముగా అందజేయుదును' అన్నాడు.

తరువాత ఇరువురును కలసి బేరమును స్థిరపరచుకొనిరి. సవిస్తరముగా నే లండనులోని 'డైలీ టెలిగ్రాఫ్', 'స్టాండర్డు', 'మార్నింగుపోస్టు' మొదలగు అన్నివార్తాపత్రికలకును, ఒక్క టైమ్సు తప్ప-అందజేయుటకు రూటరు ఒప్పందముల జేసికొన్నాడు. కొంతకాలము గడచిన తర్వాత 'టైమ్సు'పత్రికా సంపాదకుడు రూటరు వార్తలను తీసుకొనుటకు తనంతతానే మనసు మార్చుకొనవలసివచ్చెను.

ఇది ఇప్పుడు ప్రపంచములోని అన్ని భాగముల నుండియు సరియగు వార్తలను విద్యుత్తంత్రుల మూలమున ...లకు ప్రతి వార్తాపత్రికకును అందజేయుచున్న రూటరు వార్తాసంఘపు జన్మవృత్తాంతము.

ఇప్పుడు రూటరు సంఘమునకు ప్రతినగరమునను బ్రాంచి ఆఫీసు లున్నవి. అందు పనిచేయు ఉద్యోగులకు ఎక్కువ జీతములు ముట్టుచున్నవి. రూటరువార్తాహరులకు మహారాజులతోను, చక్రవర్తులతోను, గొప్ప గొప్ప దేశీయ నాయకులతోను సంబంధపరిచయము మున్నది.

ఈసంఘపు అభివృద్ధి దినదినమునకు ఎక్కువగుచున్నది.

'చక్రవర్తి'

## లిన్‌లిత్‌గో ప్రభువు

౧౯౩౬ సం. ఏప్రిలు నెలలో లిన్‌లిత్‌గో ప్రభువు ఇండియాకు రాజప్రతినిధిగా వచ్చినాడు. లిన్‌లిత్‌గో ప్రభువు ఇంటి పేరు హోప్ (Hope). ప్రస్తుతపరిస్థితులనుండి విముక్తత గాంచుటకు ఆశించుచున్న హిందూదేశమునకు 'ఆశ' అనే యింటిపేరుతో రాజప్రతినిధి వచ్చుట కొంతవరకు ఆశకు కారణమే. కస్తూరివారివలె యింటిపేరేకాక లిన్‌లిత్‌గో ప్రభువు స్వభావము, ఆశయము హిందూదేశ ప్రజలకోరికకు తగినవిగా నున్నవి. ఆశయములను మనసులోను, వాగ్రూపమునను పూర్తి చేయకుండ ఆచరణలో చూపించుటవలన భారతీయులకు లిన్‌లిత్‌గో ప్రభువు పరిపాలన కాలములో కొంత మేలు జరుగవచ్చునని ఆశమూన జనించుచున్నది.

లిన్‌లిత్‌గో ప్రభువు విక్టోరియా మహారాణిగారి జూబిలీవత్సరమగు ౧౮౮౭ లో జన్మించెను. బ్రిటిషు సామ్రాజ్య చక్రవర్తికి ప్రతినిధిగా జార్జి చక్రవర్తిగారి జూబిలీవత్సరమగు ౧౯౩౫ లో నియమింపబడెను.

లిన్‌లిత్‌గో ప్రభువు స్కాట్లండు దేశీయుడు. వీరి ౨౧ సంవత్సరమున, తండ్రి చనిపోగా ప్రభువు బిరుదము, ఆస్తి అంతయు ఈయనకు చెందెను.

ఈయనకు చక్కని వ్యవహారజ్ఞానము గలదు. బ్యాంక్ ఆఫ్ స్కాట్లండు మొదలగు ముఖ్యమైన కంపెనీలకు డైరెక్టరు. ౧౯౨౨-౨౪ వరకు ఎడ్మిరాలిటీలో 'సివిల్ లార్డు యూనియనులిస్టుపార్టీ'కిడిప్యూటీఛైర్మను. స్కాట్లాండులోని 'రాయల్ ఫైన్ ఆర్ట్సు కమిషను'నకు సభ్యుడు. సైన్యములో పనిచేసినాడు. వ్యవసాయములో ఆరితేరినచేయి. లిన్‌లిత్‌గో షైరునందలి, యీ గవర్నరు జనరలుగారి పొలము, బ్రిటనులోని చక్కనిపొలములలో నొకటి.


ఐరిష్ ఫ్రీస్టేటు ప్రెసిడెంటు, డివాలెరా


డివాలెరా సతి


డివాలెరా సుత

ఈయనకు హిందూదేశపు వ్యవహారములను గురించి బాగుగా తెలియును. ఇండియన్ ఎగ్రికల్చరల్ కమిషనునకు ఛైర్మనుగా వచ్చినాడు. అంతేకాక హిందూదేశములో పనిచేసివెళ్లిన ప్రతి రాజప్రతినిధితోను, ఇంగ్లండుకుపోయిన ప్రతి భారతదేశ సంస్థానాధిపతితోను సంప్రతించి హిందూదేశమును గురించి బాగుగా తెలిసికొనినాడు.

సర్ ఫ్రెడరిక్ మిల్నరుగారి కుమార్తెయగు లిన్‌లిత్‌గో సతి తనవివాహమైన ౨౮ సంవత్సరముల లోను, ఒక్క దినమునుగూడ తనభర్త వృథాగా గడుపుట చూడలేదని చెప్పినది.

లిన్‌లిత్‌గో ప్రభుని యిద్దరుకుమారులు, ఎరల్ ఆఫ్ హోప్ టౌన్ (Earl of Hopetown), ఆనర బల్ జోన్. ఏ. హోప్ (Hon. John. A. Hope) ఇరువదినాలుగు సంవత్సరముల కవలలు. కుమార్తెలు ముగ్గురిలోను లేడీ ఆనీ (Lady Anne)కి ౨౧ సంవత్సరములు; లేడీ జోన్ (Lady John) నకు ౨౦ సంవత్సరములు; లేడీ డోరీన్ (Lady Doreen) నకు ౧౬ సంవత్సరములు వయస్సు.

లిన్‌లిత్‌గో ప్రభువునకు వ్యవసాయ పరిశ్రమలందు గల ప్రత్యేకాభిమానము పశుగణాభివృద్ధికొరకై ఆయన తీసుకొనుచున్న శ్రద్ధవలన తెలియుచున్నది. ఆంబోతులకు అచ్చుపోసి వదలిపెట్టించుట, పిల్లలకు ఉచితముగా ఆవుపాలనిచ్చునట్లు మ్యునిసిపలు సంఘము వారికి సలహాలనొసగుట ప్రశంసనీయము.

౧౯౩౬ సంవత్సరముల కాలములోను తన కష్టనివారణము కలుగునని భారతదేశపు రైతు ఆశించుచున్నాడు.

'చక్రవర్తి'


పోర్టుబ్లే జైలు. అండమాను ఇక్కడి శిక్షి శిక్షలో నాదిమభాగము ననుభవిం

## అండమాను దీవులు

అండమానుదీవు లనగా భారతీయులు ద్వీపాంతరవాసశిక్షను అనుభవించు దీవులనుట ప్రసిద్ధవిషయము.

'అండమాను' పదము 'హనుమాన్' పదమునుండి పుట్టినదని తలంపబడుచున్నది. అండమానుఆదిమనివాసులు సంకరములేని ప్రాచీన మనుష్యజాతులలోనివారు. ఏషియా ఆగ్నేయభాగమున నేడు నివసించు జాతులలో ప్రాచీనము జాతికంటె పూర్వమే వీ రక్కడ నున్నవారు. అప్పటప్పటి జనాభాలెక్కలనుబట్టి యీజాతి క్రమముగా. క్షీణించుచుండుట గోచరించుచున్నది. ఈ క్రమమునను సరించి యీ జాతి యీ శతాబ్ది యంతమునకు నామావశేషము కాగలుగుననుట సంభావ్యము. ఈ దీవు



౨. వినాశోన్ముఖమగు అండమాను జాతికిచేరిన వ్యక్తి.

లకు రాజధాని "పోర్టుబ్లేరు". ఇది కలకత్తాకు ౭౮౦ మైళ్ల దూరమున నున్నది. 'ఆర్కిబాల్డు బ్లేరు' అనువాతడు బంగాళాఖాతమున ఓడలదోపిడిని నివారించుటకు దీనిని ౧౭౮౯-వ సంవత్సరమున నిర్మించినాడు. ద్వీపాంతరవాసశిక్ష ననుభవించువారల కిది ౭౭ ఏండ్ల క్రిందట స్థానముగా చేయబడినది. ఇక్కడ సముద్రతీరమున మనోహరములగు టెంకాయతోట లున్నవి.

ఈ దీవులలో కొండలు, గుట్టలు చాల కలవు. లోయలు చాల యిరుకయినవి. అడవులు కారుకొని యున్నవి. కావున కలప అత్యధికముగ నిచట దొరకుచున్నది. కోతకలప యిక్కడనుండి యూరపు, ఇండియాదేశములకు మిక్కిలిగా ఎగుమతిచేయబడుచున్నది. ఇచటి ప్రకృతిదృశ్యములు అత్యంతము రమణీయములు.

ఇక్కడ ప్రకృతము శిక్షితులసంఖ్య- పూర్వము వారి సంఖ్యయే అధికము - చాల తగ్గిపోయినది. ద్వీపాంతరవాసశిక్ష ననుభవించుటకు శిక్షితుల నిక్కడకు పంపు పద్ధతి యిపుడు మానివేయబడుటయే యిందుకు కారణము. ఇపు డిక్కడనున్నవారిలో పూర్వశిక్షితులే అధికాంశము. క్రమముగా బర్మావారి సంఖ్య పెరుగవచ్చునను సూచనలు కలవు.

---

## కీ. శే. కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు



వీరు సంస్కృత పండితులు; కవులు; శ్రీ రమణ మహర్షికి శిష్యులు. సంఘ సంస్కరణము నఖిల

షించువారే కాక ఆచరణకును దెచ్చినవారని శ్రీరమణ మహర్షి శిష్యులగుటవలన స్పష్టమగుచున్నది.

## శ్రీ. వావిలికొలను సుబ్బారావుగారు



సుప్రసిద్ధకవియు, భక్తుడునునగు ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు ఆగస్టునెల 1 తారీఖున స్వర్గస్థులైరి. వీరు 1863 సం॥ జనవరి 28 తారీఖున జననమందిరి. రామాయణాద్యనేక గ్రంథములను వీరు రచించి కవులలో నగ్రస్థానము వహించిరి. వీరు వ్రాసిన ఆంధ్రవాల్మీకి రామాయణము ఉత్తమ గ్రంథములలో నొక్కటిగా ప్రసిద్ధిగాంచినది. భక్తిసంజీవనియను పత్రిక నొకదానిని వీరు నడుపుచుండిరి. వీరు ప్రెసిడెన్సీ కాలేజియందు పండితులుగా నుండి ఉపకారవేతనము గైకొనిరి. వీరు స్వగృహమగు 'శ్రీరామ జయమందిర మున 73 యేట పరమపదము నొందిరి.

## లండనులోని భారతీయ విద్యార్థులు

[లండనులోని భారతీయ విద్యార్థి సంఘము యొక్క పదునేడవ వార్షికోత్సవ సందర్భమున ప్రకటింపబడిన విషయాలు.]

౧. భారతీయవిద్యార్థి సమితి అని పిలువబడే యీ సంఘం భారతీయ జాతీయతను ప్రకటించే స్వచ్ఛమైన సంఘంకాదు. ఇది కేవలం భారతీయ విద్యార్థులను అదుపాజ్ఞలలో ఉంచుటకు ఏర్పడ్డ వై. యమ్. సి. ఎ. వారి నిర్బంధయుక్తమైన సంస్థ. భారతీయ విద్యార్థులు జాతీయతతో కూడిన యితర విద్యార్థి సంఘాల్లో జేరకుండా ఉండడానికి యెత్తిన పన్నగడ.

౨. ఈ సమితిని పరిపాలించుట కేర్పడ్డ సంఘంలో పెక్కుమంది సభ్యులు ఆంగ్లేయులు. వారికి బ్రిటిష్ దేశంలో నివసించే భారతీయుల కష్టసుఖాలు తెలియనే తెలియవు.

3. పరిపాలనవర్గంలోని నిరంకుశసభ్యులు దృష్టిబొమ్మవంటి భారతీయ కార్యదర్శియొక్క సలహాలతో (కేవలం నామకః) పరిపాలిస్తారు. ఆదృష్టిబొమ్మ విద్యార్థిసహాయసమితి అని పేరూ ఊరూ లేని మఱి యొక సమితి సహాయంతో చిన్న చిన్న పనులు నెమ్మదిగ చేస్తాడు.

౪. ఎవరైనా స్వాతంత్ర్యబుద్ధితో ఏదైనా న్యాయవిషయంలో కార్యదర్శి అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రసంగిస్తే యావత్పరిపాలకవర్గము అతనికి ఎదురుతిరుగుతుంది. (ఆంగ్లేయ సభ్యుల మెజారిటీ)

౫. బర్మా, చైనా, ఆఫ్రికా, యూరప్ విద్యార్థులు అసంఖ్యాకములగు యువజనవిద్యార్థి సంఘాలలో విచ్చలవిడిగా పూనికతో ప్రపంచ విషయాలను గూర్చి చర్చించుకొనుచుండ ఒక జైళ్లులమారి పద్ధతి మూలాన్ని భారతీయుల కట్టి యవకాశాల్ని చిక్కనిచ్చుటలేదు. మీదుమిక్కిలి ౫౦౦ భారతీయ విద్యార్థులు ఈ సంఘంలో సభ్యులుగా ఉండి సాలుసరికి ప్రతి సభ్యుడు ఒక పౌను, ఐదు షిల్లింగుల చొప్పున చందా నిస్తున్నారు.

౬. కాబట్టి భారతీయ విద్యార్థుల కనుకూలంగా వుండే ప్రత్యేకసంఘాన్ని స్థాపించుకోడానికి ప్రయత్నం చేయాలి. (మే-జూన్ ఇండియన్ పత్రికనుండి)

ఆ. సూ.

రాబిన్ చటర్జి



౬౩ గంటలసేపు విసువకుండ నీటియందు ఈదిన వారు. ఈదునపుడు వీరిచేతులు కట్టబడియుండినవి. ప్రపంచమున వీరికంటె ఎక్కువకాలము ఈదినవారిప్పటి కింకనెవ్వరు కానరారు.

---

## స వి తా దే వి

ప్రబంధకవుల వర్ణనలకు సరిపొయ్యే రూపంగల ఈ సవితాదేవి ౧౯౧౩ సంవత్సరంలో, కలకత్తాలో గౌరవముగల ఆంగ్లోయిండియన్ కుటుంబంలో పుట్టింది. బాల్యంలో ఆంగ్లవిద్య బాగా అభ్యసించింది. దాంతో పాటు హిందీ, వంగభాషలనుకూడా క్షుణ్ణంగా నేర్చుకుంది. తన ౧౬ వ ఏట సినిమారంగం ప్రవేశించి 'Flesh and flame' అనే మూవీలో నటించింది. అదే ఆమెనటించిన మొదటిచిత్రం. తరువాతినూ కొన్ని మూవీల్లో నటించింది.

టాకీలువచ్చాక సవితాదేవి సాగర్ మూవీటోన్ వారి చిత్రాల్లోనే స్థిరంగా నటించుతోంది. హిందీ ముద్దొచ్చేట్టుగా గడగడా మాట్లాడుతుంది. భావప్రకటనలో ముగ్ధత్వం ఎక్కువగా కనబడుతుంది. ఒక్క విచారంతప్ప తక్కినభావాలన్నీ అతిచమత్కారంగానూ, మిక్కిలి నేర్పుతోనూ ప్రదర్శిస్తుంది.

ఇంతవరకు సవితాదేవి కొన్ని చిత్రాల్లోమాత్రమే నటించింది. అవి 'సిల్వర్ కింగ్', 'ల్యూర్ ఆఫ్ ది సిటీ', 'వెంజన్స్ యీజ్ మైన్', 'ఎడ్యుకేటెడ్ వైఫ్', 'ఫర్ బిడెన్ బ్రైడ్', 'డాక్టరు మధురికా', 'జీవనలత'లు.

'డాక్టరు మధురికా' అనేచిత్రం బొంబాయిలో వరుసగా ౧౩ వారాలూ, కలకత్తాలో ౯ వారాలూ ప్రదర్శింపబడింది. ఆమె నటించిన చిత్రాల్లోకల్లా 'డాక్టరు మధురికా' చాలాబాగుందని మెప్పుపొందింది. ఆమెకూ ఆమెతోపాటు ఆఫిలింలో నటించిన మోతీలాలుకూ ఉజ్జీ సరిపోయింది. వాళ్ళిద్దరి సంభాషణా, భావప్రకటనా, చిత్రంలో చాలా సొంపుగావుంటాయి. వాళ్ళిద్దర్నీ ఫిలింలోచూస్తే ముచ్చటేస్తుంది. ప్రస్తుతం సవితాదేవికి జీతం ౨,౦౦౦ రూపాయలకు పైన. ఆమెకు సంగీతంలో అంత నేర్పులేకపోయినా పాటా, కంఠమూ మధురంగా వుంటాయి.

ఇటీవల మనదేశానికివచ్చిన చార్లీచాప్లిన్ తమ్ముడు ఆమెను హాలీవుడ్డుకు రమ్మని ఆహ్వానించినట్టూ, ఆమె అందుకు అంగీకరించినట్టూ పుకారు.

'కళావినోది'

# సంపూర్ణ సూర్యగ్రహణము





మొన మొన్నటి సూర్యగ్రహణము జపానులో చక్కగా కనుపడినది. దాని నచటి వైజ్ఞానికులు ఫోటో తీసిరి. ఆ చిత్రమును, దానిని తీసిన కామెరాయును ఇందున్నవి.

## మెక్ మేహన్

ఈ మెక్‌మేహన్ మొన్నమొన్న (౧౬-౭-౧౯౩౬) ఇంగ్లండులో ఎడ్వర్డురాజుగారు హైడు పార్కునుండి మెరవడితో గుఱ్ఱము నెక్కి వచ్చుచుండగా వెల్లింగ్టను ఆర్చివద్ద వారిపైపునకు రివాల్వరును విసరివైచెనను నేరమునకు గుఱియయిన స్కాట్లెండుదేశీయుడు. ఇతడు జర్నలిస్టు. రివాల్వరు రాజుగారి గుఱ్ఱము వెనుకకాలికి తగిలినదట. తనకు జరిగిన అవమానరూపమగు నన్యాయమునకు పరిహారమును గోరుచు ఇతడు



౧. మెక్‌మేహను.

అందజేసిన విన్నపములు బ్రిటిషు ప్రభుత్వాధికారులచే తిరస్కరింపబడినవట. అందువలన నత డా విషయమును రాజుగారి చిత్తమునకు దెచ్చి న్యాయమును బడయు సంకల్పముతో, మార్గాంతరము గానక ఈ యుపాయమును పన్నినాడట. కాని రాజుగారికపాయమును గలిగించవలెనని కాదట. పాపము! రివాల్వరు మొదటి గోళమున గుండులేదట. కావున నది ప్రేలజాలదట. అయినను ఈచేత తనకు ప్రాణములమీదికి దెచ్చిపెట్టునట్టిది. దీనికి సాహసించినాడు మెక్‌మేహను.



౨. పోలీసులు అరెస్టుచేసి కొనిపోవుచున్న మెక్‌మేహను.

ప్రాణమునకన్న మానము విలువహెచ్చు అను నార్యోక్తి కిది నిదర్శనము. ప్రజావమానము నయిన సహింపనగునుకాని ప్రజల ధన మాన ప్రాణముల సంరక్షణమునకని నియమింపబడిన రాజపురుషులచే నయ్యెడు నవమానమును సహించుటకు శక్యము కాదనిది తెల్లము చేయుచున్నది.

## భారతదేశంలోని విద్య

ఈమధ్య (౧౯౩౧) జరిగిన జనాభా లెక్కల ప్రకారం, భారతదేశంలోని ౩౫ కోట్ల ౩౦ లక్షల మంది మొత్తంప్రజలకూ దరిదాపు ౩ కోట్ల ౩౫ లక్షల మంది ప్రజలుమాత్రమే విద్యాపరిచయంగలవారని తేలుచున్నది. ౧౭ కోట్ల మంది స్త్రీలకు ౪౦ లక్షల మంది మాత్రమే అక్షరజ్ఞానం కలవారు. మనదేశాన్ని విద్యావిషయాల్లో ఇతరదేశాల్తో పోల్చిచూస్తే గుండెలు ఆగిపోతాయి.

| | | | |
|---|---|---|---|
| నూటికి | ఈజిప్టులో | ౮౫.౭ | విద్యావంతులుకారు |
| ,, | కెనడాలో | ౫.౧ | |
| ,, | అమెరికా సం. రాష్ట్రాలలో | ౬.౦ | |
| ,, | రషియాలో | ౪౭.౭ | ,, |
| ,, | స్పెయిను | ౪౩.౦ | ,, |
| ,, | ఫ్రాన్సు | ౫.౮ | ,, |
| ,, | ఇటలీ | ౨౬.౮ | ,, |
| ,, | ఇండియా | ౯౦.౬ | ,, |

ప్రపంచకంలో మొత్తంమీద విద్యరానివారిలో మూడవవంతు మనదేశంలో ఉన్నారు. ఈకారణంచేతనే ప్రజలకు సంబంధించిన ప్రతిఉద్యమం మనదేశంలో అపజయాన్నే పొందుతోంది.

ప్రస్తుతం మనదేశంలో ఉన్న విద్యాపద్ధతి జనబాహుళ్యానికి నిరుపయోగం. మే, జూన్ న్యూ ఈరాపత్రికలో రవీంద్రుడు ఈవిషయాన్నే యీలా వ్రాసారు. "ఒనుక ఒకసామాన్యుడగు తాపీమేస్త్రీ ఒక అమాయకపు బ్రాహ్మడికి యిల్లుకట్టడానికి వప్పుకున్నాడు. తెచ్చినసామగ్రి మంచిది. చేసినపనిగొప్పది. కాని యిల్లు పూర్తిఅయినపిదప మేడమెట్లు మాత్రం తక్కువయాయి. ఆవిధంగానే మనదేశంలోని విద్యావిధానం ఉంది. ఒక అంతస్తుకి మరొక అంతస్తుకి సంబంధం లేదు. పైగా పైదానిబరువు క్రింది అంతస్తు భరిస్తూన్నా ఫలితాన్నిమాత్రం పొందటంలేదు."

మనవారి ప్రస్తుత పరిస్థితినిచూస్తే, వారికి పూరాగా, మన ప్రాచీనసంస్కారం శల్యాల్ని అంటింది. దాన్నిమాపేసి, ఇప్పుడు పూర్తిగా పాశ్చాత్య సంస్కారాన్నే ప్రబోధించడం నిరుపయోగం, మహాదోషం. ారిమతాన్నీ, వారి ఆచారాల్నీ, వారి అలవాట్లనీ అరికట్టడం దుస్సాధ్యం. వారి పురాణాలూ, వారికథలు, వారిపాటలు, వారి కీర్తనలు వారికి ఒకవిధమైన శాశ్వతాభిప్రాయాల్ని ప్రసాదించాయి.

అట్టి పరిస్థితులలో ఉన్నవారికి నేర్పవలసినవిద్యనుగూర్చి ఆలోచించడం అవసరం. పాశ్చాత్యవిద్యావిధానం వారికి దురవగాహం. విశాలమైన ప్రాపంచిక దృష్టిని కలిగించి బీదలకు భాగ్యవంతులకు తరగతిభేదాల్ని లేకుండాచేసి సౌభ్రాత్రాన్ని ప్రోత్సహించే విశాల విద్యను వారికి నేర్పాలి. అలాటి కార్యక్రమాన్ని నెరవేర్చడానికి ఇతరదేశాల్లోవలె మనదేశంలో ప్రభుత్వం వారు పూనుకోరు. పాఠశాలలలోఉన్న ఉపాధ్యాయులకా తిండిలేదు. ప్రజలలో పేదరికం నిండిఉంది. నేర్పబడువిద్య నిస్సారమైంది. పేదపిల్లలు చదువుకొనుటకు అవకాశాన్ని కలుగజేసే బడులులేవు. త్యాగబుద్ధితో తమధర్మాన్ని నిర్వర్తించే నేర్పరితనంగల ఉపాధ్యాయులు అసలేలేరు. ఇన్ని అవాంతరాలు తప్పి మనదేశములో విద్య వ్యాపించాలి.

ప్రభుత్వంవారు పూనుకోని కొన్నికొన్ని ముఖ్య విషయాలలో ప్రజలే పూనుకోవాలి లేకుంటే ప్రభుత్వంవారు పూనుకునేటట్లు ప్రజలు ఆందోళన చెయ్యాలి. ఇతరదేశాల్లోని పేరెన్నికగన్న విద్యాసంస్థలన్నీ ఉదారులూ, సంపన్నులూ అగు మహాపురుషుల ధర్మాల మూలాన్నే ఉద్భవించాయి. మనదేశంలోనూ భాగ్యవంతులున్నారు. కొద్దిమందే కావచ్చు. వారు ధనాన్ని దాస్తారు. వడ్డీవ్యాపారం చేస్తారు. లేకుంటే యితరదేశాల్లో దుర్వినియోగపరుస్తారు. అదీ లేకుంటే ఓట్లు కొంటారు.

ప్రస్తుతం మనదేశంలో ఉన్నవిశ్వవిద్యాలయాలు పాశ్చాత్యవిద్యాలయాల అనుకరణాలు. వీటికి బాహ్యాం

గానే సారూప్యం. మనకు విశ్వవిద్యాలయాలంటే పెద్ద పెద్ద భవనాలు, బల్లలు, కుర్చీలు, శాసనాలు, పరీక్షలు, పట్టాలు మొదలైనవి; అంతే. విదేశాలలో-ముఖ్యంగా ఆక్స్‌ఫర్డులోను, కేంబ్రిడ్జిలోను-ఉన్న విశ్వవిద్యాలయాలు ఆయాదేశాలయొక్క జాతీయతనీ ప్రతిఫలిస్తాయి.

ఈ వ్యత్యాసానికి కారణం ఉంది. ఏదేశం వారూ, ఏకాలంలోను స్వంతవ్యవహారాల్ని పరభాషలలో నిర్వహించుకుని యెరుగరు. భాష పరాయిది అయినప్పుడు సొంతంగా నేర్చుకోడానికి చాలకాలం పడుతుంది. వయస్సులో సగంభాగం విద్యను అర్జించడానికే వినియోగపర్చే వ్యక్తులతో కూడిఉన్న జాతి యొక్క దుస్థితిని గూర్చి వేరుగా చెప్పనక్కర్లేదు. అప్పటికేనా, పాపం, వారికి పూర్తిగా పరిజ్ఞానం కలుగదు. చివరికి వారు పరభాషారాక, మాతృభాషారాక, ఉభయభ్రష్టత్వాన్ని పొందుతారు.

కనుక దేశభాషలతో విశ్వవిద్యాలయాలింకా యెన్నో ఉద్భవించాలి. నానాటికి క్షీణించే భారతీయ జాతీయతనూ, వ్యక్తిత్వాన్నీ పునరుజ్జీవింపజేయడానికి పలువురు పూనుకోవాలి.

ఆ. సూ. మూర్తి.



వరలక్ష్మీపూజ

S. S. S.




1936/8

## సమమంత్రపు సిరి

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు రచియించిన చిన్న పద్యకావ్యము. సమమంత్రపు గల్లిగల్లి మాటిమాటికిని నిక్కిన, నీల్గిన, విర్వీగిన, చివరకు చేతికి చిప్ప దాపరిల్ల సమూలముగ పడిపోయిన యొక బాపనికథగా మనము నిత్యము చూచు లోకవృత్తమునే శాస్త్రిగారు తెల్పినారు. సరళమయిన కవిత చెప్పగల తెలుగుకవులలో వీరొకరు. జాతీయాభి, నం బోధము వీరి రచనల నొప్పియుండును. ఈ కథానకము రచించుటలో ఏయొక్క విశిష్ట వ్యక్తినిగాని దూషించుట తమ యుద్దేశ్యముగాదనియు, లోకవృత్త ప్రదర్శనమే తమయుద్దిష్టమనియు శాస్త్రిగారు హృదయమును వెలిపుచ్చినారు. రచనము చదువనింపుగానున్నది.

ఇందలి యతిభ్రంశములు ప్రమాదపతితములు గాక బుద్ధిపూర్వకములగుటలో వీరి మతమేమో స్పష్టముగ బోధపడుటమాత్రము లేదు. బహుశా యతినియమము వీరి కభిప్రేతము కాదేమో యని యూహింపవలసియున్నది.

ఇది శతావధాని వేలూరు శివరామశాస్త్రిగారి కంకితముచేయబడినది.

## కావ్యమంజరి

ఇదియు సూర్యనారాయణశాస్త్రిగారు రచియించినదే. అడపాయి తెలుగుపత్రికలయందు చెప్పుటప్పుడు ప్రకటితములైన కొన్ని యనిబద్ధ కావ్యములు ఇట్లు పుస్తకరూపమున నొకచో నిబంధింపబడినవి. ఈ మంజరిచివర సూక్తిసప్తమని కొన్ని సూక్తులును చేర్పబడినవి. ఈ రచనయందును శాస్త్రిగారి కలము చిందులు చక్కగా గోచరించుచున్నవి.

అనిబద్ధకావ్యములలోని 'భావ సంవత్సర', 'యువాబ్ది' కావ్యములు మాత్రము నిత్యానుసంధానమైన యీ మంజరిలో చేరియుండుట యుక్తముగ తోపదు. అవి విశిష్ట, తాత్కాలిక భావానుబద్ధములుగాని సామాన్య, శాశ్వతిక భావానుబద్ధములు గానేరవని యభిప్రాయము. అక్కడవారికితప్ప వీనికి నిత్యసత్త యుండ నేరదు. యతినియమమందలి స్వాతంత్ర్యమతి మిందున్ను పాటింపబడినది. కవిత సరసభావానువిద్ధమై యున్నది.

శాస్త్రిగారి యీ నూతన, సరసరచనల కాంధ్రులు సముచితాదరణ నొసంగుదురని నమ్ముచున్నాము. వెల ఒక్కొక్కటి నాలుగణాలు. ప్రాప్తిస్థానము:

వేంకట్రామ అండ్ కో.,
3—3 మార్కెట్టువీధి, సికింద్రాబాదు (దక్కన్)

## త్రివేణి

శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు ఇంగ్లీషులో ప్రకటిస్తూవచ్చిన త్రివేణిపత్రికకు ఎనిమిదేండ్లు నిండాయి. ఇంతకాలము రెండునెలల కొక సంచిక చొప్పున వెలువడుతూ వచ్చింది. తొమ్మిదోయేడు పెట్టింది మొదలుకొని దాన్ని మాసపత్రికగా ప్రకటించడానికి రామకోటీశ్వరరావుగారు సంకల్పించి మొదటి సంచికను ప్రకటించారు. ఇది నిజంగా సాహసమే. రామకోటీశ్వరరావుగారు పత్రికా నిర్వహణంలో వుండే కష్టసుఖాలు అనుభవించినవారై ఇట్లా సాహసించారంటే అందులో ఒక రహస్యం లేకపోలేదు. పత్రికల్లోకల్లా మాసపత్రికకు, చక్కగా నిర్వహిస్తే సరి, మంచి స్థానం వుంది. సులభంగా ఎక్కువప్రచారంలోకి వస్తుంది. ఈ సంగతి వారు గ్రహించే ఇలాసాహసించారని అనక తప్పదు. ఈ సాహసం త్రివేణికి అభ్యుదయహేతువు కావడం నిశ్చయం.

మాసపత్రిక బాగా వ్యాపించాలంటే, ౧. దాంట్లో మంచి మంచి వ్యాసాలు పడుతూవుండవలెను; ౨. ప్రతి

నెలా సకాలానికి సంచిక వెలువడుతూ వుండవలెను; 3. కాగితమూ, అచ్చూ, శైలీ అందంగా వుండవలెను. ఈ మూడు లక్షణాలూ వుంటే పత్రిక బాగా ప్రచారంలోకి వస్తుంది; దానికి అర్థబలమూ చేకూరుతుంది. పత్రిక పేరు ప్రతిష్ఠలూ, స్థిరంగా చిరకాలం నిలిచివుంటుంది. సానుభూతివల్ల లభించే అర్థబలంకంటే సరుకు గుణాన్ని అనుసరించి ఏర్పడే చందాలవల్ల లభించే అర్థబలం ఎక్కువపుష్టి నిస్తుంది పత్రికను.

త్రివేణికి ఇదివరకే పేరు వచ్చినా, ఇంకా ఎక్కువ మంచి వ్యాసాలను సంపాదించి ప్రకటించడానికి రామకోటీశ్వరరావుగారు ప్రయత్నించాలి. పత్రిక తాలూకు అచ్చూ, కాగితాలూ, శైలీ అందంగా వుండటం రూపానికి నిర్దిష్టతను సమకూరుస్తుంది. వ్యాసాలు మంచివిగా వుండటం గుణానికి నిర్దిష్టతను సమకూరుస్తుంది. రూపగుణాలు రెండింటిలోను గుణమే ఉత్తమంగా భావింపబడుతుంది. రెండూ కుదిరివుంటేనా చెప్పవలసిందేలేదు. త్రివేణికి మంచి రూపమేదో అమరింది. ఇంకా మంచి గుణాలను ఎంత ఎక్కువగా సమకూర్చుకుంటూవస్తే అంత ఎక్కువగా సులువుగా పేరు ప్రతిష్ఠలనూ, వ్యాప్తినీ పొందుతుంది. ప్రకృతం వెలువడిన సంచికలో వ్యాసాలు పత్రికకున్న పేరు ప్రతిష్ఠలకు ఏమాత్రమూ తీసిపోయేవి కావు. దీని సాలు చందా రు. ౬-౮-౦: విడి సంచిక వెల రు. ౦-౧౨-౦.

---

తాతాచరిత్రము

కొమాండూరి శఠకోపాచార్యులు, ఎం. ఏ., బి. ఎల్, గారిచే రచింపబడినది. వచనము. డబుల్ క్రౌను సైజు; ౧౬౧ పుటలు; వెల పది అణాలు. వలయువారు గ్రంథకర్తపేర కాకినాడ వ్రాసిన బడయగలరు.

దీనియందు భారతదేశపారిశ్రామిక నాయకులందగ్రగణ్యుడని చెప్పదగు జంషెడ్జీ నస్సర్వాంజతాతా యొక్కచరిత్రము విపులముగ నుత్సాహపూరితముగ మృదుశైలిలో వివరింపబడినది. పార్సీలపూర్వచరిత్ర, జంషెడ్జీబాల్యదశ, వ్యాపారారంభము, తనదేశమున కవసరములు ఇతరపరిశ్రమలకు కీలకములు అగు పరిశ్రమలస్థాపనయే జంషెడ్జీ తనదృష్టిని నిలుపుట, తనకులాభకరములేకున్న దేశాభివృద్ధికవసరములగు క్రొత్తపరిశ్రమలను స్థాపించుటయందు దాయనకుగల దూరదృష్టి, పాశ్చాత్యదేశములనుండి వస్తుబహుళోత్పత్తికై స్థాపింపబడినమిల్లుల వలన లాభముతోబాటు కొంత నష్టముకలుగునని గ్రహించి జంషెడ్జీ యానష్టమును తగ్గించుటకును, కార్మికులబాగుచేయుటకును, ఉద్యోగులకు పరిశ్రమలాభములందు సంబంధముకలిగించుటకును సల్పినకృషి, పాశ్చాత్యపారిశ్రామికపద్ధతిని ఎంప్రెస్సుమిల్లు, స్వదేశీఅడ్వాన్సుమిల్లులను స్థాపించి సన్ననూలు వస్త్రపరిశ్రమను వ్యాప్తిచేసినసంగతి, వానిని నెలకొల్పుటయందలి తాతాయొక్క దూరదృష్టి, ఈదేశమునందు సన్ననూలుతీయుటకును ప్రత్తిసాగుచేయుటకు కతడువహించినశ్రద్ధ, ఈ కాల్వ్యాపారమున విదేశీయులతో ప్రతిఘటించి వారి వాణిజ్యనౌకాధిపతులకుగా చేసిన తాతాయొక్క కార్యకౌశల్యము, కార్మికసమస్య, బట్టలసున్నసమస్య, పట్టుపరిశ్రమ మొదలైనవానియందు తాతాచూపిన దూరదృష్టి మొదలైనసంగతులు పేర్కొనబడినవి. ఉన్నతవిద్యను, విజ్ఞానమును వ్యాప్తిచేయుటకై తాతా తనధనమును ఉన్నత విజ్ఞానపరిశోధనాలయ స్థాపనకై వినియోగించి వివిధశాస్త్రములందు పాశ్చాత్యపద్ధతులమీద పరిశోధన గావించి యాయాశాస్త్రములయందు ప్రావీణ్యమును విదేశములకు పోయి గడింప నవసరములేకుండ నీదేశముననే పొంద, నుత్సాహపూరితులగు యువకులకు వీలగునట్లు చేసినపద్ధతులు చదువరుల నుత్సాహవంతులనుగా జేయునట్లు వ్రాయబడినవి.

లోహయంత్రశాల, జలవిద్యుచ్ఛక్తిశాల జంషెడ్జీగారు పూర్తిచేయకముందే మరణించినను, ఆరెండిటికిని తీవ్రప్రయత్నము సల్పి, పునాదివేయబడుటచేతను, తరువాత నవి, వారికుమారులచే జయప్రదముగ పూర్తిగావింపబడుటచేతను, ఆపరిశ్రమలగూర్చి పూర్తిగ తెలియజేయుటకై యవిరెండును నిందు పూర్తిగ వర్ణింపబడినవి.

ఆంగ్లమునుండి తర్జుమాచేయబడి పుస్తకములో నుపయోగింపబడిన పారిభాషికపదములకు పుస్తకము చివర పారిభాషికపదసూచి యీయబడినది.

విషయముక్తత, భావస్పష్టత, దానికితగిన శైలి కలిగి చదువరులమనోవృత్తి నాకర్షించి వారికి పాశ్చాత్య పద్ధతులమీద పరిశ్రమలస్థాపించుట కునుముఖులగున ట్లుత్సాహమును గల్గించి, స్వదేశపారిశ్రామిక భావిభాగ్యోదయమునకు తోడ్పడుట కీగ్రంథ మెంతయు తగి యున్నది.

ఇదివరలో మతమునకు, రాజకీయమునకు, వాఙ్మయమునకు సంబంధించిన నాయకులజీవితచరిత్ర లాంధ్రమున నున్నవి. కాని పారిశ్రామికనాయకుల చరిత్రము లేవియులేవు. ఇదియే మొదటి దనదగును.

ఇటువంటి గ్రంథములను పాఠ్యగ్రంథనిర్ణయసభవా రున్నతపాఠశాలలలోగాని, కళాశాలలలోగాని సహాయపఠనీయగ్రంథములుగ నిర్ణయించి, యువకుల మనముల పారిశ్రామిక ప్రపంచమునందలి యున్నతాదర్శములను, వానినిర్వహణమున కగు నుత్సాహశక్తులను నాటి, వారిని దేశీయపరిశ్రమల కృషిసల్పుట కునుముఖులజేసి, దానిమూలమున నిరుద్యోగసమస్యను పరిష్కరింప ప్రయత్నింతురని నమ్ముచున్నాము. ఇటువంటి గ్రంథముల నింకను రచించి, శ్రీ కొమాండూరి శఠగోపాచార్యులుగారు యువకులలో దేశీయపరిశ్రమల పాశ్చాత్యపద్ధతులమీద జేపట్టుట కుత్సాహమును గలుగజేసెదరు గాక.

న. సు.

## దివ్యవాణి

క్రౌను ౧/౮ సైజు; పు. ౨౪; వెల రు. ౦-౨-౦.

గ్రంథకర్త: సూరిచి నరసింహము పంతులు.

ఇది ఒక హరిజనునికథ. ఇదివరకు ఆంధ్రపత్రిక యొక్క సంవత్సరపు ఉగాదిసంచికలో ప్రకటితమయినది. ౧౨-వ ఆంధ్రసేవాప్రసూనముగ విశాఖపట్టణంజిల్లా ఎలమంచిలి తాలూకాలోని మెలుపాక గ్రామమునందలి వ్యాసకుటీరము 'న ప్రకటింపబడినది.

## కాదంబరీకల్యాణమ్
### (సంస్కృతనాటకమ్)

క్రౌను ౧/౮ సైజు; పు. ౨౩౬; వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: నరసింహకవి.

ప్రకాశకులు: ది ఎడ్యుకేషనల్ పబ్లిషింగ్ కంపెనీ, ౧౨, సెకండ్ లైనుబీచ్, మద్రాసు.

---

## వీణ

(సాహిత్య మాసపత్రిక) ఒకటవ సంపుటము ౧, ౨ సంచికలు వెలువడినవి. ఏడాదిచందా రెండు రూపాయలు.

వ్యవస్థాపకులు: పాటిబండ మాధవశర్మ, గుడిపాటి రాజగోపాల్; కార్యాలయము తెలప్రోలు, కృష్ణాజిల్లా.

---

## ఆంగ్లచరిత్ర
### (ట్యూడరుయుగము)

క్రౌను ౧/౮ సైజు; పు. ౧౪౯; వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త: వేలూరి సత్యనారాయణ బి. ఏ., బి. యల్. భీమవరము, పడమటి గోదావరిజిల్లా.

---

## ఆరోగ్యశాస్త్రము
### (ఆంధ్రవిశ్వకళాపరిషత్తుచే బహూకృతమైన గ్రంథము)

క్రౌను ౧/౮ సైజు; పు. ౪౧౦; వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: గుళ్లపల్లి నారాయణమూర్తి, ఎల్. ఎమ్. ఎస్., అనకాపల్లి.

---

## విద్యార్థప్రకాశిక

క్రౌను ౧/౮ సైజు; పు. ౨౪౮; వెల రు. ౧-౪-౦.

గ్రంథకర్త: కొన్నులగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. ఎల్., 'కమలావిలాసము'; నెం. ౪౦, లజ్ చర్చిరోడ్డు, మైలాపూరు, మదరాసు.

---

## పులిగోరుశతకము

డెమ్మి ౧/౮ సైజు; పు. ౨౦; వెల రు. ౦-౨-౦.

గ్రంథకర్త: ఉభయభాషాప్రవీణ వడ్డాది సీతారామాంజనేయులు, ఖాశింకోట.




## విశ్వసాహిత్యసమాజము

విశ్వకల్యాణపరిణామమునకు సాహిత్యము కీలకము, సాహిత్యము హృదయము. సాహిత్యోపాసకులు, దివ్యద్రష్టలు, సిద్ధులు, మహర్షులు, మహాత్ములు, బ్రహ్మలు. వివిధ మతములు, కులములు, సంఘములు, జాతులు, రాజ్యములు, దేశములు, కాలములు సాహిత్యోపాసకులకు శాంతశివసుందర బ్రహ్మ సందర్శనమునకు సాధనములు. సామ్రాజ్యము అంతరించినను, శకములు మారినను, దేశములు పోయినను, జాతులు నశించినను సాహిత్యము నిత్యమై విలసిల్లుచున్నది. సుఖదుఃఖములందు, జయాపజయములందు, భాగ్యదరిద్రములందు, సాహిత్యోపాసకులు నిత్యమైన రసానందమును సందర్శించుచు, ప్రపంచమునకు ఆనందమును గలుగజేయుచున్నారు. అర్థకాములకు, రాజ్యకాములకు, భాగ్యకాములకు, భోగకాములకు పరస్పరసంరంభము సంభవమైనను సాహిత్యోపాసకులకు సంరంభ మసంభవము. సంక్షోభమయమైన వర్తమానసందర్భసమయమునందు ప్రపంచమునందు గల భిన్నరాజ్యములందలి సాహిత్యోపాసకులు చేరి, ప్రపంచమునందు సాహిత్యవ్యాపనమునకును, శాంతిస్థాపనకును చేయుచున్న ప్రయత్నములు పండితపామరులయాదరణకు పాత్రము లగుచున్నవి. అనంతరూపమయమైన ప్రపంచము ఏకశ్రుతిలయభావబద్ధమైయున్నవిధము ప్రాజ్ఞులు గ్రహించుచున్నారు.

మతాచార్యులు, శాస్త్రజ్ఞులు, కళోపాసకులు వారి సిద్ధాంతములయందు బోధించెడి బోధలు మనోహరము లైనను మహాకవుల సాహిత్యమువలె హృదయానందదాయకములు కావు. పండితుల సిద్ధాంతములు మనోగోచరములై, వాదప్రతివాదములకు కారణము లగుచున్నవి. కవుల కావ్యములు హృదయగోచరములై రసానందమును గలుగజేయుచున్నవి. ప్రపంచకల్యాణమునకు కారణభూతులైన మహాత్ములందు మహాకవు లగ్రగణ్యులు. ప్రత్యేకయుగములందు వీరులు, ధీరులు, శాస్త్రజ్ఞులు, తత్త్వజ్ఞులు ప్రపంచకల్యాణమునకు కారణభూతులైనను వారి ప్రతిష్ఠ కవులప్రతిష్ఠవలె శాశ్వతము గాకున్నది. తాత్కాలికముగ లబ్ధమైన వీరుల ధీరులవైజ్ఞానుల ప్రతిష్ఠయును బీభత్స, రౌద్ర, భయానకమయమై కవులప్రతిష్ఠవలె శాంతశివసుందర రసానందమునకు సాధనము గాకున్నది. ప్రపంచమునందు గల సాహిత్యోపాసకులు విశ్వసాహిత్యసమాజమును స్థాపించి భిన్నజాతులను, భిన్నసంఘ

ములను, భిన్నమతములను, భిన్నసంస్కార ములను ఏకమైన మానవధర్మాభ్యుదయము నకు వినియోగించుటకు చేయుచున్న ప్రయత్నములు హిందూస్థానమందలి సాహిత్యోపాసకులనుగూడ నాకర్షించుట సముచితముగ నున్నది. విశ్వసాహిత్యసమాజమునకు హిందుస్థానశాఖకు మహాకవి రవీంద్రనాథ టాగోరు అధ్యక్షులు. శ్రీమతి సోఫియా వాడియాగారు ఉపాధ్యక్షులు. గతమాసమునందు బొంబాయియందు జరిగిన సభయందు శ్రీమతి వాడియాగారు 'బ్యూనోస్ ఎయర్స్' నందు కూడనున్న అంతర్జాతీయ సాహిత్య మహాసభకు భారతీయప్రతినిధిగ నియమింపబడిరి. ఆమహాసభయందు శ్రీమతులు సరోజినీదేవిగారును, సోఫియావాడియాగారును చేసిన ప్రసంగములు భారతసాహిత్యప్రతిష్ఠను విశదము చేసినవి.

## భారతీయసాహిత్యము

సనాతనమైన భారతీయ సాహిత్యము వర్తమానకాలమునను సంక్షోభపూరితమైన ప్రపంచకల్యాణమునకు వినియోగపడగల విధము రవీంద్రుని సాహిత్యసందేశమును, గాంధీమహాత్ముని శాంతిసందేశమును వెల్లడి చేయుచున్నవి. హృద్యమైన రవీంద్రుని సాహిత్యసందేశము సనాతనమైన భారత సాహిత్యప్రయోజనమును సుగమము చేయుచున్నది.

"ప్రాచీన నవీనఖండములందలి కావ్యకోవిదులను కల్పనాదక్షులను మానవధర్మపాశబద్ధులను చేయుటకు తోడ్పడుటకు శ్రీమతి వాడియాగారు హిందూదేశాభినందనములను మీరదేశములకు తీసికొనిపోవుచున్నది."

గాంధీమహాత్ముని సందేశము వారికి సహజమైన వినయమును వెల్లడిచేయు చున్నది:

"శ్రీమతి సోఫియావాడియాగారు సంకల్పించిన సాహిత్యసందేశము నందును నా సదాశయములు గలవు."

ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యవిశారదులకు గాంధి, రవీంద్రనాథులు సాహిత్యసందేశము నందలి పరమార్థము వెల్లడిచేయగలరు. సనాతనమైన భారతీయసాహిత్యసంస్కారము వేదయుగమునుండి వర్తమానకాలమువరకును అనేకవేలయేండ్లు సజీవముగ మానవకల్యాణమునకు వినియోగపడుచున్న విధమును ఆసేతుహిమాచలవ్యాప్తమైన భిన్నవిధములైన భారతీయసాహిత్య సంస్కారములు విశదము చేయుచున్నవి. భాషలు వేరైనను, రాష్ట్రములు వేరైనను, మతములు వేరైనను, వర్ణాశ్రమధర్మములు మారినను సనాతనమైన భారతీయసాహిత్యసంస్కారము నవీనసాహిత్య నిర్మాణమునందు సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. భారతవామ్నాయ ణాదర్శములు, వైదిక కర్మకలాపములు, పురాణగాథలు, దర్శనధర్మములు వర్తమాన సాహిత్య కల్పనయందు ప్రత్యక్షమగుచున్నవి. శ్రీమతి సరోజినీదేవిగారు చేసిన ప్రసంగమీ పరమార్థమునే వెల్లడిచేసినది.

భరతవర్షమునందు 'హరిః ఓమ్' పరమార్థముతో నుపక్రమింపబడిన అధ్యయనము 'ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః' పరమార్థముతో పరిణామమును పొందుచున్నది. చిరకాల సంవర్ధితమైన భారతీయ సాహిత్య శాంతి సంస్కారము ప్రపంచశాంతికి వినియోగపడుట భారతీయసంస్కారమునకు పరమార్థము. భిన్నమతములకును, జాతులకును, దేశములకును నిలయమై పారతంత్ర్యపాశబద్ధమై దుఃఖవేదన ననుభవించుచున్న హిందుస్థానము విశ్వసాహిత్యసభకు సమకూర్చిన సందేశము మహాసభాప్రయోజనమును విశాల మొనరింపగలదు.

ప్రపంచమునందంతటను వివిధవిషయములకు అంతర్జాతీయసభలను చేయుట ఆచారమైనది. అంతర్జాతీయములైన ఆర్థికసభలు, రాజకీయసభలు, శాంతిసభలు, మతసభలు, వైద్యసభలు, శాస్త్రసభలు సిద్ధాంతములందు ప్రపంచలక్ష్యము నాకర్షించినను క్రియలందు నిరర్థకములుగ నున్నవి. విశ్వమునంతను సాహిత్యపాశబద్ధము చేయుట కేర్పడిన విశ్వసాహిత్య మహాసభవలన ప్రపంచశాంతికి మహోపకారము కలుగుటకు అవకాశములు గలవు. విశ్వసాహిత్యబృందావనమునందు సాహిత్యోపాసకులు స్త్రీపురుషభేదము, తెల్లనల్లభేదము, ప్రాచ్యపాశ్చాత్యభేదము, భాగ్యదరిద్రభేదము, ప్రాచీన నవీనభేదము, సంస్కృతాంగ్లాంధ్రభేదము లేక సమానాదరణగౌరవములు పొందుచున్నారు. విశ్వసాహిత్యసమాజము ఈ పరమార్థమునే విశ్వవ్యాపకము చేయుటకు చేయుచున్న ప్రయత్నములు సకల జనసమాదరణమును బడయుట పుణ్యము, పురుషార్థము, శ్రీమతి వాడియాగారి కాధ్యాత్మికసాహిత్యమునందు గల విశ్వాస మపారము. ఆధిభౌతికసాహిత్యానందపరవశమైన పాశ్చాత్యసాహిత్యవిశారదులకు సోఫియావాడియాగారు నిత్యమైన భారతీయాధ్యాత్మిక సాహిత్యసందేశమును వెల్లడిచేసి భారతీయభావసౌభాగ్యమును దిగంతములందు వ్యాపింపజేయుటకు విశ్వసాహిత్యసమాజ ముపకరించుగాత!

* * *

## భారతసాహిత్యపరిషత్తు

సనాతనమైన భారతసాహిత్యము శాఖోపశాఖలుగను విశాలమైన భరతఖండమునందే కాకను ప్రపంచమునందంతటను వ్యాపకమును గాంచినది. యవన రోమక సాహిత్యములు, ఈజిప్టు ఇంకాసాహిత్యము, అస్సిరియా, చాల్డియా సాహిత్యములు, చీనా, జపాను సాహిత్యములు ప్రాచీన భారత సాహిత్యవిజ్ఞాన ముద్రాంకితములు. ప్రాచీనకాలమునందు పరంజ్యోతివలెను ప్రకాశించిన భారతీయసాహిత్యవిజ్ఞానము వర్తమానకాలమునందును భౌతికాంధకారబంధురమైన వర్తమానకాలమునందును పరంజ్యోతిని జేయుట భారతీయుల కర్తవ్యము. భిక్షాపాత్రను చేతనుబూని ధర్మసంకీర్తనమును,

ధర్మోపదేశము చేసిన గౌతమబుద్ధునికన్న భారతమాత వర్తమానకాలమునందు కరుణ చందు గాంధిని గనుట సుకృతము. వేద యుగమునందు వైదికసాహిత్యము, బుద్ధ యుగమునందు బౌద్ధసాహిత్యము, వర్తమాన యుగమునందు గాంధీసాహిత్యము విశ్వ సాహిత్యమునకు జీవమణులు. సనాతనమైన భారతీయ సాహిత్యము భరతవర్షమునందు మూలమూలలను వ్యాపించి దేశభాషా సాహిత్యములకు మూలాధారమై ప్రజా హృదయమందు వికాసమును గలుగజేసినది. సంస్కృత సాహిత్యముద్రాంకితము లైన ప్రాకృతద్రవిడ సాహిత్యములకు ప్రాచీన కాలమునందువలెను వర్తమానకాలమునందును సన్నిహితసాహచర్య సంయోగములు భారతీయ సాహిత్య సౌభాగ్య మహత్త్వము నకు సాధనములు. భారతీయ దేశభాషాసాహిత్యములకు పరస్పర సాహచర్య సంయోగములు భిన్నసాహిత్యముల వికాసమునకు వినియోగపడుటయె కాకను భారతజాతీయ సన్నిహిత సంయోగమునకును వినియోగపడగలవు. భారత రాజ్యాంగమునందు సంయుక్త ప్రభుత్వము [illegible] లో చేర్పడుచున్నది. సంయుక్త ప్రభుత్వము సంయుక్త సాహిత్యమును సమకూర్చుట సహజము. వివిధ రాష్ట్రములు, భాషలు, సాహిత్యములు వ్యక్తిత్వమును గలిగి పూర్ణవికాసమును పొందుచు భారతీయ సాహిత్యకల్పతరువునకు శాఖోపశాఖలుగను విలసిల్లుట భారత సాహిత్యమున కభీష్టప్రయోజనము.

* * *

## ఆంధ్రసాహిత్యము

ఆంధ్రసాహిత్యమునకు తెనుగుపేరు పెట్టినను, ఆంధ్రనామకరణము చేసినను సంస్కృతసాహిత్యముద్రాంకిత మనివార్యము. భారతభాగవతరామాయణ సాహిత్యాభావమైన తెనుగుసాహిత్యము దుర్లభము. తెనుగు సాహిత్యముద్రాంకితములైన భావములు, పదములు భ్రమరకీటకన్యాయమునను తెలుగుభాషారూపపరిణామమును పొందినవి, పొందుచున్నవి. తెలుగు సాహిత్య సంస్కారమును పొందని భావములు, పదములు విదేశీయములని శంకించుట చుట నిందించుట నిరర్థకము. సంస్కృతాంధ్ర భాషావివాదములు. గ్రాంథికవ్యావహారికభాషా వివాదములు, ప్రాచీన నవీన సాహిత్యవివాదములు, ఆంధ్ర హిందీభాషా వివాదములు మీమాంసకులకు ప్రయోజనకరములైనను సాహిత్యనిర్మాతలకు నిరర్థకములు. అంతర్జాతీయ మానవ స్వాతంత్ర్యధర్మ సంస్థాపనసమయమునందు సాహిత్యోపాసకులు, స్వదేశ భాషాభిమానము శ్లాఘ్యమైనను, విశాలమైన విశ్వసాహిత్యారాధనమును జేయుటకు దీక్షను బూనుట ప్రయోజనకరము. కావ్యాలంకార శాస్త్రము లేమి విధించినను వర్తమానమానవ ధర్మప్రయోజనములను హృద్యముగను నిరూపించుట సాహిత్యమునకు పరమార్థము. ఆంధ్ర

సాహిత్యాభ్యుదయమునకు సాహిత్యోపాసకులు, సాహిత్యపరిషత్తులు చేయుచున్న ప్రయత్నములు ప్రశంసనీయములైనను దేశభాషా ప్రజాభ్యుదయముల కనురూపమైన సాహిత్య వికాసవ్యాపనములు సాధ్యములుగాకున్నవి. సాహిత్యోపాసకులు, సాహిత్యప్రియులు నవయుగ నిర్మాణావసరముల కనుకూలమైన సాహిత్యనిర్మాణములకు పూనుకొనుట సముచితము. స్వదేశభాషలలోని ఉత్తమసాహిత్యగ్రంథములకును, పత్రికలలోని వ్యాసములకును ఆంధ్రానువాదములను ప్రకటించుట భారతీయాంధ్ర సాహిత్యాభ్యుదయమునకును, భారతధర్మాభ్యుదయమునకును మూలాధారము. ఇతర సాహిత్యవ్యాపనమాంధ్ర సాహిత్యాభ్యుదయమునకు ప్రతిబంధకమని భయపడకను ఇతర సాహిత్యము నాంధ్రసాహిత్యముతో మేళగించుట వివేకము.

భారతసాహిత్య పరిషత్తు పక్షమున ప్రచురింపబడుచున్న హంసపత్రికయందును, విశ్వసాహిత్య సమాజ పక్షమున వెలువడుచున్న 'పెన్ను' పత్రికయందును ప్రచురింపబడుచున్న వ్యాసములును సాహిత్యప్రియులకును విశ్వభారత దేశీయ సాహిత్యసమ్మేళనసాధనోపయోగములను విశదము చేయుచున్నవి. హంస జులైసంచికయందు గురునాథశర్మగారి ఆదికవినన్నయనుగురించిన వ్యాసమును, వ్రజనందనశర్మగారు 'బాలరసాల', 'కాటుకకంటినీరు' సుప్రసిద్ధపోతనపద్యముల మీదను వ్రాసిన వ్యాఖ్యానమును భారత సాహిత్య బృందావనమునం దాంధ్రభాషకు గల ప్రతిష్ఠను విశదము చేయుచున్నవి. హంస సంచికలోని ఇతర భాషాసాహిత్య విషయములాంధ్ర భాషానువాదమునకు దగియున్నవి. నెల్లూరునందు విశ్వనాథసత్యనారాయణగారు కావ్యలక్ష్యమును గురించి చేసిన యుపన్యాస సారాంశము ఆగస్టు పెన్నుపత్రికయందు ప్రచురింపబడినది. ఆంధ్రసాహిత్యప్రియులును సాహిత్యాభ్యుదయమునకు స్వాభిమానమును విడిచి హంస, పెన్నుపత్రికలు సూచించిన విధమునను ఇతర సాహిత్యములకు స్వాగతంబు నొసంగి ప్రేమించుట ధర్మము. శ్రీయుత సత్యనారాయణగారు నిర్దేశించినటులు సాహిత్య మహాతత్త్వమునకు లక్ష్యము సహృదయానందము. ఆంధ్రసాహిత్య ప్రియులీ పరమార్థలక్ష్యముతో భారతీయ విశ్వసాహిత్యోపాసకులై సాహిత్యసాధ్యమైన మానవస్వాతంత్ర్యధర్మప్రయోజనములను నారాధించి ఆత్మానందమును బడయుదురు గాత!

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. సెప్టంబరు)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో అక్టోబరు 10-వ తేదిని రూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసర ముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 1, 2. B 2, 10. H 39, 41, 43, 44. J 9, 14, 15, 16, 28. M 3. N 20.
P 23, 25, 36. R 1, 7, 28. S 58, 124, 125, 127, 129, 133, 138, 251. V 31.

[illegible]
[illegible]

---

# వి ష య సూ చి క

---



# చి త్ర ము లు

త్రివర్ణచిత్రములు:—మాచిట్టికి ఎంత ఆకలో! ; శివభక్తమాహాత్మ్యమున కిరాతాఖ్యానమున నొకరంగము.

సాధారణచిత్రములు:—చెంజిదుర్గ చిత్రములు; ప్రౌఢ; ముగ ; ఇతర చిత్రములును.

---

# యౌవనముగను,
# దృఢముగను నుండు టెట్లు?



రక్తమును శుభ్రపరచు కొనవలెను. మానవుల ఆరోగ్యము, ప్రాణము మంచి రక్తముపై ఆధారపడియుండును. నెత్తురు చెడిపోయియున్నప్పుడు "డాక్టరు పాల్సు పిం పిల్సు" అను మాత్రలను సేవించినచో రక్తము శుభ్రపడి ఆరోగ్య మొదవును. వృద్ధులు కూడ యౌవనవంతులగుదురు. ఒకమాత్రయే మంచిగుణము నిచ్చును. దొరకు స్థలములు:—

**అప్పా అండ్ కో,**

286 చైనాబజారురోడ్డు, మదరాసు.

**దాదా అండ్ కో,**

86 నైనియప్పనాయక్ వీధి, పార్కుటవును, మదరాసు.

ఇంకా యితరమందుల దుకాణములలో అమ్మబడును

S. PAUL & Co., 4, Hospital Street
Dharamtola. CALCUTTA.

# రూ 100 లు యినాం!

(ఇంద్రజాల అంగుళీయము)




మిక్కిలి శక్తికలది. కాంతి గలది. దీనిశక్తిచే అతికఠినమగు పనికూడ నెరవేరును. ఎవరిని మీరు కోరెదరో వారు దీనిచే మిమ్ముల ప్రేమించెదరు. పరీక్షలందు, వ్యాజ్యెములందు జయము గలుగును. ఉద్యోగము మగసంతానము, భాగ్యము మున్నగునవి కలుగును. ఇది గుణము లేదని రుజువుచేయువారికి రూ 100/- బహుమానము. కష్టపడ నవసరములేదు. దానిని మీయొద్ద నుంచుకొనుము.

**BENGAL MESMERISM HOUSE,**

Panchpota, Bengal (B. M.)

## లివరు రిస్టు వాచ్



చాలాకాలము పనిచేయును. సరియైన గంటలను తెలియజేయును. 5 సం॥ల గ్యారంటీ యొసంగబడును. పట్టితోకూడా పంపబడును. నెం. 1 రూ. 4-4-0, నెం. 2 గుండ్రని షేపు రూ 2-15-0, కేడియం రూ. 5, రోల్డుగోల్డు నెం. 2 రూ. 4-8-0, నెం. 1 రూ. 5-8-0, చదరము రూ. 7-8-0, పోస్టేజి 7 అణాలు ప్రత్యేకం. 3 గడియారములు ఒకేసారి కొన్నవారికి పోస్టేజి ఉచితము.

## రూబీ బాక్సు కెమెరా



దీనివలన ఎట్టివారైన నిమిషములలోగా కార్డుసైజులో ఏ ఫోటోనైనా తీయవచ్చును. ఒక దినమునకు రూ 5 లు సంపాదింపవచ్చును. ప్లేటు పేపరు, డెవలపింగ్ ద్రావకం, ఉపయోగించు విధము ఉచితముగా పంపబడును.

ధర రూ. 4-0-0. పోస్టేజీ, ప్యాకింగ్ వేరు.

## మిక్కిలి నైపుణ్యముగ, మంచి కట్టైన ఎక్కువ శ్రేష్ఠమైన దోమతెరలు.



మిక్కిలి శ్రేష్ఠమైన తెల్లనూలు పోగులచేత నేయబడి చాలాకాలము మన్నునట్లుగ తయారుచేయబడినవి. మేలిరకపు పచ్చ, నీలము, ఎఱుపు, పసుపు మొదలగు రంగులలో అడిగినంతనే లభించును.

| పొడవు. | వెడల్పు. | ఎత్తు. | వెల. |
|---|---|---|---|
| 6 అ. | 3½ అ. | 3½ అ. | రూ. 1-12-0 |
| 6 ,, | 4 ,, | 4 ,, | ,, 1-14-0 |
| 6½ ,, | 4½ ,, | 4½ ,, | ,, 2-6-0 |
| 7 ,, | 3½ ,, | 5 ,, | ,, 2-10-0 |
| 7 ,, | 5 ,, | 6 ,, | ,, 2-14-0 |
| 7½ ,, | 6 ,, | 6 ,, | ,, 3-14-0 |

తపాలాచార్జి ప్రత్యేకం. ప్యాకింగు ఉచితము.

ఒకేసారి 3 తెరలను కొనువారికి 6 అ. పొడవు 3½ అ. వెడల్పు, 3½ అ. ఎత్తుగల ఒక తెర ఉచితము.

విలాసము:— నేషనల్ ట్రేడింగ్ కంపెని,
(బి.బి.) P O., బీ. కె. వీధి, కలకత్తా.



మా చిట్టికి ఎంత ఆకలో!   —యం. స్వామినాధన్.